# శ్రీమద్రామాయణము

## సుందరకాండ



రచన :

డా|| జి.ఎల్.ఎన్. శాస్త్రి, M.Sc., M.Phil., Ph.D.

రీడర్, భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు, టి.జె.పి.ఎస్. కళాశాల, గుంటూరు



జగద్గురుపీఠము - గుంటూరు శాఖ

(The World Teacher Trust-Guntur Branch)

గుంటూరు - 522 002

ఫోన్ : 233995

శ్రీమద్రామాయణము
సుందరకాండ

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 1996



ప్రాప్తి స్థానములు :

1. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
H/o డా॥ జి.ఎల్.ఎన్. శాస్త్రి
'మైత్రేయ నిలయం'
5-10-4, 2/9 బ్రాడీపేట, గుంటూరు - 2
ఫోన్ : 233995

2. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్
45-40-36/1
అక్కయ్యపాలెం
విశాఖపట్నం - 530 016

వెల : సాధారణ ప్రతి రూ. 60/-
గ్రంథాలయ ప్రతి రూ. 70/-

ముఖచిత్రం : బాలి

ముద్రణ :
శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్
5/1 బ్రాడీపేట, మునిసిపల్ కాంప్లెక్స్,
గుంటూరు-522 002
ఫోన్ : 235036

# విషయసూచిక

# ముందుమాట



'సుందరకాండ పుస్తకానికి ముందుమాట వ్రాసే రోజు ఎప్పుడువస్తుందా' అని అనుకుంటూండంగానే ఆ రోజు రానే వచ్చింది. మిత్రుల, సోదరుల, శ్రేయోఽభిలాషుల, వదాన్యుల సహాయ, సహకారాలతో సుందరకాండ 'అత్యంత సుందరం'గా, అప్రయత్నంగా, ఆటంకరహితంగా– ఆవిష్కరణకై వెలుగులోకి వచ్చింది. హనుమ ఎలా నిరాడంబరంగా, సునాయాసంగా కావలసిన కార్యాన్ని అవసరానికిమించి గూడా ఎలా చక్కబెట్టుకొచ్చాడో అలాగే ఈసుందరకాండ పుస్తకంగూడా వెలుగులోకివచ్చింది. 'సుందరకాండ' వ్యవహారం అంటే ఇలానే వుంటుంది కాబోలు !

ఇందులో వాడిన భాష పరమ చప్పగా వుండే వ్యావహారిక (వాడుక) భాషా కాదు, అలా అని క్రావడులతోను, కఠినమైన సంశ్లిష్ట సమాసాల తోను, జటిలమైన పదజాలంతోను వుండే వీరగ్రాంథిక భాషా కాదు. అందరూ ఇష్టపడి చదువుకోగలిగే శిష్ట వ్యావహారిక భాష. అయితే అక్కడక్కడ సందర్భోచితంగా భాషలో లేత ముదుళ్లుంటాయనుకోండి. వాస్తవానికి అలా ఉండడమే సందర్భోచిత్యం గూడా !

అందరూ ఇష్టపడి ఈ 'సుందరకాండ'ను భక్తిభావంతో చదువుకోండి. అంతేగాని ఏదో లాభం రాబట్టుకోవాలనే ఉద్దేశ్యంతో చదవకండి. లాభం వస్తుందంటే చేసేది వ్యాపారం (TRADE) అవుతుందిగాని భక్తి కాదుగదా! ఇక్కడ భక్తి, శ్రద్ధలు ముఖ్యం. అవి రెండూ వుంటే కావలసినవన్నీ అవే వస్తాయి. ప్రపంచలో అన్నిటికీ యంత్రాలు, కంప్యూటర్లు వచ్చినా- అవి స్పీడ్‌ను (Speed), సుళువును ఇస్తాయి గాని- భక్తి, శ్రద్ధల నివ్వవు. ఇవి మనలో నుండి రావలసినవే! ఇవి లేనపుడు కంప్యూటర్లు వున్నా చేసేపనిలో 'నాణ్యత' రాదు. హనుమ ఈ రెంటితోనే అసాధ్యమైన పనిని అనితర సాధ్యంగా చక్కబెట్టుకొచ్చాడు.

ఏ పనిని సాధించాలన్నా మన ప్రయత్నంతోపాటు, పెద్దల ఆశీస్సులు, భగవదనుగ్రహం గూడా కలిసిరావాలి. అందులో అసాధ్యమైన పనిని

సాధించాలంటే వేరే చెప్పాలా ? అందుకే పెద్దలకు, శ్రేయోఽభిలాషులకు, నిస్స్వార్థంగా తమ విధ్యుక్త ధర్మాలను నిర్వర్తించేవారికి ముందుగా హనుమ అంజలులు ఘటించి కార్యోన్ముఖుడయాడు.

సత్కార్య నిర్వహణకై నడుంబిగిస్తే చాలు- ప్రారంభంలోనే సద్యః ఫలం లభిస్తుందన్నట్లు మైనాకుని ఆతిథ్యం, ప్రశంసలు హనుమకు లభిస్తాయి. అటుపైన కార్యసాధనలో ఎదురయ్యే సాత్త్విక. రాజసిక, తామసిక అవరోధాలా అన్నట్లు– ఆకాశంలో విహరించే 'సురస', అగాధంలో వసించే 'సింహిక', ఈ రెంటికీ మధ్యనున్న భూమిమీద ఉండే 'లంకిణి'- ఈ ముగ్గురి ద్వారా ఇబ్బందులు రావడం, వీటిని సందర్భోచితంగా ఎదుర్కొని తన ప్రయాణాన్ని సాగించడం, లంకా నగరంలో ప్రవేశించిన దగ్గఱనుండీ బుద్ధి కుశలతతోను, భక్తిశ్రద్ధలతోను, బాహుబలంతోను ఒక కార్యసాధకునిగా హనుమ వ్యవహరించిన తీరుతెన్నులు తెలుసుకోవాలంటే- ఈ సుందరకాండ చదవండి.

ఆంజనేయుని బాహుబల, బుద్ధివిశేష, వాగ్వైభవాలతో పాటు సీతారాముల దైహిక, ఆత్మసౌందర్యాలను, రావణ మండోదరుల రమణీయ సౌందర్యాన్ని, వివిధ జాతులకు చెందిన స్త్రీల తీరుతెన్నులు, లంకాపుర సౌందర్యం, రావణ సామ్రాజ్యంలోని సౌకర్యాలు, సదుపాయాలు పరిపాలనా విధానాలను తెలుసుకోవాలంటే ఈ సుందరకాండ చదవండి.

కార్యసాధకునికి, దూతకు- అమితమైన బుద్ధి నైశిత్యంతో సీత ఇచ్చే- సూచనలు, సలహాలు తెలుసుకోవాలన్నా, భర్తపట్ల, బంధువులపట్ల, ఆశ్రితుల పట్ల, శరణాగతులపట్ల ఆమెకు వుండే గౌరవాదరాలు, ప్రేమాభిమాన వాత్సల్యాలు ఎలావుంటాయో, సీతపట్ల రాముని ప్రేమ ఎలాంటిదో తెలుసుకోవాలంటే- ఈ సుందరకాండ చదవండి.

నేరస్తులకు విధించే వివిధ రకాల శిక్షలలోని తీరుతెన్నులను, వాటిని విధించడంలో ఉండవలసిన విచక్షణను గూర్చి తెలుసుకోవాలంటే- ఈ సుందరకాండ చదవండి.

చక్కబెట్టుకొచ్చింది అనితరసాధ్యమైన మహత్కార్యం అయినా– మిడిసిపడిపోయి గర్వంతో గట్టెక్కి కూచోకుండా, పొగడ్తలకు లొంగకుండా

డంలో అహర్నిశలు శ్రమించిన- చి॥ సూరపరాజు హనుమాన్ ప్రసాద్‌కు, అతనికి సహకరించిన అతని సోదరులు చి॥ సత్యం, చి॥ శ్రీనివాస్‌లకు, తదితర మిత్రులు, శ్రేయోభిలాషులకు- నా హృదయపూర్వక శుభాశీస్సులు.

ఈ గ్రంథ ప్రచురణకు రూ. 1116/- చొప్పున విరాళమిచ్చిన హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీ ఎన్.శ్యామసుందర్ గారికి, వారి జ్యేష్ఠపుత్రుడు చి॥ సుభాశ్‌చంద్రకు, గుంటూరు వాస్తవ్యులు శ్రీ కె. వెంకుబాబు- లక్ష్మీ దంపతికి, యు. రామచంద్రప్రసాద్ గారికి, రూ. 500/- విరాళమిచ్చిన తిరుపతి వాస్తవ్యులు శ్రీమతి ముప్పాళ సరస్వతమ్మ గారికి, ఇంకను తమ యథాశక్తి ప్రచురణ పూర్వ విరాళాలిచ్చి ప్రోత్సహించిన తదితర మిత్రులకు సోదరులకు, శ్రేయోభిలాషులకు- నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథాన్ని సుందరంగా ముద్రించి సకాలంలో ఆవిష్కరణకు సిద్ధం చేసి ఇచ్చిన శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్‌కు మరియు ముద్రణాలయ సిబ్బందికి నా కృతజ్ఞతాపూర్వక శుభాశీస్సులు.

ఈ గ్రంథం వెలుగులోకి రావడానికి ఇంకా ప్రత్యక్షంగాను, పరోక్షంగాను దోహదపడిన వారుంటారు. వారందరికీ ఈ పుస్తక ముఖంగా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

ఈ సుందరకాండ గ్రంథ ప్రచురణకు దోహదపడిన వారందరిని, వారి కుటుంబ సభ్యులను, హనుమత్సీతా లక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్ర ప్రభువు నిరంతరము కాపాడుతూ వారికి సంపూర్ణ ఆయురారోగ్యైశ్వర్యాలను ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
జి.ఎల్.ఎన్. శాస్త్రి

10-10-96
గుంటూరు

# హృదయావిష్కృతి

"పునాతి భువనం పుణ్యా
రామాయణ మహానదీ"

ఎన్ని యేండ్లు, ఎన్ని పుష్కరములు, ఎన్ని యుగములు జరిగినను– పరమాత్మవలె నిత్యనూతనమైనది శ్రీ మద్రామాయణము. బహు జన్మలుగా పుణ్యప్రవాహములు పెనవేసుకొని పుట్టినవానికి మాత్రమే రామాయణము నందు శ్రద్ధ కలుగును. అది అనుభవములోనికి రాగా రాగా శ్రీమద్రామాయణము తనకు ఆరాధ్య దైవమగును. అట్టి పుణ్యము వికసించి, వికసించి పరమ వివేక సౌరభములను లోకమున వెదజల్లెడి ప్రజ్ఞ ఏర్పడును. అట్టి ప్రజ్ఞావంతులలో మా జి.ఎల్.ఎన్. శాస్త్రి ఒకడు.

ఈ లోకంలో ఒక విచిత్రమైన అదృష్టం ఆంధ్రదేశంలో తిరిగింది. అది- 'యోగం' ఇప్పటికి సుమారు 40 సంవత్సరాలకు పూర్వం మహాభారతాన్ని యోగంతో అన్వయించి చెప్పే ఒక సిద్ధపురుషుడు నాకు దర్శనమిచ్చాడు. నేను కొంచెం ఆశ్చర్యపడ్డాను. ఆ తర్వాత 'ఓహో' 'ఓహో' అనుకున్నాను. కాని, ఆయన లోతు ఎంతో అప్పుడు నాకు సరిగా తెలియలేదు. ఆయనే కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య.

కులపతి- అంటే కులపతే! 'నిర్దిష్టాం కులపతి నా స పర్ణశాలాం'– ఆ కులపతి: ఆనాటి ఆ కులపతిని కాళిదాసు చూడగలిగాడు. ఈ నాటి ఈ కులపతిని మనమందరం చూచాము, చూస్తున్నాము, చూడగలము. రామాయణ నదీప్రవాహము వంటి ఆ కులపతి విజ్ఞాన ప్రవాహంలో ఈ జి.ఎల్.ఎన్.శాస్త్రి ఒక పాయ.

ఎక్కడి రామాయణం? ఎక్కడి రచన? ఆ రామాయణ కాలమునందలి పాత్రలు నిత్యనూతనములై నా హృదయమును పెనవేసుకొనుచున్నవి!

అంతటి భావుకుడు అంతటి సత్యవాక్కు నాకు కవి లోకంలో ఎవరూ కనబడ లేదు. రామాయణంలో అసత్యం చెప్పినవాడు ఎవ్వడూ లేడు. అసలు నన్నడిగితే భారతీయత అంటే రామాయణమే! మహాభారతంలో ఏదైనా ఒక విషయాన్ని నిర్ధారించి చెప్పవలసి వచ్చినపుడు వ్యాసభగవానుడు "పురా వాల్మీకినా గీతః శ్లోకోఽయం ప్రతిభాతిమే" అనేవాడు. అంటే- యావత్ప్ర పంచ విజ్ఞానం వ్యాసుని మేధ అయితే- ఆ మేధావంతుని శాసించేది శ్రీమద్రా మాయణమన్నమాట! ఆ రామాయణాన్ని వంటపట్టించుకుని, తన ఆత్మశక్తితో ఆ కాలంలోకి వెళ్ళి ఆ వాల్మీకి హృదయాన్ని సత్య శివ సుందరాత్మకంగా దర్శించినవాళ్ళు మాత్రమే రామకథను వినడానికి చదవడానికి, చెప్పడానికి పనికివచ్చేవాళ్ళు. ఈ శాస్త్రిగారు ఈ మూడు లక్షణాలు దృఢంగా వున్నవారు

నేనిప్పుడు అనారోగ్యంగా వున్నందువలన అనుకున్నదంతా ఆకారం లోకి తేలేకపోతున్నాను. రామలక్ష్మణులు పితృ మరణవార్త విని వారు స్వయంగా కర్మ చేసుకుని వస్తారు. అమ్మో! 'ఈ శాస్త్రి ఇంత లోతు లెరిగిన వాడా' అని నాకనిపించింది. బ్రాహ్మణజాతిలో పుట్టినవారికి సంధ్యావందనం రాదే! "ఆ రామలక్ష్మణులు పూర్వపర కర్మలన్నీ పురోహితుడు లేకపోయినా తాము నిర్వహించెడి మహాశక్తి గలవారు" అనే విషయాన్ని ఎంత సూటిగా గ్రహించాడు! నాకు చాలా ఆశ్చర్యం, ఆనందం భరింపలేనంతగా కలిగినై. తరువాత భయం పుట్టింది. ఈ వెఱ్ఱివాడు ఇంతటితో ఆపివేస్తాడేమో, రామా యణమంతా వ్రాయడేమో అని. కాని, రామాయణం సాంతం వ్రాయందే ఊరుకోడు. కేవలం రాముని మీద భక్తి మాత్రం వుంటే రామాయణం వ్రాయలేడు. వాడు రసాభిన్న హృదయుడు కావాలి. ఆ సన్నివేశాన్ని మనస్సుతో చూడగలిగిన ప్రజ్ఞ వుండాలి. అప్పుడు సాగిన రామాయణం మహానది. అలా కానిది త్రవ్వీన కాల్వ. ఇది వాల్మీకంలో "పరం కవీనా మాధారం" అన్నదానికి ఉదాహరణ మనిపిస్తుంది.

ఈ శాస్త్రిగారు నిరంతర కార్యవ్యగ్రుడు. ఐదు నిముషములు కూడా వూరకే వుండి కాలాన్ని వ్యర్థం చెయ్యడు. అందువలన తన ఉద్యోగ ధర్మం తప్పమిగిలిన అన్నివేళల్లో ఆ రామాయణ మహానదిలోనే ఎప్పుడూ అవగాహనం చేస్తుంటాడు.

నేననుకునేవాణ్ణి! 'ఎవరుపడితే వారు రామాయణాన్ని వ్రాస్తున్నారూ, ఏమి బాగుంటుందె? ఎంత చదువుకోవాలి రామాయణం వ్రాయటానికి' అని. వయస్సు మళ్ళిన కొద్దీ- 'నా అభిప్రాయం పొరపాటు'- అని తెలుస్తున్నది. ఈ శాస్త్రిగారు టి.జె.పి.యస్. కళాశాలలో భౌతికశాస్త్ర అధ్యాపకులు. భారతీయ ధర్మవిశేషాలను- ఉపనిషత్తులనుండి, వేదముల నుండి, పురాణముల నుండి ప్రాచీన సంప్రదాయ గ్రంథముల నుండి- ఉదాహరణలతో సమన్వయించి చెప్పే ప్రజ్ఞ ఆయనకు ఎలా కుదిరిందో, నాకు మాత్రం ఆశ్చర్యముగానే ఉంటుంది. ఏమైనా శ్రీరామచంద్రుని యందలి భక్తి, వాల్మీకము నందలి భక్తి, ఈ లోకంలో ఎప్పటికప్పుడు ఎన్నో, ఎన్నో విధాల పెరిగి లోకాన్ని ఆక్రమించుకుంటున్న అధర్మపద్ధతి- ఈ వీనితో సతమతమై మ్రగ్గి, తన ఆత్మబలాన్ని తానేనమ్ముకొని, ఎన్నోఎన్నో చిన్నచిన్న గ్రంథాలు ప్రకటించి, ఆ తరువాత శ్రీ మద్రామాయణాన్ని వ్రాస్తున్నారు. వీరు విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షాన్ని బహు వారములు చదివినందువల్ల ఆ సంస్కారము వీరిని వదలలేదు. అదీ గొప్ప విశేషమే. ఈ కాలంలో గ్రంథ గౌరవమూ లేదు. గ్రంథకర్తమీద గౌరవమూ లేదు.

ఈనాడు ఏ కవి నోటివెంట చూచినా, ఏ సహృదయుని నోటివెంట చూచినా సామాజిక స్పృహ వుండాలి అని అంటారు. సామాజిక స్పృహ అంటే ఏమిటో నాకిప్పటికీ అర్థం తెలియలేదు. సామాజికులయందు స్పృహ వుండాలనా, అదేమిటో సరిగా అర్థంకాని మాటగానే వుంది. ఇకపోతే విశ్వశ్రేయస్సు కొరకు కావ్య నిర్మాణం చేసే కవి తాను ఈ లోకానికి కొంచెం ఎడమై స్వ, పర భేదం లేకుండా ఎవర్ని ఎంతవరకు వర్ణించాలో అంతవరకు వర్ణించి పరమానందాన్ని కల్పిస్తాడు. ఏవో కొన్ని మార్పులు వున్నా, రామాయణ సిద్ధాంతాన్ని భంగం చేయకుండా ఈ శాస్త్రిగారు శ్రీమద్రామాయణాన్ని రచించాడు. అందులోదే ప్రస్తుత సుందరకాండ. ఈ సుందరకాండను భక్తితో పఠించేవారికి ఈ లోకంలో, పరలోకంలో కూడా అనేక లాభాలు వుంటాయని పెద్దలు చెప్తున్నారు. ఇపుడు మనం చూస్తున్నాము. జి ఎల్.ఎన్ శాస్త్రిగారికి వారి పరోక్ష గురువులైన విశ్వనాథ సత్యనారాయణ గారి కృతిచే

సంప్రాప్త మగు కీరితి స్వర్గదము .అంతే! దానిని నేను వరింపను. అలాగే ఈయనకు కూడా స్వర్గాదిలోక భోగములు వస్తూవుంటే అవన్నీ వద్దు అని వదులుకుంటాడు కూడాను. ఇలాంటి బుద్ధి వున్నవాడే రామాయణం వ్రాయ టానికి పనికివస్తాడు. కనుకనే వ్రాశాడు. ఈ రామాయణ ప్రవాహం కూడా లోకాన్ని పవిత్రం చేయగలదు. ఇక శెలవ్. రచనా విశేషాలు యుద్ధకాండలో మనవిచేస్తాను.

శెలవ్.

మిత్రుడు

కోగంటి సీతారామాచార్యులు

గుంటూరు
23-10-96

# పుస్తక ప్రచురణకు ప్రధాన దాతలు

పుస్తకాలు వ్రాయగలిగే వాళ్ళందరికీ వాటిని ముద్రించుకోగలిగే స్తోమత గూడావుంటే- అంతకంటె అదృష్టం ఏముంటుంది ? విషయం విలువైందైనా ముద్రించుకోగల స్తోమత లేనివాళ్ళు తప్పనిసరిగా అందుకు సహాయం చేయగల వారి సహకారం పొంది తీరవలసిందే! అలా సహకరించే వాళ్ళు దొరకడం గ్రంథకర్త అదృష్టం. ఈ విషయంలో నేను అదృష్టవంతుణ్ణనే చెప్పాలి. ఎందుకంటే- ఇంతవరకు నేను వ్రాసిన పుస్తకాలన్నిటికి ముద్రణకు దాతలు ఏర్పాటుకావటం అప్రయత్నంగా జరిగింది. ఒకోసారి వ్రాయబోయే పుస్తకాలకు గూడా దాతలు ముందే ఏర్పాటుకావడం జరిగింది. ఈ ప్రస్తుత 'సుందరకాండ'కు కూడా అలాగే జరిగింది!

జగద్గురు పీఠం, గుంటూరుశాఖ వారియొక్క- వైద్యసేవ సద్గ్రంథ ప్రచురణ, సద్గోష్ఠి, సత్కార్య నిర్వహణా ప్రణాళికను చూసి- రచన పూర్తి కాకముందే 'సుందరకాండ' ముద్రణా యజ్ఞంలో తమను పాలుపంచుకునేట్లు చేయవలసినదని ఎంతో సహృదయతతో శ్రీ సర్వా వేంకటరామ శేషలక్ష్మీనారాయణగారు 2 నెలలకు ముందే రూ॥ 10,000 విరాళంతో ముందుకు వచ్చారు. వీరు నా శ్రీమతికి వరసకు సోదరులవుతారు. నా శ్రీమతిని చెల్లెలుగాను నన్ను బావగారి లాగాను ఎంతో ప్రేమాభిమానాలతో చూస్తారు. వారి జ్యేష్ఠపుత్రుడు చి॥ రవికి- మా అక్కగారి కుమార్తె చి॥సౌ॥ పద్మజను ఇచ్చి వివాహం జరిపించడం నేపథ్యంలో నా ప్రమేయం తగినంతగా వుంది. దీనితో- మా రెండు కుటుంబాల మధ్య బంధుత్వం మరింత బలపడి, అనుబంధం పెరిగింది.

కృష్ణా జిల్లాలోని పామర్రు గ్రామానికి చెందిన 'సర్వా ఆదిశేషావతారం-వేంకటనరసమ్మ' పుణ్యదంపతికి పామర్రులో 5-5-1934న పుట్టిన వర పుత్రులే లక్ష్మీనారాయణగారు. జన్మనిచ్చింది తల్లిదండ్రులే అయినా తన తల్లి యొక్క 'తండ్రి-తల్లి' ఐన'తూములూరి శ్రీరాములు-లక్ష్మీనరసమ్మ'గార్ల

పెంపకంలోనే పెరిగి పెద్దవారయారు. పా మ ్రు హై స్కూ ల్లో ను, బందరు హిందూకళాశాలలోను విద్యాభ్యాసం కొనసాగించారు. 11-5-1963న వివాహం జరిగింది. సహధర్మచారిణి అయిన శ్రీమతి బాలాత్రిపురసుందరిగారు ఆయనకు అన్నివిధాలా సహకరించే ఇల్లాలు. లక్ష్మీనారాయణగారు రిజిస్ట్రేషన్ శాఖలో 30-6-1966లో చేరి, 31-5-92లో పదవీ విరమణ చేశారు. పదవీ కాలంలోను- పదవీ విరమణ తర్వాత గూడా వీరు ఎన్నో దేవాలయ సత్ర నిర్మాణాలకు విరాళాలు ఇచ్చి కార్యకర్తలను ప్రోత్సహించారు.

సర్వా లక్ష్మీనారాయణగారి లాగానే సుందరకాండ ముద్రణాయజ్ఞంలో పాలుపంచుకోడానికి ముందుకు వచ్చిన మరో దాత శ్రీ కొండా శివరామకృష్ణ మూర్తిగారు. మాస్టర్ ఇ.కె గారికి శిష్యులై, వారిచే అనుగ్రహింపబడి ప్రేరేపింపబడి జగద్గురు పీఠం- గుంటూరు శాఖ అతి నిరాడంబరంగా, శబ్ద రహితంగా నిర్వహించే సత్కార్యక్రమాల్లో పాల్గొంటూ- ఇంతకు పూర్వమే మా ఉచిత హోమియో వైద్యాలయ నిర్వహణకు రూ॥ 10,000/- విరాళమిచ్చారు. ఇంతకు పూర్వం ప్రచురితమైన 'లీలామాధవమ్', శ్రుతిగీత–2 అనే రెండు పుస్తకాల ముద్రణా వ్యయాన్ని భరించారు.

వైద్యాలయ నిర్వహణకని, ప్రతి సంవత్సరము జరిగే మాస్టర్ ఇ.కె. జన్మ దినోత్సవ నిర్వహణకు, గురుపూజామహోత్సవ నిర్వహణకు, ముందుముందు ప్రచురించబోయే లలితా సహస్రనామాది పుస్తకాల ముద్రణకని– ఇలా వేరు వేరుగా కొంత సొమ్ము కేటాయించుకుని, ఎంతో పద్ధతిగా ప్రణాళికను సిద్ధ పరచుకుని జీవితాన్ని గడుపుతున్నవారు శ్రీ శివరామ కృష్ణమూర్తిగారు. ఈసారి 'సుందరకాండ' గ్రంథంలోని విషయాలకు రక్షణ కవచంలాగా పని చేసే- టైటిల్ పేజీ ముద్రణా వ్యయాన్ని తన బాధ్యతగా స్వీకరించారు.

ఆగస్టు 17వ తేదీ 1937 సం॥లో పుట్టిన శివరామ కృష్ణమూర్తిగారు గుంటూరు ప్రభుత్వ ఆసుపత్రిలో వైద్యేతర కార్యదర్శిగా ఈ మధ్యనే పదవీ విరమణ చేశారు. తమ సహోద్యోగులను, మిత్రులనూ సమీకరించి 'అమృత వాహిని' అను పేర ఒక యోగ మిత్రమండలిని స్థాపించి, ఆధ్యాత్మిక కథా మంజరిగా 'గాథాలహరి' అను పేర ఒక పుస్తకాన్ని, యాజ్ఞవల్క్యసంఘం తరఫున ఆర్షధర్మానికి సంబంధించిన మరో రెండు పుస్తకాలను గూడా

ప్రచురించారు. బ్రాడీపేటలోని తమ స్వగృహానికి 'MASTERS' GRACE అని పేరు పెట్టుకుని మాస్టర్స్‌పై తమకుగల భక్తిని తెల్పుకున్నారు. వీరికి అన్నివిధాలా సహకరించే సహధర్మచారిణి శ్రీమతిరాజ్యలక్ష్మిదేవి.

సంప్రదాయబద్ధమైన జీవితాలనుగడుపుతూ, సక్రమమార్గంలోతమ పిల్లలను తీర్చిదిద్ది, సత్కార్య నిర్వహణలకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను, సహాయ సహకారాల నందిస్తూ, ఇహపర సాధకంగా జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న శ్రీ S. లక్ష్మినారాయణ- బాలాత్రిపురసుందరి దంపతికి, శ్రీ కె. శివరామకృష్ణ మూర్తి -రాజ్యలక్ష్మిదంపతికివారివారి కుటుంబసభ్యులందరికీ-సంపూర్ణఆయు రారోగ్యైశ్వర్యాల నిచ్చి అనుగ్రహించాలని హనుమత్సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రమూర్తిని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. వారికి నా తరఫున, జగద్గురు పీఠం గుంటూరుశాఖ తరఫున కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు తెల్పుకుంటున్నాను.

ఇట్లు
జి.ఎల్.ఎన్. శాస్త్రి

19-10-96
గుంటూరు

# ముఖచిత్ర వివరణ

తే॥దే॥ 'అభయమును దెల్పు దక్షిణ హస్తమునకు
ఆ భరణమైన అంగుళీయకము నిచ్చి
పంపె హనుమను రాముడు పత్నికడకు'—
'లంకలో నున్న సీతకు శంకవదలి
తలను వంచగ కనిపించు తళుకులొలుకు
తనదు చూడామణిని పంపె తనదు పతికి'

శ్లో॥ "ఇయం సీతా మమసుతా సహధర్మచరీతవ
.... .... .... .... ....
పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా"

అని, జానకిని దాశరథికి అప్పగించాడు జనకుడు. తండ్రి ఎలా చెప్పాడో అలాగే నీడలాగా రాముణ్ణి అనుసరించి వెళ్ళింది సీత. అయోధ్యకే కాదు, అరణ్యానికి కూడా! అరణ్యంలో ఉన్నప్పుడు– ఉదయం లేవగానే ముందుగా శ్రీరాముని పాదారవిందాలకు శిరస్సు వంచి సీత నమస్కరించేది. అప్పుడు రాముడు తన దక్షిణ హస్తంతో అభయం తెలిపి, రెండు చేతులతో ఆమెను పైకి ప్రేమగా లేవదీస్తూ ఆమె తలకట్టు పైన ఉండే చూడామణిని చూచేవాడు. ఇలా ప్రతిరోజూ జరిగేది. ఈ సన్నివేశం ఇద్దరి హృదయాల్లో స్థిరంగా ముద్రించుకు పోయింది.

రావణుడు సీతను అపహరించి సీతారాముల వియోగానికి కారకుడౌతాడు: సీతారాము లిద్దరికీ ప్రతి ఉదయ సమయంలోను జరిగే ఈ తీపి సంఘటనకు తెరపడింది. మనుష్యులు దూరమైనంత మాత్రాన మనస్సులు దూరమౌతాయా? సీత మనోవేదనను రాముడు, రాముని మనఃక్లేశాన్ని సీత అనుభవించారు. సీతకు అభయం తెల్పి, అచిరకాలంలోనే ఆదుకుంటానని

మౌనంగా చెప్పడాన్ని సూచించే తన దక్షిణ హస్తపు ఉంగరాన్ని రాముడు హనుమకు ఇచ్చి సీతకు పంపాడు. ఇందుకు ప్రతిస్పందనగా, కృతజ్ఞతా పూర్వకంగా, వినయంగా తను శిరస్సు వంచి అంజలించితే ముందుగా కనబడే తన తలకట్టు పై వుండే చూడామణిని సీత హనుమకు ఇచ్చి రామునికి పంపింది. సుందరకాండలోని అతి ప్రధానమైన, అతిసున్నితమైన సన్నివేశాల్లో ఇది ఒకటి. ఈ విషయమే "సాధకులకు మాత్రమే !" అన్న శీర్షికలో మరింత వివరింపబడుతుంది.



# సాధకులకు మాత్రమే!

సుందరకాండ గూడా రామాయణంలోని అంతర్భాగమే అయినా— మిగిలిన కాండలకన్న ఈ కాండకు కొంత ప్రత్యేకత **(Speciality),** ప్రాముఖ్యము **(Importance)** ఉన్నాయని; దీనిని చదివినా వ్రాసినా, పారాయణ చేసినా, విన్నా కూడా మంచి ఫలితం వుంటుందని, అంటారు. ఇలా అనడంలో కొంత అర్థం లేకపోలేదు, ఎందుకో వివరిస్తాను.

సుందరకాండ మొత్తం ఆరు కాండలలో ఒక కాండే అయినా- ఈ కాండలో- మిగిలిన కాండలలో వున్న ప్రధాన విషయాలన్నీ వుంటాయి. అంటే- మొత్తం రామాయణ విషయం అంతా వుంటుంది. ఎలాగంటే— (1) బాలకాండనుండి కిష్కింధాంతం వరకు వున్న విషయాలు, సుందర కాండలో హనుమ సీతను కలిసినప్పటి వరకు ఉన్న ప్రధాన విషయాలు- ఇవన్నీ హనుమ ద్వారా సీతకు కొన్ని, సీత ద్వారా హనుమకు కొన్ని తెలియ జెప్పడం ఈ సుందరకాండ మొదటి భాగంలో వుంటాయి. (2) హనుమ సీతను కలిసిన తరువాత ఏం జరుగుతుందో సుందరకాండ మిగిలిన భాగంలో ఎలానూ వుంటుంది. (3)ఇక సుందరకాండ తరువాతది అయిన యుద్ధకాండలో వుండే ప్రధాన విషయాలు గూడా- ఈ సుందర కాండలోనే- త్రిజటా స్వప్న వృత్తాంతంలో తెలియజేయబడతాయి. కాబట్టి, ఈ ఒక్క సుందరకాండ చదివితే రామాయణంలోని ప్రధాన విషయాలన్నీ తెలుస్తాయి. సుందరకాండ పారాయణ ప్రత్యేకతను సంతరించుకోడానికి ఇదికూడా ఒక కారణం.

ఇక సుందరకాండ పారాయణ గురించిన మరొక ప్రత్యేకత ఏమిటో తెలియజేస్తాను. అసాధ్యమైన పనిని సుసాధ్యం చేసిన హనుమ సామర్థ్య పరాక్రమ బుద్ధి విశేషాదుల గూర్చి ఈ సుందరకాండలో వుంటుంది. అంటే- కార్యసాధకులకు, ఉపాసకులకు, యోగసాధకులకు కావలసిన దీక్ష, పట్టుదల, ఓర్పు, వివేకం, సమయస్ఫూర్తి, వాగ్వైభవం, వాఙ్నియమం- మొదలైన సల్లక్షణాలను పెంపొందింపజేసుకోడానికి ఉపకరించే విషయాలుంటాయన్న మాట! ఎవరి సహాయ సహకారాలు లేకుండా- అంతకు పూర్వం పరిచయమే లేని, తేలిగ్గా అందుబాటులో లేనివిధంగా నూరు యోజనాల విస్తీర్ణం గల

సముద్రానికి అవతల ఒడ్డున ఉన్న స్థలంలో- చుట్టూరా అప్రమత్తతతో ఉన్న కర్కశ రక్కసుల కాపలాలో వుండి, అంతకు పూర్వం పరిచయమేలేని, తెలియని, చూడని వ్యక్తిని వెదకడం, కలుసుకోవడం, ఆమెకు సందేశం వినిపించడం; అక్కడ వున్న వ్యక్తుల గురించి, వ్యక్తుల తత్త్వాల గురించి బలపరాక్రమాలు, వారి మధ్యవుండే రాజకీయం గురించి, శత్రువులెవరు, మిత్రులెవరు, ఎవరెవరి ఇళ్లు ఎక్కడెక్కడ వున్నదీ- వాటిగురించి తెలుసు కోవడమే కాకుండా- ముందు ముందు అవసరమొచ్చి సముద్రానికి వారధి కట్టవలసి వస్తే- ఆ వారధి కట్టే సమయంలో రాక్షసమూక ఎవరూ అడ్డు కోకుండా, వాళ్ళ ఇళ్ళను పునర్నిర్మాణం చేసుకోవలసిన పనిలోనే నిమగ్నమై పోయే అవసరాన్ని కల్పించే విధంగా వుండేందుకా అన్నట్లు- ముందే వాళ్ళ అందరి ఇళ్లు, వాకిళ్లు అన్నిటినీ తగులబెట్టి ధ్వంసం చేసి మరీ రాగలగడం- ఇవన్నీ సామాన్యమైన విషయాలు కాదు కార్యసాధకునికి, యోగసాధకునికి, దూతకు ఇలాంటి విషయాలు తెలుసుకోడమే ఒక శిక్షణ- ఇదంతా ఈసుందర కాండలో వుండడం వలన గూడా-అది పారాయణ ప్రాముఖ్యాన్ని సంతరించు కోడానికి ఒక కారణంగా చెప్పుకోవచ్చు.

సుందరకాండ పారాయణప్రాముఖ్యాన్ని సంతరించుకోడానికి కుండలినీ యోగ పరంగా ఇంకో సమన్వయం వుంది. ముందుగా ఈ పుస్తకంలో చివర వున్న 'అనుబంధము' అనే శీర్షికలో తెలిపిన విషయాలన్నీ చదివితే రామా యణాన్ని కుండలినీయోగపరంగా సమన్వయించవచ్చునని తెలుస్తుంది. ప్రస్తుత 'సుందరకాండ' విశుద్ధి చక్రానికి సంబంధించిన కాండ అని గూడా తెలుస్తుంది. అయితే ఈ విషయం ఇక్కడ మరింత వివరించాల్సిన అవసరం వుంది.

ఆకాశంలోంచి అన్నీ ఎలా వచ్చి, చివరకు ఎలా లీనమౌతాయో, వివిధ తత్త్వాలు, రహస్యాలు ఎలా నిక్షిప్తమై వుంటాయో- అలాగే ఈ సుందర కాండలో మిగిలిన కాండల విషయాలు నిక్షిప్తమై వుంటాయి.

విశుద్ధిచక్రం మనలో కంఠంవద్దవుండే 'స్వరపేటిక'(Vocalchords)

ప్రాంతంలో వుంటుంది. మనం మాట్లాడాలన్నా, చదవాలన్నా, పాడాలన్నా, గొంతెత్తి అరవాలన్నా ఈ స్వరపేటిక సహాయం లేనిదే చెయ్యలేము. అంటే లోపలనుండి వచ్చే నాదం వాక్కులాగా వ్యక్తమై, ఉచ్చరించడానికి వీలుగా రావాలంటే– ఈ స్వరపేటిక సహాయం కావలసిందే ! ఈ స్వరపేటిక వద్ద వుండే 'విశుద్ధి చక్రం'తో గల సమన్వయాన్నిబట్టి 'సుందరకాండ కూడా పారాయణకు చెందిన కాండగా ప్రసిద్ధి చెందింది' అనడం అనౌచిత్యం కాదు. కాబట్టి, కంఠశుద్ధికి, పవిత్రతకు ఈ విశుద్ధి చక్ర సంబంధిత సుందరకాండ పారాయణ ఎంతైనా ఉపకరిస్తుందని చెప్పడం తప్పుకాదు గదా!

ఇక ఇతివృత్తాల పరంగా చూస్తే- 'ప్రలోభాన్ని' సూచించే 'బంగారు లేడి' అనే 'మారీచు'ని సహకారంతో- 'ఆత్మ' అనే 'శ్రీరాముని'తో కలిసి వున్న 'బుద్ధి' అనే 'సీత'కు మోహభ్రాంతిని కలుగజేసి- 'మనస్స'నే 'రావణాసురుడు' ఆ బుద్ధి సీతను అపహరించి, తన చెప్పు చేతలలో పెట్టుకోడానికి చేసే ప్రయత్నానికి సంబంధించిన గాథే 'సీతాపహరణం'. ఇది అరణ్యకాండ లోని ప్రధాన ఇతివృత్తం.

ఆత్మ సామ్రాజ్యానికి వారసుడు, సూర్యకులదీపకుడు అయిన ఆత్మ అనే శ్రీరాముడు- సూర్యపుత్రుడు, మనలో ప్రాణనాడికి ప్రతీక అయిన సుగ్రీవునితో- సూర్య శిష్యుడు, మనలో బ్రహ్మనాడికి ప్రతీక అయిన 'హనుమ' ద్వారా- సఖ్యం చేసుకుని, మనలో 'అపాననాడి'కి ప్రతీక అయిన వాలిని నిరోధించి, వార్తాప్రసారానికి సంబంధించిన నాడులనే వానర సమూహాన్ని చేరదీసి, సమీకరించి బుద్ధి అనే సీత జాడను తెలుసుకోడానికి చేసే ప్రయత్నానికి సంబంధించిన గాథే- కిష్కింధా కాండలోని ప్రధాన ఇతివృత్తం.

ప్రలోభానికి లొంగి మోహభ్రాంతిలో పడిన బుద్ధి జీవి అనే సీత- మనస్సనే రావణాసురుని చర్యలకు, కట్టుదిట్టాలకు తలవంచాల్సిన పరిస్థితులలో నిర్బంధపెట్టబడుతుంది. పరమాత్మ అంశ అయిన ఆత్మఅనే శ్రీరాముని సన్నిధిలో- బుద్ధిజీవి అనే సీత- తనుపొందిన ఆనందస్థితిని తలచుకొని దుఃఖపడుతుంది. అప్పుడు ఆత్మారాముడు ఈ భయాన్ని పోగొట్టేందుకు- 'అసలు' విషయాన్ని బోధపరచే "గురువు" అనే హనుమకు- తన అభయహస్తానికి

ఆభరణం లాగా వున్న- అంగుళీయకాన్నిచ్చి, బుద్ధి అనే ఆ సీత వద్దకు పంపి ఓదార్పును కలుగజేస్తాడు. జీవితంపై ఆశను కలిగించినందుకుగాను బుద్ధిజీవి సీత- కృతజ్ఞతతో భక్తి ప్రపత్తులను తలవంచడం ద్వారా సూచించే- తలపైనున్న చూడామణిని ఇచ్చి ఆత్మారామునికి పంపుతుంది. ఈ మానవ జీవితాంశాల వివరణమే- సుందరకాండలోని ప్రధాన ఇతివృత్తం.

ఇక ఈ సుందరకాండ వ్యక్తిగతంగా నామీద ఎలాంటి ప్రభావాన్ని చూపిందో వ్రాస్తాను.

అస్మద్గురువరేణ్యులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల (మాస్టర్ ఇ.కె.) వారి ఆదేశాన్ననుసరించి 'రాముడు – రామాయణం' అనే శీర్షికతో నేను సరళ వచనంలో వ్రాసిన, వ్రాస్తున్న- రామాయణాన్ని మా జగద్గురు పీఠం వారు 'నా వాణి' పేరుతో ప్రచురించే ఆధ్యాత్మిక, వైద్య, విజ్ఞాన మాస పత్రికలో రెండు దశాబ్దాల కాలంగా ధారావాహిక వ్యాసాలుగా ముద్రిస్తున్నారు. అయితే- శ్రీరాముని పాదుకలను సింహాసనం ఎక్కించి పూజించిన ఘట్టంతో ఈ రచన ప్రారంభింపబడి, ఇప్పటికి సుందరకాండ వరకు పూర్తయింది.

సుందరకాండ 'నా వాణి'లో 1992 జూలై నెలలో ప్రారంభమై 1996 సెప్టెంబర్ నెల పత్రికలో సమాప్తమైంది. నేను వ్రాసిన పుస్తకాల్లో 12 పుస్తకాలు ఈ నాలుగు సంవత్సరాల కాలంలోనే ముద్రితమై గ్రంథ రూపంలో వెలుగులోకి వచ్చాయి. పుస్తకాలను వ్రాయగలగడమేగాని, ప్రచురించుకోగల స్తోమతలేని వాణ్ణి అయినా దాతల, మిత్రుల, శ్రేయోభిలాషుల సహాయ సహకారాలతో అవి ఇలా గ్రంథరూపంలో వెలుగులోకి రావడానికి- ఈ సుందరకాండ రచనాకాల ప్రభావమే అని అనుకుంటున్నాను.

కేవలం గ్రంథాల ప్రచురణేకాదు మా అమ్మాయి పెళ్ళి, మాఅబ్బాయికి ఖరగ్‌పూర్ **I-I-T** లో ఇంజనీరింగ్ సీటు రావడం, ఈ సుందరకాండ రచన పూర్తవంగానే ముద్రణకు ఇచ్చిన మర్నాడే వార్తాపత్రికల్లో నాకు రాష్ట్ర స్థాయిలో "ఉత్తమ అధ్యాపక పురస్కారం" ఇస్తున్నట్లు వార్త రావడం, తత్ఫలితంగా ఎన్నో సంస్థలవారు నన్ను సన్మానించి గౌరవించడం- ఇవన్నీ ఈ నాలుగేళ్ళ 'సుందరకాండ రచనా కాలంలోనే జరిగాయి.

ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే– సుందరకాండ వ్రాసినా, చదివినా విన్నా ఎంత ఫలితం వుంటుందో తెలియపరచడానికి మాత్రమే! అయితే ఇలాంటి ఫలితాలు వస్తాయని అనుకొని మాత్రం నేను సుందరకాండ రచన చెయ్యలేదు, చదవలేదు. దీనినిబట్టి– షరతులు, ఆంక్షలు పెట్టి సలహాలు సూచిస్తూ భగవంతుణ్ణి ఆరాధించడంకాదు మనం చెయ్యవలసిందనీ, నిష్కామ బుద్ధితో మనం చెయ్యవలసిన, చెయ్యగలిగిన పనులు చేసుకుంటూ వుంటే– మనకు రావలసినవి, చేకూరవలసినవి ఆ భగవంతుడే చూస్తాడనీ తెలుసు కోవాలి. (కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన– భగవద్గీత)

భక్తిశ్రద్ధలతో, ఇష్టపడి, గ్రంథాంతర విషయాల్లో లీనమై, అనుభూతి పరంగా ఈ సుందరకాండను చదువుకోండి. తోచిన నియమాలను, నిబంధ నలను పెట్టుకొని 'పారాయణ' పద్ధతిలో చదువుకుంటే ఇంకా 'పవర్‌ఫుల్' **(Powerfull)** గా వుంటుందనుకుంటే అలాగే చదవండి. ఎలా చదివినా– ఆసక్తి, భక్తి, శ్రద్ధ ముఖ్యం అని మాత్రం గమనించండి. ఇవి లేకుండా ఎన్ని నియమాలు, నిబంధనలు పెట్టుకుని 'సిలబస్' పూర్తి చేసినట్లు చదివినా అది సరియైన విధానం కాదని నా అభిప్రాయం. పాఠకులు, సాధకులు అందరూ ఈ సూచనను గుర్తుపెట్టుకొని, ఈ సుందరకాండను చదువు కుంటారని, మీ వ్యక్తిగత జీవితాన్ని సంస్కరించుకుంటూ, వికసిస్తారని ఆశిస్తాను.

జి.ఎల్.ఎన్. శాస్త్రి

శ్రీరస్తు

# శ్రీమద్రామాయణము

## సుందరకాండ

### ఆంజనేయుని అంజలులు

"వెలుగులకు వెలుగు, అఖిల విద్యలకు ఆద్యుడు, కర్మసాక్షీభూతుడు అయిన ఆచార్య భాస్కరునికి నమస్కృతులు. ధర్మశాస్త్ర, ధనుర్విద్యాపారీణుడు, సల్లక్షణ సలక్ష్మణమూర్తి అయిన శ్రీరామచంద్రమూర్తికి ప్రణామములు. దుష్టుల దుష్టబుద్ధిని దధీచి వెన్నెముకతో సంస్కరించే ధర్మమూర్తి, జీవులను పెనవేసుకుకుని వుండే అజ్ఞాన, పాప, అహంకారాలనే వృత్రాసురుని చుట్టలను పటాపంచలుచేసే దేవేంద్రునికి నమస్సులు. పుట్టీ పుట్టంగానే ఆకాశంలోని సూర్యారుణ ఫలాన్ని అమాంతం కబళిద్దామనే కోర్కెతో వియద్వీధికి ఎగిరిన నాకు జన్మనిచ్చిన-సమీర జనకునకు వందనాలు. సంకల్పం లేకుండానే తన ద్వారా యావత్తు సృష్టి వ్యక్తమౌతున్నపుడు సాక్షీభూతుడుగా వుండి జీవుల కర్మలకు తగిన శిక్షలను ఏర్పరిచే విధికి వినయాంజలులు ఋగ్వేదంలో ప్రస్తుతింపబడిన వరుణదేవుని మహిమాన్వితమైన రూపు గలిగి, ఎల్లప్పుడూ ధరణీ దేవతను కన్న తండ్రిలా కౌగిట్లో కాపాడే జలధినాధునికి నమోవాకములు"-అంటూ సముద్ర లంఘన కార్యం సఫలీకృతం కావటం కోసం కార్యారంభంలో సూర్యాది దేవతామూర్తులకు నమస్కరిస్తూ నాలుగు దిక్కులకును, ఆకాశాన్ని పట్టి ముట్టడించేట్టుగా పర్వతాకారంగా పెరుగుతున్న హనుమంతుని కపివీరులు చూసి భయకంపితులయ్యారు. మహేంద్ర పర్వతంమీద పాదాలు మోపి ఒక్కసారి పైకి లంఘించడంతో పర్వతం మీద చెట్లు వాటి పూలతో హనుమకు మహాభిషేకం చేసి స్తుతించి ప్రసన్నుని చేసుకున్నాయి.

మహేంద్ర పర్వతంమీద కాళ్ళు తన్నిపట్టి పైకి లంఘించడంతో కాళ్ళ క్రింద భూభాగం దిగబడిపోయి, బిలం బయటపడి అది ధరణీదేవత దంతపు పునాది లాగా, అందులోంచి కదులుతూ బయటకు వచ్చే పొడవైన పాములు నరాలలాగా భాసించాయి.

పాములు దంష్ట్రిలతో కరచిన చోట్ల అగ్నులు పుట్టి జ్వాలలు రేగుతూంటే అవి పర్వతరాజు ముఖంపై ఎఱ్ఱని చెమటధారలులాగా వుండి ముఖం కందగడ్డలాగా కనబడుతోంది.

పర్వతంమీద వుండే సిద్ధులు, మహర్షులు కొండ బ్రద్దలవుతుందేమోననే సంశయంతో, కూర్చున్న చోటునుండి ఇంకా గగనంపైపుకు తరలివెళ్ళారు. వనభోజనాలు ఆరగిస్తున్న యక్షదంపతులు తినే భోజనం, త్రాగే పానీయాలు అక్కడికి అక్కడే సగంలోనే వదిలి ఎంగిలి చేతులతో నింగివైపుగా ప్రయాణించారు.

"ఇతడు మహానుభావుడు. ధరణీజామాత, సీతాపతి అయిన రామచంద్రుని సేవా కార్యార్థియై మహేంద్రపర్వతం మీదనుండి గగనసీమకు వస్తున్నాడు, కంగారు పడకండి!" అని సిద్ధులు చెప్పినమీదట ఆకాశచారులకు భయంపోయి కుదుట పడ్డారు. పయోధిపై పవనసుతుని సంప్లవన సౌందర్యాన్ని తిలకిస్తూ పులకించిపోయారు.

పావని పాదఘాతానికి భూమి రసాతలంలోకి దిగబడిపోతుందేమోనని పూర్వం క్షీరసముద్రమథనంలో వాసుకి మంద్రగిరిని పట్టుకున్నట్లు-అనంతుడు భూమిని చుట్టలు చుట్టుకొని గట్టిగా పట్టుకున్నాడు. అలా చేయడంవల్ల మారుతి పాదాలు తన్నిపెట్టడానికివీలై ఒక్కసారిగా ఎగరగలిగాడు. ఎగిరి క్రిందనున్న వానరయోధులను చూస్తూ-

"సీతను చూసి వెంటనే వచ్చేస్తాను. ఒకవేళ లంకలో సీత లేకపోతే స్వర్గానికి వెళ్ళి చూస్తాను. అక్కడ లేకపోతే లంకను పెల్లగించి తెస్తాను. ఆ దశకంఠుణ్ణి చేతులు కాళ్ళు కట్టి తీసుకువస్తాను" అన్నాడు.

రామకార్య భారం తన భుజస్కంధాల మీద దాల్చినట్లు మహాభార సమన్వితుడైన హనుమ ఒక్కసారి కుప్పించి లంఘించడంతో సమస్త వృక్ష సంతతితో నిండివున్న మహేంద్రగిరి యావత్తు కంపించిపోయింది. హనుమ తనను చిన్నప్పటినుండి గరుత్మంతునితో పోల్చుకునేవాడు. హస్తాలుచాచి అవి రెక్కలలా వూహించేవాడు.

ఇప్పుడు లోని ఊహ, కోరిక తీరినట్లు మహావీరునిలా భావిస్తూ సంతోషిస్తున్నాడు. హనుమను చూస్తూంటే-మహేంద్రగిరి ప్రాణాలతో లేచివస్తోందా?

అన్నట్లుంది. "అరే! ఇప్పటిదాకా ఈ గిరి ఇలాతలంలో వుంది. అంతలోనే అంతరిక్షానికి ఎగసివస్తోందే" అని భ్రాంతి పడుతున్నారు ఖేచరులు. హనుమ వెనక్కి తిరిగి చూడకుండా సీతాన్వేషణా మత్తచిత్తుడై శీఘ్రవేగంతో సాగి పోతున్నాడు.

రామకార్య నిర్వహణాదక్షుడై అత్యున్నతోత్సాహంగా వెళ్తున్న కొడుకు హనుమకు ఎదురుగా వస్తూ, కౌగిలించుకొని ఈలలు వేసుకుంటూ వాయు దేవుడు వెనక్కివెళ్తున్నాడు. "సీత అనే పరిశుద్ధ వేదతేజఃపుంజాన్ని తస్క రించిన రావణుడనే సోమకాసురుణ్ణి పట్టి విడిపించడానికి ఆకాశమనే సము ద్రాన్ని ఈదుకుంటూ వెళ్తున్నాడా" అన్నట్లు హనుమ భాసిస్తున్నాడు.

ముంగాళ్ళు తోకలాగా, బలమైన, ధృఢమైన తొడలు తెరచాపలాగ, బాహువులు తెడ్లులాగా వుండి ఆకాశమనే సముద్రంలో పయనిస్తున్న నావలాగా హనుమ భాసిస్తున్నాడు.

దానవ బాధితులైన దేవతల హృదయాలలోని భావాలన్నీ మూటకట్టిన రూపం పొంది ఆకాశమార్గం పట్టినట్లు హనుమ భాసిస్తున్నాడు. రాక్షసుల ఆటలు కట్టించడానికి హనుమ అంబరవీధిని పోతున్నాడని నాగజాతికి, ఋషులకు, దేవతలకు మిగిలిన వృక్ష, జంతు జాతులందఱికీ తెలుసు. కానీ ఒక్క రాక్షసులు మాత్రం మూర్ఖులు గాబట్టి హనుమ ఇందుకోసం వెళ్తున్నా డని వూహించలేకపోయారు.

## సముద్ర, మైనాకుల ఆతిథ్యం

సూర్య వంశస్థులచేత అభివృద్ధి పొందిన సాగరమూర్తి - సూర్యవంశ కార్య నిబద్ధుడైన ఆంజనేయునికి తన వంతుగా సపర్య చేసి సహాయపడాలను కున్నాడు. తనలోనే ఎవ్వరికీ కనబడకుండా దాగివున్న హిమగిరిపుత్రుడైన మైనాకునితో—

"ఓ మైనాక మహాచలా ! నీతండ్రి అయిన హిమవత్పర్వతరాజు నాకు చాలా కావలసిన మంచి మిత్రుడు. నీ తండ్రికి నువ్వు ఎలాగో నాకూ అలాంటి వాడివే. ఇన్ని నాళ్ళు నిన్ను నా కడుపులో పెట్టుకుని కాపాడాను. ఏ రోజునా నేనుగా నిన్ను- ఏదీ అడగలేదు. ఈ రోజు నీతో చిన్న అవసరమొచ్చింది.

భూజాత సీతను మూర్ఖుడైన రావణుడు దొంగలించుకొనిపోయాడన్న వార్త నువ్వు వినే వుంటావు, ఆ సీతను వెదకి రామునికి సహాయపడాలనే కోర్కెతో కపిపుంగవుడైన ఆంజనేయుడు వియత్పథంలో దూసుకుంటూ పోతున్నాడు. పూర్వం ఒకసారి మీతండ్రి ఆకాశమార్గంలో వెళ్ళడం నేను చూశాను. మళ్లీ అలాగే పోతున్నాడేమో అనిపించింది. ఆకాశంతో నీరాజన మెత్తినట్లు సిందూరారుణ కాంతులు చిమ్మే ఆ ముఖం చూసిం తర్వాత అలా వెళ్ళేది అంజనేయుడని తర్వాత తెలిసింది. 'పూర్వం పర్వతాలు రెక్కలు గలిగి నింగిలోకి గూడా ఎగరగలిగేవి' అని అందరూ చెప్పుకుంటూండగా వినడమేగాని చూడలేదు. అలా రెక్కలు గలిగిన నువ్వు నాలోనే వున్నావు ఇన్నాళ్ళు. మరి నీతో పని పడింది. ఇక్ష్వాకు వంశస్థులైన సగర పుత్రులే నాయీ విశాల గంభీర స్థితికి కారకులు. వాళ్ళు నాకు సాక్షాత్తు పితామహులు తెలుసా? అటువంటి మా వంశానికి సంబంధించిన గౌరవాన్ని నిలవెట్టడం కోసం హనుమ గగనచారుడై వెళ్తున్నాడు. ఎప్పుడూ ఆకాశంలో తిరిగేవాళ్ళకే కష్టం. ఇప్పుడు ఇలా హనుమలా గగనతలంలో నిర్విరామంగా దూసుకుంటూ వెళ్ళడం మరింత కష్టమని, అలసిపోకుండా వుండలేడని నీకు వేరే చెప్పనక్కర లేదు. తనకు రాథముడైన ఆ రావణుని లంకకు చేరేంత వరకు హనుమకు విరామం, విశ్రమం వుండదు గదా! ఈ మార్గ మధ్యంలో కాస్త విశ్రాంతి తీసుకోడానికి అవకాశం కల్పిస్తే బావుండదూ?" అన్నాడు. మైనాకునికి సాగర మూర్తి ఆంతర్యం అర్థమైంది. వెంటనే పూర్వం క్షీరసముద్ర మథనానంతరం వెంటనే ఆ మందర పర్వతం ఒక్కసారి పైకి ఎలా లేచిందో సరిగ్గా అలాగే మైనాకుడు సముద్రంల్లోంచి ఒక్కసారిగా పైకి లేచాడు. ఆకాశానికి డొక్కలో గ్రుచ్చుకున్నట్లైంది. అది ఉదయాద్రి అయివుంటుందా, అస్తాద్రి అయి వుంటుందా అని సూర్యునికే అనుమానం వచ్చేలాగా ఆకాశం నడిమి భాగంలో నిఠారుగా నిలబడ్డాడు మైనాకుడు. వియత్పథంలో దూసుకుపోతున్న మార్గానికి అంతరాయం ఏర్పడడంతో హనుమకు చికాకు కలిగింది. "వీడెవడో కొవెక్కి వళ్ళు అదే పనిగా పెంచిన మహా రాక్షసుడెవడో అయివుంటాడు. వీడి. తొమ్ము వ్రక్కలిస్తాను" అంటూ భుజంతో ఢీ కొన్నాడు. ఆ దెబ్బకు మైనాక పర్వతం పీటలు వారింది. "అబ్బా! ఎంత కర్కశంగా దెబ్బకొట్టాడు?

మొత్తానికి నన్నే దెబ్బకొట్టగలిగిన ఇతని బాహుబలం సామాన్యమైంది కాదు" అంటూ మనస్సులోనే సంతోషిస్తూ మనుష్య రూపాన్ని పొంది–

"ఓ మహావీరుడా! నీ మార్గానికి అంతరాయం కలిగిందని చింతించకు. నన్నేదో నీకు శత్రువుగా భావించకు. సత్కార్య నిర్వహణలో దీక్షగా అనితర సాధ్యమైన పనికి పూనుకుని అవిశ్రాంతంగా వెళ్తున్న నీవు నావిశాల కూట ప్రదేశాలలో కాస్త విశ్రాంతి తీసుకునే ఏర్పాటు చేద్దామని వచ్చాను. నువ్వు వినే వుంటావు, పూర్వం పర్వతాలకు రెక్కలు గూడా వుండేవని. ఆ రెక్కలతో పర్వతాలు పైపైన సంచరిస్తుంటే భూమిమీద ప్రజలు భయాందోళనలు చెందటం చూచి ఇంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను విరగ గొట్టాడు. ఇంద్రుడు నా దగ్గఱకు గూడా వస్తున్నాడని తెలిసి నీతండ్రి అయిన వాయుదేవుణ్ణి ఆశ్రయించాను. ఆయన అనుగ్రహంతో ఈ సముద్రంలో ఆశ్రయాన్ని పొందాను. నీ తండ్రికీ సముద్రుడికీ తప్ప మరెవ్వరికీ నా ఉనికి తెలియదు. ఇన్ని రోజులబట్టి నేనిలా బ్రతికి మెతుకుతింటున్నానంటే నీ తండ్రి చలవే సుమా! పైపైకి చూడ్డానికి కటిక ఉప్పే అయినా అంతర భావాల్లో చెఱకు తీపినిమించినవాడే! "రామ కార్యార్థం వెళ్తున్న నీకు అలసట తీరేందుకు నాశృంగంమీద పండిన పాలాశఫలాదుల్ని, తరులతాస్నిగ్ధ పాద్యాంబువుల్ని నీకు ఉపాధేయంగా సమర్పించమని ఈ సముద్రుడే నన్ను పంపించాడు. నీవు మాఇంటికి అతిథివి. రామకార్య నిర్వహణాయత్తచిత్తుడివి. నీకు సమర్పిస్తే సర్వ కపిలోకానికే కాక రామునికి గూడా అర్పించినట్లౌతుంది. ఆతిథ్యం స్వీకరించి అనుగ్రహించు" అన్నాడు.

అహంకారంతో కొట్టుమిట్టాడే పండితోత్తములకు ఏదైనా కొత్త విషయానికి ఆశ్చర్యం కలగకపోవచ్చునుగాని రసాతలంలో వారుగూడా ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడన్నా పర్వతాలకు రెక్కలు చూచినపుడు ఆశ్చర్య పడకమానరు.

ఈ పర్వత పక్ష ప్రసన్న పురాణగాధ విని ఎదురుగా అల్లాంటి పర్వతాన్ని చూచి, మారుతి ఆశ్చర్యపడ్డాడు.

హనుమ మైనాకునితో– "నగరాజా! నన్ను క్షమించు. కార్య నిర్వహణాయత్త చిత్తుడనై వున నేను మార్గానికి అడ్డు ఏర్పడడంతో అసలు

సంగతి తెలుసుకోడానికి ప్రయత్నించకుండా నువ్వేదో పెద్ద రాక్షసుడవై మార్గానికి అవరోధాన్ని కలిపిస్తున్నావని కోపంతో నీ బొమ్మని ఢీకొని గాయ పరచాను. అలా చేసినందుకు ఇప్పుడు బాధపడుతున్నాను." అంటూ చిట్లిన చోట మైనాకుని మేను తన చేత్తో ఆప్యాయంగా నిమురుతూ—

"మీ హృదయపూర్వక ఆతిథ్యానికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు. ఆ సముద్రునికి గూడా నా నమస్కారాలు తెలుపు. మీ ఆతిథ్యం నాకు దక్కినట్లే. నేను ప్రస్తుతం ఆగి విశ్రాంతి తీసుకునే సమయం కాదు. దయచేసి నేను వెళ్ళడానికి అనుమతించు" అంటూ తన మార్గాన తన పయనాన్ని కొన సాగించాడు. ఇంతలో ఇంద్రుడు అక్కడకు వచ్చి మైనాకుని చూచి—

"ఓ గిరిరాజా! ముందు ముందు గూడా ముల్లోక వాసులు మెచ్చుకునే పనిచేశావు గదయ్యా! నువ్వింక నా వజ్రాయుధానికి భయపడనక్కరలేదు." అని అనుగ్రహించి వెళ్ళిపోయాడు. మైనాకు డామాటలు విని ఉక్కిరి బిక్కిరైన సంతోషంతో పయోనిధిలో నిమగ్నమైనాడు. హనుమంతుని అద్భుతమైన బాహుబల విక్రమాన్ని, వినయ సంపత్తిని, కార్యకరణోర్జిత మార్జవాన్ని ఇంద్రుడు మనస్సులో మాటిమాటికీ గుర్తుచేసుకుంటూ అమహనీయ ప్రసన్నాంజ నేయుణ్ణి ప్రస్తుతించాడు.

"మంగళమూర్తీ! మరణాంధకారారాక్కా! మర్కటా! పంచవక్త్రా! సర్వాంగదకంఠహారా! రామకాంతా దర్శన భాగ్య ప్రదాతా! హనుమంతా! ఆంజనేయా! ప్రసన్నాంజనేయా! ప్రభాదివ్యకాయా! ప్రకీర్తిప్రదాయా! సింహాన—! వైనతేయా! జయోఽస్తు! విజయోఽస్తు!"

హనుమంతుని ఈ రెండవ విక్రమానికి ఆశ్చర్యాన్ని పొంది మనస్సు లోనే మంగళ నీరాజనా లర్పించిన ఇంద్రుణ్ణి చూసి, సర్వ ఋషులు, సిద్ధులు, సాధ్యులు సర్వభూతాలు హనుమను ప్రస్తుతించారు.

ప్రళయకాలంలో రుద్రమూర్తిలాగా ఆకాశాన్ని అమాంతం మింగుతాడా అన్నట్లు రెక్కలు చాచి, ఆకాశంలోకి దూసుకుంటూ హనుమ పోతున్నాడు. ఈలెక్కన కనక హనుమ వెళ్తే లంకలో ప్రవేశించే సమయం సుముఖంగా వుండదని ముందే వూహించి లంకలో ప్రవేశించే కాలం మంచిదవాలనే

ఉద్దేశ్యంతో దేవతలు నాగమాత అయిన 'సురస'ను ప్రార్థించారు. ఆమె వారికి ప్రత్యక్షమైంది.

"వాయుసుతుడైన హనుమంతుడు సముద్రాన్ని లంఘిస్తూ పోతున్నాడు. అతనికి మంచి జరగడం కోసమే నీవు అతనికి అడ్డు తగిలి కాస్త ఆలస్యం అయ్యేట్టు చూడాలి. పెద్ద పర్వతాకారంలో పెద్ద పెద్ద దంతాలు గల కరాళ ఆకృతితో పెద్ద పర్వతాకారంలో వెళ్ళు. అలా ఎదురుబడే నిన్ను చూసి ఏం చేస్తాడో చూడాలి. ఏదో ఒక ఉపాయంతో నిన్ను తప్పించుకుని వెళ్ళ గలిగాడా–సరే! లేకపోతే రామకార్యాన్ని సాధిస్తాడా లేదా అన్నది ఈ తొలి అడ్డంకులోనే తెలుస్తుంది." అని ప్రార్థించారు.

## నాగమాత సురస

నాగమాత పాతాళలోకంనుండి ఆకాశం దాకా సముద్ర మధ్యంలో మహా భీకరాకారముతో వాయుసుతుని మార్గానికి అవరోధంగా నిల్చి-

"ఎక్కడికి వెళ్తున్నావ్! నాకు ఆకలేస్తోంది. రా, సరాసరి నా నోట్లోకి వచ్చెయ్! నమిలి మింగి నా ఆకలి తీర్చుకుంటాను" అంది. అందుకు ఆంజనేయుడు అంజలి ఘటించి—

"నా పేరు హనుమంతుడు. వాయుదేవుని కుమారుడను. రామకార్య నిమిత్తం వెళ్తున్నాను. ఒక్క బాణంతో దుష్ట శిక్షణ చేయగల శ్రీరాముడు నన్ను దూతగా పంపాడు. దేవతలకు శత్రువైన రాక్షసరాజు రావణుడు భూజాత, శ్రీరాముని పత్ని అయిన సీతను ఎత్తుకొని పోయాడు. మూడు లోకాలలోను తిరుగులేని ఆ శ్రీరామ చంద్రునికి ఇంత అన్యాయం జరుగుతుంటే ధర్మ ప్రవృత్తిగల వారెవరు చూస్తూ ఊరుకోగలరు? అందుకే ఆ రాక్షసరాజు ఆ సీతమ్మతల్లిని ఎక్కడ వుంచాడో చూ యనికి చెప్పి వస్తాను. అప్పుడు నీ ఆకలి సంగతి చూసుకుందువుగాని! ఆలస్యం కాకుండా ముందు నన్ను పోనీ తల్లీ'' అని ఆగకుండా ఆకాశంలో ముందుకు పోతున్నాడు.

ఆగకుండా పోతున్న ఆంజనేయుని చూసి నాగమాత-

"నే నెవర్ననుకుంటున్నావో, నా సంగతి నీకు తెలియదల్లే వుంది. నన్ను తప్పించుకుని ఎవ్వరూ వెళ్ళిపోలేరు. అది నాకు బ్రహ్మ ఇచ్చిన వరం తెలిసిందా. ఇంకేం మాట్లాడకుండా నా నోట్లోకి రా'' అంది.

# హనుమ, సురసల పోటీ తత్త్వం

నాగమాత మాటలకు హనుమకు కోపం వచ్చింది. "అయితే సరే నేను పట్టగలిగినంత నోరు చేసుకో'' అని పది యోజనాలదాకా దేహాన్ని పెంచాడు. అందుకు సురస ఇరవై యోజనాల నోరు చేసింది. హనుమ ముప్ఫై యోజనాల మేను పెంచాడు. సురస సలభై యోజనాలు నోరు పెంచింది. హనుమ యాభై యోజనాలకు శరీరాన్ని పెంచాడు. సురస అరవై యోజనాల నోరు తెరిచింది. ఇలా ఒకరికంటె ఒకరు పది పది యోజనాల చొప్పున పెంచుతున్నారు. చివరకు సురస వంద యోజనాలకు నోరు పెంచింది.

సృష్టిలోని సమస్త ప్రాణుల వి త్తనాలను సంగ్రహించి హిరణ్యగర్భుడు ప్రళయ జలధిలో పయనిస్తున్నట్లున్న ఆ వంద యోజనాల నోటిలో సురస నాలుక పెద్ద తెరచాపలాగాను, దంతపంక్తి ఒక పెద్ద ఓడ లాగాను భాసించి హనుమ లోలోపలే సంతోషించాడు. వెంటనే అంగుష్ఠమాత్ర (చేతి బొటన వేలి అంత) శరీరుడై అంత పెద్ద నోటిలోనికి ప్రవేశించి మళ్ళీ బయటకు తిరిగి వచ్చి—

"నువ్వు పట్టిన పట్టు చెల్లింది. నీ నోటిలోనికి వెళ్ళి తిరిగి వచ్చి నీ మాట చెల్లించి అంజలి ఘటిస్తున్నాను. నన్ను అనుగ్రహించు అన్నాడు'' తెలివిగా.

హనుమ తెలివిగా చేసిన పనికి ఆ నాగమాత సంతోషించి "నీ కార్యం సఫలమౌతుంది. ఇంక ఆ రాముణ్ణి వైదేహినీ ఇద్దరినీ కూర్చు'' అని అనగానే పైనున్న సిద్ధాదులు హనుమ భుజబల విక్రమాలకు, బుద్ధిబల నైపుణ్యాలకు, కార్య నిర్వహణాదక్షతకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొందారు. శచీ పురందరులు హనుమను హృదయంలోనే స్తుతించారు. హనుమంతుని ఈ మూడవ విక్రమానికి సిద్ధులు సాధ్యులు హనుమను- మంగళరూపా! మహనీయ తేజ! పంచవక్త్రి! త్రిపంచనేత్ర! సర్వాంగద కంఠహార! సర్వజ్ఞ! సర్వ గ్రహభీతి నివారణ! మహితాత్మా! అంటూ కొనియాడారు.

"ఇలా వంద యోజనాలదాకా పెంచిన శరీరంతో ఇక్కడనుండే ఒక కాలు లంకలో పెడితే లంఘించాల్సిన అవసరము వుండదు గదా'' అనే ఆలోచన గూడా వచ్చింది హనుమకు. ఆలోచనైతే వచ్చింది కాని ఎందుకనో ఆచరణలో పెట్టకుండానే హనుమ విజయద్వీథిలో మేఘాల చాటున దాగుడు

మూత లాడుతున్నట్లు పయనిస్తున్నాడు. వన్నెలు చిమ్మే తోక ఇంద్ర ధనుస్సును గుర్తుకు తెస్తోంది. ఒక్కొక్క మేఘ మండలాలను దాటుకుంటూ వెళ్తున్నాడు. సంధ్యాకాలం సమీపిస్తున్న కొలదీ చీకట్లు దట్టంగా క్రమ్ము కొంటున్నాయి. దట్టని మేఘాలు దాటుతున్నప్పుడు చిక్కని చీకటిలో బంగారు వన్నెగల మారుతి మెరుపులాగా భాసిస్తున్నాడు.

## సింహిక

అంతటి ఆకారంగల హనుమను ఆకాశంలో వెళ్తూ ఉండడం చూసింది 'సింహిక' అనే ఒక పెద్ద రాక్షసి. వెర్రి ఆకలితో వున్న ఆ సింహిక పెద్ద గుహలాగా నోరు తెరిచి హనుమంతుని నీడ పట్టుకుంది.

ఉధృతమైన ప్రవాహానికి ఎదురీదుతున్నట్లుగాను, పెద్ద ఝుంఝూ మారుతానికి ఎదురేగుతున్నట్లు, ఆకాశం అనే శూన్యభూతం కోరలతో గుంజు కుంటున్నదా అన్నట్లు, రెండు చేతులతో పట్టుకుని వెనక్కు లాగేస్తున్నట్లు హనుమకు అనిపిస్తోంది. వేగం సన్నగిల్లుతోంది. ఏమిటా అని వెనక్కి తిరిగి చూస్తే పాతాళానికి ద్వారంలా వున్న నోరు తెరుచుకుని ఉన్న పెనురక్కసి కనబడింది. "ఓహో! ఇదా ఇంతవరకు నన్ను పట్టి వెనక్కు లాగుతున్నది నాలుగు దిక్కులకు సైన్యాన్ని పంపిస్తున్నపుడు దక్షిణదిక్కుకు పోయే మాకు సుగ్రీవుడు చెప్పిన "సింహిక" ఇదే కాబోలు. మనుష్యుల నీడను పట్టిగూడా వారిని మింగగలది ఇదే కాబోలు" అనుకుని క్రమక్రమంగా తన శరీరాన్ని పెంచుతూ పెంచుతూ ఒక్కసారి వజ్ర లఘు దేహుడయ్యాడు. రాక్షసి నోట్లోకి ఒక్కసారిగా దూకాడు. అంతవరకు రాక్షసికి సరిపోయేలా దేహాన్ని పెంచు తున్న హనుమ ఒక్కసారిగా క్లుప్త శరీరుడవడం, రాక్షసి నోట్లోకి దూకడం ఎవ్వరికీ- చివరకు దేవతలకు గూడా తెలియదు. లోపలకు వెళ్ళడం రాక్షసి గుండెను వ్రక్కలు చేసి వెనువెంటనే బయటకు రావడం, లోపల ప్రాణాలు లోపలే పోయి రాక్షసి చావడం— అంతా తృటికాలంలో జరిగిపోయింది. ఎవరన్నా గుండె ఆగి చస్తారు కాని, గుండె లోపల ఇలా మట్టు పెట్టబడి చచ్చిన తీరే వేరు. సముద్రంలో తిరిగే పాములకు తెప్పలాగా ఉపయోగ

పడిన దాని శవం చూస్తే తెలియాలే తప్ప అది చచ్చిందని గూడా ఎవరూ అనుకోలేరు.

## లంకా పట్టణ సౌందర్యం

సమీపంలోనే వున్నది లంకా పట్టణం. మేలుకుంటున్న జనుల ఘోషతో మిళితమై సిద్ధ చారణుల స్తోత్ర గీతాలు మిన్నుల నంటాయి. వాటిని విన్న మారుతి ఆకాశంలోనే విహరిస్తూ మనోజ్ఞమైన లంకాపట్టణ శోభను తిలకించాడు.

రకరకాల తరులతా పుష్పాలతో దట్టంగావున్న అరణ్యాలను చూపునకు అందేంతవరకు చూస్తూ ఆనందించాడు. ఒక్కసారి లంకా పట్టణంలోకి దిగుదామనుకున్నాడు. కాని అంతలోనే అనుమానం వచ్చింది. ఇంతటి పర్వతమంత దేహంతో వెళ్తే రాక్షసులందరూ 'వీడెవడు' అని వింతగా చూసి అందరూ జేరి అనవసరంగా నానా అల్లరీ, ఆగమూ అవుతుంది. అసలు వచ్చిన పని సాగదు. ఎందుకొచ్చింది అని చిన్నవాడుగా అయి లంకాపట్టణ ప్రవేశం చేశాడు.

కోట బురుజులమీద నిల్చుని నిత్యం వీధుల వెంబడి వచ్చేపోయే వారిని, వారిలో శత్రువు లెవరన్నా వుంటే వారిని చూడవలసిన రాజభటులు 'ఆ ఎవడు వస్తాడులే మన పట్టణంలోనికి అనే గర్వంతో ప్రమత్తులై వున్నారు. అసలు సముద్రం వైపుగా చూడనే చూడరు. మారుతి వస్తున్న సంగతి, లంకను ప్రవేశించిన సంగతి వారికి తెలియనే తెలియదు.

హనుమ కొంచెంసేపు వానరంలాగా, కొంచెంసేపు సింహంలాగా, మరి కొంచెంసేపు గ్రద్దలాగా, గుఱ్ఱంలాగా, ఇలా చిన్నచిన్న రూపాలతో వెళ్తూ లంకలోని వారికి అసలు తానెవరో తెలియనీయకుండా వెళుతున్నాడు. లంకాపురానికి చుట్టూ వున్న త్రికూట పర్వతం మీదకు చేరాడు. చెట్లమీద పుష్పాలలోని తేనెలతో పాద్యాన్ని ఇచ్చి, లతా పుష్పాలతో పూజను చేసి హరిని ప్రసన్నుని చేసుకున్నాడు హనుమకు చెమట పట్టింది. ఇంతటి మహోద్భుతమైన కార్యాన్ని చేస్తున్న తన సుతునికి సేద దీర్చాలన్నట్లుగా హనుమను వాయుదేవుడు సంతోషంతో కౌగిలించుకున్నాడు.

హనుమ గుహల్లో సంచరిస్తున్నాడు. ఎన్నో రకాల వృక్షాలు, తరులతా

గుల్మాలు, చిగురులు, పూవులు, ఫలాలు అన్నీ కుప్పలాగా పోసినంత దట్టంగా ఉన్నాయి.

కోటకు ఉత్తరదిశవైపుగా నడుస్తున్నాడు. గోడల్లో బీటలు వున్నాయేమోనని, శిలలు విచ్చుకునేమన్నా వున్నాయేమోనని, సరిగ్గా రక్షణ లేని చోటులు ఏమన్నా వున్నాయేమోనని వజ్ర పరీక్ష చేస్తూ వెళ్తున్నాడు. అంతా లక్ష్మీ కళ- ఎక్కడ చూసినా ఐశ్వర్యం, వైభవం, ఇంత దుర్జనత్వం వున్న ఈ రాక్షసుని పట్టణానికి ఇంతటి లక్ష్మిని ఎలా కూర్చాడా ఆ భగవంతుడు అనుకున్నాడు. కోట చుట్టూ అగడ్త లోతుగా వుంది. పూర్వం ఇక్ష్వాకులు సముద్రాలను త్రవ్వారు 'వాళ్ళకేమీ పోటీలో తీసిపోము మేము' అనే విధంగా కోటచుట్టూ త్రవ్వించాడా ఈ రావణుడు అన్నట్లుంది అగడ్త. క్రిందనుండి చూస్తే- ఆకాశంలోకి చూడవలసినట్లు కోట బురుజులున్నాయి.

ఎంతటి బలపరాక్రమ సామర్థ్యాలు గల వాడైనా ఆ కోట గోడలను ఎగబ్రాకి పైకి వెళ్ళడమనేది ఊహకుగూడా అందని విధంగా వుంది. క్రింద నుండి చూస్తే కంఠనరాలు చిట్లి మెడ విరుగుతుందనేట్లు వుంది. ఎన్నో ఏళ్ళ బట్టి సముద్ర జలాలు కోట గోడలను తడుపుతూ ఉండడంతో ఆ గోడలు పాచిపట్టి చెయ్యి వేస్తే జారిపోయేట్టుగా వున్నాయి. దట్టమైన పచ్చని పట్టు వస్త్రం చుట్టినట్లున్నాయి. ఏ విధంగానూ చేతులు వేసి ఎగబ్రాకలేనివి, కాలు మోపరానివిగా ఉన్నాయి.

కోట బురుజుల మీంచి బాణాలు వదలడానికి ఖాళీలు యేటవాలు తూములతో దుర్గం పకడ్బందీగా వుంది. త్రికూట పర్వతానికి సరిగ్గా మధ్యలో రావణుని నగరం వుంది నానారాక్షస దైత్యనాథ సభా భవనాలతో ఆ నగరం విరాజిల్లుతోంది. ఎలాంటి వీరులైనా ఇక్కడకు రావడమే కష్టం, వచ్చినా చెయ్యగలిగేదిగూడా లేదు. సరే ఆ విషయం ఇప్పుడెందుకు. ప్రస్తుతం ఇక్కడకు వచ్చింది సీతమ్మ తల్లిని చూడ్డానికి. ముందు ఆ పని అయిన తర్వాతనే ఇంకో ఆలోచన చెయ్యాలి. జటాయువు అన్న సంపాతి 'తాను లంకలో వున్న సీతను చూస్తున్నాను' అని చెప్పాడు. అయితే ఎక్కడ వున్నట్లు? ఈ రూపంతో వెళ్తే అందరూ వింతగా కుతూహలంతో వెంబడించవచ్చు. రాజభటులు చూస్తే లేనిపోని రభస, గందరగోళం. వచ్చిన పని

కాస్తా పాడయిపోతుంది. కళ్లకేమీ కనపడనంత చీకటి పడ్డప్పుడు అన్వేషణకు బయలుదేరితే మంచిది. దైవాన్ని అనుసరిస్తేనే మనిషి ఏదైనా పని సక్రమంగా చెయ్యగలిగేది. తొందరపడితే ప్రయోజనం దక్కకపోగా వికటిస్తుంది, విష మిస్తుంది. తొందరపడి ఒక నూలు పోగంత తేడా వచ్చేట్లు చేస్తే ఇంతవరకు సాధించిన కార్యం అంతా బూడిదలో పోసిన పన్నీ రౌతుంది. పుష్పమంతా విచ్చుకుని తొడిమ దగ్గర పురుగు పట్టి మొదలంటా చెడినట్లౌతుంది. నిశాకర ముని పలికిన పలుకు, నాగమాత సురస దీవెనలు, ఇంతవరకు పడ్డ శ్రమ అన్నీ తొందరపడితే 'త్రాగలేని పిల్లి బోర్లపోసుకున్నట్లు' చేసినట్లౌతుంది.

కేవలం నీతిమంతుడైతే రాయబారానికి. భుజశాలి అయితే శౌర్యంలో పోటీకి తొందరపడతారు. కాని నీతిమంతుడు, జితేంద్రియుడు అయితేగాని రాచకార్యాలు శుభప్రదంగా, సుఖాంతం కావు. పగలు ఎంతగా తన ప్రతాపాన్ని సహస్ర కిరణాలలో చూపినా రాత్రికి ఆ ప్రతాపాన్నంతా చుట్ట చుట్టి చంద్రునిలో చేర్చే విధంగా రాయబారి ఆ యా కాలాలకు తగ్గట్టుగా ప్రసన్నంగా నడుచుకోవాలి.

హనుమ తన శరీరాన్ని మరింత కుదించి ప్రాకారాన్ని దూకి సౌధా గ్రంలో నిలుచున్నాడు. ఏడంతస్తుల మేడమీద నిలుచుని కళ్ళు మాటి మాటికీ చుట్టూరా చూశాడు. భవనాలలోని లోపల దీపాలు కిటికీల గుండా కాంతుల్ని విరజిమ్ముతూ చీకట్లో లంకా పట్టణం కడురమ్యంగా దీపతోరణాలు అల్లుకున్నట్లుగా కనబడింది. ఆ చీకట్లో సౌధాగ్రాలమీద లంఘిస్తూపోతున్న హనుమను మధుపానమత్తులై కుమ్మరి చక్రంలా వళ్ళు తిరుగుతూ వున్న రాజ భటులు ఏ మాత్రం గమనించలేకపోయారు. ఎవరి కంటా బడకుండా హనుమ నగర మధ్య ప్రాంతానికి వెళ్తున్నాడు.

వీధులు తీర్చినట్లున్నాయి. దీపాలు కలిగిన స్తంభాలతో, ముత్యాల తోరణాలు కట్టిన ద్వారబంధాలు, పాలరాతి గోడలు గలిగిన ఏడెనిమిది అంతస్తుల మేడలు, ఆ మేడల లోంచి కిటికీల గుండా వచ్చే రత్నదీపాల వెలుగులు రమణీయంగా వున్నాయి. అగురు ధూపాలు, కస్తూరి, మంచి గంధ పరిమళాలు ముక్కుపుటాలకు విందు చేకూరుస్తున్నాయి. వీధివీధికి మండలాలు రచ్చబండలు, ఇంటి ఇంటికి మండిగాలు, బంగారు తలుపులు కుంకపు జేవురు

రంగు పట్టీలతో నిట్టగోడలు, ఖడ్గహస్తులు, ఆపద ఏమన్నా వస్తే వెంటనే తెలుపడానికి గంటలు గల్గిన యంత్రాలు వున్నాయి. బాటలవెంట పోయే దానవుల మాటల్లో గురువు, దైవము అనే మాటల ప్రసక్తి తక్కువ. కళ్ళల్లో క్రోధం, ఎరుపుదనం ఎక్కువ. తూలుడు నడకలతో ఒక్కొక్కడు పోతుంటే భూమి ఏమీ ఊగిపోవడం లేదుగదా అనిపిస్తోంది. చంద్రుని వెన్నెల్లో లంకాపట్టణం చక్కగా కనబడింది.

మొదట హనుమంతుడు భయపడినా, అంతా చూచిన మీదట కొంత ధైర్యం కలిగింది. ఇక్కడకు కుముద, అంగద, సుగ్రీవ, సుషేణ, మైంద, ద్వివిద, కుశపర్వ కేతుమాలలు గూడా రాగలరు. మిగిలినవారు రాలేక పోయినా లంకని జయించడానికి మేము చాలు అనుకున్నాడు. చిన్న పిల్లి అంత రూపంతో లంక ప్రథమ ప్రాకారం లోపల వున్న గృహ ఆరామాలను వెదకి వెదకి చివరకు ఒకచోట ముఖం క్రిందకు దించుకుని కూర్చున్నాడు.

## లంకిణి

"ఎవరు నువ్వు?" అని ఎవరో గదమాయించారు. హనుమ తల ఎత్తి చూశాడు. గద్దింపు మాటలు వినంగానే కుదించిన హనుమ శరీరం రెట్టింపయింది. ఎదురుగా వాసపు బొంగుల్లాంటి బాహువులతో, నల్లని పొగరంగు శరీరంతో, చిట్లించిన భృకుటితో వున్న ఒక పెద్ద పిశాచ రూపాన్ని చూశాడు. ఆ రాక్షసి గూడా ఒక్కసారి పెరిగిన హనుమ సంగతి గ్రహించి కోపంతో—

"టక్కరి కోతి! అలికిడి వినంగానే ఇంతలో అంత అయిన అసలు నువ్వెవరు? ఎక్కడినుండి వచ్చావు? ఏం చేస్తున్నావ్! ఇక్కడ నీకేం పని! నా దృష్టిని ఎవ్వరూ ఈ లంకాపట్టణంలో తప్పించుకోలేరు. ఎంతటి కామ రూపులైనా నా కన్ను గప్పలేరు, నన్ను దాటి పోలేరు డొక్కు మాయలతో నన్ను ఢోకాకొడదామనుకుంటున్నావేమో? నిన్నేం చేస్తానో చూడు" అంది. అప్పుడు హనుమ—

"నాక్కాస్త అలసటగా వుంటే ఇక్కడ కూర్చున్నాను అంతే! ఎవర్నీ ఏమీ అనలేదు, చెయ్యలేదు. ఏదో చెట్లమీద సంచరించే వాళ్ళం. మాకు ఒక ఊరు అని, ఒక ఇల్లు అని వుంటుందా? ఎక్కడ కాయలు, కసర్లు

దొరుకుతాయో అక్కడక్కడకు వెళ్ళి అవి తింటూ ఆకలి తీర్చుకుని తిరుగుతూ బ్రతుకుతుంటాము. ఇంత పెద్ద పట్టణాన్ని చూపకపోతేనూ, చూడనివ్వక పోతేనూ గొప్పతనం అందరికీ తెలిసేది ఎలా?" అన్నాడు. హనుమ మాటలకు రాక్షసి విజృంభించి వికటాట్టహాసం చేసి పెద్ద నోరు తెరిచి, మీదికి వచ్చి బుసలు కొట్టే పడగెత్తిన పాములాగా నిలిచింది. ఆ నోరు యమపురికి ద్వారంలాగా ఉంది. హనుమ ఒక్కసారి—

"ఆగు! నేనీ ఊరు చూసి వస్తాను. ఇక్కడ ఎవ్వరినీ ఏమీ చెయ్యను అంటూంటే వినకుండా మీద మీదకు వస్తావేం?" అన్నాడు. రాక్షసికి వళ్ళు మండింది. హనుమను అణచి వేద్దామని అరచేత్తో బలంగా ఒక్కచరుపు చరిచింది. ఈ దెబ్బతో అణగారి పోతాడు పిచ్చికుంక అనుకుంది.

అగ్ని పర్వతంలోంచి పెళ్ళగించుకుంటూ పైకి వచ్చే అగ్ని జ్వాల లాగా పైకి ఎగసి రాక్షసి ముఖంమీద ఒక్క గుద్దు గుద్దాడు. రాక్షసి దిమ్మెరపోయి రెండు చేతులతో తన ముఖాన్ని అదుముకొంటూనే విలవిలా తన్నుకుంటూ క్రింద పడింది. ఆ స్థితిలో వున్న రాక్షసిమీద లోపల జాలి కలిగినప్పటికీ దానిని పైకి లేవదీసి–

"అబలలై గూడా మదంతో ఇక్కడ స్త్రీలు పెద్ద గొప్పగా దౌష్ట్యాన్ని ప్రకటిస్తారల్లే వుంది." అన్నాడు. హనుమంతుని దెబ్బకు నెత్తురు కక్కుకున్న ఆ రాక్షసి–

"అబ్బా! ఇంక ఈ రాక్షస జాతికి చివరి రోజులు వచ్చినట్లే! నాకీ సంగతి మునుపు బ్రహ్మదేవుడు చెప్పాడు పూర్వం రావణుడు దేవతలతో యుద్ధానికి తలపడి వాళ్ళని బాధపెడితే వాళ్ళు "లంక భస్మం అవుతుందని శపించారు." అప్పుడు నేను బ్రహ్మను ప్రార్థిస్తే "ఏనాడైతే నీ బలాన్ని, ప్రాణాన్ని ఒక కోతి హరించగలదో అప్పుడు నీకు శాప విముక్తి, ఆనాడు ఈ రాక్షస జాతికి వినాశం చేకూరినట్లే" అని చెప్పాను. ఇంక ఈ రావణుని దర్పము, ద్వేషము అంతమయ్యే కాలం ఆసన్న మయినట్లే! ఈ పట్టణంలో నేనొక్కదాన్ని లేకపోతే ఈ రావణుని చేతగాని, మాటగాని సాగదు. నీలాంటి వాడొక్కడు చాలు- ఈ రాక్షసజాతిని తుదముట్టించడానికి. చెడ్డ రోజులు వస్తే తమ్ముడే ఎదురు తిరగవచ్చు, కట్టుకున్న భార్యే తిట్టి పోగులుపెట్టవచ్చు,

ఏం చెయ్యబోయినా ఎదురు దెబ్బ తగలవచ్చు. నీళ్ళలో అణిగి వుండాల్సిన రాళ్ళే నీళ్ళపై తేలవచ్చు గూడా! ఏం చెప్పగలం? (ఇవన్నీ ముందుముందు జరిగేవే!) ఇంక నువ్వు అనాయాసంగా నీ పని నువ్వు చేసుకో?" అంటూ మళ్ళీ నెత్తురు క్రక్కుకుంది. గాలి ఆడక సతమతమైంది. నేలంతా నెత్తురుతో తడిసింది. మాట చెల్లని రాజు ముఖంలాగా నేలమీద నిస్తేజంగా పడి పోయింది. అది లంకాపట్టణానికే లంకిణి, మొత్తం లంకకు అదే కాపలా.

"రాక్షసి శవము ఇక్కడ పడివుండడం ఎవరైనా చూస్తే శత్రువు లెవరో ప్రవేశించినట్లు గ్రహించి తీరుతారు" అని అనుకున్నంతలో క్రింద పడివున్న రాక్షసికి మనుష్య రూపం వచ్చింది. రాక్షసి శవం కనబడలేదు. అక్కడనుండి ఆ మనుష్య రూపం భగ్గుమంటున్న బొగ్గుల మీద గుగ్గిలం వేస్తే వచ్చే పొగలాగా ఆకాశం వైపుకు సాగిపోయింది.

హనుమంతుడు లోపలి ప్రాకారాన్ని దూకి వరుసగా గుళ్ళు, గోపురాలు, వీధులు, వాకిళ్ళు, శృంగాటకాలు దాటుతూ రాచవీధులగుండా పోతూ ఉద్యాన వనాలనీ, జలాశయాలనీ చూస్తూ అలికిడైనచోట నీడల్లో దాక్కుంటూ, గోడలకు అతుక్కుని నక్కుతూ, జనం లేనిచోట్లకు దూకుతూ అన్ని వీధుల వెంట తిరగసాగాడు.

## లంకావీధులు

వీనుల విందుగా వీణా వేణునాదాలు, దేశి రాగయుత గీతాలాపనలు వినబడుతున్నాయి. ఆడవాళ్ళు పల్లవులు పాడితే- మొగవాళ్ళు చరణాలు పాడు తున్నారు. మధ్యలో మృదంగ నిస్వనాలు. రాక్షస కుల కలకంఠుల కలస్వనాలు చిత్రాతి చిత్రంగా సన్నని తీగల్లాగ, సాగుతూ ఆనందపరుస్తు న్నాయి. ముగ్ధ మోహనరాగముతోపాటు, సస్వర సామగానాలు గూడా వినబడుతున్నాయి. దానవుల సస్వర మంత్రోచ్చారణకు దేవతలు మంత్రా ధీనులై తేజో రూపాలతోనే వారిని సే[illegible]. దురధికారమంటే ఇల్లాగే వుంటుందేమో! మంత్రాలతో పొగడు[illegible] వతలను ఆవాహన చేస్తారు, ఆపైన మారణాయుధాలతో వాళ్ళనే తె[illegible]టారుస్తారు.

కాలి అందెల గజ్జల ఘల్లు ఘల్లు మ్రోతలతో, వెట్టివెట్టి అత్తరు ఘాటు వాసనలతో, మైకంలో త్రాగిన కల్లు కంపుతో, తెల్లని ఉలిపిరి చీరలతో, ముదురు కోర ముంగురులలో, వెన్నెల కాంతుల్లో వన్నెల విననికట్టల్లా వీధులవెంట అభిసారికలు పోతున్నారు.

రకరకాల వికృతాకారులు వీథులవెంట పోతున్నారు వారిలో ఒంటి కన్ను వాళ్ళు, ఒంటి చెవివాళ్ళు, బానపొట్టవాళ్ళు, కుంభకుచములవాళ్ళు ఇలా ఎందరో వున్నారు. అందర్నీ చూసుకుంటూ పోయి మరి ఒక అంతః ప్రాకారాన్ని సమీపించాడు. ఆ ప్రాకారానికి గట్టి కాపలా వుంది. సాయుధ బలపరాక్రమ సంపన్నులు దాన్ని రక్షిస్తున్నారు. దాని లోపల నుండి వెన్నెలలను తిరస్కరించే చల్లని తెల్లని కాంతులు తొంగిచూస్తున్నాయి. కర్ణ పేయమైన సంగీత ధ్వనులుగూడా సన్నగా వినబడుతున్నాయి. ఇది రావణా సురుని అంతఃపురమే అయి వుంటుందని హనుమ నిర్ణయించుకొని, తప్ప కుండా సీత ఇక్కడ వుండవచ్చునని నిశ్చయించుకొని లోపలకు ప్రవేశిద్దా మనుకున్నాడు. అలా అనుకున్నాడేగాని ఎవరికంటా పడకుండా వెళ్ళగలడా? ఒకవేళ వెళ్ళినా లోపల ఎక్కడ వ్రాలాలి అనే సందేహం వచ్చి ఏం చెయ్య డానికి పాలుపోక ఒక్కసారి పైకి ఎగిరాడు. మెరిసే తారకల్లాగా హనుమ నేత్రాలు కనబడ్డాయి. ఎగరవేసిన గాలిపటం లాగా హనుమ ఉంటే- దానికి కట్టిన దారంలాగా హనుమ తోక సన్నగా కనబడుతోంది. ఒక్కసారి పిడుగు పడ్డట్లు నేలమీదకు వ్రాలాడు హనుమ. వ్రాలడం ఒక అంతఃపురపు కిటికీ చువ్వల ప్రక్కకు వ్రాలాడు. లోపలికి తొంగిచూసాడు. లోపల ఏముందో గ్రహించాడు. వెంటనే క్రిందవున్న ఒక చిన్న తోటలోని పూలమొక్కప్రక్కకు జారాడు.

హనుమ కళ్ళల్లో వెన్నెలలు వెల్లి విరిసాయి. ఆనందంతో కళ్ళు చెమర్చాయి. కంటినుండి జారే వెండి జలతారు నీటిధారల వెల్లువలో మింటి చంద్రుడు రాజహంసలాగా కనబడ్డాడు. ఆకాశానికి అవతలవున్న లోకాలకు ప్రవహింప జేయడానికి ఏర్పరచిన వెండి తూములాగా మింటి చంద్రుడు కనబడుతున్నాడు.

రాజనీతిపరుడైన రాముడు తన పనిమీద హనుమను పంపి హనుమ

ఎక్కడెక్కడ ఏమేమి చేస్తున్నదీ వీక్షిస్తున్న రామచంద్రునిలా ఆకాశంలో చంద్రుడు అగుపిస్తున్నాడు.

ఇంతకు మునుపు ఎన్నడూ సీతను చూపలేదు గదా హనుమ గుర్తించగలడో లేడోనని "సీత ముఖం ఇలా ఉంటుంది" అని తెలియ జేస్తున్నట్లుగా చంద్రుడు భాసిస్తున్నాడు. ఆకాశమనే సముద్రాన్ని హనుమ అనే మందరంతో మధించగా ఏర్పడ్డ అమృత కుంభంలాగా చంద్రుడు అగుపడుతున్నాడు. రావణుని సౌధంలో హనుమ సీతను వెదకటం కోసం అన్నీ ప్రస్ఫుటంగా కనబడేందుకు చల్లని కాంతులు విరజిమ్మే దివ్వెలాగా చంద్రుడు దీపిస్తున్నాడు. లంకలో వున్న లావణ్యనిధియైన సీత వదనం ఆకాశమనే సరస్సులో ప్రతిఫలిస్తోందా అన్నట్లు చంద్రుడు కనబడుతున్నాడు.

## సౌధాల్లో సోయగాలు

అంతర సౌధాలలోనికి వెళ్ళాలని ఒక్కసారి హనుమ మింటి కెగిరాడు. ఆ సురారి సౌధాల్లో హనుమకు పానశాలలు, నాట్యశాలలు, వాటిలో మృదు గీతాలాపనలు, నాట్యాలు చేస్తూ అప్సరసల్లా వున్న కన్యకామణులు, వళ్ళో వీణలుంచుకొని, జడలు వక్షాల మీదికి వేసుకుని, సన్నని వ్రేళ్ళతో తీగలను మీటుతున్న పడతులు కనబడ్డారు.

సగం త్రాగి, మిగిలిన సగం కల్లు గిన్నె భర్త కిస్తోంది ఒక లలనామణి. అర్ధనిమీలిత అరుణ లోచనుడైన భర్త ఆ గిన్నెను అందుకోడానికి చెయ్యి జాపి జారవిడుచుకున్నాడు.

ఒకామెకు ఒక ప్రక్కగా చీర జారి, గజ్జల వడ్డాణం మీదపడి గజ్జెలు ఘల్లు మంటున్నాయి. ఇదేం పట్టించుకోకుండా ఆమె తన చేతిలోని మధు పాత్రను ఇదిగో ఇదిగో అంటూ తక్కిన వారికి ఇస్తున్నట్లు చూపిస్తూ చివరకు తానే త్రాగి, తూగుతోంది.

ఒకామె ఒళ్ళు దాచుకోకుండా నాట్యం చేస్తూ, ఒంపుసొంపులతో వయ్యారాలు ఒలికిస్తూ, కృత్రిమ ప్రణయపు చూపులు విసురుతూ తన చుట్టూ వున్న పురుషుల మీదకు తూలిపడుతున్నట్లు నటిస్తోంది. వాళ్ళు ఆమె కొంగు

లాగ ప్రయత్నిస్తున్నారు. ఆమె వాళ్ళ చేతివ్రేళ్ళను పెదవుల్తో స్పృశిస్తూ కవ్విస్తోంది.

స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ పానమత్తులై వున్న వాళ్ళను చూసి వెగటు కలిగి హనుమ తనలో తాను చూమకుని తిరిగి ప్రసన్నతను పొందాడు.

వెన్నెల వన్నె తగ్గి చిన్నబోతున్న సమయంలో అంగనలందరూ అర్థ నిమీలితాక్షు లయారు. నిశ్వాసపారు లయారు. నిద్రాముద్రితు లయారు. నిశ్శబ్దబద్ధమైన సౌధంలో మధిరపానమత్తులు మరో లోకంలో ఉన్నారు. బయట మాత్రం సాయుధ దైత్య భటులు పారా తిరుగుతూనే వున్నారు. ఈ సమయంలోనే సీత ఎక్కడున్నదో తెలుసుకోవాలనుకొన్నాడు హనుమ. ప్రతి కలవని అతివల శ్వాసలతో, ప్రతి మించిన గుబ్బులతో, సౌధం- నిప్పు కళికలతో కుతకుతలాడే అగ్ని పర్వతం లాగా వుంది. నిత్య జాగ్రదవస్థలో వుండే జానకీదేవికి- ఇంత వళ్లు తెలియకుండా గాఢ సుషుప్తిలో వున్న ఇక్కడి వాతావరణానికి- సరిపడటం లేదని యోచి హనుమ ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళి ఇంకొక చోట-

"తెల్లని శంఖం రంగుతో వుండి, లేత పసుపుపచ్చ రంగు శిఖరం, పద్మపు రేకుల వంపుకోణాల శిల్పంతో నిరాడంబరంగా ఉండి, పరమ ప్రశాంత వాతావరణంతో కూడుకుని వున్న సౌధాన్ని" చూశాడు. ఆ సాధు వర్ణ సౌధంలో వినయ వైభవాలు రెండూ ఉన్నందుకు హనుమకు ఆశ్చర్య మైంది. ఆ సౌధంలోంచి చక్కని రాగాలతో సన్నని గీతాలాపనలు వినబడు తున్నాయి. మెలితిరిగిన కండరాలతో, వంకర కనుబొమ్మలతో, కోరపండ్లతో, బుఱ్ఱ మీసాలతో, బల్లెములు, ఈటెలు పట్టుకుని తిరిగే భటులు— ఆ ప్రాంతంలో కనబడలేదు. అక్కడి చిరుగాలులు వెన్నెల చల్లదనానికి కన్నుల పండువైంది హనుమకు. మనిషి ముఖంలోను, కట్టూబొట్టూలోనే కాదు, కట్టిన ఇంటిలో గూడా మనిషి ఆత్మ లక్షణం తెలుస్తుంది" అనుకున్నాడు హనుమ. హృదయానికి హాయిని చేకూర్చే ఈ ఇల్లు ఎవరిదో? పరమ దుర్మార్గపు జాతిలోకూడా సాత్త్వికుడు అప్పుడప్పుడు అపురూపంగా పుట్టి వచ్చునేమో గదా! అనుకున్నాడు హనుమ. ఆ సౌధంలో ఏమైనా సీత

వుందేమో అని లోపలకు వెళ్ళి చూశాడు. అక్కడున్నవి కొవ్వుదీపాలు కాదు. ఆముదపు దీప కళికలు. అవి కూడా కొడిగట్టిలేవు. నిద్రాదేవి జడ పూల తళుకులుగా భాసిస్తున్నాయి. ఇంకా లోపలకు వెళ్ళాడు. యజ్ఞశాలలు, హోమ గుండాలు కనబడ్డాయి. ఎట్లా వెళ్ళాడో అట్లాగే ఆ సౌధం నుండి తిరిగి వచ్చేశాడు హనుమ.

అంబరాన్ని చుంబించే శిఖరాలతో, చిత్రవిచిత్ర వర్ణాలతో, నానా కుసుమ తరులతా భూయిష్టమైన ఉద్యానవనాలతో, సూర్య ప్రభను మించిన కాంతులతో మేరు పర్వత శిఖరాన్నే తలదన్నే విధంగా కనబడే మరొక సౌధాన్ని చూశాడు హనుమ. ఆ సౌధంలో అహంకారం, గర్వం, దర్పం కొట్టవచ్చినట్లు కనబడే వివిధ తైల చిత్రాలు, శిలాప్రతిమలు, కనబడ్డాయి. బయట ఎవరో "పారిపోకురా! యుద్ధానికి రా! నిలబడు చూద్దాం!" అనే మాటలు వినబడ్డాయి. తీరా చూస్తే తెలిసింది, అవి-మనుష్యుల మాటలుకాదు. బయట పంజరాల్లో వున్న చిలుక పలుకులు. ఆ పలుకులతో అవి సురారి వీరత్వాన్ని నోరారా కీర్తిస్తున్నాయి. సౌధం లోపల వీణలు వాయిస్తూ పరవశిస్తున్న పడతుల చిత్రాలున్నాయి. పూర్వం స్వర్గానికి వెళ్ళి జయించి నప్పటి దృశ్యాలు వున్నాయి. అప్సరసలను పట్టి పలువిధాలుగా పరాభవించి నప్పటి చరిత్ర- దేశరంగుల చిత్రాలతో కనబడుతున్నాయి. తోపు రంగు చీరలు, చెంపస్వరాలు, ముంతకొప్పులు, కంఠహారాలు, కర్ణాభరణాలు కలిగిన రాక్షసి స్త్రీలూ వున్నారు. ఆ ప్రక్కనే తెల్లని సన్నని కుబుసములాంటి చీరలతో, నాజూకైన చూపులతో, నజరైన భంగిమలతో దేవతా స్త్రీలు వున్నారు. 'భూమి- లోపలకు దిగబడి పోతుందా' అనిపించేట్లు నడిచే దైత్య కామినులు వున్నారు. భూమిని అంటకుండా నడుస్తూ పోయే నాకస్త్రీలూ వున్నారు. భూమిలోకి దిగబడిపోయే దైత్యభావము కాకుండాను, వట్టిగాలిలోకి తేలిపోయే సౌరభావమూ కాకుండాను రెండూ సమపాళ్ళలో వుండే మానవ ధర్మానురూపగమన లక్షణం గలిగిన స్త్రీలు అక్కడ మచ్చుకు ఒక్కరైనా లేరు. ఇక్కడ సీతమ్మ వుండదని నిర్ధారించుకొని మరోచోటుకు పోయాడు హనుమ.

మరో సౌధంలో మన్మథ బాణాల్లాంటి కొందరు మగువలు కిటికీల

వెనక నిలబడి వయ్యారాలు పోతూ, బయటపోయే పురుషులను చూస్తూ కర సంచాలన సంకేతాలతో కవ్విస్తున్నారు. కొందరు దగ్గరే నిలబడి చంచలమైన చూపులతో ప్రతీక్షిస్తున్నారు. వీళ్ళని చూడంగానే పరమ వైరాగ్య సంపన్నుడైన పావనికి లోకరీతులు ద్యోతకమయి రోత పుట్టింది. ఎక్కడ చూచినా అసుర కాంతలు, అమరకాంతలే తప్ప అవనిజ జాడ కనబడలేదు.

ఒకచోట దీనముఖంతో ఒకామె గోడకు ఆనుకుని చెక్కిలిమీద చేతి నుంచి సుధాకరుణ్ణి చూస్తూ కూర్చుంది. ఆమె సీతమ్మ ఏమోనని దగ్గరగా వెళ్ళాడు. ఆమె రెప్పవాల్చదు. వంటిమీద చెమట పట్టదు. కంటికి ఇంపు గొల్పే ఆ మూర్తిని చూచి, శిల్పి నైపుణ్యాన్ని మారుతి మనస్సులోనే మెచ్చుకున్నాడు.

ఎక్కే గుమ్మం దిగే గుమ్మం లాగా వుందిగాని హనుమకు ఎక్కడా సీత జాడ కనబడడం లేదు. ఇంతకు మునుపు హనుమ ఎన్నడూ పరీక్షగా పడతులను చూడలేదు. కాని ఇప్పుడు కాంతల కన్నులు, కపోలాలు, నెలతల నడకలు, నడుములు, అతివల అంఘ్రులు అంగుష్ఠాలు పరీక్షగా చూడవలసి వస్తోంది. ఎక్కడ చూసినా ఎవరిని చూచినా కామసంబంధంగానే ఉంది తప్ప ఆత్మగుణాలైన వినయ సౌశీల్యాదులు కనబడక పోవడంతో హనుమ విసుగు చెందాడు. సీతాదర్శన ప్రతీక్షా భావంతో వున్న హనుమ —

## పుష్పక దర్శనం

తళుకులు చిమ్మే పాలవెల్లి రూపుదాల్చిందా అన్నట్లున్నటువంటి, బ్రహ్మ మానస నిర్మితమైన బంగారుమేడలా ఉన్నటువంటి, ఆదిశేషువు తన శరీరంతో వెండికొండలా మారాడా అన్నట్లున్నటువంటి తన కళ్ళతో తాను చూచినా ఇదమిత్థమని తేల్చుకోలేనట్లుగాను వున్న దానిని చూశాడు. విబుధ లోకపు ముక్కను ఆ రాక్షసరాజు ఇక్కడకు తీసుకువచ్చాడా లేకపోతే ఆ బ్రహ్మగారే తపస్సుకు మెచ్చి ఈ రాక్షసునికి సత్యలోక శకలాన్ని అనుగ్రహించాడా అన్నట్లుంది దాని రూపం. బ్రహ్మగారితో హాస్యపు జూదమాడి గెలిచి ఆయన వాహనమైన హంసను ఇక్కడకు కొని వచ్చాడేమో అనిపించేట్లు వుంది. విష్ణువును జయిద్దామని వెళ్ళి ఎక్కడా కనబడక ఒక మూలనున్న

ఆదిశేషువును పెకలించి తన గృహంలో వుంచితే ఆ ఆదిశేషువు పండు వెన్నెలలను పుక్కిటబట్టి మాటిమాటికీ బుసలు కొడుతున్నాడా అనిపించే కాంతి పుంజాలను విరజిమ్ముతూఉన్న ఒకదానిని చూచాడు. శరన్మేఘాలు దొంతర్లను సెజ్జగా అమర్చి దానిమీద పచ్చకర్పూరపుపొడి చల్లి, మల్లెపూలదండలు కట్టి, రకరకాల ఆభరణ తోరణాలతో ఒప్పే 'దానిని కుబేరుని వద్దనుండి రావణుడు ఎత్తుకు వచ్చిన పుష్పక విమానమని' సర్వజ్ఞుడైన ఆంజనేయుడు గ్రహించాడు.

తనకు చోటు లేకపోయినా దానిలోకి ఎక్కగానే చోటు సరిపోయేట్లుండే పుష్పకం ఆ సమయంలో కనబడటం తన ప్రతీక్షకు యోగ్యమైన వరంగా హనుమ భావించాడు. కాలు పెట్టడానికి గూడా సందు లేనట్లు వందలకు మించి వనితలుపడి నిద్రించే ప్రదేశంలో తనకాలు నుంచగలిగి నిలబడడానికి, ఈ పుష్పకానికి చక్కని పోలిక కుదుర్చుకున్నాడు హనుమ. ఎవరికి తన కాలు తాకినా వాళ్ళు గ్రహించలేనట్లు జాగ్రత్తపడ్డాడు, అణిమాది అష్టసిద్ధులు తెలిసిన హనుమ. హనుమ వుండడానికి నాలుగంగుళాల స్థలం చాలు అన్నంత లఘురూపాన్ని పొందాడు. అక్కడ పుష్పకంలో నాలుగంగుళాల స్థలం గూడా వున్నట్లు లేదుగదా ఎంతమందైనా ఎలా సరిపోతారబ్బా! అనిపించింది హనుమకు. కాని వెంటనే- తానెంతకు ఎదగగలడు? ఇప్పుడు తానెంతలో ఇమిడిపోయాడు? ఒకే ఒక మనస్సులో ఎంతమందైనా ఎలా ఇమడగలరు? అనే భావాలు కలిగి సమాధానపడ్డాడో ఏమో తనలోతానే నవ్వుకుని ముందుకు సాగాడు. (మనస్సులాంటిదే పుష్పక విమానం)

## హనుమ ఊహలో సీతమ్మ

హనుమ పుష్పకానికి దగ్గరలోనే ఒకచోట నిలుచుని 'సీతను ఎలా వెదకాలి? ఎలా వుంటుందని వెదకాలి?' అనే ఆలోచనలో పడ్డాడు. అక్కడ వున్న వారందరూ రావణుని చేత కొనిరాబడిన అతిలోక సుందరులు. ఆ అందరి మధ్య సీతను పోల్చుకోవాలి. పచ్చని నిమ్మపండు శరీరఛాయతో, అంత పొట్టి కాకుండా, అంత పొడుగూ కాకుండా సమంగా, నాజూగ్గా వుండి వుండాలి. ఆమె పాదాలు చూడగానే వాలి మ్రొక్కుదామనిపించేట్టు ఉండి ఆ పద సాన్నిధ్యంలో ఎద ప్రశాంతంగా నిద్ర పోవాలనిపించేట్టుగా వుండి

తీరాలి. ఆమె మోకాటిచిప్పలు తాబేలు డిప్పలలాగా వుండవచ్చు. విల్లంబులు పట్టడంలో కాయలుకాచిన రాముని చేతులు సీతమ్మ చేతిని పట్టుకున్నపుడు గుర్తులు పడే వుంటాయి గాబట్టి గుర్తుపట్టచ్చు. కాని ఇప్పుడు నిరంతరం కన్నీరు తుడుచుకోవలసి రావడంతో చేతులకు ఆ గుర్తులు కనబడతాయో లేదో?

చిఱునవ్వు ఉదయించేట్లుగా పెదవుల పొందిక వుండివుండాలి. అయితే ఈ విరహకాలంలో దానికి అవకాశం వుంటుందో ఉండదో అని సంశయమే మళ్ళీ! అంతకు పూర్వం ఒక సారన్నా చూచి ఎఱుగున్న వాళ్ళనైతే గుర్తు పట్టవచ్చుగాని అసలెప్పుడూ చూడని వారిని గుర్తు పట్టడం ఎలా? ఇంక రామచంద్రుణ్ణి బట్టి ఆమెను వూహించాడేమో! ఒకరిని గూర్చి, వారి గుణాలను గూర్చి పూర్వం వినివుంటే ఆ గుణాలకు తగ్గ వ్యక్తిని వూహించుకుంటాం. అప్పుడా వ్యక్తి రూపం చూడకపోయినా చూచినట్లేవుండి మనస్సులో మెదుల్తూ వుంటుంది. ప్రస్తుతం హనుమ హృదయంలో సీతరూపం అలాగే మెదుల్తోంది. అలా అవ్యక్తంగా మెదిలే రూపం ఎదురుగా వ్యక్తమై కనబడుతుందేమోనని వెదుకుతున్నాడు. కళ్ళుమూసుకుని ఎడమ కంటికి ముందరగా రామచంద్రుణ్ణి నిలిపి, రాముని ప్రక్కగా సీతమ్మ వున్నట్లు వూహిస్తున్నాడు. కాని, ఎందుకో తన ఆత్మలో వున్న రాముడు ఎదురుగావున్న రాముడు ఒకలాగాలేరు. 'బహుశః మోక్ష సంబంధమైన ఉపాసనా విధానానికి ఐహికమైన ప్రాణి ప్రయత్నానికి పొత్తు కుదరకపోవడం దీనికి కారణం కావచ్చు' అనుకున్నాడు.

## నిద్రావస్థలో వివిధ స్త్రీలు

హనుమ పుష్పక విమానాన్ని ఒక్కసారి చూశాడు. వైఢూర్య శిలా న్యాసంతో, మణిద్వారంతో రమణీయ మణితోరణాలతో దర్శన కమనీయంగా వుండి నిద్రిస్తున్న స్త్రీల చేత అలరారుతున్న ఆ పుష్పక విమానం నిద్రిస్తున్న కమలాలతో వున్న కమలాకరంలాగా కనబడింది. మరింత పరికించి చూస్తే లోపల నిద్రిస్తున్న వారి తీరులు రకరకాలుగా వున్నట్లనిపించింది.

స్వచ్ఛమైన తెల్లని వస్త్రాలతో, స్వర్ణాలంకృత వేణులతో, గులాబి చెక్కిళ్ళ, తీసిపోని లావణ్యపు తీపి మేనులతో విద్యాధర స్త్రీల నిద్ర వినూత్నంగా వుంది.

హారాలు వీపు వైపు, కేశాలు రొమ్ముమీద తొండవిస్తూ తమ ఒడలు తాము తెలియని స్థితిలో యక్ష సతులు నిద్రిస్తున్నారు.

భర్తలను పెనవేసుకున్నట్లుగానే కనబడుతూ, నోరు తెరచి ఆనంద పరవశత్వంతో గీతాలాపనలు చేస్తున్నట్లుగా నిద్రిస్తున్నారు కిన్నెరస్త్రీలు.

చుట్టూ వదులుగా వున్న నాచు మధ్య ముకుళించుకుని వున్న తమ్మి మొగ్గలా, నీటి అలల్లా భాసించే శ్వాస గాలులతో, తారాకాంతులను మరపించే మేని కాంతులతో, రాత్రిపూట కనిపించే తామరపూల చెరువుల్లాగా అప్సర స్త్రీలు నిద్రిస్తున్నారు.

ఇంకో ప్రక్క పూర్ణిమా చంద్రబింబ ముఖాలతో గానకళా కోవిదులైన గంధర్వసతులు కాంచన రూపాలతో మనోజ్ఞంగా నిద్రిస్తున్నారు.

బాహువులకు, పాదాలకు, కంఠానికి, ముక్కులకు, చెవులకు చక్కని భూషణాలు కలిగి సన్నని నడుములతో, వ్రేళ్ళకు గూడా నాజూకు సగలతో, ఒక ప్రక్కకు ఒత్తిగిలితే ఘల్లుఘల్లున మ్రోగే ఒడ్డాణపు చిరుగజ్జెలు, పాద మంజీరాలతో కుబేర నిధుల్లాగా గుహ్యక స్త్రీలు నిద్రిస్తున్నారు

ఇంకా సిద్ధ సాధ్య కామినులు నిద్రిస్తున్నారు. వారి మధ్య చక్కని అవయవాల పొందికతో, సుందర సౌష్టవ కరచరణ నేత్ర నాసికా కర్ణాలతో కన్నులకు ఇంపుసొంపుగా కనబడే మనుష్య స్త్రీలు నిద్రిస్తున్నారు.

వళ్ళంతా చెమటలతో, వంటినిండా వెంట్రుకలతో తమ కాళ్ళు చేతులు ఎలా ఉన్నాయో గూడా తెలియని భంగిమలతో ప్రగాఢమైన నిద్రమత్తులో ఉగ్ర రూపాలతో రాక్షసస్త్రీలు గూడా వున్నారు.

నిద్రమత్తులో వళ్ళు తెలియక ఇద్దరు స్త్రీలు ఒకళ్ళకొకరు బాహువులతో కౌగిలించుకొని ఎవరికి వారు రాక్షసనాధుణ్ణి కౌగిలించుకున్నామన్న అను భూతిలో పెనవేసుకుపోయి వున్నారు.

దశకంఠుడు ఇరవై చేతులతోను తనను కౌగలించుకున్నా డన్నట్లు ముడుచుకుపోయి ముఖారవిందానికి వున్న ఎఱ్ఱని పెదవుల రేకులను ముద్దు ముద్దుగా దశకంఠుని ముఖంవైపుగా వుంచుతున్నట్లు ఒక కాంత నిదురిస్తోంది.

గాఢ నిద్రమత్తులో వంటిసంగతి పూర్తిగా తెలియని స్థితిలో రాక్షస స్త్రీలు కొందరు అర్ధనగ్నంగా పడుకుని వున్నారు.

## రావణుని నిద్రావిలాసం

ఒక ప్రక్క పాల సముద్రంలో చుట్టలు చుట్టుకుని పడుకుని వున్న ఆదిశేషుని మెత్తని పానుపులాగా ఒత్తుగానున్న మెత్తని పరుపులతో ఒక పట్టె మంచం ఉన్నది. దాని పట్టెలనిండా వైడూర్యాలు, కోళ్ళనిండా మరకతాలు, పందిరి నుండి క్రిందకు లతలు, పుష్పమాలలు, నాలుగు కోళ్ళవద్ద రంగు రంగుల శిలా నిర్మిత పాంచాలికలు, యంత్ర నిర్మిత వింజామరలతో వున్న ఆ పందిరి మంచాన్ని చూస్తూ వుంటే మూడు లోకాల్లో వుండే పురుగులను పట్టడానికి నేసిన దారాల అల్లిక మధ్య నిదుపెంచే ఒక విచిత్రమైన సాలీడు గూడులాగా వుంది. నానా భూషణాలతో విరాజిల్లుతూ, కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆ సుందర మందిరం రావణుని శయ్యామందిరం. వాసుకిని పోడవులో మించి వుండే రావణుని సుదీర్ఘ బాహువులు కంచు కండలతో మనోజ్ఞంగా ఉన్నాయి.

కస్తూరి పూతలు, మంచి గంధం పూతలతో మేను పరిమళాలు గుబాళిస్తోంది.

మఱ్ఱి చెట్టుకు ఊడల్లా వున్న ఇరవై చేతులు చంద్రశేఖరునకు హారతి ఇవ్వడానికి తగ్గట్లున్నాయి.

పిడిఘాతాల తాలూకు రాపిడిలు, బాణాలు పట్టిన కాయలు, హస్తాల్లోను భుజాలమీద అమ్ముల పొది రాపిడికి కట్టిన బొడుపులు, వక్షం మీద కట్టిన కదుములు ఉండి ప్రస్ఫుటంగా మహోగ్ర పరాక్రమాన్ని తెలియజేస్తున్నాయి.

మంథర గిరికి వాసుకిని ముప్పేటలుగా చుట్టి పాలసముద్రాన్ని మథిస్తున్నపుడు ఆ మంథర గిరికి ఏర్పడ్డ మూడు రాపిడి రేఖలు లాగా నుదుటి మీద విభూతి రేఖలు మూడు కనబడుతున్నాయి.

# నిద్రిస్తున్న మండోదరి

రావణుడు నిద్రిస్తున్నప్పుడు గూడా సుందర, శౌర్య, వీర్య, పరాక్రమ శృంగార వైభవ చిహ్నాలు ప్రస్ఫుటంగానే కనబడుతున్నాయి. అలాంటి రావణుని చూసిన పారవశ్యం పలచబడిన తరువాత హనుమ ఆ ప్రక్కనే వున్న శయ్యను చూశాడు. దానిమీద బ్రహ్మ సర్వ సౌందర్యాన్ని ప్రోగుచేసి బొమ్మ లాగా చేశాడా అన్నట్లు కనబడే స్త్రీ పడుకుని వున్నది. ఆ అందాన్ని చూస్తున్నపుడు వినయశీలాలు గల మాతృమూర్తిత్వాన్ని అన్వేషించసాగాడు హనుమ. ఇందు వదనం, జలజనేత్రాలు, సంపెంగముక్కు, బింబాధరాలు, కంబు గ్రీవం. ఇలా తనూలత పొడసూపుతున్నా హనుమ దృష్టిలో మాతృత్వ లక్షణానికే ప్రథమ తాంబూలం. సర్వవిధాలా ఆ శయ్యపై పడుకుని వున్న ఆమె సీతే కావాలని అనుకున్నాడు. మంచి ఆలోచనాపరుడే అయినా హనుమ తొందరపడ్డాడు. సీతను చూచాననుకొని తన తోకను చేతిలోకి దీసికొని ముద్దు పెట్టుకున్నాడు. నవ్వుకుని తన దూతత్వం ఫలించిందని ఎగిరి గంతు వేశాడు. అంతలోనే మనస్సెందుకో అనుమాన స్థితిలో పడింది. తాను పూర్వం చూచిన, పడుకుని వున్న- కాంతల అందరి ముఖాల్లో ఉండే సంతృప్తి ఈమె ముఖంలో గూడా వుంది. ఇలా వుండడం లోని ఔచిత్యాన్ని తనలో తనే తర్కించుకుంటున్నాడు. ఈ మానవ రాజులు ఆర్యధర్మవర్తనులు, మనుధర్మ విజ్ఞానులు, భర్తను కోల్పోయినపుడు గూడా ఈ జాతి స్త్రీలు భర్తసహోదరుల పొందును కోరరు. అటువంటి ఉదాత్త శీలస్వభావ సంపన్నమైన జాతి. ముదురు వయస్సుగల రాక్షసరాజు వెళ్ళి వంచలేని ధనుస్సును పసివయస్సులో వున్న రఘురాముడు వంచాడు అంతే కాదు పరమశివుని శిష్యుడైన భృగురాముని ముందు ఎవ్వరూ నిలవలేక పోగా ఈ రఘురాముడు ఆ భృగురాముణ్ణి నేలమీద నిలబడడానికి తగనివానిగా చేశాడు. ఆ భృగురాముడు అవక్ర విక్రమ పరాక్రమ సంపన్నుడైన కార్తవీర్యుని వెయ్యి చేతులను తన గండ్రగొడ్డలితో నరికితే- ఈ రఘురాముడు ఒక్కబాణంతో సప్తతాళ వృక్షాలను ఒక్కసారిగా నేలకూల్చాడు. అటువంటి నాథునికి దూరమైన సీతమ్మతల్లి ఇలా శయ్యమీద సంతృప్తిగా నిద్రాసౌఖ్యాన్ని అనుభవిస్తుందా?

ఈమె రావణుని పట్టపురాణి మండోదరి అయి ఉండాలి. ఈ పతి వ్రతను జూడగలిగిన నా పుణ్యం చేత తప్పకుండా ధరణీజాత సీతమ్మను గూడా చూడగలనన్న నమ్మకం కలుగుతోంది. పట్టణమంతా కాగడాలతో గాలించి సందు సందుల్లోను తిరిగి తిరిగి వెదకినా తల్లి కనబడలేదు. రావణుడు ఆమెను ఎక్కడ వుంచుతాడనుకుంటామో అలాంటి చోటగూడా లేదు. మరి సంపాతి తాను చూస్తున్నాను సీతను ఈ లంకలో అన్నాడు అనాడు. నా దురదృష్టమేమో నాకు కనబడడంలేదు. ఇంకా చూడని చోటు బెత్తెడు వున్నా వెళ్ళి వెదకి చూస్తాను. ఆమెను చూడకుండా తిరిగి వెళ్ళి రఘునాథుణ్ణి చూడ గలనా?

## కిం కర్తవ్యం?

లేకపోతే చివరకు ఒక పని చెయ్యాలి. ఈ రాక్షసనాథుని మేల్కొల్పి, మెడమీద కాలుపెట్టి, ఉక్కిరి బిక్కిరి అయ్యేట్లు చేసి సీతమ్మను ఎక్కడ దాచాడో విషయం రాబట్టాలి అని అనుకుంటూనే నిద్రిస్తున్నవాణ్ణి ఇలా చెయ్యాలనిపించడం కేవలం కలియుగంలో చెల్లుతుందేమో! ఒకవేళ అలా చేసినా వీని భార్యలందరూ ఒక్కసారి గొల్లుమంటూ గగ్గోలు, బొబ్బలు పెడతారు. అందరూ చుట్టూ మూగుతారు. అంతా గందరగోళమవడం తప్ప ఇందువల్ల సీత జాడ ఏం తెలుస్తుంది? అనవసరంగా అధైర్యంతో వచ్చిన పనిని చెడగొట్టిన వాణ్ణవుతాను.

రాక్షసరాజు నిద్ర మేలుకొనేదాకా వేచివుంటే అటు తూర్పుదిక్కున సూర్యుడుదయించి కిరణాలు విరజిమ్ముతాడు. కైపెక్కినవాళ్ళు, నిద్రమత్తులో మునిగినవాళ్ళు, వళ్ళెరక్కుండా పడివున్నవాళ్లు ఇలాంటి వాళ్ళందరికీ సూర్య కిరణాలు గుచ్చుకొని చైతన్యం వచ్చి మేలుకొంటారు. గుప్పిట తెరచినట్లౌ తుంది. ఇంతవరకు పడ్డ శ్రమ వృథా అవుతుంది. సీతను అన్వేషించి వస్తాడు హనుమ అని అవతల ఎదురుచూస్తున్న వారి ఆశలన్నీ నా మూలంగా వమ్ము అవుతాయి. శతయోజన విస్తీర్ణంగల సముద్రాన్ని అంగలువేస్తూ దాటగలిగాను అనే గర్వంతో వున్న నేను సీతాన్వేషణలో పొందిన ఈ నిరాశా సముద్రంలో మునిగి పోవాల్సిందే! "సముద్రం పైన దూకుతూ పక్షిలాగా ఎగరటం వేరు-

రాక్షసరాజు సీతను దాచిన చోటును ఎఱగటం వేరు. ఈ సూక్ష్మ విషయం తెలియక తగుదునమ్మా అని విఱ్ఱవీగుతూ వచ్చావని తెలుసుకో" అని తనలో తానే అనుకున్నాడు. ఏం చెయ్యడానికీ పాలుపోక చింతిస్తూ పుష్పకాన్ని వదలి, తెల్లని వెన్నెలను తన పొట్టలో నింపుకుంటున్న సముద్రం దగ్గరకు వచ్చి, అన్నివిధాలా భద్రంగా వుండే ఏర్పాట్లు చేయబడ్డ లంకాపుర ప్రాకారాన్ని సూక్ష్మరూపంతో అతి చాకచక్యంగా ఎక్కి అంతా పరికించి చూస్తున్నాడు—

పైన ఆకాశం, నక్షత్రాలు, చంద్రుడు, పండు వెన్నెలలు, క్రింద సముద్రపు కెరటాలలోను సముద్రతరంగ తుషారబిందువుల పలకరింపులో దూరంగా వున్న సముద్ర జలతలం పైన ప్రతిబింబించే వివిధ కాంతులు- అన్నిటిని తలపంకిస్తూ చూస్తూ సృష్టి వైచిత్ర్యాన్ని లోకరీతుల్ని విమర్శనా దృష్టితో, తాత్త్వక దృష్టితో తనలో తనే చర్చించుకుంటూ తక్షణకర్తవ్యాన్ని గూర్చి ఆలోచించాడు. ఏమీ పాలుపోలేదు. ఇంక ఆలోచన మాని కళ్ళు మూసుకుని ఇక్కడ తపస్సు చేసుకుంటే సరి అనే ఆలోచన గూడా వచ్చింది. లేకపోతే సుగ్రీవుని దగ్గఱకు వెళ్ళి సీత కనబడలేదని చెప్పెయ్యాలి. చెప్తే ఇంకేమన్నా వుందా? చండశాసనుడైన సుగ్రీవుడు నన్ను చెట్టుకొమ్మకు తల క్రిందుగా తాడు లాగా వ్రేలాడ దీస్తాడు. సీతను చూడలేదంటే ఆ రాముడేమౌతాడో, లక్ష్మణుడేమౌతాడో, అయోధ్య వాసు లేమౌతారో ఊహిస్తుంటేనే హృదయం తరుక్కుపోతోంది. దీనికంటే ఇక్కడ కూర్చుని తపస్సు చెయ్యడమే యుక్తమని తోస్తోంది. లేకపోతే సీతనుచూడలేదని చెప్పడానికి ఏముఖం పెట్టుకుని వెళ్తాను? అంత సముద్రాన్ని దాటి ఎలా వెళ్తాను? ఉత్సాహం లేకపోతే ఏమీ సాధించలేం గదా! సముద్రానికి అవతల ఒడ్డున నా కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తూవుంటారు. నేనేదో మహాకార్యాల్ని సాధించగల దక్షుణ్ణని వాళ్ళు పొగిడితే అవునన్నట్లభినయించి, ఒళ్ళు పెంచి, సముద్రాన్ని దాటి ఆశ్చర్యాన్ని కలిగించి ఇప్పుడు బిక్కమొగంతో సీతను చూడలేక పోయ్యాను అనిచెప్పనా? సిగ్గుమాలి అలా చెప్పి రాముని ఆపద చూడటం కంటే ఇక్కడే ఎక్కడో అగ్నిలో దూకటం పదిరెట్లు మేలు.

ఆకాశమనే సరస్సులో విహరించే హంసలాగా వున్నాడు నెలవంక.

ధ్యాన గతుడైన పరమ హంసలాగా నడిమింట నిశ్చలంగా వున్నాడు చంద్రుడు. తారకలతో వున్న ఆకాశం ముత్యాల గొడుగులాగా వున్నది. దానికి మధ్య వెండి బిళ్ళలాగా చందమామ వున్నాడు. అటువంటి చంద్రునిలా నిశ్చలంగా వున్న హనుమ ఇంకా–

"పెట్టిన గడువు అయిపోయింది. వెతికే ఓపిక గూడా ఐపోతోంది. అవతల రామచంద్రుడు మాత్రం ఎంత కాలమని ఓపిక వహిస్తాడు. శివుణ్ణి పానవట్టంలాగా పట్టిన ఆదిశేషునిలాగా లంకను యావత్తూ తోకతో చుట్టచుట్టి, ఒకే ఊపులో పెల్లగించి, సరాసరి ఆ రాఘవుని పాదాల దగ్గఱ వుంచుతాను. ఆ సీతమ్మను లంకలో ఆ దైత్యుడు ఎక్కడ దాచాడో ఆ రామచంద్రుడే వెతుక్కుంటాడు. ఈ పని తెల్లవారిన తరువాత చేస్తాను. ఈ రాత్రికి ఈ అశోకవనంలో ధ్యాననిమగ్నుడనౌతాను. ఇక్కడ తపస్సుకు చాలాయోగ్యంగా వుంది" అనుకున్నాడు.

సముద్రం మీంచి చల్లనిగాలి తగలడంతో ఉత్తరీయం తీసి వంటికి కప్పుకున్నాడు హనుమ. చిక్కగా వున్న తోకను పైకెత్తి చివర వంపు త్రిప్పి తన శిరస్సుపైన పతాకంలాగా కనబడేట్టు చేశాడు. ఆ స్థితిలో హనుమ మనోహరంగా కనబడ్డాడు. సుస్థిరమైన ఆసనంలో వుండి ధ్యాన నిమగ్నుడయాడు హనుమ. చుట్టలు చుట్టుకొన్న తోక చుట్టలు సర్పభూషణాల్లాగా కనబడుతూ హనుమ మహాదేవునిలా మనోజ్ఞంగా ధ్యానస్థితిలో వున్నాడు. దేవతలందరూ ప్రసన్నభావంతో అనుగ్రహిస్తున్నారు. హనుమకార్యం ఫలప్రదమవాలని ఆకాంక్షిస్తున్నారు. హనుమలోని యోగాగ్ని ప్రజ్వరిల్లి, విను వీధిలోని చంద్రుని చల్లదనాన్ని కొల్లగొడుతోంది. సముద్రపు గాలుల్లోని శిశిరత్వాన్ని పటాపంచలు చేస్తోంది, హనుమ ధ్యానస్థితినుండి జాగ్రదవస్థలోకి వచ్చాడు. ఏదో మెఱుపులా ఆలోచన వచ్చింది. కోటగోడ మీదనుండి గెంతుతూ, ఆకాశంలో చంద్రుణ్ణి, క్రింద సముద్రాన్ని చూచుకుంటూ అశోక వనం వైపుకు లంఘించాడు.

## అశోకవనం

మునిలాగా వున్న హనుమకు అశోకవనం పుష్పాభిషేకంతో స్వాగతం పలికింది. వనమంతా అతిథిలాగా సంచరించి వినోదాన్ని చూశాడు. ఎంత

కోట వుందో అంత వనమున్నట్లు తోచింది. తోట అంతా రకరకాల చిత్ర విచిత్రమైన తరు వృక్షలతా గుల్మములతో నిండి వుంది. తరులకున్న తీగలు అల్లిబిల్లిగా చుట్టుకొన్నప్పటికీ ప్రవేశించలేని అడవిలాగా తయారుకాలేదు. ఆకాశాన్నంటే వృక్షాలు, నేలపై విరులపాన్పులు పరచే మొక్కలు గలిగి వనమంతా శోభాయమానంగా వుంది.

"అంతఃపురంలో ఉంచకుండా ఈ వనాంతరంలో సీతమ్మ తల్లిని ఉంచడం ఆ రావణుని దురాలోచనను తెలియజేస్తుంది. పోనీ ఎక్కడో అక్కడ తల్లి భద్రంగా వుంటే చాలు! ఇంతకు పూర్వమే ఈ దిక్కుగా వచ్చి లోపలకు వెళ్ళడం జరిగితే ఒకరాత్రి కలసి వచ్చేది. ఎందుకనో ఈ తోటలో తల్లి వుండే వుంటుందనిపిస్తోంది" అలా అనుకుంటూ హనుమ వనంలోని టేకు, మద్ది, చంద్ర, లొద్దుగ మొదలైన అరణ్య వృక్షాలను; వేప, చింత, గానుగ, దిరిసెన, రావి, జువ్వి, మఱ్ఱి మొదలైన గ్రామ్య తరువులను; ఉసిరిక గన్నేరు, దానిమ్మ, ములగ మొదలైన గృహ భూరుహారులను; నానాపుష్ప కుంజములను చూస్తూ వెళ్తున్నాడు.

ఒకప్రక్క గుట్టలు, మరొకప్రక్క సర్పాల్లాగా సాగే సెలయేళ్ళు, కమలాకరాలు, ఇసుకతెన్నెలు, ఎత్తైన స్తంభాలతో పెద్ద పెద్ద మండపాలు, పూలమొక్కలకు గొట్టాలతో నీళ్ళు నిల్వ చేసిన ఎత్తైన జలాశయాలు, నీటి తుంపరలు వెదజల్లబడే మర జలాశయాలు, చెట్లక్రింద నీడల్లో విశ్రాంతి తీసుకునేందుకు టెక్కాలతో రాతి అరుగులు, ఇలా ఎన్నో ఏర్పాట్లతో వనమంతా శోభాయమానంగా వుంది. చెట్టుచెట్టునూ చూచుకుంటూ వెళ్తూంటే సగం రాత్రి గడిచిపోయింది. ఇంక లాభం లేదని అన్నిటికన్నా ఎత్తుగానున్న చెట్టెక్కి చుట్టూ కలయజూస్తే సీతమ్మతల్లి జాడ ఏమన్నా తెలుస్తుందేమోనని చుట్టూ పరికిస్తున్నాడు. అంబరాన్ని చుంబిస్తున్నట్లున్న ఒక ఇరుగుడు చెట్టు కనబడింది. ఆ చెట్టుకు ఆకులు, కొమ్మలు తక్కువగా వుండి, చుట్టూ చూస్తే అన్నీ వివరంగా కనబడేట్లుగా వుంది. ఆ చెట్టు ఎక్కి నాలుగు దిక్కులవైపు చూశాడు.

దూరంగా ఒక చక్కని తటాకాన్ని చూశాడు. దానిలోని నీరు వెన్నెల వెలుగులు విరజిమ్ముతూ మనోహరంగా ఉంది. దూరంగా వున్న ఎత్తైన

వృక్షాలు నీటిపై సాష్టాంగపడుతున్నాయా అన్నట్లున్నాయి వాటి నీడలు అందరికీ తనలో ఆశ్రయమిస్తున్నట్లు చుట్టూ ఎత్తుగా వున్న వాటి అన్నిటి నీడలను ఆ తటాకం తన అక్కున చేర్చుకుంటోంది- తన కూతురైన లక్ష్మిని ఈ రక్కసుడు ఎప్పుడైనా తెచ్చి ఇక్కడ వుంచుతాడేమోనని ముందే వూహించి పాలసముద్రం చిన్న ఆకృతి దాల్చిందా అన్నట్లుంది ఆ తటాకం. దీనికి విరుగుడై నందువలన శత్రు భావనతో దూరంగా పోయిందా అన్నట్లు లంకాద్వీపం పొలిమేరల వద్ద ఉన్న లవణ సముద్రం భాసిస్తోంది.

అటు ఆకాశంలోని మేఘాలనుండి నీళ్ళను సంపాదించి, ఇటు నేలపైన జలాశయాలకు సెలయేళ్ళ ద్వారా, జలపాతాల ద్వారా ఖర్చుచేస్తాయా అన్నట్లు భాసిస్తున్నాయి-ఎత్తైన కొండలు, వాటిచరియలు, లోయలు. భూజాత సీత తప్పకుండా ఈ ప్రాంతాన్ని సందర్శించడానికైనా ఇక్కడకు రావచ్చు లేదా రామదూతగా నేను వస్తానసే ఊహ కలిగి అయినా ఇక్కడకు రావచ్చును! అనుకున్నాడు హనుమ. సీతమ్మ తల్లి వస్తే తాను ఆమెకు కన బడకుండా, చూచేందుకు వీలుగా ఏదైన చెట్టెక్కి చూస్తే బావుంటుందని ఒక శింశుపా తరువును ఎక్కాడు ఇంతకు పూర్వం ఈ శింశుపా వృక్షం ఎక్కి నపుడు రమ్యమైన తటాకాన్ని చూశాడు. ఇప్పుడూ ఈ శింశుపా వృక్షం సీతమ్మ తల్లిని చూపించవచ్చు. ఎందుకంటే ఫలాలను, ప్రతిఫలాలను ఇవ్వడం ఈ వృక్షం లక్షణం గదా అనుకున్నాడు హనుమ. సమీపంలోనే అశోకవనంలో పంటకు వచ్చిన వరి పైరులాగా వున్న, చిగుళ్ళతో నిండిన అశోక వృక్షాన్ని చూశాడు. ఒక చెట్టు కొమ్మమీద నుండి ఇంకొక చెట్టు కొమ్మమీదకు దూకుతూ చివరకు ఆ అశోకవృక్ష శిఖరాన్ని జేరాడు.

హనుమ చెట్టుమీదకు దూకంగానే చుట్టూ వున్న చెట్లమీద వున్న కొన్ని పక్షులకు మెలకువ వచ్చి భయమేసి ఒక్కసారిగా పైకి ఎగిరాయి. ఆకాశంలో వున్న చంద్రుణ్ణి బట్టి మూడు జాములు దాటిందనుకున్నాడు. కావాలని లక్ష్మీదేవి మధ్యలో కూర్చుని వున్నట్లుగా- అశోకవనము లలిత లావణ్య శోభతో కళకళలాడే ప్రౌఢ యువతిలాగా వుంది.

ఆ వనంలో చక్కని చిక్కని తెల్లని వెన్నెలలు కడింది పూల సువాసన లలో పిల్ల తెమ్మెరలు గుబాళిస్తున్నాయి. విరులతో విరగబూసిన వనంలో

వున్న ఒక పాలరాతి సౌధం- పాల కడలిలోని చంద్రునిలా భాసిస్తోంది. వెన్నెలల మధ్య వ్రేలాడే పెద్దపెద్ద చెట్ల ఆకులు- వెన్నెల దేవతలు ఆర వేసుకున్న చీరల్లాగా వున్నాయి.

## సీతా దర్శనం

పాలరాతి సౌధాన్ని పరికిస్తున్నాడు హనుమ. బయట నాల్గుమూలల వద్ద మూడు మూడు స్తంభాలు, లోపల నాల్గు మూలలవద్ద మూడు మూడు స్తంభాలు వుండి మధ్యలో ఒక పెద్ద స్తంభం- ఇలా నాలుగు అంచెలతో సహస్ర స్తంభ మండపం ఉంది. చుట్టూ మరకతాలు, వైఢూర్యాలు, మాణిక్యాలు పొ ద గ బ డి, దాని పాలరాతి గో డ ల మీ ద త ళు క్కు మంటున్నాయి. మరకతాలు తాపిన సౌధధాత్రిమీద హనుమ చరిస్తూండగా ఒక జంగమ స్త్రీలాగా ఉన్న ఒకామె కనబడింది. చంద్రకాంతి చెట్ల ఆకుల మీద, కొమ్మలమీద పడితే ఎలా వుంటుందో అలాగ వెలుగునీడల మధ్య ఆమె అస్పష్టంగా కనబడుతోంది. హనుమ హృదయంలో ఒక రూపాన్ని కూర్చుకుని వున్నాడు. ఆ రూపాన్ని సరిపోల్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

అమె సీత అవడానికే ఎక్కువ అవకాశాలు కనబడుతున్నాయను కున్నాడు హనుమ. ఆమె చుట్టూరా ఘోరమైన కరాళ దంష్ట్రిలతో, చేతుల్లో కత్తులుపట్టుకుని కొందరు కాపలాకాస్తున్నారు. ఆమె కళ్ళ వెంబడి నీటిధారలు కనబడుతున్నాయి. ఎన్నోరోజులనుండి కట్టుకుని, మాసిపోయినచీరలోవున్నది. ముఖం చంద్రబింబంలాగా ఉంది. కాళ్ళు మడచికూర్చుని వుంది. చుట్టూ చేరిన రాక్షస స్త్రీలు ఎఱ్ఱని కళ్ళతో బెదరిస్తున్నారు. ఇవన్నీ చూసిన హనుమకు ఆమె సీతయే అనే భావన కలిగింది.

ఈమె చుట్టూరా పిశాచీగణం వుండి కాపలా కాస్తున్నారంటే- ఈమె సీతే అయి వుండాలి. కృశించిన నడుముతోపాటు-కృశించిన దేహం గల ఈమె తప్పకుండా సీతమ్మే అయి ఉండాలి రాఘవేయుల కోడలే అయి వుండాలి. లేకపోతే ఆ సూర్యతేజో విలాసదేహం ఇంకొకరికి ఈ లంకలో వుండదు. ఈమె ముఖారవిందంలో ఏదో ఆధ్యాత్మిక మహోన్నత కనబడుతోంది.

ఈమె తప్పకుండా సీతమ్మయే అయి వుంటుంది. పైకి దుఃఖ చిహ్నాలు కన బడుతున్నా లోపల ఏదో ధైర్యగుణం తొంగిచూస్తోంది. ఈమె తప్పకుండా భూజాతయే అయి వుంటుంది. పాతర వేసిన వడ్ల పసిమి రంగులో వున్న ఈమె మేనును చూస్తూంటే- తప్పకుండా ఈమె భూమిలోపల కొన్నిరోజులు పెట్టెలో పెట్టబడి ఉందేమో అన్న అనుమానం వస్తోంది. కళ్ళల్లో హరిణ లోచనాలు కనబడడంచూస్తే - ఈమె కళ్ళను హరిణాలు ఒకప్పుడు దోచు కున్నాయేమోనన్న అనుమానం కలుగుతోంది.

అంతవరకు చూచిన తర్వాత హనుమ సరాసరి ఆమె ఏ చెట్టుక్రింద కూర్చొన్నదో ఆ అశోక వృక్షం ఎక్కి గుబురుగా వున్న కొమ్మల మధ్యన దూరి- తొండలు, ఉడతలు, పక్షులు గూడా చప్పుడు చేయని ఆ తోటలో రాక్షసులందరూ పానమత్తులై, వళ్ళు తెలియని స్థితిలో వుండగా చూచి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ సీతమ్మ దగ్గఱగా వెళ్ళి ఇంకొంచెం పరీక్షగా చూడసాగాడు.

పూర్వం కిష్కింధలో తాను నగలమూటలో చూచిన నగలు ఈమెశరీరం మీద లేవు. అదీగాక అంగసాముద్రిక ప్రకారం తు.చ. తప్పకుండా వున్న ఆమెను చూసిన తర్వాత సందేహ నివృత్తి జరిగింది. ఆమె తలపై చూడామణిని చూచాడు. ఇటువంటి చూడామణులు మిథిలా భామినులే ధరిస్తారు. ఇటువంటి చూడామణులు ధరించిన భామలుగల భూములు నిత్య కళ్యాణం పచ్చ తోరణంతో వుంటాయి. అటువంటి చూడామణి కనబడడం తనకు శుభాన్ని సూచిస్తోందనుకున్నాడు.

పూర్వం నగలను మూట కట్టడానికి ఏ చీరచెంగు చించి మూట కట్టిందో ఈ రోజున కూడా ఆమెను ఆ చీరలోనే చూస్తున్నాడు. అయితే ఆనాడు నగలను కట్టిన చీరచెంగు క్రొత్తదిలాగా వుంది. ఈనాడు ఆమె చీర పాతదిలాగా వుంది- అంతే తేడా! కృశించిన ఆమెను చూస్తూంటే- "ఈమె వైదేహియే, కాకపోతే అలా ఎందుకుంటుంది?" అన్నట్లుంది. చివరకు అని పించడం కాకుండా ఆమె సీతగానే నిశ్చయించుకుని, ఆకులు గుబురుగా వున్న అశోకవృక్ష శాఖల మధ్యలో నిలిచి, కన్నులు మూసుకుని ధ్యానస్థితిలో సీతను దర్శించాడు. హనుమకు ఆ ధ్యానస్థితిలో సీత-

అంగారక గ్రహపీడితమైన రోహిణి లాగా కనబడింది. దుష్టుడి చేత చిక్కిన శాస్త్రం లాగా, అపవాదుపాలైన కీర్తిలాగా, పాడ్యమి నాటి విద్య లాగా, స్వర విహీనమైన వేదమంత్రంలాగా, దుర్జనుడి చేత చిక్కిన అధికార రేఖలాగా, కలి ఆశ్రయించిన ధర్మదేవతలాగా కనబడింది. తప్పకుండా ఈమె సీతయే అని మరొక్కసారి దృఢపరచుకున్నాడు.

రామునితోపాటు తననుగూడా అడవికి తీసుకువెళ్ళమని సీత కోరి నప్పుడు రాముడు మొదట ఒప్పుకోలేదుట! కాని తరువాత సీత పలికిన ధర్మ వచనాలకు రాముడు సీతను తనతోపాటు అరణ్యాలకు తీసుకువచ్చాడట! అంటే తనకంతగా ఇష్టం లేకపోయినా తీసుకువచ్చాడేమో? అలా అని ఆమెను గురించి ఉదాసీనంగా ఎప్పుడూ ప్రవర్తించలేదుట. ఆమె తింటే తాను తినే వాడట. లేకపోతే లేదుట. "అంత అనురాగమా సీత అంటే?" అనుకున్నాడు ఆనాడు. ప్రస్తుతం సీతను చూసిన తరువాత హనుమకు ఆ మాటమీద పూర్తిగా నమ్మకం కలుగుతోంది.

అపురూపమైన లేడిది దొంగ వ్యవహారం అని తెలిసిగూడా రాబోయే ఆపదను లెక్కచేయకుండా సీత కోరింది గాబట్టి తీసుకురావలసిందేనని రాముడు ఎందుకు తెగించి బయలుదేరాడో ఇప్పుడు సీతను చూచిన తరువాత అర్థం అవుతోంది హనుమకు.

వాలిని చంపడంలో రాముడు ఏ విధమైన ధర్మ నిర్ణయాన్ని తీసు కున్నాడో అన్న అనుమానం ఇంతకుపూర్వం కలిగినా కలుగవచ్చునేమోకాని ఇప్పుడు సీతను చూచిన తరువాత ఆ సంశయం కలగడానికి అవకాశం లేదనిపిస్తోంది హనుమకు.

ఇవన్నీ చూస్తుంటే ఈ సీతకై ఆ రాముడు చెయ్యనిదేమి వుంటుంది అనిపిస్తోంది. సృష్టి స్వరూపిణి అయిన ఈమెకు ఆపద కలిగితే పరమ పురుషుడైన రాముడు చాప, మంత్రాలకు పని చెప్పకుండా వుంటాడా అని పించింది హనుమకు.

ఇదంతా చూస్తుంటే ఆ రాక్షసరాజు లేనిపోనిది చేజేతులా కోరి

ఆపదను తెచ్చుకున్నాడనిపిస్తోంది. జానకి ఆపద జనానికే ఆపద అనీ, జగన్నాథుడితోనే కయ్యమనీ ఆ రావణుడికి తెలియటం లేదు.

సీతను చూడక పూర్వం రాముణ్ణి గురించి పూర్తిగా తెలుసునను కున్నాడుగాని ఇప్పుడు సీతను చూచిన తరువాత రాముణ్ణి గురించి తన పూర్వజ్ఞానం ఎంత అసంపూర్ణమో, అది ఎంత అజ్ఞానమో ఇప్పుడు తెలుస్తోంది హనుమకు. సీతను తెలుసుకోకుండా, చూడకుండా ఆ రాముడు పూర్తిగా అర్థం కాడన్న ఒక్క విషయం ఇప్పుడు నిర్ధారణ అయిపోయింది హనుమకు.

ఈ సీతారాము లిద్దరినీ విడదీయడానికి ప్రయత్నించే తెలివి ఎలాంటి తెలివో ఇప్పుడు తెలుస్తోంది. ఈ తెలివి ప్రాణంలేని దేహాన్ని జీవింపజేయ డానికి చేసే వ్యర్థ ప్రయత్నం లాంటిదని ఆ రావణునికి తెలియటం లేదు.

"జలజలోచన అయిన భూజాత సీత శ్రీరాముణ్ని విడిచి వుందను కున్నా, జలజేక్షణుడైన శ్రీరాముడు సీతను విడిచివున్నాడనుకున్నా పొరపాటు పడ్డట్టే! ప్రస్తుతం ఇద్దరి మధ్యవున్న జలధి ఎంతవరకు భావజగత్తులోనిదో అనిగూడా అనుమానం. అందుకనే గావును నాకు దానిని దాటినట్లే అని పించటం లేదు నీలమేఘశ్యామల దేహుడైన రాముడు విద్యుల్లతాసదృశమైన సీతతో విహరించడంలో మధ్య ఏర్పడే తాత్కాలిక వ్యవధిగాని ఇది వియోగం కాదు. మేఘాన్ని, మెఱుపుతీగను విడదీయగలమా?" అనుకుంటూ హనుమ అశోకవృక్షపు కొమ్మల మధ్యవుండి నిరీక్షిస్తున్నాడు.

క్రింద సహస్ర స్తంభ మండపంలో అన్ని స్తంభాలు చీకటిక్రమ్ముకుని ఉండగా సీతమ్మ ఆనుకుని కూర్చునివున్న స్తంభం ఒక్కటి మాత్రం చిక్కటి, తెల్లని వెన్నెలలు విరజిమ్ముతోంది. ఆ వెన్నెలకాంతులు సీత చెక్కిలిమీది బాష్పాలను స్పృశిస్తున్నాయి. ఆ బాష్పాలు ముత్యాల్లా జారుతున్నాయి. చుట్టూ చీకటిగావున్నా సీత ముఖంమీద మాత్రం వెన్నెల పడడం వలన ఆమె ముఖం స్ఫుటంగానే కనబడుతోంది. లేడికోసం చెట్టుచాటున పొంచి వుండే వేటకానిలా హనుమ వున్నాడు. మింటిలోని చంద్రుడు- మూయబోయే కన్ను లాగా వున్నాడు. హంస ముక్కున చిక్కిన తామరతూడు లాగా ఉన్నాడు. జలధిపై ఒరిగి పడబోయే నావలాగా వున్నాడు. ఎఱుపు విరిగి

తెలుపు తిరగడం ఉదయ లక్షణమైతే- తెలుపుపోయి ఎఱుపు తిరగటం అస్తమయ లక్షణమా అన్నట్లు క్రమక్రమముగా తెలుపుపోయి ఎఱుపు, అటు పైన అంధకారచ్ఛాయలు అలుముకుంటున్నాయి.

## రాక్షస స్త్రీల వాలకం

సీత చుట్టూ రాక్షస స్త్రీలు చేరుతున్నారు. వారి కోరలు సమ్మెలు లాగాను, వారి చింత నిప్పులవంటి కళ్ళు దివ్వెలుగాను వున్నాయి. అడ్డంగా తిరిగిన ముక్కులతోను, పైకి ఉబికిన ముక్కులతోను, పొట్టిముక్కులు, బాన పొట్టలతోను, వికృతాలంకార వేషాలతోను వున్నారు వాళ్ళు. నత్తలు, పీతలు వారికి నాజూకైన ఆహారం. దంతధావనం, నిత్యస్నానం మొదలైన వాటితో పనిలేదు. ఆ మాంసం ఈ మాంసం అనే భేదం లేకుండా అడ్డమైన గడ్డిని మేసేస్తున్నారు. పెదవుల చివరలు పగిలి అక్కడ ఈగలు మూగి వాసన గొడుతూ అసహ్యంగా వున్నారు. ఆ చీకట్లో సీత చుట్టూ మూగిన వారందరూ ఒక రకంగా లేరు. రకరకాల వికృతాకారాలతో, జుగుప్సాకర హావభావ చేష్టలతో, కఠోర కంఠధ్వనులతో, వికార విన్యాసాలతో, వికటాట్టహాసాలతో, నానా భీభత్సంగాను ఉన్న వాతావరణం మధ్యన రాత్రంతా అలాగే చిత్ర వ్యధకు గురి అవుతున్న సీతమ్మను హనుమ జాలిగా చూస్తూ యోగిలాగా ఓర్పుగా నిరీక్షించాడు.

క్రమక్రమంగా తూర్పు పడతి జుట్టు ముడిపై ఉషఃకాంతులు తురాయి లాగా భాసిస్తున్నాయి. వేద ప్రవచనాల గంభీర గళాలు మనోజ్ఞంగా వినబడు తున్నాయి. తోట అనే సంగీత విద్వాంసుడు ఉషస్సులో లేచి అభ్యాసము చేస్తున్నట్లుగా శకుంత సంతాన కలకూజితాలు మృదుమధురంగా వినవస్తు న్నాయి.

## రమణులతో రావణాగమనం

ప్రభాత కాంతిరేఖలు వెన్నంటిన వేవెలుగులాగా వెలుగుతూ వన్నెలు చిమ్ముతున్న కన్యకామణులు తోడురాగా ఒక మహాపురుషుడు వస్తూ వుండడం

హనుమ చూశాడు. అష్టమీ చంద్ర ఫాలభాగాలతో; పద్మదళాయతాక్షులతో, చంపకాన్నిమించే వంకలేని నాసికలతో, బింబాధరాలతో, అద్దపు చెక్కిళ్ళతో రత్న మాణిక్య కుండల శోభిత కర్ణాలతో, అమలక సాదృశ్య చిబుకాలతో, హారశోభితలైన కంబుకంఠాలతో, కలశీ ముగ్ధపయోధరాలతో, మన్మథ హేలలతో, మత్తెక్కించే చూపులతో, చామరాలు పట్టి సేవిస్తూ ప్రభుని ప్రక్కన ఆ స్త్రీలు ప్రకాశిస్తున్నారు.

జార్చిన విశాల నీల కేశపాశాలతో, చేత పాన కలశాన్ని పూని ఒక నెఱజాణ వయ్యారంగా నడచి వస్తోంది.

ఒకామె బంగారు అంచుగల పట్టుచీర కట్టి, బిళ్ళ గోచీ బిగించి, సమస్త భూషణాలు ధరించి, చేత ముత్యాల గొడుగును ప్రభు కిరీటము పైగా పట్టుకుని అతి జాగ్రత్తగా అడుగులు వేస్తోంది.

గాలిలోకి తేలియాడే తెల్లని ఉలిపిరి వస్త్రాలతో అర్ధనగ్నంగా వుండి, పైటలు తొలగినా సర్దుకోవాలనే ధ్యాస లేకుండా, తూలుతూ, కామభావంతో కాంతలు ప్రభుని అనుసరించి నడచి వస్తున్నారు.

చేత పట్టిన కాగడాల కాంతి చక్రాలతో చక్రస్తనులు పరిమళితతైల పరిపుష్ట శరీరాలతో మెరుస్తూ వస్తున్నారు.

వినూత్న పద విన్యాసాలతో, అరుణారుణ చరణ మంజీరాల మంజుల నిస్వనాలతో, శ్రుతి కలిసిన మధుర కలరవాలతో సరసిజనేత్రులు సరసన వస్తున్నారు.

మెఱుపుతీగల కాంతులతో కూడిన మేఘునిలాగా, రమణీయ కమనీయ రత్న మాలికలతో రంజిల్లు సౌందర్య రాశిలాగా, చల్లని తెల్లని వెన్నెల వన్నెలలతో కూడిన చందమామలాగా, ప్రతిఫలించిన మింటితారలతో కూడిన పయోధిలాగా– ఆ వస్తూన్న గంభీర సుందరమూర్తి కనిపిస్తున్నాడు. ఫాల భాగంలో విభూతి రేఖలు అడ్డం తిరిగిన పావక జ్వాలల్లా భాసిస్తున్నాయి. 'ఆ వచ్చేది ముక్కంటి కాదుగదా' అని భ్రమ పెట్టేటట్లుగా వున్నాడు. దగ్గఱ దగ్గఱకు వస్తున్న కొద్దీ హనుమకు ఎవరో గుర్తుకు వస్తున్నారు. చివరకు గుర్తు పట్టాడు ఇంతకు పూర్వం పుష్పకంలో నిద్రిస్తున్నపుడు తాను చూచిన తీరుకు

ఇప్పటి తీరుకు చాలా తేడా కనబడుతోంది. నిద్రిస్తున్నపుడు మొత్తం జగత్తునంతా తుత్తునియలు చేయగల దారుణ శౌర్యసంపత్తి గల బాహుబలంతో కనబడ్డాడు. ఇప్పుడంత కఠోరంగా కనిపించడంలేదు. నిద్రిస్తూన్నపుడు ఈ దానవులు తమ సహజ లక్షణాలతోను, నిద్ర లేనప్పుడు కమనీయమైన కామ రూపంతోను వుంటారేమో ! లేకపోతే ఈ ప్రళయ రూపమెక్కడ ? ఈ ముగ్ధాంగనల ముద్దు మోములను మైమరపించే ఈ మోహన రూపమెక్కడ?

## అనుభవం లేని భీతి

రావణుని సహజ సౌందర్య గంభీరాకృతిని చూడంగానే హనుమకు– సముద్రపుకొడ్డున నిల్చుండి కెరటాలకు వెనుకకు తగ్గినట్లుగాను, ఉరకలు వేసుకుంటూ సుళ్ళు తిరుగుతూ మహోజ్జ్వలంగావచ్చే గంగా ప్రవాహం వరదను చూచి వంట్లో నెత్తురువాకలు వెన్నాడినట్లుగాను అయింది. వెంటనే తాను కనబడతానేమోనని గుబురు కొమ్మల మధ్య నక్కాడు. ఎదలో ఏదో అయినట్లై "ఏమిటా ఇది?" అని ఆలోచించిన మీదట గాని అది భయమని తెలియలేదు. ఇంతకు పూర్వం ఎప్పుడూ భయం తాలూకు అనుభూతి తనకు లేదు. ఇదే మొదటిసారి. బహుశా ఇదే చివరిసారిగూడా అవవచ్చు. ఈ భయం హనుమ హృదయంలో కోపాన్ని గూడా తెప్పించింది. తాను పుట్టిన క్షణంలో గూడా నింగిలో నిప్పులు గ్రక్కే ప్రచండ భాస్కరుని చూచి భయపడలేదు. శ్రీరామచంద్రుని చూచి నివ్వెరపడలేదు. మాయకు రూపమైన ఈ భయాన్ని పరమ యోగి అయిన తన యందు కలగజేసిన ఆ రావణుని యందు భయంతో పాటు జుగుప్సాభావం గూడా కలిగింది. అయినా ప్రస్తుత కర్తవ్యం గుర్తుకు వచ్చి క్రింద నున్న వారెవ్వరికీ కనబడకుండా మరింత జాగ్రత్తపడి- క్రింద ఏం జరుగుతుందో ఇక మీదట- అని నిశ్చలమైన భావంతో నిరీక్షిస్తున్నాడు.

రావణుడు సీత వున్న చోటుకు దగ్గఱగా రాంగానే సీత చూస్తూ వుండి ఆమెను పరిరక్షించే రాక్షస స్త్రీ సమూహమంతా చేతులు కట్టుకొని నిలబడ్డారు. దివిటీలు పుచ్చుకున్నవారు ముందుకు వచ్చి సీత వున్న ప్రదేశాన్ని వెలుగులతో నింపారు,

పరిచారికలు రావణునికి సముచితాసనాన్ని ఏర్పాటు చేశారు. అయినా ఆ ఆసనాన్ని ఏమీ చూడకుండా నిల్చునే సీతవంక చూస్తున్నాడు. అప్పుడు-సీత—

## సీత వాలకం

ప్రళయ జలధిలో సోమకాసురుణ్ణి చూచిన వేదమాతలాగా కలవర పడుతోంది. చాపచుట్టలాగా చుట్టి భుజంమీద పెట్టుకుని హిరణ్యాక్షుడు వెళ్తున్నప్పుడు వానికోఱ గీసుకుని, సోలిపోయి, క్రిందుమీదైన భూమాతలాగా వుంది. దురహంకారంతో తానే సర్వేశ్వరుడనని హిరణ్యకశిపుడు చాటుకునే ప్రళయ భీకర సభను చూచి భయపడే విష్ణుభక్తిలాగా వుంది. ద్రవ్యవితరణా ఫలంగా బలి చక్రవర్తికి దక్కడానికి భయపడే స్వర్గలక్ష్మిలాగా వుంది. తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టే కార్తవీర్యార్జుని దురాక్రమ పరాక్రమానికి అవులాగా అంబా అని అరచి దిగులు పడిపోయే ఆతిథ్య దేవతలాగా ఉంది.

తొడలు చేతులతో ముడుచుకున్న దేహం కలిగి, త్రాళ్ళతో కట్టివేయ బడిన పన్నగేంద్ర వధువులాగా వుండి, ఉపవాస శోక ధ్యానాదులచే కృశించిన సీతను రావణుడు చూసి మొదట ఆమెను చంపుదా మనుకున్నాడు. కాని, మళ్ళీ ఎందుకో ఆలోచించి మధురవాక్కులతో ప్రసన్నురాలిని చేసుకుందామని విలాసంగా నిలబడి, లాలిస్తున్నట్లుండే మాటలతో—

## రావణుని లాలన వాక్యాలు

నన్ను చూసి భయపడడ మెందుకే అమృత వదనా! నా చుట్టూవున్న సుందరాంగనలను చూడు. నిన్ను నేను కోరుకుంటూంటే వాళ్ళందరూ నా పొందు కోరుకుంటున్నారు. చూడు ఒక్కసారి ప్రొద్దు పైకెక్కుతోంది. కళ్ళు తెరు! చీకటి బ్రతుక్కి స్వస్తి చెప్పవే చిన్నారీ!

సుందరీ! నువ్వు అందరూ గొప్పగా చెప్పుకునే నందనవనం, అప్పైన చైత్రరథం చూశావా ? బహుశా చూసి వుండవు. చూసివుంటే ఇప్పుడు

నువ్వున్న ఈ అశోకవనం ముందు అవి ఎంత దిగదుడుపో తెలిసి వుండేది. ఈ వేసవికాలంలో కనీసం పదిరోజుల పాటైనా ఇక్కడ ఉంచమని దేవతా స్త్రీలు అందరూ ఉబలాటపడి నన్ను అభ్యర్థిస్తారు తెలుసా? అలాంటి వనంలో నువ్వు అడక్కుండానే నిన్ను తెచ్చి పెట్టాను. అంతేకాదు, ఇక ఈ వనంనీదే! ఇంకొకరు ఎవ్వరూ ఇక్కడకు రారుగూడా!

ఈ దశకంఠు డెలాంటి వాడనుకున్నావ్! అందరూ ఆరాధించే సర్వ దైవతాలను వంచించిన వాడు, అపురూప లావణ్యాలు గలిగిన అప్సర స్త్రీలందరూ ఈ రావణుని ప్రేమకు, కటాక్ష వీక్షణాలకు పడిగాపులుకాస్తారు. బహుశః నీ కివేమీ తెలిసివుండక పోవచ్చు. ఇప్పుడు నా చుట్టూ వున్న వీళ్ళెవరనుకున్నావ్! వాళ్ళే! వాళ్ళకు నేను తప్ప ఇంకో ప్రపంఛం లేదు. నాకు నీవు తప్ప ఇంకో ప్రపంచం లేదు. నాకు నీవు తప్ప ఇంకో ప్రపంచం లేదు, అర్థం చేసుకో!

నన్ను మించిన పండితుడున్నాడనుకుంటున్నావా? వేదార్థాలన్నీ నన్ను దాటి లేవు. ఎక్కడి కక్కడకు చిక్కులు లేకుండా విడదీసి ఒక పద్ధతిలో సవరించాను. ఇంత చేసిన నాకు అవగతమైంది ఒక్కటే! ఈ సృష్టికి మూలం కామమే! వాస్తవానికి దాన్ని మించిన పురుషార్థమే లేదు! ఈ సృష్టికంతకూ ప్రేమకే పెద్ద పీట. బ్రహ్మాదిదేవతలు కూడా ఈ ప్రేమకు లోకువే! నీమీద నా ప్రేమ అఖండమైనది. అటువంటి నా ప్రేమను కాదనటం దుఃఖానికి కారణం అవుతుందని తెలుసుకో అరవిందాననా!

నన్ను నీవు ప్రేమించడ మనేది నిశ్చయమే! చిరంతన హేలామధురాభి రాముడనైన నన్ను గాక వేరొకరిని నువ్వు ప్రేమించలేవు.

ఒక్క విషయము చెబుతా విను ! ప్రేమించే వానికి ఈ భూమ్మీద అసాధ్యమైంది వుండకూడదు. అందులోను ముగ్ధ సౌందర్యరాశిని ప్రేమించిన వాడు ఆమె ముద్దు తీర్చగలగడానికి చాలినవాడై వుండాలి. తెచ్చిపెడతా లేడిని, నీ కోరిక తీరుస్తా అని గబా వెళ్ళింది. తేగలిగాడా? నిన్ను అడవిలోకి తేవడం అంత సులభం అనుకున్నాడల్లే వుంది. పాపం! అదంత సాధ్యమయే పనా అందరికీ! నిన్ను తేవాలనుకున్నాను. ఇక్కడ వుంచాలనుకున్నాను

అంతే ! తెచ్చాను ఇక్కడ వుంచాను. సంకల్పానికీ చేతకీ సుంత గూడా వ్యవధానం వుండదు నా దగ్గఱ. నా తెలివి, పట్టుదల, సామర్థ్యం ఎలాంటివో ఆలోచించు- కోర్కెలు కలిగితే ఎవరిని కోరాలో నీకు తెలుస్తుంది.

సర్వజ్ఞుడనే పదం అందరికీ చెల్లదు. తాను అనుకున్నంత మాత్రాన, అందరూ అన్నంత మాత్రాన, సరిపోతుందా ? ఎప్పుడేం జరుగుతుందో ఆ మాత్రం తెలియని వాడు తెస్తా తెస్తానంటూ బయలుదేరడం దేనికి చెప్పు? నా వల్ల అయే పని కాదని వూరుకో వచ్చుగా ! ఆలోచించు నువ్వే ! నీకే తెలుస్తుంది ఎవరు నిజంగా సర్వజ్ఞుడో, సర్వ సమర్థుడో! అదేమి ఖర్మో! మతి మాలిన వాళ్ళనే నమ్మి మీ అతివలు దుఃఖాలు కొనితెచ్చుకుంటారు. అడవి దారులు పట్టిన వాడికి అతివల గుఱించి, అందం గురించి, ఆనందించటం గురించి ఏం తెలుస్తుందిలే!

తెస్తాను తెస్తాను అంటూ వెళ్ళాడు పాపం ఇంకా తెచ్చే ప్రయత్నం లోనే వున్నాడో లేక అడవిదార్లు అర్థంగాక ఎక్కడన్నాపడి కాలం చేశాడో! నేను జారులను పంపి వెదకి విషయము తెలుసుకు రమ్మన్నాను. అందరూ అన్నిచోట్లూ తిరిగి ఎక్కడా జాడలేదని, ఒకచోట ఏదోశవం చుట్టూ అందరూ చేరి దుఃఖిస్తూన్నట్లు వార్త చెప్పారు. ఔదార్యంతోనే వ్యవహరించి 'వాడు చావలేదు. బ్రతికే వున్నాడని' నీ తృప్తికోసం నేను అన్నా- బ్రతికి బట్టగట్టినా బాధతో క్రుంగిపోయేవాడు ఈ మహాసాగరాన్ని ఈదుతాడా ? ఆకాశంలో ఎగురుతాడా? ఈ మాత్రం మర్యాదా లక్షణం గూడా వాడిలో వుంటుందను కోను. దాక్షిణ్యపయోనిధీ! దాపరికం లేకుండా చెప్పిన నా మాట లాలకించు లలనా రత్నమా!

వాడు పూర్ణ పురుషుడంటూ వృధా భ్రమ, వృధా శ్రమ పడబోకు. వాడు నీకు జతా! ఇంకా ఏమనాలో తెలియటం లేదు. తల ప్రక్క వంకర నెల వంకను, తలపైన వంకరటింకర వయారాల జలవనితను పెట్టుకున్న వల్లకాటి ఆ సామి కేమన్నా తెలుస్తుందేమో మరి ! ఎందుకొచ్చిన కొకివికి వూహలతో సతమత మౌతావుగాని కోమలీ ! నన్ను గ్రహించు, నన్ను ను గ్రహించు" అని సుందర మందహాసంతో దశకంధరు డన్నాడు.

పుష్పకంలో నిద్రిస్తున్న నాకు ఉషఃకాంతుల ఉద్దీపనతో మెలకువ వచ్చింది. మున్ముందుగా నువ్వే నా స్మృతికి వచ్చావు. నా గుండె నిండా నిండిన నీ రూపును అల్లానే భద్రపరచిన వెనువెంటనే దర్శనార్థినై వచ్చాను. ఇచ్చిన గడువు పన్నెండు మాసాల్లో పదినెలలు నీ అధర స్పందనకై ఎదురు చూసి నిరాశ చెందాను. ఇంకా రెండే రెండు నెలలు వ్యవధి! శరీరం విరహ తాపంతో దహించుకు పోతోంది. ఓ ఘన శ్రావణాంబుద నీలకుచిరా! వాయువు తోడై తే సముద్రుడు ఎంత మిడిసిపడతాడు? వార్ధి ఎంత అల్ల కల్లోలంగా వుంటుంది? నా హృదయం అనే సముద్రం గూడా ప్రస్తుతం అలాగే వుంది. వాళ్ళిద్దరికీ లోకువై పోయాను. నీకు బానిసనే అయాను. నా చుట్టూవున్న ఈ దేవతా స్త్రీలు, సుందర రాక్షసాంగనలు నిన్ను వాదాన్నిగా చేసుకున్నా ఏమీ అనుకోరు. నా కృప వుంటే చాలు వారికి. నాకు నీ కృప వుంటే చాలు. ఇందుముఖీ! ఒక్కమాట చెబుతా విను. నువ్వు మిగిలిన రెండు మాసాలూ గూడా ఇలాగే మౌనం దాల్చి, నా వలపును వమ్ముచేశావంటే నేను బ్రతుకలేను, బ్రతికేది లేదు. ఇది ముమ్మాటికీ సత్యం. నీకు బ్రహ్మహత్యా దోషం అంటక తప్పదు" అన్నాడు. రావణుడు ఇంకోరకమైన ప్రయత్నంతో-

## ప్రలోభ ప్రయత్నం

"నీ చెలిమి ఫలంగా నీ తండ్రి ఇంటిని బంగారంతో నింపుతాను. అందరి రాజులను సామంతులను చేసి, నీ తండ్రిని సార్వభౌమునిగా చేస్తాను. బ్రహ్మ తత్త్వానికి ప్రధాన వారసునిగా చేస్తాను. అందరి విషయంలో గొప్ప తనం చెప్పడానికి ఉత్ప్రేక్షలు, అతిశయోక్తులు కావాలి గాని నా విషయంలో కేవలం అవన్నీ స్వభావోక్తులే! నా శక్తి సామర్థ్యాల గురించి నాకై నేను ఇంతగా చెప్పుకోకూడదుగాని ఈ గగన గ్రహ తారాచంద్రులే ప్రశంసిస్తారు. నువ్వు తర్వాత విచారిస్తావు. జరగబోయేది చెబుతా విను. కంఠం దాకా విషం గలిగి, అరచేతిలో వైకుంఠం చూపి, చిట్టచివరకు రిక్తహస్తాలు చూపే అశక్తులను ఎందుకు నమ్ముకుంటావు? నీ కోసం నా సమస్త సామ్రాజ్యలక్ష్మిని

వదులుకుని వచ్చే నన్ను నమ్ముకో ! నీ పాదసేవకు అంకితమై, నిన్ను నా హృదయ పీఠంలో వుంచి ఆరాధించుకుంటాను. నువ్వు ఏదైనా అడుగు, మరుక్షణంలో అది నీ ముందు వుంటుంది. సీత అడిగింది రావణుడు ఇవ్వలేక పోయాడు అనే మాట వుండదు. అసలు నేనా పరిస్థితిని తట్టుకోలేను. నీ పాదాల మీద శపథం చేస్తూఅంటున్న మాటలివి ఓ దయాపయోనిధీ! నన్ను దయతలుచు. నీవు భవసాగరాలను దాటించగల నావవు. నేను కంఠందాకా ఉప్పునీళ్ళలో మునిగి కుడితిలో పడ్డ ఉడుతలాగా కొట్టుకుంటున్న సంసార బద్ధుడను. కాస్త నీ చేయూత అనే తెడ్డుకట్ట నందించి పాణిని గ్రహించి నన్ను ఒడ్డుకు చేర్చు" అన్నాడు.

రావణుని మాటలకు సీత కనీసం తలకూడా పైకి ఎత్తలేదు. ఆ మాటల లోని యథార్థం సీతకు ఎంతవరకు గోచరించిందో తెలియదుకాని, ప్రక్కన నిలబడి రావణుని ముఖం వంకే తదేకంగా నిశితంగా చూస్తూ వున్న అతని భార్యలకు మాత్రం అతని మాటలన్నీ చాటువులుగా అనిపించాయి. అప్పుడు రావణుడు మళ్ళీ—

ముగ్ధ మనోహరంగా ముఖానికి మరింత సోయగాన్ని ఒలికించి మురి పించే ముంగురుల చిరు తరంగాలతో విహరించవే శివమూర్తీ ! పునుగు, జవ్వాది, కర్పూరపు సుగంధ పరిమళాలతో తళుకులు చిందే జరీ అంచుల పట్టుచీరతో, మంజుల మంజీర అరుణారుణ చరణాలతో నా దెసగా విహరించి తరింపజేయవే!

చీలమండల లోతున వుండే చిన్న చిన్న సెలయేళ్ళలో దిగి పాదాల వ్రేళ్ళతో క్రింద వుండే చిన్న చిన్న గులకరాళ్ళను గిలకరిస్తూ, కట్టిన చీర పైకి పట్టి, చెట్టా పట్టాలుగా చరిద్దాము, తరిద్దాము నా మాట మన్నించి, రా!

కోకిల కూస్తే నువ్వు గొంతెత్తి పిలిచినట్లు; నెమలిపింఛం విప్పితే- నీ వేణీబంధం విడివడి, నీ శుభమైన వీపు నంతనూ అలంకరించి, స్పృశించినట్టు, మబ్బుల నేపథ్యంలో నీ ముఖ చంద్రుడు దోబూచులాడుతున్నట్టు కేళీ శైలములపై విహరిస్తూన్నట్లు, నా మనస్సును కవ్విస్తున్నావు.

సెలయేఱు వంటి యవ్వనాన్ని- దాని పొంగు- హంగు, ఉద్వేగము- ఉల్లాసము అంతరించి పోకముందే సొమ్ము చేసుకొని మన్మథ సామ్రాజ్యంలో మహాశృంగార వీరులై చరించాలి, తరించాలి. అంతేకాని ఎందుకొచ్చిన ఈ మౌన వ్రతాలు- మూగనోములు ? ఇవి ఆత్మతృప్తినీ ఇవ్వవు- ఆనంద దాయకమూ కావు. కాబట్టి నామాట మన్నించి నన్ను తరింపచెయ్యి" అన్నాడు.

# రావణుని తృణీకరించిన సీత

జానకి మౌనంలో మార్పులేదు. సరిగదా- దించిన తల ఎత్తలేదు. అసలు రావణుని మాటలు విన్నదా- లేదా? అనే అనుమానం గూడా చుట్టూ వున్న రావణుని భార్యలకు కలిగింది. "ఏం? మహారాజు అంతలా మనస్సువడి మాట్లాడితే కనీసం పెదవి విప్పవేం" అని సీతను అడిగారు. అప్పుడు సీత ఒక గడ్డి పరకను అడ్డంగా వుంచి-

"ఓ గడ్డి పరకా! నీకైనా బుద్ధి సక్రమంగా వుంది అనుకుంటున్నాను. రఘురాముని ఆజ్ఞాను వర్తిగా మసలుకొనే సాధుప్రవర్తన నీకుంది. దుష్టత్వము దురభ్యాసము, రెండూ నీకు లేవు. అన్ని జంతువులకు ఆహార రూపంలో పరులకు ఉపకరిస్తున్నావు.

హితబోధ అనే వర్షం లేక, దుర్జనత్వమనే వేసవికి ఎండి సూదిలాగా తయారై గ్రుచ్చుకునేట్లుగా తయారవకు. నువ్వు ప్రస్తుతం శిశిర మృదుత్వం చెల్లవలసిన అశోకచ్ఛాయలో వున్నావని గుర్తించుకో! ఆహా నాకు మనోజ్ఞమైన ఆకుపచ్చని ఆకృతి, నిగనిగలాడే నవ్యత్వం, ఖడ్గపుటంచు వంటి సునిశిత పరాక్రమం వున్నదని మాత్రం గర్వించకు. గర్వంతో అహంకారపడితే అంత కంటె నవ్వులపాలయే విషయం, అవివేకం మరొకటి వుండదు. అయితే నువ్వొక మాట చెప్పవచ్చు, జీవసృష్టికి ఆదిలో నువ్వుండవచ్చు. సమస్త పశుపోషణకు కావలసిన పచ్చని సంపద నీకుండడం లక్ష్మీప్రదమే ! కాని, పచ్చగా పైకి కనబడే నీ సంపద అంతా ఏ హరిణమో వచ్చి తిననంత వరకే!

'ఇక్కడ ఆసురీ గుణసంపన్ను లున్నారు. లేళ్ళు రావడానికి భయపడతాయి' అని ఉన్మత్తతో ప్రగల్భాలు పలకడం అవివేకమౌతుందని గుర్తుంచుకో!

"ఇనకులేశ్వరుణ్ణే మోసం చేసి, భూజాతనే తీగుకువచ్చి నా వశం చేసుకున్నాను. ఇంక ఆ అసమర్థుడైన ఇనకులేశుడు ఏం చెయ్యగలడు?" అని నువ్వనుకున్నా ఎవరూ కాదనలేరు- పోనీ ! అలాగే అనుకో ! అనుకున్నా అనుకోకపోయినా నువ్వు తృణమే నని మాత్రం గుర్తుంచుకో !

సీత అన్యాప దేశాలకు రావణునికి కోపం వచ్చింది. తీక్ష్ణ రాక్షసత్వంతో ఒక్క వికృత హాసం చేసి పాదంతో ధరిత్రిని ఒకసారిగా దట్టించి–

"నేను గడ్డి పరక అయితే నువ్వు సీతాకోక చిలుకవై ఏటవాలుగావచ్చి నా బాహు పంజరంలోనికి చేరవే పంజర శుకా!" అని విజృంభించాడు. మైథిలి విస్తారిత నేత్రం బిత్తరపోతుంటే వెనకగాను; ప్రక్కగాను వున్న రావణుని భార్యలు కనుసైగలు చేసుకుంటూ భయం లేదని ఓదార్చారు. అప్పుడు సీత కొంత సేదదీరి–

"రాక్షసుడా ! మీదిమీదికి వచ్చి బూడిదై పోగవక మునుపే నేను చెప్పే మాటలు విను. ఎక్కడికి అలా వస్తావు? నే నెవ్వరనను కుంటున్నావు? రఘువంశపు కోడలిని. బిక్కమొగంతో దిక్కులేకుండా ఒంటరిగా వున్నానని అనుకుంటున్నా వేమో ! నేను పతివ్రతను. శాప సమర్థురాలను జాగ్రత్త ! ఆ రఘురాముడు ఇక్కడకు వచ్చి నిశిత శస్త్రాలతో నీ గుండెను గ్రుచ్చి నెత్తురు వరదలై పారేట్లుగా చేస్తాడు. నీ రాజ్యలక్ష్మికి సంజెవన్నెలతో స్వస్తి చెబుతాడు. అంతవరకు శాపం ఇవ్వకుండా ఓర్పు వహిస్తున్నానని తెలుసుకో! ఇవి నా పతికీర్తి పతాకంమీద ప్రమాణంచేసి చెప్పే మాటలని గుర్తించుకో!!" అంది.

## దశకంఠుని స్పందన

అప్పుడెందుకనో దశకంఠుడు కాస్త వెనక్కి తగ్గి పంటిబిగువుతో వెకిలిగా వెక్కిరింత నవ్వులు నవ్వుతూ–

"నిన్ను ఎప్పుడో చంపి వుండేవాణ్ణి. ఏదోలే అబల గదా, ఎప్పుడో ఒకప్పటికి కొంతకు కాకపోతే కొంతకైనా లొంగక పోతుందా అని ఊరుకుని వదిలిపెట్టాను. నీ భర్త ఒక బైరాగి. అంతకుమించిన బైరాగిదానివి నువ్వు. ఎవరు ఏదైనా నువ్వు నన్ను గ్రహించక తప్పదు. నాముందు ఆ బైరాగిని పొగుడుతా వేమిట్? వాడెంత నాముందు ? అయినా ఈ బిగువు ఎన్నాళ్ళు వహిస్తావో చూస్తాను. నా అంతఃపురంలోని పూలసెజ్జమీద నా అధీనురాలవై పవ్వళించక తప్పదు. అనవసరంగా హెచ్చులు పోయి తియ్యని పరువాన్ని వ్రయ్యలు చేసుకోకు" అన్నాడు. రావణుని ఆసురీ పరిహాస వాక్యాలకు సీత వ్యాకులపడి, రామదర్శన నిరాశవల్ల కొద్దిగా ధైర్యం సడలి–

# సీత నిబ్బరం

నేను పైకి కనబడే సామాన్య స్త్రీని కాదు. సాక్షాత్తు సూర్యభగవానుని వంశానికి చెందిన కోడలిని. అనవసరంగా నన్ను అనరాని మాటలు అనవద్దు. నేను వినలేను. నువ్వేలాగూ నన్ను చంపుదా మనుకున్నావు. నీ చేతిలో ఖడ్గం వుంది. నా మెడ నాకు గడ్డిపోచ. ఆలస్యం దేనికి? ఇంక నన్ను చంపు. నువ్వు ఎంత ముల్లోకవాసులను ముప్పతిప్పలు పెట్టిన పరాక్రమం గలవాడివైనా చంద్రుడికీ- వెన్నెలకు ఎడబాటు కలిగించ గలవాడవు కాదుగా? ఆ చంద్రుడే నా రాముడు- నేను ఆచంద్రుని వెన్నెలను, రాముడు పాలవృక్షం- నేను లతను, రాముడు వీణ- నేను తీగను, రాముడు నీలమేఘుడు- నేను బాల మెఱుపును, రాముడు సూర్యుడు- నేను వెలుగును; రాముడు కుమ్మరివాడైతే- నేను అతని చేతిలో మెత్తని మట్టిని, అతను చివురాకు- నేను దాని నిగనిగ, రాముడు దేవుడు- నేను భక్తురాలిని, ఆయన జలం- నేనుప్రవాహం, రాముడు ఆకాశమైతే- నేను మృదుగీతాన్ని, రాముడు ఇంద్రుడైతే- నేను హవిస్సును, వేదం రాముడైతే– నేను స్వరాన్ని. మా ఇద్దరి మధ్య ఎప్పుడూ యోగ సుస్థిరతే గాని వియోగ దుస్థితిలేదు" అన్నది.

రావణుడు సీత మాటలు వినడంతోనే ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేటట్లు వికటాట్టహాసం చేశాడు. దిగ్భిత్తికలూడి సౌధమూల స్తంభం

తూలింది. వికటాట్టహాసం సౌధమంతా ప్రతిధ్వనించింది. అశోకవనమంతా పదినోళ్ళతో అరిచే శోకవనం అయింది. అంతవరకు కలకలారావాలు చేసే పక్షులన్నీ దిగ్భ్రాంతిపడి మౌనమయాయి. సమాధిలో వున్న ఆంజనేయుని మనః ప్రవృత్తి చెదిరింది. త్రివిక్రమునిలా విక్రమించి అమితపరాక్రమముతో పిడుగులాగా రావణుని శిరస్సుపైకి లంఘిద్దామనుకున్నాడు. పైనున్న ఇంద్రుడు ఆ ఆంజనేయుని తేజస్సునుచూచి—

"మంగళ రూపా! మరణాంధ కారార్కా! మర్కటా! పంచవక్త్రా! సర్వాంగద కంఠహార! హనుమంత! ఆంజనేయా! ప్రసన్నాంజనేయా! ప్రభా దివ్యకాయా! ప్రకీర్తిప్రదాయా! సింహాననా! వైనతేయా! రామ కార్యదక్షా! జయోస్తూ! విజయోస్తూ" అంటూ స్తుతించాడు.

హనుమకు స్వస్వరూప జ్ఞానం కలిగింది. రామకార్యానుకూల కాలాభిలాషియై రావణుడు ఏం చేస్తాడో చూద్దామని మౌనంగా ప్రతీక్షిస్తున్నాడు. అప్పుడు ఆ రావణుడు సీతముందు నిలిచి సీత అన్నమాటలకు ప్రతిగా—

## రావణుని దర్పవచనాలు

నేను నీ చంద్రుణ్ణి పొడిచేస్తాను, సాలవృక్షాన్ని నఱికేస్తాను, వీణను విరిచేస్తాను, మేఘాన్ని చెల్లాచెదురు చేస్తాను, జలాన్ని ఇంకించేస్తాను, ఆకాశాన్ని సంకోచింప చేస్తాను, ఇంద్రుణ్ణి ఇదివరకే గడ్డి కఱపించాను, ఆ దైవాన్ని నేనే, ఆ వేదసంతతి నేనే అని తెలుసుకో!"

"ఇరవై చేతులలో ఈ భూమినే పట్టగలవాణ్ణి. ఇంకా మీకు యోగ సుస్థిరత ఏమిటి? నువ్వు సాలవృక్షాదులతో పోల్చిన ఆ వెఱ్ఱిబాగులవాడు అరణ్యాల్లోని పులికో, సింహానికో, కాలసర్పం కాటుకో గురియై ఎప్పుడో పంచ ప్రాణాలను వదిలి వుంటాడు. నీ దయనీయమైన పరిస్థితి నాకళ్ళకు కనబడుతోందిలే! రాముడు దేవుడో, దయ్యమో ఆ మాటలెందుగ్గాని ప్రస్తుతం చెయ్యవలసింది ఆలోచిద్దాం! దేశకాల దేహ పరిస్థితులన్నీ అనుకూలంగా వున్నాయి. అనుకూల పరిస్థితుల్ని సద్వినియోగ పరచుకోవడమే యోగము. ఈ అవకాశాన్ని వృథాచేయకు, చేయనీయకు అన్నాడు.

పరాయి వాడి భార్యముందు అలా పచ్చిగా మాట్లాడే కర్కశరక్కసుణ్ణి అసహ్యించుకొని, సీత–

## సీత హితబోధ

ఈ నీ మాటలతో ముల్లోకాలను గెలిచాసన్న నీ ప్రభ ఏమిటో, ఎలాంటిదో అర్థమైంది. సరస వచన సౌకుమార్యం గల నా రామచంద్రునికి నీవు పగవాడుగా గూడా పనికిరాని స్థితిలో వున్నావు. బ్రహ్మలోకం వెళ్ళానంటావు. వాగ్దేవత తీసివేసిన కాలిగోరులాంటి నీవు- నీకంపు మాటల నోటితో ఆ బ్రహ్మ లోకంలో ఎలా తిరిగావో, ఎలా మెలిగావో అర్థం కావటం లేదు.

పూర్వజన్మ సంస్కారం వల్ల, పుణ్య కార్యఫలం వల్ల మనిషికి మంచి రోజులు వస్తాయి. అటువంటి పుణ్యదినాలు నీకు వచ్చి ఆ పరమ పురుషుని అనుగ్రహం కలగాలని కోరుకుంటున్నాను. ఇంతకు పూర్వంగూడా మహర్షుల ఆదేశానుసారము జనస్థానంలో పదునాలుగువేల రాక్షసులను సంహరించి గూడా వాళ్ళందరకూ ఉత్తమగతులను ప్రసాదించాడు. అలాంటి పరాత్పరుడు నిన్ను తప్పక అనుగ్రహిస్తాడు. నువ్వు ఆ రఘువీరుని దగ్గఱకు వెళ్ళి "లోక మాత భూజాత సీత ఇదిగో, నీ భృత్యునిగా నన్ను అనుగ్రహించు" అని ఆయన పాదాల మీదపడి అర్థించు. నిన్ను తప్పక అనుగ్రహించి సద్గతిని కలుగజేస్తాను.

పాంచభౌతిక శరీరంతో వున్నన్నాళ్ళూ పురుషుడు ప్రతాపంతో పేట్రేగిపోయి తనకు తిరుగు లేదనుకుంటూ, అడ్డమైన పనులు చేస్తూ స్వర్గ లోకంలో ఆనందిస్తున్నా ననుకుంటాడు. మరణం ఆసన్నమవంగానే దేహం విడిచి జీవుడుగా మిగిలి అంతవరకూ తాను చేసిన పనుల తాలూకు దుష్ఫలి తాలను యాతనామయ శరీరంతో అనుభవిస్తాడు.

ఇంతవరకూ గడుసుతనంగా నీ పది తలకాయలను వాడి అయిన కత్తితో కోసి ఆదిదంపతుల అంఘ్రులకు అర్పిస్తూ వస్తున్నావు. నీ భక్తివల్ల అవి మాటిమాటికి తిరిగి మొలుస్తూ వస్తూనే వున్నాయి. కాని, నేడు నువ్వు

నా మాటను వినకపోతే ఆ రఘురాముడు నీ పది తలలు తిరిగి రాకుండా నరుకుతాడని గుర్తుంచుకో!

నీ మేలు కోరి చెప్తున్నాను; నన్ను శ్రీరామునికి అప్పగించు. ఇదివరకు చాలాసార్లు చెప్పాను, రామబాణం గురించి నువ్వు పట్టించుకోలేదు. ఒక సంగతి చెబుతా విను. నువ్వుచేసిన పాపం ఎంతపండిందో దానికి తగ్గ ప్రతి ఫలం వుంటుంది. ఒక్క బాణంవేసి నిన్నొక్కణ్ణీ చంపి వూరుకుంటాడను కుంటున్నావేమో ! అల్లా జరగదు. నువ్వుచేసే పాపపుణ్యాలకు నీ వంశం యావత్తూనూ అంకురం లేకుండా అంతం చేస్తాడు సుమా ! ఈ సంగతి నీకు చెప్పివుంటే బావుండేది అని తర్వాత ఎవరూ అనుకోకుండా నేను జాగ్రత్త పడదామని నిన్ను హెచ్చరిస్తున్నాను. నీతోపాటు నీవారి నందరినీ అనవస రంగా చంపుకోక!" అన్నది. సీత మాటలకు రావణుడు రోషకషాయతనేత్రుడై వికృతహాసం చేసి—

## రావణుని మరో ప్రయత్నం

"నీ మొగుడు అంత గొప్పవాడా ఏమిటి ? ఇంద్రుని కంటె అధికు డంటావ్! బ్రహ్మను పుట్టించినావాడేనంటావ్! శివుణ్ణి తలదన్నిన వాడంటావ్! అల్లాంటివాణ్ణి చితిలో కీలుబొమ్మలాగా ఆడించే నువ్వు అంతకంటే గొప్ప దానివి- అంతేనా? అడవిలో తన భార్యను ఎవరైనా ఎత్తుకుపోతే- వాడు నీ మొగుడు కాని వాడైతే- కాసేపు ఏడ్చి వూరుకుంటాడు కాని నీమొగుడు అలా చేయడు- నిన్ను వెతుక్కుంటూ వస్తాడు- అంతేనా ? అంటే నువ్వు వాణ్ణి అంతలా వల్లో వేసుకున్నావన్నమాట! నువ్వు చెప్పింది, కోరింది కాదనడు వాడు. అంతేగదా నువ్వు చెప్పేది" అని నర్మగర్భంగా ఆక్షేపణా భావంతో, అని మళ్ళీ వ్యంగ్యంగా—

"నేను నిన్ను ఆశ్రయించుకుని ఉన్నాను గదా! నా మీదకు వాణ్ని రాకుండా చెయ్యరాదూ? ఈ కాస్త పని చేసిపెట్టు. నన్ను నువ్వు వరించా వనుకో! వాడు నా మీదకు రాడుగా? నన్ను నువ్వు వరించ లేదనుకో వాడు వచ్చి నన్ను చంపేస్తాడు బాబోయ్! అల్లాఅయితే ఎల్లాగా ? నాకింక దిక్కెవరు నువ్వుతప్ప! ఈసారికి నా తప్పుకాయి.

"నువ్వు వాణ్ణి గురించి నింగినేల పట్టడని వాపోతుంటే నాకెందుకింక భయం. నిన్ను పంపి నాప్రాణాలు కాపాడమని బ్రతిమాలుకోనా? ఓసి తెలివి తక్కువదానా! నిన్ను హరించి, వరించి, ఇక్కడకు తీసుకువచ్చిన క్షణంలోనే నీ పరమపురుషుడు నిర్జీవుడు. నిర్గుణుడు అయాడని తెలుసుకో వెర్రిదానా! వాడసలు బ్రతికే లేడు. ఉన్నా వాడొక యంబ్రహ్మ. వాడేమి చేస్తాడో చూస్తాను" అంటూ పళ్ళు పటపట కొరికి-ఉండు ముందు నీసంగతి తేలుస్తాను చూడు అని- ఒక్కసారి చేతులు చరచాడు అంతే ! వెంటనే బిలబిల మంటూ వివిధ రూపాలలో వికృతాకార రాక్షసాంగనలు వచ్చారు. వారిలో ఒంటికంటి వారు, ఒంటి చెవివారు, అవు చెవులవారు, ఏనుగు చెవులవారు, అసలు చెవులే లేనివారు, నాలుక లేనివారు, ముక్కు లేనివారు, వ్రేలాడే నాలుకల వాళ్లు, సింహముఖాలవాళ్లు, పందిముఖాలవాళ్లు, ఏనుగుకాళ్లవాళ్లు వున్నారు. వాళ్ళని ఉద్దేశించి రావణుడు-

"ఈ రెండు నెలల్లో దీని బ్రతుకు ఒక దారికి వచ్చిందా వచ్చింది. మొరాయించి దాకపోతే- ఇంక ఏమాత్రం ఆలోచించకుండా, సంకోచించ కుండా దీని దేహాన్ని ఖండఖండాలుగా కోసి మిరియాల పొడి, లవంగాలు, దాల్చినచెక్క, కరివేపాకు, చల్ల మిరియాలు, జాపత్రి, జాజికాయ పొడి, ఉప్పు, కారాలు- నూరి వేయించిన దీని మాంసంముక్కల మీద చల్లి నాకు ఆరగింపు చెయ్యండి" అని మండిపడ్డాడు. ప్రళయాగ్నిలాగా మండిపడుతున్న రావణుని చూసి సీత- ఉజ్జ్వలంగా రేగుతున్న అగ్నిజ్వాలల ప్రక్కనున్న అరటిచెట్టులాగా వణికిపోయింది.

## రాక్షసాంగనల పరిహాస ప్రసంగాలు

పరిస్థితి చూచిన మదనకేళీ విలాస ప్రౌఢిమ గల ఒకామె రావణునిచేతిని తన చేతిలోనికి తీసికొని హేలగా, వాలుగా ఊయలూపుతూ-

అతి సుకుమారంగా వున్న ఆ మానవరాలికై ఎందుకు ఆశ పడతావు? నీ కోర్కె బరువుకు ఆమె ఆగలేదు. చచ్చినా చావచ్చు. ఉన్నది చాలక అదోపాపం గూడా మనకు దేనికి?" అంది. ఆమె మాటల్లోని హాస్యానికి

అక్కడున్న అంగనలందరు ఒక్కసారిగా నవ్వుతూ రావణుని చుట్టూ చేరి, తలో చెయ్యి పట్టుకున్నారు. అలా అన్న ఆమె ముద్దు పేరు ధాన్యమాలిని· వాతావరణాన్ని మార్చివేయగలగడంలో ఆమె మంచిదిట్ట.

అంగనలందరూ నవ్వుతూ, త్రుళ్ళుతూ కేకలు, కేరింతలతో ఉండడం చూసి తన ఇరవై బాహువులనూ తనతో వచ్చిన ఇరవై ఇంతుల మూపుల పైన వేసి ముందుకు సాగిపోయాడు రావణుడు.

రావణుని ఆజ్ఞ మేరకు అక్కడవున్న రాక్షసాంగనలు సీతను చూస్తున్నారు. మొదటినుండీ పరాన్ముఖంగాను, పరాకుగాను వుండి ఉపవాస వ్రతంలో కృశించి భయకంపిత నేత్రాలతో వున్నప్పటికీ- సీత ముఖంలో ఒక అప్రాకృతమైన, దివ్య గంభీర శోభితమైన లక్షణం రాక్షసాంగనలకుతోచింది. అందువల్ల ఆ సీతను లఘుభావంతో చూడ్డానికి కొద్దిగా జంకుతున్నారు. అదీ గాక ఇంతకు పూర్వం రావణునితో సీత నిస్సంకోచంగా, ధైర్యంగా అన్న మాటలు విన్నమీదట భయంగూడా వేసింది. కాని రాజాజ్ఞ పాటించాలి గాబట్టి లేని ధైర్యాన్ని తెచ్చుకొని, మేకపోతు గాంభీర్యంతో ఒకామెతెగించి-

"ఏమే! దశకంఠస్వామితో అంత ధైర్యంగా పలికావు. నీ మొగుడు అంతటి సాహసవంతుడా? అయినా స్వామితో అలా మాట్లాడటం నీకుతగునా? బ్రహ్మగూడా మా ప్రభువుకు గౌరవమిచ్చి మాట్లాడతాడు. నిన్ను చూస్తుంటే నీకు సిగ్గుగూడా లేదనిపిస్తోంది. లేకపోతే బరితెగించి ఒకపరాయి మగవానితో అందులోను ఒక త్రిలోక విజేతతో అల్లాగనే మాట్లాడేది? ఏమోనమ్మా! మా రాక్షసకులంలో మేము పతికి, ప్రభువుకు ఎదుట నిలబడటానికే జంకుతాం. సిగ్గుపడతాం. మా ప్రభువు మంచివాడు కాబట్టి సరిపోయింది కాని, నువ్వు ఆడినమాటలకు ఇంకొకరైతే ఈ పాటికి నిన్ను నిలువునా చీల్చి ముక్కలు ముక్కలు చేసి వుండేవారు."

"ఆడది అన్న తర్వాత కాస్త అణుకువ, సిగ్గు, బిడియమూ వుండాలి. మాకేవుంటే మానవులైన మీ కెంతగా వుండాలి ? మా మగవాళ్ళతో మేము ఎదురుబడి, ఎదిరించి మాట్లాడనే మాట్లాడలేము. నువ్వు చూడాస్తే బొత్తిగా హద్దూపద్దూ లేకుండా స్వామి ముందు అనరాని మాటలన్నీ అన్నావు. అయినా ఇంతకీ నిన్నని లాభం లేదులే! నీ తప్పు లేదు. నిన్ను కోసుకునైనా తినా

లన్నంత కామం నీమీద వున్న స్వామినే అనాలి. సర్వలోకాలను జయించిన స్వామి ఇంతగా పనికిరాకుండా పోయాడు నీకు, ఆయన ముందర, ఆయన వంశం ముందర నువ్వెంత? నీ బ్రతుకెంత? అన్నది.

## ఏకజట వికారపు మాటలు

ఇలా ఒక్కళ్లు ధైర్యం చేసేటప్పటికి మిగిలిన వారందరికీగూడా ధైర్యం కలిగింది. అప్పుడు 'ఏకజట' అన్న ఒక రాక్షసి—

"అబ్బో, ఈవిడగారికీ మన స్వామి ఏం పనికి వస్తాడు. ఈమెగారు ఎందుకూ పనికిరాని గడ్డి కఱచే జగన్మిథ్యావాది (జనకుడని భావన) కూతురు గదా! ఒసే జానకీ! విను. ప్రజాపతుల్లో నాల్గవవాడు మానసబ్రహ్మ. ఆయన కొడుకు పులస్త్యుడు. ఆ పులస్త్యుని కొడుకు విశ్రవసుడు. మా ప్రభువైన రావణుడు ఆయన కొడుకు. అంటే-బ్రహ్మ దగ్గఱనుండి నాల్గవతరమువాడన్న మాట! అల్లాంటి స్వామి నీ కళ్లకు ఆనటం లేదు. మీ ఆయన అడవిదారిబట్టి దిక్కుతోచక అలమటిస్తున్న బికారి. చిత్రాలన్నీ ఈ సృష్టిలోనే వున్నాయని పిస్తుంది. లేకపోతే ఏమిటి నీ మొహాని కేమన్నా ఒక అర్థం, పొంతనా వుందేమో చెప్పు. నేను కాస్తో కూస్తో చదువుకొన్నాలే! సత్త్వగుణానికి కొంత రాజసం కలిసిపుట్టేవారు క్షత్రియులు. అచ్చమైన సత్త్వగుణం బ్రాహ్మణులది. ఆ గుణం నీకెందుకు నచ్చుతుందిలే! ఉగ్గుపాలతోనే మీకు ఆ రాజసాన్ని పెంచి పోషింపచేస్తారు. అందుకే ఆ తలతిక్కతనం, పేట్రేగిపోవడం మీ ప్రకృతిలోనే వుంటాయి. సృష్టికార్యం కోసం వినియోగించుకున్నాడేమో తప్ప మా బ్రహ్మకు, మాకూ ఆ రాజసం వాస్తవానికి సహజం కాదు. కాబట్టి ఇప్పటికైనా మించిపోయింది లేదు. నేను చెబుతున్నా విను. నీ మనస్సును మార్చుకో. ఇందువల్ల నీ మర్యాదేమీపోదు. వెయ్యిరెట్లు పెరుగుతుంది" అన్నది.

## హరిజట వ్యంగ్య ప్రసంగం

ఏకజట అలా అనంగానే వెంటనే అందుకున్నట్లు పిల్లి కళ్లు కలిగిన 'హరిజట' అనే రాక్షసి—

"మాకు మర్యాద లెందుకే? మాక్కావలసింది పట్టుదల! దానికే మేము పాతివ్రత్యమని పేరు పెట్టుకున్నాం. ఆ పాతివ్రత్య మహిమతో మేము రావణుణ్ణి శపిస్తాము. ఎల్లాంటి రావణుణ్ణి శపిస్తామనుకున్నారూ ? బ్రహ్మకు నాలుగో తరమైనవాడు, సర్వ తపస్సులు చేసినవాడు, సర్వ లోకాలను గట్టిగా మూటగట్టినవాడు అయిన రావణ్ణుణ్ణి- తెలుసా?- అని కాసేపాగి- మీకు తెలుసో తెలీదో పకతి పట్టిన కుందేటికి మూడే కాళ్లట ! కావలిస్తే లెక్క పెట్టుకోండి. పదిసార్లు లెక్కపెట్టినా అంతేట! అని సీతవైపు తిరిగి- "ఏం అంతేగదా? ఏమోలే నీకు తెలిసినంత ఆ లెక్కలు మాకు తెలుసునా పాడా ? ఇంతకీ ఆ రాక్షసనాథుడు ఈమె యందు ప్రేమగలిగినవాడు- ఇంక ఈమె ఏది అంటే చెల్లదు? ఎప్పటికైనా తనమీద ప్రేమ పుట్టకపోతుందా అని ఏమీ చెయ్యకుండా వూరుకుంటున్నాడు స్వామి. అది అలుసై తన నోటికి వచ్చిందల్లా వాగుతోంది ఈమెగారు" అన్నది. అప్పుడు పొడవైన నాలుక, కఠోరమైన కళ్లు కలిగిన "వికట" అనే రాక్షసి శూలం చేత్తో పుచ్చుకుని తాండవం చేస్తూ —

"పది నెలలబట్టి రాని మగాడు రెండు నెలల్లో వస్తాడు. అదిగో చూడండి! ఓడమీద వస్తున్నట్లున్నాడు!! అదిగో తెరచాప మీకు కనబడడం లేదా?"– అని తన నాలుకను తెరచాపలా చాపింది– అందరూ పకాలున నవ్వారు. వాళ్ళల్లో ఒకామె–

"ఓసీ! అబద్ధాలాడతావు దేనికే ? ఒకప్రక్క యముని ముఖం నావ అయితే- నీ నాలుక తెరచాప అంటావేమిటి? నీకా అదృష్టం దక్కాలంటే స్వామి దయ వుండాలి" అన్నది.

## సీత పుటుకకు క్రొత్త భాష్యం

అప్పుడు 'ప్రఘస' అనే రాక్షసి– బతికినప్పుడూ స్వామికి కాంతవై సుఖపెట్టినట్లు లేదు. శుష్క ఉపవాసాలతో కృశించి ఎండిపోయిన తర్వాత నీ ఎండిన మాంసం తిన్నా సుఖం ఉండదు మాకు. బ్రతికిన రోజుల్లోనూ సుఖపడ్డది, సుఖపెట్టింది లేదు. పోయినా రేపు నువ్వు సుఖపడేది, మమ్మల్ని సుఖపెట్టేదిలేదు. ఏం జన్మే నీది?–

పుట్టినప్పుడే శివధనుస్సును ఎక్కుపెట్ట గలవాణ్ని తేవడానికై తండ్రిని దుఃఖపెట్టావు. శివధనుస్సును విరగ్గొట్టించి, పరశురాముణ్ణి దుఃఖపెట్టావు. వంకజాళివై మహారణ్యాల్లో తాళి కట్టిన వానినే దుఃఖాల పాలు జేశావు. నిన్ను చూస్తేనే తలమునకలైన వలపులూరే రాక్షసరాజుకే దుఃఖం తెచ్చి పెడుతున్నావు. ఇంక మా మాట చెప్పాల్సిందేముంది? రేపు నీ ఎండిన మాంసం ఒరుగులు తినిపించి దుఃఖింప చేస్తావు. నీలో మార్పు రాకపోతే, మా రాజు చేతే మాకు దుఃఖాన్ని కలుగజేస్తావు. నీలాంటి వాళ్ళు ఈ మూడు లోకాల లోను ఎక్కడా వుండరు. అంతా 'మాయ' వ్యవహారంగా వుంది నీతో. సుఖాన్ని చూపిస్తున్నట్లే వుంటావు, దుఃఖింపజేస్తావు. నువ్వు ఎవత్తెవోగాని మా తల్లీ! మా దాపుకు దయచేశావు. లక్ష్మివి. జగదంబవి. నువ్వు ఎక్కడ చేరితే అక్కడ దిబ్బ వేసుకుపోతావు. తెలియక నిన్నెవరన్నా కావాలని కోరుకుంటే వాడి ప్రాణాలమీదికి తెచ్చిపెడతావు గదే! ఓసీ! సీతా! ఇందు వదనా! కుందరదనా! గగన జఘనా! స్త్రీరూప ప్రళయ గరళమా! మా తల్లీ! నీకు పుణ్యం వుంటుంది. మా స్వామిని ఒక్కనిమిషమన్నా సుఖపడనీయవే!" అన్నది అప్పుడు చింతనిప్పుల కళ్లు, మొసలికోరలు, మొండిచెయ్యి, గార్దభ ముఖం కలిగి వంటినిండా ఎలుగుబంటి లాగా రోమాలు ఉన్న 'దుర్ముఖి' అనే రాక్షసి, ఉన్న ఒక చేతిలోని ఖడ్గం తిప్పుతూ—

## దుర్ముఖి దుర్భాషలు

"సిగ్గు లేకపోతేసరి! దీన్ని బ్రతిమాలుతున్నట్లు పలకరిస్తారేం మీరు! మన దొర శౌర్య పరాక్రమాలను ఇది పురుగులాగా తీసివేస్తుంటే- ఇంకా సిగ్గు లేక దీంతో తర్కానికి దిగడమెందుకు? ఈ ఖడ్గంతో నరికేస్తాను. పైనున్న దేవేంద్రుడు నన్ను చంపుతాడంటారా? చంపనీయండి చూద్దాం! అధమాధముడైన వాడెవడో ఇక్కడకు వస్తాడట! వాడు రాకముందే ఈ తులువను తుత్తునియలు చేస్తాను. వాడొచ్చి ఒక్క ఏడుపు ఏడ్చి చక్కాపోతాడు. పీడ వదుల్తుంది. తనకు మేలు ఏదో అది తెలియదు మన రాజుకు. నిజానికి ఇలాంటి మగువ మన లంకలో వుండకూడదు. దీని ఏడుపు అందరికీ తగిలి తీరుతుంది- 'నీ చావు నువ్వు చావు' అని సముద్రపు అలలకు అవలగా విసిరి వెయ్యాలి. ఊహుఁ! అల్లా వేస్తే ఎల్లాగో అల్లా మళ్లీ వచ్చినా రావచ్చు.

ఏడుపుగొట్టుదాన్ని ఇక్కడ వుంచడం లంకకే ఛిద్రం. దీన్ని చంపివెయ్యడమే మంచిది" అని కత్తి ఎత్తి పరవళ్ళు త్రొక్కుతూ సీతను నరకబోతున్నట్లుగా నటిస్తున్న ఆ దుర్ముఖిని తక్కిన రాక్షస స్త్రీలు బలవంతాన ఆపారు. ఆమె సీతను మ్రింగబోతున్నట్లుగాచూస్తూ, బుసలుకొడుతూ చివరకు ఎలాగో ఆగింది. వాళ్ళు ఆమెను శాంతింపచేశారు. ఆమెను అలా వదిలి సీతను చూసి —

"అంత కోపం దానికి వచ్చిందంటే తప్పులేదు కదా ! నీకు ముందే మేము చిలక్కిచెప్పినట్లు చెప్పామా లేదా? నువ్వా మాటలు పట్టించుకుంటేనా? ఏదో నోములు పట్టి, వ్రతాలు చేసి స్వర్గానికి పోవాలనుకుంటారు మీ మానవులు. కాని సశరీరంగా పోలేరు గదా మీరు. కాని, రావణుని నువ్వు పొందావంటే నువ్వు బొందితోటే స్వర్గానికి వెళ్లవచ్చు తెలుసా?" అనంగానే సీత –

## సడలని సీత నిర్ణయం

"ఆమె చంపుతుందనీ కాదు. స్వర్గం చూడాలనీ కాదు. నన్ను మీరు ఇప్పుడే చంపితే చంపండి. లేదా రెండు నెలల తర్వాతే చంపండి. లేదా, కత్తితో నన్ను కోసుకు తింటే తినండి. నాకొచ్చిన భయం మీవల్ల కానేకాదు. నామూలంగా నాస్వామి రఘురామునికి బాధ వచ్చిందే అన్నదే నా ఆవేదన."

"తన చల్లని కిరణాలను నలుదెసలకు పంపంపలేని జాబిల్లిలాగ, తన నీటి ధారలతో భూదేవిని తడపలేని మేఘునిలాగా, తన అందమైన నడకలతో సరోవరానికి అందాన్ని చేకూర్చలేని రాజహంసలాగా నా రఘుకుల స్వామి అడవుల్లో తిరుగుతూ అలసిపోతున్నాడు, ఆవేదన చెందుతున్నాడు. అతణ్ణి వదలలేక నేను వనాలకు వచ్చాను. నన్ను వదలలేక అతను నన్ను వనాలకు తీసుకు వచ్చాడు. చివర కిప్పుడు ఇద్దరం తలోచోట వనాల్లోనే వున్నాము" అని నిట్టూర్చింది. ఆ స్థితిలో సీతను చూసి రాక్షసాంగనలు-"ఈమె ఎన్నటికీ రావణుణ్ణి పొందద"ని నిర్ధారణ చేసుకున్నారు. అప్పుడు జానకి మళ్లీ –

"నేను సువర్చస్సును- రాముడు సూర్యుడు; నేను శచీదేవిని, ఆయన అమరేంద్రుడు; నేను అరుంధతిని, ఆయన వశిష్ఠుడు; నేను రోహిణిని, ఆయన

చంద్రుడు; నేను లోపాముద్రను, ఆయన అగస్త్యుడు; నేను సుకన్యను,అతడు చ్యవనుడు- ఇలా అటు అంతరిక్షంలోనూ ఇటు అవనిలోను సహచర్యం పరచుకుంటూ తిరుగుతూ వుండే దేహదేహాంతరవాసిని నేను. మీకు ఇవన్నీ తెలియవు. మీకు ఎలాగూ కొంత చెప్పాను గాబట్టి శ్రద్ధగా వినండి. మీకు ఇంకో విషయం గూడా చెబుతాను-

"నేను పూర్వం సావిత్రినై యమునికి ధర్మసూక్ష్మాలు చెప్పాను; శ్రీమతినై కపిలునికి నా తత్త్వాన్ని విపులీకరించాను. దమయంతినిగా నలుడికి శివభక్తి ఫలాన్నిచ్చాను. ఇప్పుడు సీతగా ఇంతవరకూ వస్తూ వున్న పాతి వ్రత్యానికి పరమ ప్రమాణంగా జీవనాన్ని కొనసాగిస్తున్నాను" అన్నది. సీత మాటలు అసురాంగనలకు అర్థం కాలేదు. పిచ్చి పట్టి ఏదో అర్థంపర్థం లేని మాటలు మాట్లాడుతోందనుకొని-

"సీతా, నువ్వలా చెప్పుతుంటే మాకూ ఒక్క విషయం నీకు చెప్పాలని పిస్తోంది. మా దానవరాజ్య మహారాజ్ఞిగా మండోదరి, ప్రేమరాజ్య చంద్రో దయాన్ని చేకూర్చటానికి నువ్వూ మా ప్రభువైన రావణునికి ఈ ఉర్విలో జన్మించారు" అన్నారు. సీత వాళ్ళకీ విషయాలు చెప్పినా ప్రయోజనంలేదని భావించి, కన్నీరు కారుస్తూ శింశపా వృక్షం బోదెలో దాని మ్రానుకు ఆనుకుని నిల్చుంది. ప్రక్కనున్న రక్కసి వనితలు ఒక్కసారిగా ఆమె చుట్టూ జేరి-

## మగువల మరో ప్రయత్నం

"నువ్వు మా మండోదరీదేవిని చూడలేదు. ఆవిడ గూడా నీ అంత అందగత్తే తెలుసా ! లఘువైన నడుము, ఘనమైన వక్షం, ముచ్చటైన ముక్కు కలిగినది. ఈ సమస్త దానవ సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన మా ప్రభువుకు ఇష్టమైన పట్టపురాణి. నీవుగూడా వెన్నెల నవ్వుల చక్కనిచుక్కవు. మా మండోదరీదేవి గూడా అచ్చు నువ్వు ఇప్పుడు నుంచున్నట్లుగానే నుంచుంటుంది. ఇదంతా చూస్తే మా దానవేంద్రుని కోసమే మీ ఇద్దరినీ ఆ బ్రహ్మ సృష్టించాడేమో అనిపిస్తోంది! నీకు ఒక మంచి మాట చెబుతావిను. నువ్వు కనక ఇలా నిద్రాహారాలు మాని బక్కచిక్కిపోతే- నీ భర్త వచ్చి పుడకలాగా వుండే నిన్ను చూసి, ఏవగించుకొని. నిన్ను విడిచి చక్కాపోతాడు.

అందుకని నే చెప్పినట్లు విని, ఆ మగడు వచ్చేసరికి ముద్దులు మూటకట్టే శరీరాకృతిలో వుండు. అతడు మెచ్చుకుని హత్తుకుంటాడు.

"ఇంకొక్క రహస్యం గూడా చెప్తాను విను. నువ్వేదో వ్రతాలు, నోములు, పాతివ్రత్యం అంటున్నావు గదా! ఆ రాబోయేవాడుగూడా నీతోడిదే జీవితం అనుకుంటాడనుకుంటున్నావా? అదే పొరపాటు! నీకేదైనా జరక్కూడనిది జరిగితే ఇంకో బంగారాన్ని తెచ్చి కట్టుకుంటాడు. నీ వ్రతాలు, నోములు నిష్ప్రయోజనాలే అవుతాయి. మగాడు తన ఇష్టం వచ్చినట్లు తానుండవచ్చు, చేయవచ్చు. కాని మగువలే మడి కట్టుకోవలసింది. నీలాంటి వాళ్లు భూమ్మీద వున్నంతవరకూ మగవాళ్ల ఆటలు అలా సాగుతూనే ఉంటాయి. కాకపోతే ఇది న్యాయ మనిపిస్తోందా నీకు, చెప్పు ? స్త్రీ జాతికి అన్యాయం నీలాంటి స్త్రీల మూలంగానే జరుగుతోందంటాను."

"పది నెలలున్నా విక్కడ. ఇంకా కొన్ని రోజుల తర్వాత నీ పతి వస్తాడే అనుకుందాం. ఇన్ని రోజులుగా పరాయి పురుషుడి పంచనున్నావు. మరి నీ పతికి, అవసరమైతే నీ పాతివ్రత్యానికి సాక్ష్యం చెప్పేదెవరు ఇక్కడ? అందుకనే ఈవ్రతాలు నోములు పట్టినా పట్టకపోయినా ఒక్కటే అంటున్నాను" అంది. అందుకు పతివ్రతారత్నమైన సీత—

## సీత ధర్మవచనాలు

"ఏమన్నావూ ! నేను చిక్కిపోతే నా పతి నన్ను ఏవగించుకుంటాడంటావు- అంతేనా ? నీకు తెలియకపోవచ్చు. ఆ అత్రి మహర్షి భార్య అనసూయామతల్లి నా కొక వరం ఇచ్చింది. నేను నా పతికి ఎప్పుడూ ఉజ్జ్వలమైన మోహన రూపంతోనే కనబడతాను. నా కా భయం లేదు. ఇంక మిగిలిన మాటలంటావూ, అవన్నీ ధర్మసూక్ష్మాలు బద్ధమైన మనస్సుగలవారికి జీవితం అంతా పరిశుద్ధంగానే తోస్తుంది. ఆర్ష ధర్మాలకు అపార్థాలు గోచరించవు. వాళ్ళ జీవితాలు గూడా అంత శుచిగానే సాగిపోతాయి. సంకరం జరిగితేనే సంకటాలు వచ్చి సందేహాలు ఉత్పన్నమౌతాయి. దాంతో విప్లవాలు వాటిల్లి భూమ్మీద శాంతి లేకుండా పోతుంది. ఇంకొక్క మాట! 'మండోదరి-రావణుడు' జంటలాంటి దనుకోకండి ఈ 'సీతా-రాముల' జంట.

జగజ్జననీ ఆరాధనలో ఏదో కించిద్దోషం వల్ల పాపమా మండోదరి ఈ రావణునికి ఈ జన్మలో ఇలా ఒక భార్య అయింది" అన్నది.

## పేట్రేగిన పేడి

సీత మాటలలోని యథార్థాన్ని గ్రహించలేక తనని, తమ పట్టపురాణిని ఏదో అన్నదనుకొంది ఒక వికృతాకారంలో వున్న రాక్షసి. పైకి పొడుచుకు వచ్చిన కోరపన్నుతో, ముక్కు క్రింద వెంట్రుకలతో మూడో ప్రకృతికి సంబంధించిన ఒక పేడిఅది. అది వికారంగా కనబడినా అందిరికీ వినోదాన్ని కలిగిస్తూ వుండి, అంతఃపురంలో తిరుగుతూ అటు ఆడవారితోను ఇటు మగ వారితోను కూడా చనువుగా వుండేది. సీత మాటలకు దానికి కోపం వచ్చి—

"ఆ! ఏమన్నావ్ మా అమ్మగారిని? మా మండోదరి ఎవరనుకున్నావ్? మా దానవేంద్రుని భార్యే కాదు, సర్వదైత్య సామ్రాజ్యానికి పట్టపురాణి. నువ్వేమన్నావో మళ్లీ ఒక్కసారి అను- ఈ ఖడ్గంతో నీ నాలుక ముక్కలు ముక్కలుచేసి, నెత్తురు కక్కుకునేటట్లు చేసి ముల్లోకాల్లోను నా బాహుబలం గురించి చెప్పుకునేట్లుగా చేస్తాను" అన్నది. ఆ మాటలు విన్న మిగిలిన రాక్షసాంగనలు విరగబడి నవ్వుకున్నారు. అందులో ఒకామె దాన్ని దూరంగా తీసుకుపోయి—

"ఒసేయ్ ! నీకో సంగతి చెప్పనా ! ఆ సీతకు పదినెలల బట్టి నిద్రాహారాలు లేవు. అయినా ఏమీ సడలలేదు, ఒడలలేదు. మరి ఆమెఒంట్లో ఎంత బలంవుందో ఏమో! మనకు తెలియదు. ఒకవేళ ఆమె నీచేతిలోని కత్తిలాక్కుని నిన్ను చంపినా చంపవచ్చు. అపుడు రాజాజ్ఞను అనుసరించి మేము దాని మీద చెయ్యిగూడా చేసుకోలేము. నిన్ను ఆమె చంపిందని తెలిస్తే స్వామి ఆమెపై మండిపడతాడేమోగాని నీ కోసం విచారించడు. నిన్నిక్కడ వుంచింది వినోదానికిగాని ఇంకొకందుకు కాదు." అని చెప్పంగానే అది 'నిజమే!నిజమే!' అనుకుని ఊరుకుంది.

అప్పుడు— చూడ్డానికి భయం గొలిపే రూపంగల 'వినత' అనే రాక్షసి సీతతో—

## రాక్షసాంగనల ప్రబోధ వచనాలు

"అమ్మాయ్! ఇంతవరకు నీకిష్టమైనవానిమీద ఎడతెగని విశ్వాసాన్ని ప్రకటించావు. బాగానే వుంది. నాకు అందుకు సంతోషం గూడా కలిగింది. సరే! ఆ సంగతి అట్లా వుంచి ఇంక నేను చెప్పినట్లు చెయ్యి. నా సంగతి నీకు తెలియకపోవచ్చు. కోపం వస్తే నా వళ్ళు నాకు తెలియదు. నేను చెప్పింది అవతల వాళ్లు వినకుండా వుండడానికి వీల్లేదు. ఒకవేళ వినకపోతే వాళ్లని అమాంతం మింగేస్తాను. నేను చెప్పినట్లు చేశావా సరే! లేకపోతే విన్నా అలాగే చేస్తాను"

"ఇంతటి నీ అందాన్ని ఎవడో ఏబ్రాసిపాలు చేస్తావా? చూడకపోతే 'కాకి ముక్కుకు దొండపండు' అన్నట్లుంది. ఎందుకొచ్చింది గానీ మా దైత్యేశ్వరుణ్ణి వరించు. ఇప్పటికీ మించిపోయింది లేదు, నీ జన్మసార్థకమౌతుంది. ఇంతవరకు నీకు ఎంతోమంది చెప్పారు. కాని నేను చెప్పలేదు. ఇప్పుడు చెబుతున్నాను. నువ్వు వినాల్సిందే. శత్రు భయంకరుడు, త్రిలోక విజేత అయిన మా దానవేశ్వరుణ్ణి చేపట్టమంటే చేదా? నువ్వు నా మాటలు ఆదరించకపోతే నా కోపాన్ని తప్పక రుచి చూడాల్సివస్తుంది. గుర్తుంచుకో!" —అన్నది.

అప్పుడు ఆకాశంలో గమించే శత్రువులను దమించే వికట అనే మరో రాక్షసి—

"ఓ అమ్మా సీతా! వినత నీకు చాలా హితమైన మాటలు చెప్పింది. వాస్తవానికి అది ఎవ్వరితోనూ ఖండితంగా చెప్పనేచెప్పదు. ఇక చెప్పిందంటే అవతలివాళ్ళు చేసి తీరాల్సిందే! చెయ్యకపోతే వాళ్లకు మూడిందన్న మాటే! నీకో సంగతి చెబుతా విను. మా స్వామి నిన్ను ఆ మాటా ఈ మాటా చెప్పో, భయపెట్టో లొంగదీయ మన్నాడు కనకగాని, లేకపోతే ఈపాటికి నువ్వే మిటి, నీ తల్లో జేజెమ్మ వినేది."

"గోళ్లల్లో గ్రుచ్చితే నా సావిరంగా తిక్క నసాళానికి ఎక్కుతుంది. ముళ్లపై అరచెయ్యి మోపి, ఆ చేతిపై అరికాలితో నొక్కితే బ్రహ్మలోకం కనబడుతుంది. కత్తితో ముక్కలు ముక్కలుగాకోసి, ఉప్పు కారం అంటిస్తే ఆకాశం కనబడుతుంది. బట్టలు ఊడదీసి చింతబరికెలతో మోదితే చెప్పే విషయం పూర్తిగా అర్థమవుతుంది. ఎర్రగా కాల్చిన ఇనప కడ్డీతో వళ్లంతా వాతలు పెడితే వంటికి పట్టిన వాతరోగం కాస్తా వదుల్తుంది. తల తిరిగి ముద్ద నోటికి రాకపోతే ఏది చెప్పినా ఎవరైనా వింటారు ఇంతవరకు చిలక్కి చెప్పినట్లు పదిసార్లు చెప్పి, వందసార్లు మొత్తుకున్నా సుంత గూడా లాభం లేకుండా పోయింది. ఇదంతా చూడొస్తే-నీకొక్కదానికే మొగుడున్నట్లు చెప్తావేం? మాలో లక్షల మంది కామినులు ఒకడిని వీడి ఒకడిని కలుస్తూ కేళీ విలాసాలు సాగిస్తాం. అలాంటి మారాజ్యంలోకి నువ్వు అడుగుపెట్టి ఇలా కాని పరిస్థితులను సృష్టిస్తున్నావు" అన్నది.

అప్పుడు తేనె రంగు కన్నులతో, నిత్యం ఎండు చేపలు నముల్తూ వుండి, నిరంతరం చొంగ కారుతున్నా తుడుచుకోవాలన్న ధ్యాసే లేని జండోదరి అనే రక్కసి—

"త్రాగలేని పిల్లి బోర్ల పోసుకున్నట్లుంచి నీ వ్యవహారం చూస్తుంటే! నువ్వు మా మాట వినకపోతే నీకూ నా గతే పడుతుంది. పరాయివారికి గూడా నా తలవ్రాత రాకూడదనుకుంటాను. ఇంక ఇక్కడ నిన్ను హింసించే వాళ్లెలాంటి వారనుకున్నావ్? యమలోకంలోని యమ భటులచే వీళ్లకి మా దైత్యేశ్వరుడు చక్కని శిక్షణను ఇప్పించాడు కాబట్టి ఆలోచించుకో. నా మాట విను, మా ప్రభువును వరించు"— అన్నది.

అప్పుడు అజాముఖి అనే మరొక రాక్షసాంగన—

"యమ భటుల హింసలంటే నీకు ఏమీ తెలిసినట్లు లేదు... కీళ్ల కీళ్ల సందుల్లో క్రుమ్ముతారు. ఆయువుపట్లలోను, మర్మ ప్రదేశాల్లోను విచిత్రంగా హింసిస్తారు. మాడు మీద మేకులు కొడతారు. పాదాలకు, చేతులకు తాళ్ళు బిగించి కీళ్లూడిపోయేట్లు లాగుతారు. ముళ్ల చక్రానికి కట్టి అంకులరాట మాడిస్తారు" అన్నది. అప్పుడు ఇంకో రాక్షసి కల్పించుకొని—

"స్వర్గ భోగాలు తరుముకుంటూ కాళ్ళ దగ్గరకు వస్తుంటే ఉప్పొంగి పోయి భుజాలెగరేసే వాళ్ళను చూశాము గాని, ఇలా సిరి రా మోకాలొడ్డే వారిని చూడలేదు. మరి ఇలాంటి నీ ప్రేమను పొందిన ఆ నరుడు తప్పకుండా అత్యంత సుందరుడై వుండాలి. నాకు నిన్ను చూస్తుంటే జాలి వేస్తోంది. అయినా ఏం చెయ్యగలం. మీ ఇద్దరికి యోగకాలం తీరిపోయింది. విధి వ్రాతను ఎవరు తప్పించుకోగలరు ! అయితే కర్మను బట్టి చనిపోయేవారు పోతూవుంటారు. వాళ్లతోపాటు వున్నవాళ్లు గూడా చనిపోతారా ? ఒకవేళ చచ్చిపోయినా పోయినవారు వస్తారా? ఒక్కటి చెబుతాను విను. ఈభూమ్మీద తినడానికి గింజలు ఎవరికి ఎంతకాలం వుంటాయో, అంతకాలం వాళ్లు చచ్చి నట్లు ఇక్కడ వుండాల్సిందే! ముందూ పోరు, వెనుకా పోరు. బ్రతకడం తప్ప నప్పుడు చచ్చు బ్రతుకు బ్రతకడం దేనికి? హాయిగా, దర్జాగా బ్రతకాలి గానీ! అంతటి బ్రతుకు మళ్లీ అందరికీ దక్కుతుందా- కోటిమందిలో నీలాంటి ఒక్క కోమలాంగికి తప్ప. అసలు అంగనలందరికీ భోగపరమార్థం తెలుస్తుందా? ఏదో ఊహల్లోను; ఎవరో చెప్పుకుంటేనూ తప్ప ప్రత్యక్షానుభూతి ఎవరికీ సంపూర్ణంగా వుండదు. నీవు స్నిగ్ధ సుకుమార లావణ్యంతో పరమ రమణీయ భావ సుధా లహరిలాగా వున్న రసమూర్తివి, సరసమూర్తివి. ఎందుకు నీ అందాన్నంతా వృథా చేస్తావు.

మధ్యాహ్నపు ఎండలో చల్లని నీటి తరంగాలను చేతులతో, కాళ్ళతో చిమ్ముతూ చక్కగా ఆనందించాలి.

శరత్పూర్ణిమా చంద్రికల్లో నిష్కంచుక శరీర సుఖాలను పొందాలి.

వర్షాకాలం వచ్చిందంటే మణిమయ సౌధాల్లో హంసతూలికాతల్పాలపై గ్రుచ్చిన కౌగిళ్ళను దక్కించుకోవాలి.

మధుమాసంలో సుమవర్ష స్నానంతో మేనులను పరిమళ ప్రసన్నంగా పరవశింపజేసుకోవాలి. ఇలాంటి అపురూపమైన భోగాలను ఈ భూమిమీదనే పొందగల ప్రదేశంలో నువ్వున్నావు. మా దైత్యనాథుడు వీటన్నిటినీ అను భవించి తరించడంకోసం భూమంతా వెదకి వెదకి ఇక్కడ కోట కట్టాడు. నిన్ను తెచ్చి పెట్టాడు ఇదంతా నీ అదృష్టం" అన్నది.

అప్పుడు సీత వాళ్ళందరినీ చూసి-

## తిరుగులేని సీత నిర్ణయం

"సప్త సముద్రాలు ఇంకిపోయినా, తెల్లని చంద్రుడు మాడి మసిబొగ్గు లాగా అయిపోయినా, ఈ భూగోళం యావత్తూ చిల్లపెంకులులాగా బ్రద్దలైనా అతడే నా పతి, నేనే ఆయన భార్యను గుర్తుంచుకోండి! గాలికి స్పర్శ గుణం లోపించినా, నిప్పుకు వేడిమి సమసినా, నీటికి తడి లేకపోయినా పోవచ్చు కాని అతడే నా పతి, నేనే ఆయన భార్యను. ఆత్మ నిత్యంగా వున్నన్ని రోజులు, ఆత్మ చైతన్యవంతమైనన్ని రోజులు, ఆత్మ దీపించినన్ని రోజులు ఆయన పతి, నేను ఆయన భార్యను. ఈ యోగానికి తిరుగులేదు" అన్నది.

సీత మాటలకు రాక్షసాంగన లందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఒకరితో ఒకరు గుసగుస లాడుకున్నారు. చివరకు మనకెందుకని కొందరు, సీత సంగతిని నేరుగా రాక్షస రాజైన రావణాసురునికే చెబుదామని బయలుదేరిపోయారు. కొంతసేపటికి, వెళ్లినవారిలో ఒకామె తిరిగివచ్చి—

## మరో ప్రయత్నం

"స్వామితో నీ సంగతి, నీ మొండి పట్టుదలగూర్చి చెప్పాము. అప్పుడు స్వామి ఎంతో కోపంతో మండిపడి— 'ఇక రెండు నెలలు గడువు కాదు కదా, రెండు రోజులు, రెండు క్షణాలు గూడా చూడవద్దు. మీరు వెంటనే ఇప్పుడే వెళ్లి ఆమెను సంహరించి నాకు ఉదయపు అల్పాహారంగా ఆ మాంసాన్ని తెండని చెప్పాడు' అని అనంగానే అందఱూ ఒక్కసారి లేచి నృత్యాలు చేసి, కత్తులు నూరుతూ, బల్లెముల కొసలకు పదును పెడుతూ తయారవుతున్నారు. అంతలో వాళ్లల్లో వినత అనే రాక్షసాంగన సీత దగ్గరకు వచ్చి—

"నెత్తి, నోరు మొత్తుకుని మేం చెబుతే విన్నావా ? చూడు ప్రాణాల మీదకు తెచ్చుకున్నావ్. నీకీనాటితో ఆయువు చెల్లింది. స్వామి నిన్ను చంపమని అనుజ్ఞ ఇచ్చాడు. ఆ మాటలంటున్నపుడే మాకు నోరు ఊరటం ప్రారంభించింది. కానీ, నీతో ఇంతవరకూ కలిసి వున్నందుకు మాకు నీమీద జాలికూడా కలుగుతోంది" అన్నది.

అక్కడున్న రాక్షసాంగన లంధరూ గుమిగూడినట్లుగా సీత చుట్టూ

చేరి చంపుతామన్నట్లు మీదమీదకు వెళ్తుంటే వినత వారందరినీ వారించి సీతకు కాస్త సంతాపాన్ని తొలగించడానికి ప్రయత్నిస్తూ..

"ఓయమ్మా! ఇప్పటికైనా మించిపోయింది లేదు. రాముణ్ణి మరచిపోయి మా రావణుని అంగీకరించు. నువ్వూ బ్రతుకుతావు, మన స్నేహం గూడా సఫలమై నిలుస్తుంది" అన్నది. అప్పుడు సీత ఏమాత్రం చలించకుండా—

## సీత హితబోధ

"ఈ శరీరం నిత్యం కాదు అలాంటి అనిత్యము, అశాశ్వతము అయిన దానికొరకు అవివేకులైతే నిత్యమైన వాటిని గూడా వదులుకోడానికి సిద్ధ పడతారు. నా ఈ శరీరం పోయినా నేను రఘురాముణ్ణే కోరేదాన్ని. అయితే నా శరీరాన్ని మీరు ముక్కలు ముక్కలుగా చేయక మునుపు మీకు కొన్ని మాటలు చెబుదామనుకుంటున్నాను వినండి"—

"అజేయుడైన నా రఘురాముని గూర్చి మీకు ఇష్టమొచ్చినట్లు అశుభమైన మాటలు మాట్లాడుతూ సంతోషిస్తున్నారుకదూ! అల్లాగే సంతోషిస్తూ వుండండి. ఈ సర్వ రాక్షస కులానికి చావు దగ్గరకు వస్తోందన్న సంగతి గూడా తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టదు. మీ చావు- గుమ్మాల దగ్గర కాచుకూర్చుంది. ఏదో మధ్య వారధి అడ్డం వుంది గదా అని ధైర్యం పట్టి వున్నారేమో అది వట్టి ఆత్మవంచనే అవుతుంది."

"రామబాణం సంగతి మీకు ఏమాత్రం తెలియదు. మహా పర్వతాలు మహా సాగరాలు ఇవేమీ రామబాణానికి అడ్డంకాదు, ఆటంకాలు కావు. సాగ రాలైతే బాణాగ్నికి ఇంకిపోతాయి. కొండలైతే కరగిపోతాయి. ఆ సంగతి నాకు తెలుసు. అన్న దమ్ములిద్దరినీ తన భుజాల మీదకు ఎక్కించుకొని సునాయాసంగా అడవిలో తిరిగిన విరాధుని రెండు బాహువులను చెట్లను నరికినట్లు నరికేశాడు రాముడు."

"ఈ లంకలోని రాక్షసు లందరినీ కూకటివేళ్లతో పెళ్లగించి, నీరుపెట్టి కొత్త పంటను పండించడానికి, విత్తనాలను నాటడానికి రాముడు రాబో తున్నాడు. రావడమేమిటి, లంకా గ్రామాన్నంతా త్రవ్వి కలుపు మొక్కల రాక్షసులను ఏరిపారేస్తాడు. ధర్మాధర్మాలు నిర్ణయించడానికి ఒక దేశానికే

చెల్లుబాటయే స్మృతి చాలదు. రాముడు సర్వదేశ స్మృతి తెలిసినవాడు. తగిన సమాధానం చెప్పి మరీ హతమారుస్తాడు. చచ్చినవారి ఎముకలను ప్రోవులు పెట్టి ఎక్కడి కక్కడ మంట బెడతాడు."

"అన్నట్లు ఇంకో విషయం మీకు చెప్పడం మరచాను. ఇంతవరకు రఘురాముణ్ణి గూర్చి మాత్రమే మీకు చెప్పాను. మీ పాలిటికి ఇంకొకడు వున్నాడు. అతనే నా మఱది లక్ష్మణుడు. ఈ భూలోక, స్వర్గలోక, పాతాళ లోకాలు మూడింటినీ మట్టుపెట్ట గలవాడు. వంచకుడైన మీ రావణుడు మా పర్ణశాలకు బిచ్చ మెత్తుకోడానికి వచ్చినపుడు ఈ లక్ష్మణుడు లేడు. వుండి ఉంటే మీ నాయకుని పని ఆనాడే సమాప్తమై వుండేది. నాస్వామి రాఘవునికి భార్యగాను, నా మఱదికి వదినగాను అవడం నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను. మీరూచూస్తారుగా! దండతాడిత భుజంగాలుగా, రోష కషాయత నేత్రాలతో వస్తారు. నేనుండకపోయినా మీరు వారి మహోద్దండ సంగ్రామ సంరంభాన్ని చవి చూద్దురుగాని. మా మఱది భీకర పోరాటాన్ని తిలకిద్దురు గాని."

"మీరు ఇన్నిరోజులూ నన్ను చంపకుండా వున్నారు. నేను నా రాముని విడిచి ఇంక వుండలేను, చంపెయ్యండి. కాని ఒకందుకు భయం కలుగుతోంది. నేను బ్రతికివుంటే రాముడు ఒక్క రాక్షస సంహారమే చేస్తాడు. నేను లేకపోతే ముజ్జగాలనే మట్టుపెడతాడేమోనని భయంగా వుంది. రాముడు ఎంతటి ప్రాజ్ఞుడు; కృతజ్ఞుడు, సద్వృత్తుడు, నిత్యస్వాధ్యాయ నిరతుడు, సత్య వ్రతుడో మీకు తెలియదు, మేము అయోధ్యను వదలి వస్తూంటే యజ్ఞ యాగాది క్రతువులు చేసిన వాజపేయయాజులు అందరూ రాముణ్ణి వదలలేక వెంటపడి వస్తూంటే రాముడు వాళ్లందరినీ బ్రతిమాలి వెనక్కు పంపించేశాడు. అంతటి సాధుమూర్తి చేత ఈ దుష్ట దానవ సంహార హింసాకాండ జరుగుతుందా?" అని, సీత భల్లున వ్యథ చెందింది. అందుకు రాక్షసస్త్రీల గుండెల్లో రాయిపడి, తెప్పరిల్లి, భయం వల్ల క్రోధం కలిగి నిష్ఠూరంగా—

## రక్కసుల ప్రతిస్పందన

"నీ బుద్ధి బుగ్గలవ్వ! నువ్వు అలా అన్నంత మాత్రాన, నువ్వు భయ

పెట్టినంత మాత్రాన మా గుండెలు జారిపోవు. 'ఎందుకొచ్చిందిగాని తల్లీ! నీ మగడు, మఱది ఇక్కడకు వచ్చి మమ్మల్ని ఏమీ చెయ్యకుండా నువ్వు మాకు అండగా నిలబడు, మమ్మల్ని కాపాడు ! నీకు పది గోవుల్ని ఇస్తాము' అని ప్రాధేయ పడతామనుకున్నావా ? మేము ఏమీ అంత వెఱ్ఱిపప్పలం కాదని తెలుసుకో! నిన్నిప్పుడే ముక్కలు ముక్కలుగా కోసి తింటాము. నీ మొగుడే అడ్డుపడతాడో, నీఅబ్బ అడ్డుపడతాడో చూద్దాం. మేము మాంసాన్ని పూర్తిగా తిని చీకి పారేసిన నీ ఎముకలను పట్టుకుని ఓదార్చడానికి ఇక్కడకు వస్తాడేమోలే! అదీ చూద్దాం! హమ్మమ్మ! మమ్మల్ని ఎన్నెన్ని మాటలాడావే నంగనాఛీ. నిన్ను 'పాపం' అని తలచకూడదు. నీ కంఠ మాంసాన్ని ఉండ లుండలుగా చేసి ఉప్పుకారం చల్లి చీకులుగా సురాపానం చెయ్యాలి.

'అసలు నీకనుబొమ్మలే కొడవళ్ళుగా వున్నాయి, కోసల కళ్ళు పదునైన మొనగల చురకత్తుల్లాగా వున్నాయి. నీ రూపమే ఒక ఖడ్గంలాగా వున్నపుడు నీకు యోగ్యమైనది ఖడ్గవధయే!' అంటూ రాక్షసాంగనలు కత్తులునూరుతుంటే ఝుళం ఝుళ ధ్వనులు వినిపిస్తున్నాయి. వాటికి మువ్వల గల గల ధ్వనులు తోడౌతున్నాయి. చుట్టుప్రక్కల చెట్లమీదవున్న పక్షులకలకలరావాలు వాటితో శ్రుతి గలుపుతున్నాయి. వీటన్నిటికీ తోడు అందరూ కోలాహలంగా హలహలా రావాలు చేస్తున్నారు. సందడి పెచ్చు పెరిగి అంతా సంకులంగా వుంది. ఈ సందడి కిప్రక్కనేనిద్రపోతున్న త్రిజటఅనే పేరుగల ఒకముసలి రాక్షసిలేచి–

"అయ్యో! ఏం చేయబోతున్నారే ? మీరు హడావుడి కాస్త ఆపండి. కొంపదీసి ఆ జానికమ్మని చంపుతున్నారా ఏమిటి? ఆ జానకిని మాత్రం చంపబోకండి, కావలిస్తే నన్ను చంపండి. ఏం చేస్తున్నారో ఆలోచించకుండా మీ కంఠాలకు మీరే ఉరిపోసుకోకండి. అయ్యో ఎంత చెడ్డ కల వచ్చిందే! తొందరపడి ఆ జానకిని చంపి మీ చావు మీరు తెచ్చుకోకండి. కళ్లకు గట్టినట్లుంది ఇప్పటికీ నాకు. మన దానవులకు ఇంక మంచి రోజుల్లేవు. ఈ భూజాతను చంపితే వచ్చే కీడుకు వంద రెట్లు అనుభవించాల్సి వస్తుంది" అన్నది. త్రిజట మాటలు విన్న వినత, వికట, ప్రఘస, చండోదరీ, అజముఖి హరిజట, ఏకజట మొదలైన వారందరూ త్రిజట చుట్టూ జేరి-' నీకు వచ్చిన కల ఏమిటో చెప్పు' అన్నారు. అప్పుడు త్రిజట-

# త్రిజటా స్వప్న వృత్తాంతం

"తెల్లని కాంతులు విరజిమ్మే దంతాలతో, అంతకంటె తెల్లని రంగులో వున్న ఏనుగు నెక్కి మనస్సును హరించే రూపంలో నీలమేఘశ్యాముడైన రాముడు వస్తున్నాడు. నీలి కడలి మధ్యలో తెల్లని పర్వతంలాగా ఉన్నది ఏనుగు. కడలి ఒడ్డున సీత నిలుచుని వుంది. ఆమె పచ్చని చీర అంచులు గాలికి రెపరెపలాడుతున్నాయి. నాలుగు దంతాలున్న ఆ ఏనుగుపై నుండి క్రిందకు దిగి రాముడు మృదుల మందహాసంతో, మెరుస్తున్న కపోలాలతో సీత వున్న చోటుకు వచ్చాడు. తెల్లని, చల్లని చంద్రకాంతులు విరజిమ్మే కనుకొనలు గల సీతను సమీపించాడు. తామరతూడుల చందంలో అందాలు చిందుతూ, నునుపుగా, మెరుపుగా వున్న ఆమె బాహువులను ఆమెను చూస్తూ జగన్మోహనంగా రాముడు నవ్వాడు. కల అని పేరే గాని ఆ కల కంటున్నప్పుడు గూడ గుండెల్లో ఒక స్థిరమైన మధురానుభూతి ముద్రింపబడింది. స్వామి తన చేతులతో భూజాత సీత కోమలమైన బాహువులను పట్టుకున్నప్పటి ఆ దృశ్యానికి- ఇంద్రనీలం మణులు ముత్యాలను రాల్చినట్లు-నాకళ్లు పులకించి ఆనందభాష్పాలను చెమర్చాయి."

"మరుక్షణంలో మృదువైన తన కౌగిలిలో- మృదుల తరమైన మోహనాకృతియైన సీతను చేర్చుకున్నాడు. తన రెండు చేతులతోను సీతను పట్టుకొని, తను ఎక్కి వచ్చిన ఏనుగు కుంభస్థలం వద్ద ఒడుపుగా కూర్చోపెట్టుకుని, తానెక్కి, అంకుశంతో ఏనుగును అదలించి బయలుదేరాడు. లక్ష్మణుడు పట్టుకుని వీచే చామరం సీతారాము లిద్దరికీ ప్రశాంతమైన మలయమారుత సంస్పర్శను కలుగజేసింది."

"సీతారాముల ఏనుగు మీద విహారం చాలా ఆహ్లాదకరంగా వుంది. సీత ఒకసారి ఏనుగు కుంభస్థలం వద్ద, మరోసారి రాముని తొడపైన కూర్చుంటూ, త్రిలోకవాసులను ఆజ్ఞాపించగల విస్ఫారిత నేత్రాలతో ఒకసారి ముందు మార్గం పైన, మరోసారి తన నాథుని వదనాన్ని- తిలకిస్తూ విహారానందాదిరేకంతో ఉల్లాసంగా వుంది."

"సీతారాములు అలా కనబడుతూనే వున్నారు. అంతలోనే వాళ్లు కను మరుగై, రోహిణీ-చంద్రులు కనబడ్డారు. వాళ్లు కనుమరుగై ఛాయా-సూర్యులు కనబడ్డారు. అంతలోకే వాళ్లూ కనుమరుగై సీతారాములెక్కిన ఏనుగు ఆకారం మాత్రం కనబడింది. కళ్లు పొరలు కమ్మినట్లు తెలిమబ్బులు తెరలు తెరలుగా కనబడ్డాయి. తీరా కళ్లు నులుముకొని తేరిపార చూస్తే రాముడూ లేడు, ప్రక్కన లక్ష్మణుడూ లేడు, ఏనుగూ లేదు. వెలుగులు విరజిమ్మే సూర్య చంద్రులే కన్నుల్లాగా భాసిస్తూ, గోళ్లకాంతులు తారకల్లాగా మెరుస్తూ, కళ్ల కాటుక వినువీధిలో చరించే చీకటిలాగా కనిపిస్తూ ఆమె పైటకొంగు రెపరెపలు తెలిమబ్బుల సోయగాన్ని మరపిస్తూ, వున్న సీతా తనువు అనంతమైన ఆకాశం లాగా భాసించింది. ('ఆకాశం గగనం శూన్యం' అని అమరకోశం చెప్తుంది. సీత శూన్యమైన ఆకాశంలాగా అంటే 'మాయ'లాగా అని అర్థం చెప్పుకోవచ్చు. 'ఆకాశం గగనం పూర్ణం' అనే అర్థంలో యావత్తు సృష్టిని తనలో నిలుపుకుని పూర్ణాకాశంలాగా భాసించే ప్రకృతి మాతలాగా అనీ అర్థం చెప్పుకోవచ్చు.)"

"వెలుగులు చిమ్ముతున్న క్షీరాబ్ధి కన్యలాగా వున్న భూజాత సీతను చుట్టూ చామరాల రూపాలతో దిక్పతీ మణులు సేవిస్తున్నారు. సీత కను బొమ్మలు నెల పొడుపు చంద్రునిలాగా వున్నాయి. క్రింది పెదవినుండి వెలువడే చల్లని కాంతులు మిన్నంతా లేత వెన్నెలలను నింపాయి. శరత్పూ ర్ణిమా సుందరిలాగా సీత భాసించింది."

"అంతలో ఆ వియత్ప్రదేశంలో- లంక, ఆవెనకగా నాలుగు దంతాల ఏనుగుపై సీతారామలక్ష్మణులు కనబడ్డారు. వారు పుష్పక విమానంపై ఉత్తర దిశగా పోతున్నారు."

"ఒకప్రక్క శ్రీరాముని నోటిగుహలోనికి చరాచరాత్మకమైన ఈభూమి యావత్తూ పోతూ- వస్తూ వున్నట్లు చూశాను. ఇంకోప్రక్క తేజోవిహీనంగా, నూనె వంటితో పానవివశుడై, మతి తప్పి, నేలమీద పడివున్న మహీపతి రావణుని చూశాను. అంతలోనే మళ్లీ మన రావణ రాజు విమానంలో కన బడ్డాడు. అంతే! మరుక్షణంలోనే మన రాజు విమానంలోంచి భూమ్మీదకు త్రోయబడ్డాడు. అప్పుడు ఆ రావణుడు ముండిత శిరస్కుడై, నల్లని వస్త్రం కట్టుకుని వున్నాడు. నూనె త్రాగుతూ నర్తిస్తున్నాడు. మళ్లీ కాస్సేపట్లో

వళ్లంతా రక్తలేపనం కలిగి, గాడిదలు కట్టిన బండిమీద వున్నట్లు చూశాను. గాడిదమీద పోతూ, వళ్లంతా బూడిద పూసుకుని, వెకిలినవ్వులు నవ్వుకుంటూ పోతున్నాడు. ఇంతలోనే నల్లగాడిదపై నుండి భూమ్మీదకు తలక్రిందుగా పడ్డాడు. కదల లేదు. బ్రతికున్నాడా లేదా అనే సందేహం కలిగింది. కాని లేచాడు. క్రింద పడడంతో వళ్లు పుండైనట్లుంది. మొండి మొలతోనే నడుస్తున్నాడు. నెత్తురులో ముంచిన చీర కట్టుకుని వున్న ఎవరో ఒక స్త్రీ మన రాజు మెడకు త్రాడుకట్టి దుస్సహమైన దుర్గంధంతో నిండివున్న నరక కూపంలోకి ఈడ్చుకుపోతోంది."

"అంతలోనే ఒకవైపు కుంభకర్ణుడు గూడా కనబడ్డాడు. అన్నగారిని ఈడ్చుకు పోతున్నట్లే తమ్ముడైన కుంభకర్ణుణ్ణి గూడా ఈడ్చుకుపోతున్నారు దక్షిణ దిశగా. పంది మీద రావణుడు, మొసలిమీద ఇంద్రజిత్తు, ఒంటెమీద కుంభకర్ణుడు దక్షిణ దిశాముఖు లౌతున్నారు."

"ఒక్క విభీషణుడు మాత్రం స్వచ్ఛమైన తెల్లని కాంతులు విరజిమ్మే ఛత్రం నీడలో, తెల్లని వస్త్రాలు ధరించి, వంటినిండా మంచిగంధపుపూతతో సమస్త రాజభోగాలతో ఒప్పుతూ పోతున్నట్లు కనపడ్డాడు. మిగిలిన మన రాక్షసులందరూ దక్షిణ దిక్కుగా పోతున్నారు."

"లంకాపురం గోడలు, గోపురాలు, కుడ్యాలు, తోరణాలు అన్నీ బద్దలై పోయి, తెగిపోయి క్రిందపడి అంతా దట్టమైన అడవిలా వుంది. ఇంతలోనే- ఒక పెద్ద దేహంతో కళ్లు మిరుమిట్లు గొలిపేట్లుండి, ముఖం నుండి అగ్ని జ్వాలలు, తీక్ష్ణమైన వెలుగులు విరజిమ్ముతూ, కర్ణభేరులు బద్దలయేటంత కఠోర కర్కశ నినాదాలు చేస్తున్న ఉద్దండుడైనవాడు ఒకడు కనబడ్డాడు. తీరా చూస్తే వాడు మనిషీ కాదు, రాక్షసుడూ కాదు వానరుడే! తన తోక చిచ్చుతో మన లంకంతా తిరుగుతూ తగలెడుతున్నాడు" అన్నది. అప్పుడు వినత-

## కలల విశ్లేషణ

"కలలు నిజమేమిటి? అసలు కల అన్నమాటే 'కల్ల' నుండి పుట్టింది. కలలో పుట్టిన వాళ్లు భూమ్మీద పెరగడం ఎంత నిజమో, కలగూడా అంతే నిజం' అన్నది. అప్పుడు వికట కల్పించుకొని-

'తిన్న తిండి అరక్కపోతే ఇలా తలాతోకా లేని, అర్థం పర్థం లేని కలలు వస్తాయి. ఈ త్రిజట బాగా ముసలిదైంది. కాని, తిండిపోతు. ఆ తిన్నది ఆ వయస్సులో అరుగుతుందా ? పెడుతుందా ? అందుకే దానికి ఎప్పుడూ ఇలాంటి కలలే వస్తూ వుంటాయి' అంది. అప్పుడు ప్రఘస—

"అసలు నన్నడిగితే— ఎవరిని గూర్చి కలలువస్తాయో వారికి ఆ కలలు చేటు చేయవు, ఇతరులకు చేస్తాయి. అలా కలలు గన్నవారు ఎప్పుడో,ఎవరో పోయారనే అశుభమైన, అప్రియమైన వార్త వినడం జరగడం సామాన్యంగా జరుగుతూ వుంటుంది" అంది అప్పుడు చండోదరి.

"ఆ మాటలన్నీ అలా వుంచండి. నే చెప్పేది వినండి, ఎవరికి కోతి కలలో కనబడుతుందో వారికే కీడు కలుగుతుంది. కాబట్టి, ఆ త్రిజటకే అశుభం జరుగుతుంది. అదీగాక తెల్లవారుఝామున కలలకు అంత ఫలితం వుంటుందనుకోను. రేపు, ఎల్లుండి లోపలనే అంతా తగులబడి పోతుం దంటారా? అదీ చూద్దాం! అంతటి కోతి అయితే వాడు వాలే అయి వుండాలి, వాలే అయితే పేచీ ఏముంది మన రావణునికి సఖుడే కదా ! లేదా అంతటి కోతిగా కనబడాలంటే ఇంక ఆ శివుడే అలా కోతిరూపుతో దిగి రావాలి. ఇంకో సంగతి చెప్పనా? తన కలలో నిప్పు, మంట కనబడాయి అంది గదా— అయితే తప్పకుండా త్రిజటకు ధనం వస్తుంది. ఆ వచ్చిన డబ్బు మనగ్గూడా పంచుతుందో లేదా పిసినిగొట్టై అంతా తనదే అని గొణుక్కుంటుందో? అన్నీ ఉడిగిపోయిన ఈ వయస్సులో ఆ త్రిజటకు ఇంత మంచి కల వచ్చిందే ? అయితే దీనికి మళ్లీ కండలు గట్టిపడి, నరాలు పదునెక్కి, దంతాలు మొలిచి పెళ్ళి గూడా చేసుకుంటుందేమోలే ! దీన్ని పెళ్ళి చేసుకోడానికి ఎవడొస్తాడో గాని మంచి అదృష్టవంతుడు, ఏమంటావు?" అంది. "ఆ అంత అదృష్టం దక్కాలంటే పైనుండి దేవతలే దిగి రావాలి. అంతకు తక్కువ ఎవరూ మన త్రిజటకు సరిపోరు." అంది అజాముఖి అనే రాక్షసి.

ఏకజట, కొరిజట అనే స్త్రీలు లోపల భయంగా వున్నా ఆ భయాన్ని పైకి పొక్కనీయకుండా చిన్నగా నవ్వారు. అప్పుడు త్రిజట—

"పడుచుతనంతో పేట్రేగి వగలుపోకండే! ముందు రాజుచెప్పిన రెండు

నెలలు సీత ఈ జోలికి పోకుండా కాలక్షేపం చెయ్యండి. ఆపైన తాడోపేడో తేలిపోతుంది. అయినా తినే వస్తువును తెచ్చి ఎదురుగా పెట్టి, దాన్ని రక్షిస్తూ వుండమని ప్రభువు అనడం ఏమంత సబబుగా వుంది ? మన అందరికీ ఒక ప్రక్క నోరూరుతూ వుంటే ఈవిడ గారిని రక్షిస్తూ గూడా వుండగలమా? ఒకవేళ యుద్ధమే వస్తే లంకలో కాస్త భద్రంగా వుండేచోటు ఏమన్నా వుందంటే ఈవిడగారున్న ఈ చోటే ! ఇప్పుడు తొందరపడి ఈమెగారిని చేజేతులా చంపుకున్నామా-ఇంక లంకలో తలదాచుకోడానికి స్థలమే ఉండదు" అన్నది. త్రిజట అన్న మాటలకు మిగిలిన రాక్షసాంగన లందరూ 'అవును త్రిజట చెప్పింది నిజమే!' అనిపించి ఎవరికివారు ఊరుకున్నారు. కాని, జానకికి భయం తగ్గలేదు. మనస్సు పరిపరి విధాల పోతోంది

## సీత వ్యాకులత

"స్వప్న ఫలానికి తగ్గట్టుగా మనం అందరం ఎలాగూ చావబోతు న్నాము. అలాంటప్పుడు ఈవిడగారు మాత్రం బ్రతకడం దేనికి అని అనిపించి మొండి సాహసంతో ఈ రాక్షస స్త్రీలు తనను ఏమైనా చేసేస్తారేమో" అని ఆత్మలోనే వ్యాకులపడుతోంది సీత.

"అయినా ఇంతకాలం నన్ను చంపుతా, చంపుతా అంటూ భయ పెడుతూ నటిస్తున్నారే తప్ప నిజానికి చంపటం లేదు. ఈ రెండు మాసాల గడువు గూడా దాటిపోతే ఆ రావణుడు ఏం చేస్తాడో? ఇంతకు పూర్వం తన నెచ్చెలులతో వచ్చినపుడు వారిలో ఒకామె రావణుడు తనను అప్పుడే చంప కుండా వారించింది. కాబట్టి తనింకా బ్రతికి వుంది. లేకపోతే, ఆనాడే తన పని అయిపోయి వుండేది" అని వ్యాకుల పడుతోంది సీత.

'ఏడాది గడువు పూర్తికావస్తోంది. అప్పుడే పది నెలల కాలం గడిచి పోయింది. ఇంకా పట్టుమని రెండునెలలు గూడా లేదేమో! నా రామచంద్రుడు వచ్చే జాడే కనబడడం లేదు. విసిగి, వేసారి వైరాగ్య భావంతో నా గురించి ఆలోచించడమే మానుకుని గూడా వుండచ్చు.'

'నన్ను విస్మరింపకుండా- ఆ దేవతలు; ధర్మము నాపతి హృదయంలో నిల్చి ఈ రాక్షస వధకు ప్రేరకులై దోహదపడితే బావుణ్ణు!'

'ఆ దైవం నన్నిలా నడి సముద్రంలో వుంచాడు. నిద్రాహారాలు, తిండీ తిప్పలు లేని బ్రతుకై, అవతల నాస్వామి ఒక సుఖము, సంతోషము లేకుండా ఆనంద హీనంగా అవస్థ పడుతున్నాడు!'

'క్రొత్త తెలివి పెరిగి' ఇవి అనవచ్చు, ఇవి అనకూడదు అనే వివేకం లేకుండా మఱిదిని అనరాని, అనకూడని మాటలన్నీ నోటికి వచ్చింది వచ్చినట్లుగా అన్నాను. ఇప్పుడిలా అయిందని దైవాన్ని నిందించడం ఏం న్యాయం? ఇదంతా నానోటి దురుసుతనం తాలూకు ఫలితమేగా? దైవం ఇలా ఇరువుర్నీ ఇబ్బంది పెడుతున్నాడంటే ఇదంతా నా పాప ఫలమేగా?'

'నా స్వామి దర్శన భాగ్యం నాకికలేదు. వర్షాశరన్మాసాలలో స్వామితో పొందే ఆనందం నాకిక లేదు. ధీశక్తి చేత, సేవాశక్తి చేత అందించిన సేవలకు బదులుగా ఛీదరింపులు పొందిన మఱదిని క్షమించమని అడగడానికి అవకాశం లేదు.'

'నా కోర్కెలు అనే చెట్టుకు ఆకులు రాలే కాలం ఆసన్నమైంది. ఇంక నాకు సంవత్సరాలు, ఋతువులు మాసిపోయినట్లే! హేయమైన కాలం కాని కాలంలో పడ్డాను. ఇవే నాకు చివరి రోజులు. ఇంక కృశించి, కృశించి నశించడమే జరిగేది.'

'ఇంక ఈ జన్మకు అత్తమామలను గాని, తల్లినిగాని, తండ్రినిగాని చూడ్డానికి నోచుకోలేదన్న మాటే! ఏ నమ్మకం పెట్టుకొని ఈరెండు మాసాల్లో నా రఘురాముడు వస్తాడని ఆశ పెట్టుకోను? మఱది ఇక్కడకు రావడం కనక జరిగితే- నన్ను పలకరిస్తాడో లేదా ఆనాడు నేనన్న మాటలు ఇంకా గుర్తు పెట్టుకొని ముభావంగా వుంటాడో?

'ఈ రాక్షస నాయకుని చేతుల్లో చనిపోక పూర్వం ఒక్కసారైనా నా జలజనేత్రుని, రాముణ్ణి చూసే భాగ్యం నాకుందో లేదో?'

ఈ విధంగా వ్యాకులపడుతూ సీత అశోక వృక్షానికి తన దక్షిణ పార్శ్వాన్ని ఆనించి అర్ధ నారీశ్వరిలాగా నిలుచుండి పోయింది.

నీళ్ళలో వున్న తామర పువ్వు నాళాన్ని చిన్న చేప కదిలిస్తే చెరువు నీటిపై వుండే ఆ తామర పూవు ప్రకాశ చాంచల్యము, మదపుటేనుగు చేత

కదలింపబడే అందమైన అరటిబోదల కదలిక, లేక అరటి తోటలపై వీచే పిల్లగాలుల స్పందనలు– ఇవన్నీ సీత డోలాయమాన స్థితిని తెలియపరుస్తున్నట్లుగా వున్నాయి. అవతల పడమర దిక్కున కొండపైన అస్తమిస్తున్న చంద్రుడిలాగా అవనిజ వదనం నిస్తేజంగా, నిరాశాపూరితంగా వుంది.

విత్తనంలో చెట్టు, చెట్టునందు విత్తనం ఎలా ఇమిడి వుంటాయో రఘురామ కార్యమనే చెట్టులో, హనుమ అనే విత్తనం అలా ఇమిడివున్నట్లుగా లంకలో హనుమ పరిస్థితిని ఊహించుకోవచ్చును.

## హనుమ కర్తవ్య విచారణ

"నేను ధ్యాన నిమగ్న చిత్తంతో తపస్సు చేసుకుందామని నిశ్చయించుకున్న సమయములో అనుకోకుండా ఈఅశోకవనంలో సీతమ్మతల్లి కనబడింది. ఇలా జరగడం పురుష కారణమని విఱ్ఱవీగుతాము కాని అంతా దైవానుగ్రహం కాక ఇంకేమిటి? నిజంగా అవనిజ కనబడడం అదృష్టం కాక మరేమిటి? ఆ రాక్షసరాజు గాని, రాక్షసస్త్రీలు గాని సీతమ్మను చంపకుండా వదలిపెట్టడం అంతకంటె చిత్రం. ఎత్తబడిన కత్తులే ఎగిరిపోయాయి. అమ్మ చెక్కుచెదరకుండానే వుంది. ఇదంతా చూస్తుంటే నా దౌత్యం ఫలించడానికే ఇలా అన్నీ ఒకటి తర్వాత ఒకటి సమకూడుతున్నట్లుగా తోస్తోంది. ఎప్పటికప్పుడు ఛెడ్డ తలంపులు అందరికీ కలిగినా ఎందుకనో అవి కార్యరూపం దాల్చకుండానే ఆగిపోతున్నాయి. ఎప్పుడు, ఏ విధంగా జరుగుతుందో వూహించలేకుండా వుంది పరిస్థితి. కాని ఒక్కటి మాత్రం దృఢంగా చెప్పుకోవచ్చు. ఇంతవరకు జరిగినవన్నీ సాధుమార్గంలోనే జరగడం ఆదృష్టమనే చెప్పుకోవాలి."

"దైవానుగ్రహంవల్ల ఇంతవరకు ఇంత ప్రసన్నంగా సాగిన రామ కార్యం ఇంక నా పురుష ప్రయత్నంతో ప్రసన్నతరంగా జరగాలి. 'ఏదో లంకకు వెళ్లాడు, వచ్చాడు' అనే పనికిరాని మాటగాక రఘువీరుడు చెప్పిన మాటలు తల్లికి చెప్పిగాని పోకూడదు. ఇంతగా అన్ని రకాలుగా కష్టపెట్టినా సహనంతో చూస్తూ, భరిస్తూ వున్న ఆ తల్లిని చూస్తుంటే శక్తి, ఓర్పు నాలో గూడా పెరుగుతున్నాయి. అవతల వున్నది అవనిజ కాక మరొకరైతే ఇలా నిలబడి వుండేదా? ధైర్యం కోల్పోయి ఎప్పుడో నశించిపోయి వుండేది."

"ఈవిడ వియోగ భారం సహించడం రామునికే చెల్లు, రాముని వియోగ భారం వహించడం ఈమెకే చెల్లు. మరి ఏ ఇతర దంపతులైనా అయితే అంతటి ఓర్పు ఉండేది కాదు, అంతటి ధైర్యం వుండేది కాదు. ఒక విధంగా చూస్తే వియోగాన్ని గూర్చి ఆలోచించే సందుగూడా ఈ రాక్షస స్త్రీలు ఇవ్వకుండా తల్లిని ఇబ్బంది పెట్టారు, పెడుతున్నారు."

'తను ఇక్కడకు వస్తున్నపుడు రాముడు-' హనుమా ! నువ్వెవరో ఆమెకు తెలియదు. నీకు ఆవిడ తెలియదు. నువ్వు నే చెప్పిన తీరునుబట్టి ఆమెను గుర్తుపట్టినా, ఆమె నిన్ను గుర్తుపట్టలేదు. ఈ ఉంగరం ఇవ్వు. కొంత వరకు అర్థం చేసుకోవచ్చు' అన్నాడు. ఆ మాటలు హనుమకు గుర్తువచ్చి "ఇప్పుడున్న స్థితిలో తన విభుని మాటలు పలకాలి. అయితే ఆమె ఇప్పు ఎవ్వరినీ నమ్మేట్టులేదు. నా సంగతి చెప్పినా ఇదేదో ఆ రాక్షసుని మాయ నాటకమనే అనుకుంటుంది. రాముణ్ణి చూస్తే ఏమన్నా నమ్ముతుందేమో రాముడైనా నాలాగా వృక్షం మీద నుండి క్రిందకు దూకి వస్తే నమ్మక పోవచ్చు. ఆ రాముడైనా- ఇక్కడున్న లంకలోని వారందర్నీ సంహరించి లంకంతా రోదనాలతో నింపితే- అప్పుడేమన్నా కాస్త నమ్మకం కలిగి గుర్తు పట్టవచ్చు. అప్పుడైనా ప్రక్కన లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకొని వస్తేనే నమ్ము తుందేమో గూడా! నేను రామచంద్రుని బంటునని చెప్పి ఈమెను నమ్మించడం కంటె ఇంకో నూరు యోజనాల విస్తీర్ణం గల సముద్రాన్ని లంఘించడమే తేలిక. ఇంతదూరం వచ్చి అమెను చూసి మాట్లాడకపోతే నేను ఏమి సాధించి నట్లు ? కానీ ఇందులో ఒక సంగతి వుంది. తన భర్త శౌర్యపరాక్రమ సంపత్తులు తెలియనిది కాదు గాబట్టి తప్పకుండా ఆ రాముడు తన సేవకుణ్ణి ఒకణ్ణి పంపించవచ్చని సీత నిరీక్షిస్తూ వుంటుంది."

"సుగ్రీవుని తోడి రాముని మైత్రి సంగతి దేవికి తెలియదు. కాబట్టి, నేను ఆ సంగతి ముందు చెప్తే బావుంటుంది. శాఖామృగ రాజ్యాధిపునితో సఖ్యం కలిసిందంటే సీతాన్వేషణా కార్యక్రమం సుకరమై, తానిలా వచ్చాననే విశ్వాసం గూడా కలుగజేసిన వాణ్ణవుతాను. అదీగాక ఆమె రఘురామునితో కలిసివున్న వనవాసకాలంలో ఎన్నోరకాల జంతువులతో మచ్చిక ఏర్పడి, వారి సేవాదరాలనుగూడా పొంది వుండవచ్చు. భూజాత వైదేహికి దేహాంతర్గత

జ్ఞానం చైతన్యం ఎక్కువ అనుకోడంలో గూడా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇంతటి ఈ వనంలో ఎక్కడా ఒక్క కోతి గూడా కనిపించడంలేదు, ఒక్క నేను తప్ప! బయటి నుండి ఈ లంకలోకి క్రొత్తగా ఒక కోతి రావాలంటే అది ఈ శతయోజన విస్తీర్ణ సముద్రాన్ని దాటి రావాలి. అలా రాగలిగిన కోతి వట్టి కోతి మాత్రమే అనుకోడానికి వీల్లేదు గదా! లేకపోతే రావణుడే ఇలా కోతి రూపంలో వచ్చాడనుకోవాలి, కాని దానవేశ్వరుడైన ఆ రావణుడు దేవతలను, దిక్పాలకులను తన చెప్పుచేతల్లో పెట్టుకున్నవాడు. అంతటి తన మదానికి ఒక చిన్న వానర రూపం ధరించి వస్తాడా? వచ్చినా వైదేహికి ఆశ కల్పించ గలడా? ఆశ కల్పించడానికైతే మాత్రం తనకున్న దుర్మదాంధత్వానికి రాముణ్ణి స్తుతిస్తాడా? వట్టిమాట! పోనీ ఒకవేళ పరిహాసానికై ఒక కోతి చేత తనను శ్రీరాముడేనని ఆమెను నమ్మించడానికి చెప్పిస్తాడేమోనని ఊహించడానికి గూడా వీల్లేదు. ఎందుకంటే వాడికి ఈ జన్మకే కాదు, వెయ్యి జన్మలకు కూడా హాస్యము, పరిహాసము లాంటివి దూరమే! ఒక అర్థజాములో నాకు అర్థమైన వాని స్వభావం ఇన్ని నెలలుగా ఇక్కడున్న సీతమ్మకు తెలియకుండా వుంటుందా?"

## ఏ భాషలో - ఏ విషయం చెప్పాలి?

"ఎలా మొదలు పెట్టాలి? ఏ భాషలో మాట్లాడాలి? ఎక్కడ నుండి మొదలుపెట్టాలి? అన్నవే ప్రస్తుత ప్రశ్నలు. ఒక ప్రక్క ఆకాశంలో వేగుచుక్క గూడా పొడిచిన సమయం ఆసన్నమైంది– (ఫలానివారు ఇంట్లో వున్నారో లేదో కనుక్కొని రమ్మని యజమాని సేవకుణ్ణి పంపినపుడు, వాడు వెళ్ళి వచ్చి, లేడ'ని చెప్తే, ఎక్కడకు వెళ్లారుట?' అని యజమాని అడిగితే— 'కనుక్కోలేద'ని సేవకుడంటే, ఆ యజమాని ఆ సేవకుణ్ణి ఏం మెచ్చుకుంటాడు? అలాంటి సేవకుణ్ణి అధముడంటారు.) ఉత్తముడైన సేవకుడైనా, దూత అయినా, యజమాని చెప్పిన దానిని అర్థం చేసుకుని, చెప్పిన దానిని మించి దోషము లేకుండా, సంపూర్ణంగా చేస్తేనే– ఆ యజమానికి సంతృప్తి కలుగుతుంది. తూకంలో అయినా సరిగ్గా సరిపోయినపుడు కంటె మొగ్గు వుంటేనే ఎవరికైనా తృప్తి గదా! కాబట్టి నేను వట్టిగా సీతమ్మను చూసి

"ఈవిడ వియోగ భారం సహించడం రామునికే చెల్లు, రాముని వియోగ భారం వహించడం ఈమెకే చెల్లు. మరి ఏ ఇతర దంపతులైనా అయితే అంతటి ఓర్పు ఉండేది కాదు, అంతటి ధైర్యం వుండేది కాదు. ఒక విధంగా చూస్తే వియోగాన్ని గూర్చి ఆలోచించే సందుగూడా ఈ రాక్షస స్త్రీలు ఇవ్వకుండా తల్లిని ఇబ్బంది పెట్టారు, పెడుతున్నారు."

'తను ఇక్కడకు వస్తున్నపుడు రాముడు-' హనుమా! నువ్వెవరో ఆమెకు తెలియదు. నీకు ఆవిడ తెలియదు. నువ్వు నే చెప్పిన తీరునుబట్టి ఆమెను గుర్తుపట్టినా, ఆమె నిన్ను గుర్తుపట్టలేదు. ఈ ఉంగరం ఇవ్వు. కొంత వరకు అర్థం చేసుకోవచ్చు' అన్నాడు. ఆ మాటలు హనుమకు గుర్తువచ్చి "ఇప్పుడున్న స్థితిలో తన విభుని మాటలు పలకాలి. అయితే ఆమె ఇప్పుడు ఎవ్వరినీ నమ్మేట్టులేదు. నా సంగతి చెప్పినా ఇదేదో ఆ రాక్షసుని మాయా నాటకమనే అనుకుంటుంది. రాముణ్ణి చూస్తే ఏమన్నా నమ్ముతుందేమో! రాముడైనా నాలాగా వృక్షం మీద నుండి క్రిందకు దూకి వస్తే నమ్మక పోవచ్చు. ఆ రాముడైనా- ఇక్కడున్న లంకలోని వారందర్నీ సంహరించి లంకంతా రోదనాలతో నింపితే- అప్పుడేమన్నా కాస్త నమ్మకం కలిగి గుర్తు పట్టవచ్చు. అప్పుడైనా ప్రక్కన లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకొని వస్తేనే నమ్ము తుందేమో గూడా! నేను రామచంద్రుని బంటునని చెప్పి ఈమెను నమ్మించడం కంటె ఇంకో నూరు యోజనాల విస్తీర్ణం గల సముద్రాన్ని లంఘించడమే తేలిక. ఇంతదూరం వచ్చి ఆమెను చూసి మాట్లాడకపోతే నేను ఏమి సాధించి నట్లు ? కానీ ఇందులో ఒక సంగతి వుంది. తన భర్త శౌర్యపరాక్రమ సంపత్తులు తెలియనిది కాదు గాబట్టి తప్పకుండా ఆ రాముడు తన సేవకుణ్ణి ఒకణ్ణి పంపించవచ్చని సీత నిరీక్షిస్తూ వుంటుంది."

"సుగ్రీవుని తోడి రాముని మైత్రి సంగతి దేవికి తెలియదు. కాబట్టి, నేను ఆ సంగతి ముందు చెప్తే బావుంటుంది. శాఖామృగ రాజ్యాధిపునితో సఖ్యం కలిసిందంటే సీతాన్వేషణా కార్యక్రమం సుకరమై, తానిలా వచ్చాననే విశ్వాసం గూడా కలుగజేసిన వాణ్ణవుతాను. అదీగాక ఆమె రఘురామునితో కలిసివున్న వనవాసకాలంలో ఎన్నోరకాల జంతువులతో మచ్చిక ఏర్పడి, వారి సేవాదరాలనుగూడా పొంది వుండవచ్చు. భూజాత వైదేహికి దేహాంతర్గత

పోవడమే గాదు, మాట్లాడి సందేశాన్ని రామునికి తెలపాలి. అప్పుడే నా దౌత్యం సార్థక మవుతుంది."

"రావణుడు అంతటి శౌర్యపరాక్రమ ప్రతాపాలతో నిక్కచ్చిగా మాట్లాడినా- సీతమ్మ వాణ్ణి ఏమాత్రం లెక్కచేయకుండా ఖరాఖండిగా మాట్లాడటం చిత్రం! ఆమె మాటలలోని స్పష్టత, ఆమె నిశ్చయాత్మక బుద్ధిని తెలియపరచే విధంగా వుంది. నిజంగా ఇటువంటివారి ప్రసంగం వాణీదేవికే సంభ్రమాశ్చర్యాలను కలుగ చేస్తుంది! శ్రీరాముడలా గాదు. ఎంతవరకు మాట్లాడాలో అంతవరకే తూచి, తూచి మాట్లాడతాడు. ఆపదలో వున్నప్పుడు గూడా సీత అలా రావణునితో ముభావంగా, భయపడుతూ మాట్లాడలేదు. అలా నిష్కర్షగా నిక్కచ్చిగా, నిర్భయంగా, నిర్మోహమాటంగా మాట్లాడడం సీతమ్మ సొత్తు. రాముని మాటలు మొదటిసారి విన్నపుడు- రాముని మాటల్లోని మాధుర్యం కంఠధ్వని ఈ భూమండలంలో ఎక్కడా ఎవ్వరికీ వుండవేమో, అని అనుకున్నాను- కాని ఇక్కడ సీతమ్మ మనోజ్ఞమైన కలకంఠధ్వనిలో సరస్వతీ వీణాతంత్రుల మధుర తరంగాలు మనోహరంగా లాస్యం చేస్తున్నాయి."

"రాముని సేవకుణ్ణైనప్పటి నుండి- సేవాధర్మానికి కట్టుబడి కాక- ఆయన గాంభీర్యానికి, ఆ గాంభీర్యానికి తగిన కంఠరావానికి ముగ్ధుడనై ఎక్కువ మక్కువతో సేవించుకుంటున్నాను. మంచి విషయాలను వింటే సాధువర్తనులకు ప్రీతి హెచ్చి కుతూహల పడతారు. రామచరిత్ర కంటె సద్విషయం ఏముంటుంది? కాబట్టి, ఆశ్రీరామ చరిత్రనే వినిపిస్తానుసీతమ్మకు. ఇన్నిరోజులనుండి బాధాకరమైన విషయాలనే వింటున్న సీతమ్మకు హృత్పద్మ వికాసం, ముఖపద్మ విలసనము జరిగేలాగా రామచరిత్ర వినిపిస్తాను. అయితే సంస్కృత భాషలో వినిపిస్తే ఒక చిక్కువుంది. ఇది బ్రాహ్మణుల భాష. ఇక్కడ రాక్షసేశ్వరుడు బ్రాహ్మణుడు. సీతమ్మ అనుమానపడవచ్చు. అందు కని యోగ్యమైన మిథిలానగరవాసుల ప్రాకృత భాషలోనే వినిపిస్తాను. అది సాధారణ మానవుల భాష. అయోధ్యలో గూడా ఎక్కువమంది ఎక్కువ సందర్భాల్లో ఈ ప్రాకృత భాషలోనే మాట్లాడుకుంటారు. ఆ భాషలో రామచరిత్ర వింటే మా సీతమ్మ మనస్సు ప్రసన్నమౌతుంది. లంకలోని వారికిది అంతగా

తెలియదు, నిద్రావస్థలోనే వుంటారు. పైగా రాక్షస స్త్రీలు గూడా కొంచెం దూరంగానే వున్నారు.''

పైన చెప్పిన విధంగా తర్కించుకొని హనుమ- రసాస్వాదన చేయలేని వారికి నిద్రమత్తు కలిగేలాగాను, రసాస్వాదులు జాగ్రదవస్థలో చైతన్యవంతుల య్యేట్టుగాను వుండే కంఠస్వరాన్ని జోడించి చెట్టు పైన కొమ్మల మధ్య వుండి, దూరాన్నుంచి ఏవో మలయమారుత వీచికలు ప్రసరిస్తున్నట్లుగా మృదుమధుర మంజుల మనోజ్ఞంగా రామచరిత్రను వినిపిస్తున్నాడు—

# హనుమ చెప్పిన రామచరిత్ర

"ఇనకుల భూమీశులు- స్వచ్ఛశీల సంపన్నులు, భావవేదులు, సంయ ములు, ధర్మాన్ని భూమిమీద నిలబెట్టిన స్తంభాలు, ఎదురుగా సాన్ని ధ్యాన్నిచ్చే పుణ్యరూపులు. సేవకు అక్షరరూపంలోకాక ఆచరణరూపంలో అర్థం చెప్పాడు దిలీపుడు. దానానికి స్వరూప మేర్పరచాడు రఘుమహారాజు. సతీ-పతులు పూవు-తావివంటివారని తన దాంపత్యంలోనిరూపించాడు అజుడు. ఈ విధంగా మహీతలంలో మాననీయమైన లక్ష్యాలను మానవుల కేర్పరచిన వారు ఇనకులేశులు''-

"కోకిల కంఠంతో కమనీయంగా రామవంశ చరిత్రను ఆంజనేయుడు ఆలపిస్తూంటే జానకీదేవి దుః ఖ పు లో లో తు ల ను ం డి స్మృతి జలం ఉబికి ఉబికి, కన్నుల ద్వారా బయటపడి, కన్నులు చెమ్మగిల్లాయి. నాలుగు దిక్కులూ పరికించి చూసింది. కంఠధ్వని పైనుండే వస్తోందని గ్రహించి గంధర్వగానం లాగా వున్నదని ఆనందిస్తూ ఈ రావణుని వనంలో ఒంటరిగా నిర్లిప్తంగా వున్న తనపై దయ కలిగే ఎవరో ఇలా సత్పురుష చరిత్రను గానం చేస్తున్నారని పులకిస్తూ వుండగా మళ్లీ ఆ గానం కొనసాగింది.''

"సత్యసంకల్పుడు, సాధుప్రవర్తనుడు, సత్య వాక్పరిపాలకుడు, పుణ్య శీలుడు అయిన పంక్తిరథుడు ప్రౌఢ ధర్మ పరాయణుడు. యజ్ఞయాగాది క్రతువులు చేసిన పుణ్యమూర్తి, బుద్ధిమంతుడు, శాంతదయాగుణసముద్రుడు. ఆయనకు భార్యలు ముప్పురిలో కౌసల్య పట్టమహిషి. ఆ కౌసల్య కన్న

కుమారుడు రామచంద్రుడు. నీలమేఘశ్యాముడు. చిన్ననాడే విశ్వామిత్రుని విశ్వాసానికి, అనుగ్రహానికి పాత్రుడై శివధనుర్భంగం చేసి పరశురాముడంతటి వాణ్ణి భూమిమీద నిలువడానికి ఆస్కారం లేకుండా చేసినవాడు. కన్నతండ్రి మాటపై కాంతారవాసుడైతే, కైకేయీసూనుడు వచ్చి అయోధ్యకు తిరిగి రమ్మనమని, తనకు అన్యాయంగా సంక్రమించిన అయోధ్యా రాజ్యాన్ని ఏలుకొమ్మని బ్రతిమాలితే, తండ్రి మాటమీదే నిలబడి, తమ్ముడికి తన బంగారు పాదుకలను ప్రసాదించి, క్రొత్త పరిష్కారాన్ని సూచించిన కరుణామూర్తి. కాంతారవాసంలో ఆ కౌసల్యా సుతుణ్ణి అనుసరించాడు సుమిత్ర పెద్దకొడుకు లక్ష్మణుడు. తోడునీడగా కంటికి రెప్పలా అన్నగారిని, అన్నగారిని వెన్నంటి వచ్చిన వదినగారిని సేవించుకున్నాడు."

"అక్కడ కిష్కింధలో రామయ్య తండ్రిని ఎఱుగున్నవానికి, ఇక్కడ లంకలో సీతమ్మ తల్లిని ఎఱుగున్న వానికే వారిద్దరి మధ్య ప్రేమ ఎలాంటిదో తెలుస్తుంది. ఆ ప్రేమ పంట సీతమ్మను పాపభీతిలేక పౌలస్త్యుడు దొంగిలించాడు. రాముడు లక్ష్మణునితో కిష్కింధకు చేరి ఒకే ఒక బాణంతో వాలిని వధించి, వాలి తమ్ముడైన సుగ్రీవుణ్ణి కిష్కింధకు రాజును చేశాడు. ఆ వాలి సామాన్యుడు గాడు. జగదేక భుజశాలి. అయినా ఆ వాలి శీలవంతుడైన తన తమ్ముణ్ణి నిరాదరించి దేశ బహిష్కరణ జేసి, ఆ తమ్ముని భార్యను అక్రమ మార్గంలో చేపట్టాడు. అందుకే రాముడు జగదద్భుతంగా అతణ్ని ఒక్క బాణంతో నేలకూల్చి రుమను, (సుగ్రీవుని భార్య) కిష్కింధా రాజ్యాన్ని తిరిగి సుగ్రీవుని కిప్పించాడు. రామసుగ్రీవుల సఖ్యానికి స్వర్గలోకవాసులందరూ గూడా సంతోషించారు."

"సుగ్రీవుడు సీతాన్వేషణకై అహర్నిశలూ శ్రమించి, అన్ని దిక్కుల నుండి కపి వీరులను సమీకరించాడు. ఆ సుగ్రీవునికి ఈ భూ భాగమంతా క్షుణ్ణంగా-ప్రతి అంగుళము తెలుసు. ఒక్కొక్క దిక్కుకు ఒక్కొక్క నాయకుని క్రింద కపివీరుల్ని పంచాడు. నాలుగు దిక్కులకు నాలుగు కపి వ్యూహాలను పంపాడు. వాలి సుతుడైన అంగదుని నాయకత్వంలో జాంబవంతాది కపి యోధులతో మేము దక్షిణదిశకు పంపబడ్డాము. నూరుయోజనాల సముద్రాన్ని లంఘించి ఈ లంకకు నేను వచ్చాను. వినతా దాస్యాన్ని తప్పించడం కోసం

ఆమె ఆజ్ఞాను వర్తియై వైనతేయుడైన గరుత్మంతుడు అమృత కలశాన్ని కనుక్కున్నట్లు ఈ జానకీదేవిని చూశాను. యజ్ఞ, యాగాది క్రతువులు నిర్వహించే వారికి నిత్యానుష్ఠాన దేవతామూర్తి అయిన గాయత్రీ తత్త్వమూర్తిని చూపించినట్లనిపించింది. మహాఋషుల తపః ఫల తేజోమూర్తిలాగా వున్న ఆ ధరణీ జాతను చూచాను. జన్మ చరితార్థమైంది. సంకల్పసిద్ధి గల సుగ్రీవుడు, అట్టి సుగ్రీవుని ఆజ్ఞ మేరకు ఈ లంకకు పంపబడ్డ నేను, ఇద్దరము సూర్యవంశీయుల కార్యంలో పాలుపంచుకున్నందుకు, ఆ పని సఫలీకృతమైంది మా జన్మలు సార్థకమైనాయి. జగత్తుకే క్షేమం కలిగింది."

## సీత స్పందన - స్వప్న విశ్లేషణ

ఆత్మానందాన్ని కలుగజేసే ఆంజనేయుని సుస్వర మధుర గానానికి జానకి పులకించి పోయింది. ఒక్కసారి తలయెత్తి శింశుపా వృక్ష శాఖల మధ్య వున్న హనుమను చూచింది.

క్రూర దంష్ట్రిలతో వున్న నోరు, తేనెరంగు కన్నులు, నొక్కుపడ్డ చెక్కిలితోను ఉన్న భీకర వదనం కనబడింది. సర్పంలాగా కనిపించే తోక, వాడి గోళ్లు, బలిష్ఠమైన బాహువులు కలిగిన ఒక భీకరాకారం కనబడింది. ఆకారం భీకరంగా వున్నా పరమ శుద్ధమైన వాగ్విలాస సంపద, బుద్ధిమంత లక్షణము, శౌర్యము కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. తెల్ల నార చీర పోగుల్లా తెల్లని యజ్ఞోపవీతం ఉన్నందున బ్రహ్మచారి అయిన వానరుడై ఉండాలని సీత అనుకున్నది— 'తానున్న శింశుపావృక్ష శాఖను ఏమీ చెయ్యడేమో గాని ఈ వనంలో మిగిలిన వృక్షాలన్నిటినీ తన ప్రతాపాగ్నితో దగ్ధం చెయ్యగలడేమో అన్నట్లున్నాడు. అయితే- ఇంతవరకు తాను విన్న గాంధర్వ గానం పైనుండి ఎవరో వినిపించి వుంటారు. అదే సమయానికి తాను తల పైకెత్తినపుడు ఈ కోతి కనబడడంతో ఈ కోతే ఆ గానం చేసిందనుకుంటున్నానేమో! రెక్కలుగూడా లేని ఈ కోతి అంత సాగరాన్ని దాటి ఎలా రాగలిగిందో? కొమ్మలమీద స్పష్టంగా ఘోర ముఖంతో వున్న కోతి కన్నులనే నమ్ముతుందా? పాటను విన్న తనకనులనే నమ్ముతుందా! దష్టమైన ఈ కాలాన్నే నమ్ముతుంధా ! గుండెల్లో జ్వలిస్తున్న ఆశను నమ్ముతుందా !

అంతా అయోమయంగా వుంది సీత మనస్సు. మనస్సు మనస్సులో లేదు. తనకు కొంతదూరంగా వుండి నిద్రపోతున్న రాక్షస సమూహాన్ని లెక్క పెట్టింది. ఎంతమంది లెక్కకు తేలాలో- అంతమందీ అక్కడ నిద్రిస్తున్నారు. కాబట్టి, వాళ్ళలోని వారెవరూ ఇలా ఈరూపంతో రావడానికి వీలులేదనుకుంది. అయితే ఇదంతా ఆ రావణుని మాయేమో అని కాస్సేపు కళ్లు మూసుకుని తెరిచి—

"కలలో కోతి కనబడకూడదంటారు పెద్దవాళ్లు, కాని ఇంతమహోజ్జ్వల తేజస్సుతో వున్న ఈ కోతి కనబడడం గూడా కీడునే సూచిస్తుందా? అయితే ఇది కల కాదుగదా. ఎదురుగుండా చూస్తున్నాను. మేల్కొని వుండే చూస్తున్నాను కాబట్టి కీడెందుకు అవుతుంది ? ఇది కల కాదనుకోడానికి గూడా వీల్లేదు. లేకపోతే పది నెలలబట్టి ఎక్కడా ఎప్పుడూ ఈ వనంలో వానర వాసనే లేదు గదా ఇప్పుడెక్కడ నుండి వచ్చింది. బయటనుండి రావాలన్నా మహాసాగరాన్ని దాటి రాగలగ లేదుగదా? కాబట్టి తాను చూస్తున్నది కలలోనే నేమో?" అని తికమకపడి అయినా ఆకోతి అక్కడే వుందో లేదా ఎక్కడికైనా వెళ్లిపోయిందో చూద్దామనుకుని, అంతలోనే- 'చూస్తే మళ్లీ కోతి కనబడుతుందేమో ఎందుకొచ్చిందని అనిపించి తలఎత్తి చూడడమే మానుకుని—

"అన్నిటికీ సిద్ధమై ఉన్న నాకు ఇలాంటి కల రానవసరమే లేదు. రామచంద్రుడు లంకకు రావాలనిపించే నా కోర్కెతో దీనికి ముడి ఉంది. నేనిప్పుడు మెలకువగా ఉన్నానో లేదో? ఇప్పుడున్న తెలివి సరియైన తెలివో కాదో? మనస్సుకు నిద్ర రాని స్థితి అంటే ఇదే నేమో ? ఇదొక రకమైన విచిత్ర స్థితి ! ఈ స్థితిలో మనస్సు, కన్నులు, చెవులు కలిసే వుంటాయి. మనస్సు ఏది వూహిస్తే అదే వినబడుతుంది, అదే కనబడుతోంది గూడా! అంతా మనస్సైన స్థితి ఇది."

"రామచంద్రుడు వస్తాడనే కోరిక మనస్సుకు ఆ వూహను కలుగజేసింది. ఆ వూహ వచ్చిందో లేదో వెంటనే ఆ వూహను నిజం చెయ్యడానికా అన్నట్లు, రావణుడు- ఆ రాముడికి ముందర కోతిని పంపే సన్నివేశం కోసం ఒక కోతి- కావలసి వచ్చాయి. మనస్సుకు దాంతో చెట్టుమీద కోతిని సృష్టించడం, ఆ కోతి వెంట కోతి రాజ్యం, ఆ రాజ్యాన్ని కనిపెట్టుకున్న అన్న

దమ్ములు- వాలి సుగ్రీవులు, ఇలా-ఇలా ఒకదానికి ఒకటి అతుకులు పెట్టు కుంటూ తన గొంతెమ్మ కోర్కె ఇంతటి రూపు కట్టుకుంటోందేమో! అబ్బ ఎంత విచిత్రం! ఈ ఆశావ్యూహము మనస్సుకు నేస్తమై, ఏమిటేమిటో కల్పి స్తూంది. ఒక్క శాఖామృగాలేమిటి, వాటితోపాటు అడవులు, అడవిమనుష్యులు సగం కోతిరూపులు, సగం మనుష్యరూపులు, వాళ్లలోనే కొందరు పాలకులు కొందరు పాలితులు ఇలా ఇప్పుడు విన్న కథా కృతిగా ఎన్నైనా వినవచ్చు, కనవచ్చును. ఒక్క లిప్తలోనే వెయ్యోవంతులోనే ఈ మనస్సు తీరిగ్గా వెయ్యి కోతులను గూడా సృష్టించుకొంటుంది గూడా నేమో! ఇది కపే అయివా నాకిక్కడ లేశమైనా కీడు జరక్కూడదు. ఈ కలవల్ల రామచంద్రునికి ఏదైనా జరక్కూడనిది జరిగితే ఓర్చుకోగలనా?"

## సీత మనోవేదన

"ఎదురుగా వచ్చి ఏమీ చెయ్యలేక, ఏవేవో మాయాపథకాలు వేస్తాడు- ఈ రాక్షసరాజు. అంతకీ లక్ష్మణుడు ఆ పథకాలన్నిటినీ దేనికి దాన్ని విశ్లేషించి విడమరచి చెప్పగలుగుతూనే వున్నాడు. కాని దురదృష్టం నెత్తి మీద కూచుండే వేళ ఎప్పుడో తెలియకుండానే మాయలో పడిపోతాం. ఇన్నాళ్లూ తమ్ముడికి అన్న, అన్నకు తమ్ముడే! ఎన్ని రోజులిలా గడపాలో? తను దూరమైన దగ్గఱ నుండి రామచంద్రునికి ఆ లక్ష్మణుడే ఉడకేసిపెట్టడం, ఆ అడవుల్లో ఏమీ జరక్కుండా కంటికి రెప్పలాగా కాపాడుకోవటం గూడా చేస్తూ వుండాలి. సర్వసౌఖ్యాన్ని వదిలి అడవుల్లో సంచరిస్తూంటే అరికాళ్ల బీట్లు విచ్చుతాయి. ఆ పగుళ్లలో ఇందుప నూనెపోసి కాళ్లను రాసే పనిగూడా పాపం ఆ లక్ష్మణుడే చక్కబెట్టాలిగదా! భక్తకోటి గుఱించిచేసే తీవ్ర చింతన వల్ల పగడాల్లాంటి పతి చరణాలు బాగా వేడెక్కితే- నూనె రాసి, చీరచెంగుతో విసురుతూ వుండాల్సిన నా స్థితి, నా గతి ఇలా అయింది. అవతల స్వామి పాదపద్మాలు ఎలాంటి దురవస్థలో వున్నాయో? నా స్వామి పాదాలే గంగా, యమునా, సరస్వతీ నదుల సంగమం, సమస్త మునిజన తపః ఫలాలు. అటు వంటి పాదాల పగుళ్లకు నా పయ్యెద ఒక్కటే పరిచర్యకు తగినది."

"స్వామి అక్కడ, నేను ఇక్కడ, ఇద్దరి మధ్య ఘోర తరంగాలతో

మహాసముద్రం, దీనికితోడు నేను మనస్సున కల్పించుకుని ఇక్కడకు తెచ్చుకున్న ఈకపి. ఈ కపి నన్ను ప్రభువు దగ్గరకు; లేదా ప్రభువును నాదగ్గరకు జేరుస్తుందా? రెండు నెలల్లో మేము తిరిగి వచ్చేస్తామని మా భరతుడు ఎదురు చూస్తూవుంటాడు. ఇక్కడ ఇనకులేశుణ్ణి ఒక రాహువు పట్టి పీడిస్తున్నాడని పాపం ఆ భరతునికేం తెలుస్తుంది?"

"వనవాసకాలం ఐపోవచ్చింది. ఇంక మేము వచ్చేస్తామని అయోధ్య లోని వారందరూ ఎదురుచూస్తూ వుంటారు. అత్తలు ముగ్గురు కళ్లల్లో వత్తులు వేసుకుని ఎదురుచూస్తూ వుంటారు అక్కడ. మా పరిస్థితి ఇలావుంది ఇక్కడ. మనస్సు ఏవేవో కోటిఊహలు చేస్తోంది. అవతల ఇంటివద్ద మా అత్తల కేమైందో? మఱదులు ఎలా వున్నారో ? అక్కాచెల్లెళ్ల మైన మేము ఎక్కడ విడివిడిగా వుండాల్సి వస్తుందో అని తండ్రి వూహించి 'మా అక్క వుంది మాకు' అన్న ధైర్యం కలిగేలా ఆ ముగ్గుర్నీ గూడా మా మఱదులకే ఇచ్చి పెళ్లి చేస్తే- అక్క ఇలా వారికి దూరంగా వుండిపోయింది. ఒక మఱది రాజయ్యాడు, అతని భార్య మాండవి రాణి అయింది అన్న సంతోషం కంటె నా చిన్నచెల్లి ఊర్మిళ ఇంటివద్ద వుండి, నా కంటె సన్యాసినిగా వుందన్న విషయం ఎక్కువ బాధగా వుంది అక్కడున్న వారందరూ, ఎలాగోలా బాధను ఓర్చుకుని దిగమింగు కోగలరేమోగాని నేనిలా అయాను అన్నబాధ ఆ సుమంత్రుని చిత్తాన్ని ఏం చేస్తుందో ఏమో! మామగారు పోయిన తరువాత ఈ బాధను పంచుకోడానికి గూడా ఆ సుమంత్రునికి ఇంకెవరూ లేరు."

ఇలా- జానకి వ్యాకులపడుతూ తన ఈ దుస్స్వప్నం మూలంగా వచ్చే భావనోద్వేగం వల్ల అవతల నిద్రపోతున్న రాక్షస స్త్రీలకు మెలకువ వస్తే ఇంక ఈ విధంగానైనా తన వారిని గూర్చి ఆలోచించడానికి తావు ఉండదనే భయంతో, వాళ్లెలా వున్నారో ఒక్కసారి చూసింది. ప్రాతఃకాలంలో వీచే చల్లని పిల్ల తెమ్మెరలకు వాళ్లు ఆదమరచి నిద్రిస్తున్నారు. కాస్త కుదుటపడి గాలి పీల్చుకుంటూంటే పైన శింశుపా వృక్షశాఖల అలికిడి వినబడింది. అయితే ఇదంతా స్వప్నం కాదన్నమాట. తాను చూచిన కోతి ఇక్కడనుంచి ఇంకో చోటుకి ఎగిరిపోబోతున్నదేమో!' అనుకుంది.

జనం చూస్తే జంతువులకు మరింత కంగారు, వెర్రితనం పుట్టు

కొస్తాయి. ఇది జంతువులన్నిటికీ వుండే సహజ లక్షణం. అందుకని చూడ నట్లుగా వుంటేనే మంచిదని సీత కోతిని చూడలేదు. కాని మనస్సులో మాత్రం కోతి మెదులుతూనే వుంది. "ఆ కపి నిజంగా రాముడు పంపగా వచ్చిన దూతేనేమో! ఆ కపి పలికినవన్నీ నిజమేనేమో! ఇంకొకరైతే అంతటి మహాబ్ధిని దాటి ఇక్కడకు రాగలరా? తప్పకుండా రామచంద్రుని అండతోను, అనుజ్ఞ తోను. ఆశీస్సులతోను వచ్చిన దూతే అయి వుంటాడు. ఆ కంఠనాదం గూడా తాను ఎప్పుడో విన్నట్లుగానే వున్నది. ఆ చెప్పిన వృత్తాంతం గూడా విపులంగా వుంది. అంత కథను కల్పించడం గూడా కష్టమే! ఈ కపి చెప్పింది అంతా యథార్థమే నేమో! అయితే ఇంతకూ ఆ కపి ఆ చెట్టు కొమ్మమీదే వుంటుందో, అక్కడ నుండి ఇంకోచోటు కేమన్నా పోతుందో ఇప్పుడే తెలిసిపోతుంది. కాస్సేపు ఆగితేసరి. రామదూతే అయితే తనంతకు తానే నా యెదుటకు రావాలి గదా!" అనుకున్నది సీత. ఇంతలో–

## సీత ఎదుట హనుమ

సముద్రం మీద నుండి చల్లని గాలులు వీస్తూ వస్తున్నాయి. చెట్ల కాండాలు ఒకదానితో ఒకటి దూసుకుంటున్నాయి. చెట్లకొమ్మలు ఒకదానితో ఒకటి రాసుకుంటున్నాయి. ఈ గడిచెన పదినెలల్లో ఇంతటి చల్లదనాన్ని, ఇంతటి సుఖానుభూతిని సీత ఎన్నడూ పొందినట్లు లేదు. అంతలోనే- చెట్టు నుండి ఎలా దిగాడో, ఎలా వచ్చాడో తెలీకుండా గాలిలోంచి పుట్టుకు వచ్చి నట్లు తన ముందర హనుమ నిల్చొని వుండటం సీత చూసింది.

పగడాలు నూటకట్టినట్లుంది హనుమ ముఖం. ఎదుట వున్న సీతమ్మను చూస్తున్నపుడు హనుమకు ముఖంలో అనుకోకుండానే బాధ, విషాదం, దైన్యం కలిగి ఒక్కసారి నేలమీద సాష్టాంగపడి అవనిజకు అల్లంత దూరాన నిలబడి–

"నేను ఒక స్త్రీ రత్నాన్ని వెదకడం కోసం సంచరిస్తున్నాను. ఇది దక్షిణ దిశా భూభాగం అనుకుంటున్నాను. మనస్సు ఆపుకోలేక నిన్నొక్క సంగతి అడుగుతాను. తప్పైతే క్షమించు తల్లీ! శతవిధాల నువ్వు వశిష్ఠుని

అరుంధతి వసుకుంటున్నాను. అలాకాకపోతే ఆ స్వర్గాధిపతి కోపగిస్తే ఇలా వచ్చిన శచీదేవివా ? అదీ కాకపోతే శశిని వదిలి వచ్చిన రోహిణీ సతివా ? లేకపోతే అగ్నిదేవుని సముజ్జ్వాలా సామ్రాజ్యాన్ని వదిలి దేహాన్ని ధరించి ఇలా చరించడానికి వచ్చిన స్వాహాదేవివా? ఈ భూమండలం మీద ఇంతటి తేజస్వినిని ఎప్పుడూ చూడలేదు. తప్పకుండా ఆ దేవలోకం నుండే ఈ లోకానికి దిగివచ్చిన దానివై వుంటావు. నీ వెవరవో గాని తల్లీ! నీ పద సేవా భాగ్యం నాకు ప్రసాదింపబడాలని చిత్తం కోరుకుంటోంది. నే నింతవరకూ వూహించినదానివి కాకుండా నా అన్వేషణా పుణ్యఫలంగా దర్శన మిచ్చిన సీతమ్మ తల్లివా? ఆ శివ ధనుర్భంగ బాహుబలపరాక్రమశాలి అయిన శ్రీ రఘు రాముని భార్యవేనా? మా కపి ప్రభువు సుగ్రీవుడు ఏ పవిత్రమూర్తికై అన్ని దిక్కులకు పంపిన కపివీరుల అన్వేషణా లక్ష్యదేవతామూర్తివైన సీతమ్మవేనా? చెప్పమ్మా నా మనస్సాగటం లేదు" అన్నాడు. అతి వినయంగా, అతి సౌమ్యంగా, అతి సుందరంగా, అత్యంత గౌరవాదరాభిమానాలతో అడిగిన ఆంజనేయుని సీత చూచి, ఒక్కసారి తీక్ష్ణమైన దృక్కులతో—

"నువ్వు నిజంగా కపివేనా? లేక వంచనతో ఇలా వచ్చావా? ఆకారం భీకరంగా వున్నా, వాక్కు మాత్రం ప్రసన్న మృదుమధురంగా వుంది?" అన్నది.

సీత అడిగిన ప్రశ్నలకు, అన్న మాటలకు హనుమకు కళ్లనిండా నీరు క్రమ్మింది. బాష్పపూరిత నేత్రాలతోనే రెప్పలుగూడా ఆర్చకుండా "తల్లీ! నన్ను నీవు ఇంతగా శంకించావంటే ఆ రాక్షసమాయ నిన్నెంతగా ఇబ్బంది పెట్టిందో నువ్వెంతగా దుఃఖోద్వేగంతో కాలం గడుపుతున్నావో నాకర్థ మౌతోంది. నిజంగా నేను కపినే తల్లీ ! నా ముఖం ఇంత భీకరంగా ఉండ డానికి కారణం నేను కపిజాతి వాడినవడమే ! అయితే వాక్కు ఇలా మృదు మధురంగా ఉంటుందని అందరూ అనుకోడానికి నేను చేసిన పెద్దల సేవ, పెద్దల వద్దనుండి వినయ విధేయతలతో నేను పొందిన విజ్ఞానమో కారణం కావచ్చునేమో నాకు తెలియదు. ఆ సంగతి మాటకేంగాని, ఒక్కసంగతి చెప్పు తల్లీ! నువ్వు మా రఘురాముని ఇల్లాలివేనా? యజ్ఞభూమిలో నుండి వెలువడిన ప్రజ్ఞాప్రసూనమేనా? శివ ధనుర్భంగ ఫల పుణ్యరాశివేనా? అవునంటే నాజన్మ చరితార్థమైందని ఆనందిస్తాను" అన్నాడు.

# సీత చెప్పిన కథా విధానం

హనుమ మాటలను విన్న సీతకు హృదయంలో కొంత ఊరట కలిగినా సంశయం మాత్రం పూర్తిగా పోలేదు. విశ్వాసము పూర్తిగా కలగలేదు. పెదవి విరుస్తూ, ఈ మూడు భావాలు ముఖంలో సూచించే ప్రక్కలతో హనుమ కన్నులలో పొడుస్తూన్నట్లుగాను, అతని ఆత్మలోచనలను త్రవ్వుతున్నట్లుగాను చూస్తూ–

"అవును. నేను రాముని ఇల్లాలినే! రాముని ధర్మపత్నినే! ఆ పాప ఫల వనితనే! ఆ వనవాసి కుల వధువునే! ఆ ధర్మవిదుని అర్ధాంగినే. సరేనా? అయితే నీకేం కావాలిట?" అంటూ మెల్లిమెల్లిగా పెదవి విరుపును తగ్గిస్తూ దయాగుణం పెంచుతూ ఇంకా ఇలా అంది–

"సత్యసంధుడు, దయాపయోనిధి, ఆర్తజన రక్షకుడు. ఋజుమార్గ వర్తనుడు అయిన ఆ దశరథమహారాజు కోడలను. పుత్రుని శివ ధనుర్భంగ ఫలంగా జనకుని ఇంటినుండి సాగివచ్చిన నన్ను చూడంగానే కన్నులు విచ్చి, హృదయమందలి వాత్సల్యము వెల్లివిరిసిన దశరథమహారాజు కోడలినే! తండ్రి ఇల్లు విడిచినా మరో తండ్రి ఇంట కాలుపెట్టాను. అత్త పట్టమహిషి. కాదు నాపట్ల. నేను ఆమె కొప్పులోని మల్లెపూవునే! నా పతిని యువరాజును చేయ సంకల్పించారు మామగారు. ఇంతలోనే ఎక్కడనుండో రేగింది, చెలరేగింది, కుమ్ములోని పొగ రాజుకుంది. రాజుకుంటున్న దాన్ని 'ఉఫ్ఫ్'ని ఊదారు ఉదారు లోకరు. అది రగిలి రగిలి అగ్ని జ్వాలలైంది ఆ పిన్న యత్త హృదయంలో. ఆ పినయత్త కైకేయి మా మామగారికి ప్రాణాల్లో ప్రాణం. ఆయనగారి ప్రాణాలు కాపాడి వరద్వయాన్ని పొందింది. వెంటనే ఇస్తానన్నా కోరకుండా అవసరానికి దాచుకున్నది. భరతుడు రాజవ్వాలి, రాముడు ఊరు వదలాలి అవే ఆమె కోరికలు. కళ్లు నూరియదు, అన్నం తినదు, తల దువ్వదు, మాసిన చీరతోనే కోపగృహంలో ముసుగు తన్ని నిరీక్షించింది. నేనన్నా, నా రామచంద్రుడన్నా ఆమెకు అమిత గారాబమే! అయితే ఏం? మా భాగ్యం ఆ రోజు అలా వుంది. ఆ రోజు చిన్న మఱది భరతుడు ఊళ్లో లేడు. ఇంతకీ దైవం ఆ రోజు మాకలా వ్రాశాడు అనుకోవాల్సిందే!"

"పితృవాక్య పరిపాలనా వ్రతదీక్షితుడైన రామచంద్రుని వెన్నంటినేను, మఱిది లక్ష్మణుడు అనుసరించాము. రాముడు రావద్దని చెప్పినా వినలేదు. ఆ మఱిది. జడలుగట్టి నాకంటె ముందే వనవాసానికి సన్నద్ధుడయాడు. పదమూడేళ్ల అడవుల్లో విహరించాము. ముని పుంగవుల సాన్నిధ్యంలో, ముని పత్నుల లాలనలో పదమూడేళ్లు ఇట్టే గడిచిపోయాయి. మణిమయ కాంతులు విరజిమ్మే ఒక బంగారు మాయలేడి నా కన్నులను దోచుకుంది. నామీద వల్లమాలిన ప్రేమతో నా రఘురాముడు ఆ మాయలేడికై వెళ్లాడు. మాయలేడి వలలో పడలేదు గాని మావారితోపాటు మఱిదిని గూడా నాకు దూరంచేసింది. ఇంతలోనే కపట సన్యాసిగా వచ్చి, నన్ను తెచ్చి ఇలా ఇక్కడ పడేశాడు దుర్మార్గంగా దుష్టుడైన ఈ లంకాధిపతి. నేను శ్రీరామచంద్రుని ఇల్లాలినే" అంది.

## అవధుల్లేని హనుమ సంతోషం

హనుమకు పట్టరాని సంతోషం కలిగింది. అవనిజకు కలిగిన దుఃఖానికి తన రాక కొంత ఉపశమనాన్ని కలుగజేసిందని సంబరపడ్డాడు. తాను చివరి భాగం కథ చెప్తే ఆమె మొదటిభాగం కథ చెప్పిందన్న మాట !. హనుమ సంతోషానికి అవధుల్లేవు. మిగిలిన కథా సాగరాన్ని ఇంక కలసి ఈదాలన్న భావన హనుమ ముఖంలో స్ఫురించింది. హనుమ మళ్లీ ఒకసారి సాష్టాంగ నమస్కారం చేసి–

తల్లీ! నిన్ను చూశాను. తల్లీ! నిన్ను చూడగలిగాను. ఇదంతా నా అదృష్టం. ఆ నీలమేఘశ్యాముడైన రాముడు సుఖంగానే వున్నాడు. నీతో చెప్పమన్నది చెబుతాను" అంటూ మళ్లీ కథ మొదలుపెట్టాడు.

"మాయ లేడి సంగతి తెలుసుకుని అన్నదమ్ములిద్దరూ తిరిగి వచ్చి, నీవు లేకుండా బోసిగా వున్న పర్ణశాలను చూసి బావురుమన్నారు. పర్ణశాలకు అన్నివైపులా వెదికి వెదికి వేసారి, పిలిచి పిలిచి, గొంతు తడారి అలసిపోయారు తల్లీ! నిన్ను చూడంగానే తన సుఖాన్ని, ఉనికిని తెలపమన్నాడు నీ మఱిది లక్ష్మణుడు. పక్షులకు, జంతువులకు భాష రాకపోవటంచేత తమ ముక్కుతో, ముట్టెతో రాక్షసుడు నిన్ను తీసుకువెళ్ళిన మార్గాన్ని దక్షిణ

దిశగా సూచించాయి. అన్నదమ్ము లిద్దరూ అలా వెతుక్కుంటూ దక్షిణదిశగా వెళ్తూ కొసప్రాణంతో వున్న జటాయువును చూశారు. 'నీ ఇల్లాలిని రాక్షస రాజు రావణుడు గైకొని పోయాడ'న్న వార్తను చెవిని వేసి ఆ జటాయువు ప్రాణాలు వదిలాడు." హనుమ చెప్పిన ఈ మాటలు వినంగానే సీత—

"అయ్యో తాతా! నాకోసం ప్రాణాలకు తెగించి పోరాడి, మా రాముని కోసం కొసప్రాణంతో నిరీక్షించి, విషయాన్ని తెలిపి మరీ ప్రాణాలు వదిలావా?" అంటుండగా కంటి వెంట బాష్పాలు జలజల రాలాయి. సీత హనుమను చూస్తూనే--

## సందేహించిన సీత

"ఎన్ని కృత వేషాలు వేస్తావు నువ్వు ? ఎందుకు లేని వినయం, లేని భక్తి నటిస్తావు? నీ అసలు స్వరూపం తెలీకుండా ఎన్ని వేషాలైనా వేస్తావన్న మాట! నీ కెందుకింత చెలగాటం? నా ముందు, నా వాకిట ముందు నీకు పీస మెత్తు కలిసి వచ్చేది లేదని తెలుసుకో రాక్షసాధమా!" అని చతికిలబడి పోయింది. ఆమె కళ్లవెంట కన్నీరు ధారలు కడుతున్నాయి. హనుమ ఆమెను చూసి—

"ఈమె పృథ్వీ జాత. సహజంగానే పృథ్వి గంధవతి(పృథ్వీ గంధవతీ) ఆ పృథ్వీ పరిమళం ఈమె తోయజనయనాల్లో నుండి వెలువడుతోంది. మల్లియల తావి వస్తోంది. ఈమె పరమ పవిత్రమూర్తి. అయినా తనను ఇంకా సందేహిస్తూనే వున్నది అనుకొంటుండగా సీత హనుమను రావణునిగానే అనుమానిస్తూ—

"అప్పుడు సన్న్యాసి వేషం. ఇప్పుడు బ్రహ్మచారి వేషం. లోపల అసాధులక్షణం కనబడనీయకుండా పైకి ఆ సాధు వేషం వేస్తావు. ఎందుకు నువ్వు సాధువుగా వుండవు ? ఈ వెఱ్ఱి వేషాలు మాని లోపలా బయటా ఒకే లాగా ఎందుకు వుండవు ? ఈ దానవత్వం మదమెక్కిన మహిషంలాంటిది. ఇది ఎప్పటికీ, ఎన్నటికీ మంచిని కలుగజేయదు. ఈ కుటిలమైన బుద్ధి కులానికే చేటు కలుగజేస్తుంది, బ్రహ్మ వంశానికే అపభ్రంశమైనది. ఓ రావణా! నీ ప్రయత్నం ఇంక విరమించు. కాదని నన్ను తాకితే నీ తలకాయలన్నీ

నాలుగు చీలికలై, నలభై ముక్కలౌతాయి. జాగ్రత్త! ముందుకు అడుగు వెయ్యకు. ఈ నా శరీరాన్ని కోయించుకుని తిను- నే కాదనను. ఆ నీల మేఘశ్యాముడు రాక పూర్వమే నువ్వు ఈ శరీరాన్ని కోయించినా, వేయించినా అని గుర్తుంచుకో! నే నొక్కమాట అన్నానంటే నాభి దగ్గతే పీల్చిన ప్రాణ వాయువు ఆగి ఇంక పైకి రాదు. ఒక్క అడుగు ముందుకు వేశావంటే నీ అయుర్దాయం చెల్లినట్లే! శ్వాస సాగాలంటే నా మాటమీద విశ్వాసముంచి దూరంగా పో! దురాశాపరుడా!" అంది.

వజ్రఘాతానికి సొట్టబడిన హనుమ చెక్కిలి గుంటలో బాష్పధారలు నిలిచిపోయాయి. అది చూడ్డానికి కొండమీద వర్షం కురిసి వెలసిన తరువాత రాతి పగుళ్ళలో నిలచిపోయిన నీరులా వుంది. సీత, హనుమ చెక్కిలిపై అలా నిలచిన బాష్పధారలను చూసింది. వికటాట్టహాసాలు, ఏకకాల దశకంఠ ప్రరోహాలు లేకపోవడం చూచి, రావణ సహజ స్వభావానికి ఏదో కొంత తేడాగా వుండడం గమనించి 'దానవుడు కాడేమోలే' అని అనుకొని-

"నిజంగా రామదూత వన్నట్లుగానే నువ్వు కళ్ల వెంట కన్నీరు కారుస్తున్నావు ఆ రాక్షసుడు చేసిన మోసమువల్ల నామనస్సే ఏదో అయినట్లుంది. కాని, నా అంతఃకరణానికి నువ్వు ఆప్తుడవుగానే అనిపించి నమ్మమంటోంది. కాని నీ ఆకార సంచలనాలు నాకు అవిశ్వాసాన్ని కలుగజేస్తున్నాయి. ఇంకా నాకు 'ఇది కలయే' అనే భ్రాంతి పోవడం లేదు. ఇదంతా కలలో కోతి ప్రభావమేనేమో! అయినా ఇది కల కాదుకదా! నువ్వు రామునికి కింకరుడివనే నా హృదయం నమ్ముతోంది. కాని సంశయాత్మకమైన మనస్సు మాత్రం ఎందుకో నమ్మలేకపోతోంది, ఏం చెయ్యను? నువ్వు నిజంగా రామదూతవే అయితే నాకు నమ్మకం కలిగేలాగా ఆ మంజువక్తృని, కంజనేత్రుని, కమనీయ గాత్రుని గురించి చెప్పు, విని తేల్చుకుంటాను" అన్నది.

సీత మాటలు విని హనుమ పునః పునః ప్రణామాలు చేసి అంజలి ఘటించి-

## హనుమ చెప్పిన రాముడు

"అమ్మా! మొట్టమొదట నా హృదయంలో అనిపించిన సంగతి

చెబుతాను చిత్తగించు. ఆయన నీకు తగును, ఆయనకు నీవు తగిన దానవు. ఇంతగా ఇద్దరూ ఒకరికొకరు తగిన వారవడం సృష్టిలోనే ఎక్కడా లేదు. మీ ఇద్దరూ ప్రాణము, దేహములాంటివారు. ఎవ్వరూ ఈ రెంటినీ విడివిడిగా చూడలేరు, ఆయన్ని చెప్పడమంటే ఇంకో విధంగా నిన్ను చెప్పడమే అవుతుంది తప్ప వేరేమీ కాదు. సృష్టి ప్రళయోన్ముఖమైన మీ రెండు రూపాలను ఇప్పటి నీలో నేను చూశాను."

"మనోహరత్వంలో మన్మథుడు, ధనుర్విద్యలో ధూర్జటి, ధర్మ నిర్ణయంలో దేవేంద్రుడు, పితృవాక్యపాలనలో ఒక క్రొత్త స్మృతి కర్త, మంజువక్త్రుడు, కంజనేత్రుడు, కమనీయ గాత్రుడు అయిన ఆ రాముడు ఇలాంటివాడు, ఇంతటివాడు అని ఎలా చెప్పగలం? అద్దంలాగా గుండెల్లో నింపుకోగలం. అంతేగాని, అలా నింపుకున్న వానిని గురించి పూర్తిగా అద్దం చెప్పలేనట్లే మనమూ చెప్పలేము. ఆయన సద్గుణాలు చెప్పినవి చెప్పకుండా, వ్రాసినవి వ్రాయకుండా, మూడు కాలాల్లో పుట్టిన మహాకవులందరూ ప్రస్తుతిస్తూ వ్రాసినా, పాడినా తరుగు వుండదు. ఇంకా ఆయన స్వరూప స్వభావాలు తెలియాలంటే ఆయన తన పెద్ద తమ్ముడైన భరతుని చూచే పద్ధతి తెలుసుకుంటే అవగాహన అవుతుంది. నిజానికి తనకంటే చిన్నవాడే ఆ భరతుడు. అయినా ప్రస్తుతం ఆ తమ్ముడే రాజు, తాను రాజప్రతినిధి. ఆ తమ్ముడు ఈయనను దైవంగానే చూస్తాడు. ఈయన ఆ తమ్ముణ్ణి రాజులాగానే గౌరవిస్తాడు. అది తమ్మునిపై వాత్సల్యాన్ని, సంప్రదాయ పద్ధతిని, రాచరికపు మర్యాదను, వ్యక్తిగత సౌశీల్యాన్ని తెలియజేస్తుంది. అన్నిటికన్న చిత్రమేమిటంటే- స్వామి ముఖాన్ని చూస్తున్నపుడు మన కళ్లను మార్చుకోలేము. ఎంత సేపైనా అలాగే చూడాలనిపిస్తుంది. చిత్తంలో ఆయనే రమిస్తూ వుంటాడు. ఎప్పుడూ ముఖంలో మందహాసం తొణికిసలాడుతుంది. స్వామి కోపంగా వున్నపుడు గూడా చిర్నగువు జిలుగు మాసిపోదు. చెక్కిలి, క్రింది పెదవి, చిబుకాల కూర్పులోనే ఆ ఏర్పాటు సహజంగా వుంది. ఆ రఘురాముని బాహువులు రెండూ మోకాళ్ళ జంటను స్పృశిస్తాయి. చేత్తో కోదండాన్ని పట్టుకుని కుడిచేతి వేళ్ల అంచులతో వింటినారిని లాగి ధనుష్టంకారం చేస్తే వీణను మీటినట్లే వుంటుంది."

"నువ్వు కోపాన్ని, దుఃఖాన్ని వదిలి దయతో నన్ను అర్థంచేసుకో! ఎవడి తలమీద కాలుంచి ఇక్కడకు వచ్చానో అట్టి నేను రాక్షసుడనౌతానా? ఓ వనితారత్నమా! నేను నిక్కంగా రామదూతనమ్మా ! నీ పరిస్థితిని చూచి రమ్మని పంపగా వచ్చిన రామదూతను. నిస్సంకోచంగా నన్ను రఘురాముని దూతగా నమ్ము. లేకపోతే శతయోజన విస్తీర్ణ సముద్రాన్ని దాటి రాగలనా?

"రాక్షసకులాంతకుడను నన్ను రఘురాముని దూతగా నమ్ము. నీ అరుణారుణ చరణారవింద భక్తుడైన నీ మఱది లక్ష్మణుడు నీకు తన ప్రణామములు తెలుపమన్నాడు, స్వీకరింపవమ్మా ! సర్వలోక వానరపతి సూర్యసుతుడు సుగ్రీవుడు నీ చరణాలకు సాష్టాంగ ప్రణామాలను తెలిపాడు,దయతో గ్రహించి నన్ను రామచంద్రుని దూతగా నమ్ము. రామదూతగా నన్ను పుట్టించిన ఆ విధాత నా ముఖాన్నిలా భీకరంగా కూర్చాడు, నిష్కారణంగా. ఇది నా కర్మ అనడం కంటే ఏమనుకోగలను? కరుణించి నన్ను సరిగా అర్థం చేసుకోవమ్మా! నన్ను నా స్వామి నమ్మాడు. స్వామి అర్థాంగివైన నీవు గూడా నమ్మవమ్మా ! మీపైనగల నా భక్తి ఫలంగానే ఈ మహా సాగరాన్ని దాటగలిగాను. ఏ శిరస్సుతో స్వామిని తెలుసుకున్నానో ఆ శిరస్సునే నీ ముందు నేలకాన్చి ఉన్నాను. రాముని గురించి వినంగానే ఈ జన్మనెత్తింది మీపద సేవకే అని ధ్రువీకరించుకున్నాను. ఇప్పుడు అలా అనుకోడం నా అహంకారమే నేమో అనిపిస్తోంది సుమా! రాముని దూతగా నా నమస్కారాలు స్వీకరించవమ్మా. రామ గేహినీ ! రాముడు నీ కుశల మడిగాడు లక్ష్మణుడు ప్రణమిల్లాడు. రామసఖుడైన సుగ్రీవుడు నీకు నమస్కృతులు తెలిపాడు. నేనిలా వచ్చి నీకిలా చెప్పడమే ఆలస్యం. అంతే ! ఇంక లంకంతా రామ బాణాగ్నికి దగ్ధమై పోవడమే జరగబోయేదని తెలుసుకో!"

"చివురాకుల స్నిగ్ధత్వంతో, నల్లవిసెపూల ఛాయతో గల చెక్కిళ్లు; కుసుమశరుని కోదండాన్ని, నెలవంక రేఖను గుర్తుకు తెచ్చే కనుబొమలు; పాముపడగల పెను నొసలి ప్రదేశాలు; మీనాల మెఱుపు, చెంగలువ క్రొండాలుతో పోటీవడు కనుకాంతులతో వుండే శ్రీ రఘురాముని వదనారవిందాన్ని నీవు కొద్ది రోజుల్లోనే చూస్తావు. రాక్షస రాజధానీ నగర దహన శిఖలు సాంధ్యరాగాల నేపథ్యంలో నీ హృత్పద్మ సూర్యుణ్ణి చూస్తావు" అన్నాడు.

కంఠము గలిగినవాడు, దుందుభిస్వన నిర్ఘోషుడు, ఇందువదనుడు, సమస్సమ విభక్తాంగుడు, మేఘశ్యాముడు, గంభీరమూర్తి అవక్ర విక్రమ పరాక్రమ సంపన్నుడు."

"త్రిస్థిరుడు, త్రిప్రలంబుడు, త్ర్యున్నతుడు, త్రితాముడు, త్రిస్నిగ్ధుడు, నిత్య త్రిగంభీరుడు, త్రివళిత్య వసతుడు, త్రిపక్ష్మవంతుడు, త్రిశీర్షవంతుడు, చతుష్కలుడు, చతుర్లేఖుడు, చతుష్కిష్కువు, చతురార్థానుష్ఠానశీలుడు, చతుర్గతి విలాసుడు, హృదయానికి ఆహ్లాదకరంగా వుండేవాడు, సత్యధర్మ పరుడు, శ్రీమంతుడు, దేశకాల దశాభేద వివేకి, నిగ్రహాను గ్రహ సంపన్నుడు, మందహాస సుందరాస్యుడు, లోకప్రియుడు-అయినవాడు రాముడు. సౌందర్య గుణగణాల్లో లక్ష్మణుడు గూడా రాముని వంటివాడే! కాని శరీరచ్ఛాయలో రాముడు నీలమేఘశ్యాముడు, లక్ష్మణుడు తప్తకాంచన దేహుడు. రాముడు సూర్యునివంటి వాడైతే లక్ష్మణుడు చంద్రుని వంటివాడు, రాముడు ఆకాశం వంటివాడైతే, లక్ష్మణుడు వాయువు వంటివాడు."

## రామ సుగ్రీవుల కలయిక

"కోదండధారులై నీ కోసం అవని అంతా గాలిస్తూ, అడవిలో సంచరిస్తూ, శివుడు- నందీశ్వరుడిలాగా కనబడే ఆరామ లక్ష్మణులను నేనుచూశాను. మా కపిరాజు సుగ్రీవుడు చూశాడు. మా ప్రభువు సుగ్రీవుడు తన అన్నగారైన వాలిచేత అక్రమంగా తన రాజ్యలక్ష్మిని, గృహలక్ష్మిని గూడా పోగొట్టుకున్నాడు. అంతేకాదు ఈ భూమ్మీద తలదాచుకోవడానికి అంగుళం మేర స్థలంగూడా లేక, ఆ వాలి దుష్ట ప్రభంజనానికి తట్టుకోలేక మతంగ మహాముని కొండగుట్టపై గుట్టుగా కాలం గడుపుతున్నాడు. మతంగ మహాముని శాపం వలన ఆ వాలి అతని అనుచరులు ఆ కొండ ప్రాంతానికి వస్తే తలలు పగిలి చస్తారు. అందువలన సుగ్రీవుడుకూడ ప్రాణాలు కాపాడుకుంటున్నాడు."

"మొదట్లో ఏవో మహా భుజంగాలు చెట్ల పెద్ద పెద్ద కొమ్మల మీద నుండి దూకుతున్నాయేమో ననుకున్నాము. ఆ అనుమానం తీరక, చెట్ల సందులలోపడి తొంగిచూచాము. అవి భుజంగాలు కాదని, కార్ముకధారులైన మోహనాకారులేనని అప్పుడు తెలిసింది. ఇంకేముంది కొంప మునిగింది.

సుగ్రీవుణ్ణి చంపించడం కోసం ఆ వాలే ఎవర్నో పంపినట్లున్నా'డని అనుకున్నాం. కాని వాళ్ల ఇరువురి ముఖాలు చూస్తే మటుకు అలాంటివారు కాదేమో ననిపించింది. పోయి అసలు విషయం తెలుసుకురమ్మని సుగ్రీవుడు నన్ను పంపాడు. నేను వెళ్ళి వాళ్ల సంగతి తెలుసుకొని, మా సుగ్రీవుని సంగతి వాళ్లకి చెప్పి, ఆ ఇద్దర్నీ నా భుజాలమీద ఎక్కించుకొని మరునిమిషంలో మతంగ పర్వతం మీద మా వాళ్లని కలిశాను. కబంధుడు ఊర్ధ్వలోకాలకు పోతూ సుగ్రీవునితో సఖ్యం చెయ్యమని చెప్పిన ప్రకారమే రామసుగ్రీవుల మైత్రి జరిగింది. ఇద్దరు సత్పాత్రుల మధ్య, దేవతాకృతుల మధ్య బంధుర ధర్మపథానురక్తిలో జరిగిన మైత్రి అది. ప్రగాఢ శేముషీ చిత్ర విచిత్రవృత్తుల మధ్య జరిగిన మైత్రి అది. అగ్నిసాక్షిగా జరిగిన మైత్రి అది. ఆ అగ్నిజ్వాలను అనుసరించి వాలి రాచరికం ఆహుతై పోయింది. రాజ్యలక్ష్మితో పాటు గృహలక్ష్మి అయిన రుమను గూడా సుగ్రీవుడు దక్కించుకున్నాడు. ఇంక ఆ అగ్నిజ్వాల లంకను తుదముట్టించి, రాముడు సీతాసమేతుడవడమేమిగిలింది."

"దుష్ట రావణుడు నిన్ను లంకకు తీసుకు వెళ్తున్నపుడు నువ్వు చీర కొంగులో కట్టి జారవిడిచిన నగల మూటను కొండమీద నున్న మేము చూశాము. జాగ్రత్తగా నగల మూటను పట్టుకుని భద్రంగా వుంచాము. మాటల మధ్యలో ఆ నగల మూటను శ్రీరామునికి చూపించి గుర్తు పట్టమన్నాము. ఆ నగలను చూసిన స్వామి కన్నులు ముసురు వానలు నిండిన నల్లకలువ పూవుల్లా అయిపోయాయి. ఆ నగలను వళ్లంతా రాచుకుంటూ దుఃఖనిమగ్నుడై పోయాడు తక్షణ కర్తవ్యాన్ని కార్యరూపంలో పెట్టాడు సుగ్రీవుడు. వాలి వధానంతరం కిష్కింధాధిపతిగా ఎక్కడెక్కడున్న కపి వీరుల్ని కబురుపెట్టి రప్పించాడు. ఎన్ని కోతులు వచ్చాయో చెప్పలేము. ఇన్ని కోతులు లోకంలో ఉండడానికి, నమ్మడానికి వీలు లేనన్ని కోతులు వచ్చాయి. ఈ భూమినే మింగగల రాకాసి కోతు లవన్నీ ! నేల ఈనిందా అన్నట్లు గుంపులు గుంపులుగా తయారైనారు. సుగ్రీవుడు నాలుగు దిక్కులకు ఒక్కొక్క నాయకుని క్రింద కొంతమంది కోతులను కేటాయించి, నీ అన్వేషణకై పంపాడు. ఈ దక్షిణ దిక్కుకు పదహారుమంది ఉద్దండులైన యూథపతుల్ను పంపుతూ, మా వల్లనే పని సానుకూలం కావాలని, అవుతుందని

అంతటి నమ్మకం మా మీద ఉందని చెప్పి, మమ్మల్ని ఉత్తేజపరచి పంపాడు."

## వానరుల త్రికరణ శుద్ధి

"మా జట్టుకు నాయకుడు వాలి సుతుడైన అంగదుడు. అతడు మా కపి రాజ్యానికి యువరాజు కూడాను. అతనికి శ్రీరామచంద్రునిపై భక్తి అపారము. ఒక్క సంగతి చెబుతే అంగదుని భక్తి తెలుస్తుంది. దక్షిణ దిశకు వెతుక్కుంటూ వచ్చిన మేము ఒక చీకటి గుహలో చిక్కుకుని, ఒక మహా యోగిని చేత విముక్తిని పొంది, నీవు కనబడలేదని విచారంతో తెరిగి వెళ్లి పోవడం కంటె ప్రాయోపవేశంతో ప్రాణాలు వదులుదామనుకుంటున్నప్పుడు అంగదుడు—

"ప్రాణాలెలా అయినా, ఎప్పటికైనా పోయేవే! ఆ ప్రాణాలు పోవడానికి ముందు రామచంద్రుని మనోహరాంగన అయిన సీతమ్మతల్లిని చూచిపోవాలి అన్నాడు. మా జట్టులో అందరూ అలాగే నిశ్చయించుకున్న రామభక్తులు. వారు సర్వలంకనూ నాశ మొనరుస్తారు. వాళ్ల రామభక్తి అలాంటిది. అందు కనే నీ జాడ తెలియక కర్తవ్యం తోచనపుడు విలపించారు. అప్పుడే మేం 'జటాయువు మాకన్న ఎంత నయమో!' అని జటాయువు కథ చెప్పుకున్నాం. ఆ కథను విన్న జటాయువు అన్నగారైన సంపాతి అనే వృద్ధ పక్షి చెప్పగా- 'రావణుడు నిన్ను ఈ మార్గంగా లంకకు తీసుకు వచ్చాడని' తెలిసింది. వంద యోజనాల సముద్రం దాటడానికి అందరికీ శక్తి కొంత కొంత తక్కువైతే చివరకు నేనే ధైర్యం చేసి అడ్డంకులు, అవరోధాలు అన్నిటిని దాటి నల్ల మేఘాల మధ్య మెరుపులాగా వున్న నిన్ను చూశాను. ఈ లంకలో గడచిన రాత్రంతా నీ కోసం గాలించాను. నా అదృష్టం ఇప్పటికి ఫలించింది. నీ సంగతి తెలియక ఆలస్యమైందిగాని, ఎందుకూ-ఇంక చూడు నేను వెళ్ళి చెప్ప టమే ఆలస్యం, ఆ రాముడు నీ ఎదుట నిలబడతాడు."

"అవతల వానరులంతా నా రాక కోసం నిరీక్షిస్తూ వుంటారు. నేను వెళ్ళి నీ సంగతి చెప్పంగానే వాళ్లను పట్టలేము ఆనందోత్సాహాలతో ఆకాశం లోకి ఎగిరి గంతేస్తారు. రాముడు రావణుణ్ణి హతమారుస్తాడు. తల్లీ! ఇప్పటి

కైనా నన్ను రఘురాముని బంటుగా నమ్ము. ఇంక ఆ శ్రీరామునికి ఏం చెప్ప మంటావో చెప్పు. అన్నట్లు రాముని వద్ద శెలవు తీసుకుని బయలుదేరినపుడు నన్ను రహస్యంగా పిలిచి— 'నాయనా హనుమా ! నిన్ను జానకి నమ్మచ్చు, నమ్మకపోవచ్చు నువ్వు మాత్రం ఆమెకు దీన్ని అందివ్వు, అని ఇచ్చాడమ్మా" అంటూ బొడ్డున వున్న ముడి విప్పి, ఒక ఉంగరాన్ని తీశాడు. అది రామ నామాక్షరాలు కలిగిన ఉంగరం. ఆ ఉంగరాన్ని సీత గ్రహించగానే ఆమెకు వళ్లు తెలియక, మితిమీరిన పరవశోద్వేగంతో కళ్లు తిరిగాయి. నీళ్లు క్రమ్మాయి. చాలా సేపటి దాకా ఆ స్థితిలోనే ధ్యాన నిమగ్నమై చివరకు—

"నా స్వామి ఇంకా ఈ సమస్త ధరణీ మండలాన్ని ప్రళయకాలాగ్ని లాగా తగులబెట్టకుండా వూరుకున్నాడే?' అంది.

## హనుమ సాధు స్వభావం

తీవ్రమైన సీత మాటలకు హనుమ బెదరి, భయపడిపోయాడు. నత శిరస్కుడైనాడు. కళ్లల్లో జాలి నిండింది. కైమోడ్పు వహించి, కరుణ నిండిన హృదయంతో—

"అంతటి మాట అనకమ్మా ! దయచేసి కోపం వహించకు. ఎవడో ఒక్క తుచ్ఛుడు అపమార్గం పట్టినంత మాత్రాన ఈ సమస్త ధరణీమండలానికే నిప్పు పెడితే ఎలాగమ్మా! ఎందుకూ! నెల తిరక్కుండానే అరవిందాక్షుడు ఇక్కడకు రావటం, రక్కసి జాతిని ముక్కలు చేసి, అగ్గిపుల్ల వేసి భగ్గుమని పించడం జరుగుతుంది. అంతవరకూ ఈ ఇలాతలాన్ని ఇలా బ్రతకనీయ వమ్మా! అవతల ఆయన, ఇక్కడ నువ్వూ అలా ఆలోచిస్తారనుకోను. మీ అంతర్యాల్లో మీరుస్థిరంగా వుండి, జగత్తే నాశమవడం మేలౌతుందా?నన్ను, నా చిన్నతనపు మాటను మన్నించు తల్లీ" అన్నాడు.

హనుమ మాటలకు సీత ఆశ్చర్యపడింది. ఈ హనుమకు ఈ జగత్తు మీద ఇంతటి మక్కువా? తప్పకుండా ఇతడు ఏ సృష్టికర్తో అయివుండాలి అనుకొని, ప్రసన్నతతో 'హనుమా ! నీ జన్మ వృత్తాంతం వినాలని కుతూ హలంగా వుంది, నాయనా" అంది. అప్పుడు హనుమ—

"మాల్యవంత మనే పర్వతంమీద అతి బలశాలి అయిన కేసరి అనే ఉత్తమ మునీశ్వరుడు ఉండేవాడు. ఒకనాడు ఏదో పనిమీద గోకర్ణ పర్వత ప్రాంతంలో తిరుగుచుండగా దేవర్షుల ఆదేశానుసారం 'శంబసాదను' డనే రాక్షసుణ్ణి ఘెల్లున మధ్యమ త్రొక్కి సంహరించాడు. ఆ కేసరి మా తండ్రి. తల్లి అంజనాదేవి. వాయుదేవుని అనుగ్రహంవల్ల నేను పుట్టాను. ఆ వాయు దేవు డెంతవాడో నేను అంతవాణ్ణి." అని చాలా సంక్షిప్తంగా తననుగురించి చెప్పాడు. హనుమ మాటలు విన్న సీత—

## సీత హృదయం

"నిజం చెప్పావు కపిరాజా, నువ్వు నిజంగా వాయుదేవు డంతటి వాడివే! నూరు యోజనాల వారధిని దూకావు నువ్వు. ఆ శ్రీరాముడు గూడా దూకగలడో లేడో నా కనుమానమే ! నిజంగా మా ఇద్దరి అదృష్టం కొద్దీ నువ్వు మాకు దొరికావు. ఇంక ఆలస్యం చెయ్యకు. వెళ్ళి స్వామిని తీసుకురా. ఇక్కడ లంకను అగ్నిదేవుని కాహుతి చెయ్యాలి. నువ్వు రాముని దూతవని నాకు మొదటి నుండీ తెలుసు నాయనా! వట్టి బాహుబల, జవసత్వ, వేగాలేనా, వాటితోపాటు బుద్ధిబలం గూడా వుందా అన్నది తెలుసుకోడానికి కాస్త పరీక్షించాను. అంతే! బుద్ధి, శౌర్యము, వీర్యము లేనివాడవైతే మా రఘురాముని కెలా వచ్చినవాడివౌతావు? నిన్ను పంపేటప్పుడు అక్కడ రాముడే కాదు ప్రక్కన మా మఱది లక్ష్మణుడు గూడా వున్నాడు. ఇంతటివాడివి కాకపోతే మా మఱది పరీక్షకు తట్టుకుని, ఇలా వచ్చేవాడివి కావు. నా రామునికి ఇరు వైపులా లక్ష్మణుడు, నువ్వూ వుంటే వేరే తన చేతు లక్కర లేకుండానే రావణుణ్ణి మట్టుపెట్టగలడు. నీకు ఈ నూరు యోజనాల సాగరం గోష్పదీ కృతమే! పవన సుతునివైన నీ ధాటికి ఎవరు తట్టుకోగలరు? నీ కాలి గోటికి పరిరారు ఈ రాక్షసి మూక యీవత్తూ."

"ఓ ధీశాలీ, వాగ్విదాం వరా ! ఇన్ని రోజుల నుండీ నా రాముని క్షేమాన్ని తెలుసుకుందామన్నా, అడుగుదామన్నా ఒక్కడు గూడా నాకు కన బడలేదు. చెప్పు. నా రామచంద్రుడు సుఖంగా వున్నాడా? నేను దూరమైన తరువాత నా రాము డెలా వున్నాడు? ప్రొద్దున్న లేచిందగ్గర నుండీ రాత్రి

ఏదో సాధించినట్లు తోక ఎగరేస్తున్నాను, అనుకుంటున్నాడు. అప్పుడు సీత మళ్లీ —

"నామీద నా నాథునికి ఎంతో ప్రేమ అని చెప్తావుగదా! ఒక్కవిషయం అడగనా ? స్త్రీయందు పురుషునికి రెండు రకాల భావాలుంటాయి. ఒకటి స్వామ్యత్వము. ఇది అధికార గుణ సూచితం. రెండవది స్వాత్మత్వం. ఇది ఐక్యతా గుణ సూచితం. పురుషుడు స్త్రీ యందు రమించక, ఆమెకు తాను స్వామినన్న అహంకారం ప్రధానంగా వుంటే అది స్వామ్యత్వ లక్షణం. ఆమె తనలోని భాగమే అని ఆమె యందు రమించడం స్వాత్మత్వ లక్షణం రామునికి నాపై గల ఎడబాటు బాధను చూశావు గాబట్టి నేను చెప్పిన పై రెండు లక్షణాల్లో నా నాథునికి నాయందు ఏది అధికమో చెప్పు" అంది. అందుకు హనుమ —

"ఆ సుగ్రీవునికి రుమపై వియోగాన్ని చూశాను. రామభద్రునికి నీపై వియోగాన్నీ చూసాను. రెంటినీ చూసినా పోల్చడానికి ప్రయత్నించను గాని ఒక్క సంగతి చెప్తాను. ఒకరోజు ఏదో మాట్లాడాలని స్వామి దగ్గరకు వెళ్లాను. ఆ సమయంలో చిక్కని చక్కని వెన్నెల-కన్నుల పండువులా వుంది. స్వామి హా సీతా ! అని ఆ వెన్నెల రాత్రి మూర్ఛను పొందాడు. అప్పుడక్కడకు సౌమిత్రి వచ్చి "మారుతీ ! రాముడు రాత్రీపగలూ కూడా ఒక్కరోజునైనా తృప్తిగా భోజనం చెయ్యటం లేదు! అన్నాడు. ఒకసారి– స్వామి ఎక్కడో విశాలమైన పర్వతం మీద మంచి వెన్నెట్లో ఉత్తరీయం వరచి పడుకున్నాడు. ఎందుకనో కాస్సేపటికి నిద్రపట్టక అక్కడ నుండి వెళ్ళిపోయాడు. నేను భక్తితో వెళ్ళి స్వామి పడుకుని వెళ్ళిపోయిన చోట పడుకుందామనుకున్నాను; తీరావెళ్ళి పడుకుని చూద్దునుగదా! ఆ పడుకున్న చోటంతా మంటలుమండేంత వేడిగా వుంది. భుజాన ఒక కోదండం వ్రేలాడుతూ, ఒక జంగమ మూర్తిలాగా పర్వతాల గుట్టలమీద, లోయల వెంబడి, వాగుల వెంబడి స్వామి తిరుగుతూండడం మా వానరు లందరం చూస్తూ వుండేవాళ్లం. అలా పోతూ వుండే ప్రదేశాలలో మేమూ దూరంగా వుండి స్వామిని గమనిస్తూ వుండేవాళ్లం. ఒక్కొసారి స్వామి 'సీతా' అంటూ పెట్టిన కేకలు పర్వతగుహల మధ్య గింగిర్లెత్తుతూ ప్రతిధ్వనించేవి" అన్నాడు. హనుమ వినిపించిన రాముని విరహబాధకు సీతకు నిలువెల్ల కన్నీరై పోయింది. హనుమను చూసి—

# సీత గత స్మృతులు

"రామునికి ఇంతటి ప్రేమ నామీద వున్నదంటే వెంటనే రాకూడదా నాయనా ! నిజంగా కనక ఇంతటి ప్రేమ వుంటే ఆనాడు అరణ్యాలకు తాను బయలుదేరుతూండగా నేనూ మీతో వస్తానంటే వద్దన్నాడే ! అంటే ధర్మం కోసం నన్ను రావద్దన్నా డనుకోవాలా ! ధర్మంకోసం ఎంతటి పనినైనాసరే చెయ్యడానికి సిద్ధపడతాడన్నమాటే గదా ! ఏమైనా నృపాల ధర్మం ఆయన దగ్గఱే నేర్చుకోవాలి" అని అంతవరకూ తనచేతిలోనే వుంచుకున్న ఉంగరాన్ని కళ్లతో తదేకంగా చూసి, చూసి–

"ఈ ఉంగరం వెనక మధురమైన కథ వుందయ్యా హనుమా ! ఒక రోజున స్వామి నిద్రపోతూంటే నేను- ఆయనకు తెలియకుండా ఈఉంగరాన్ని తీసి నావ్రేలికి పెట్టుకున్నాను. స్వామి నిద్ర లేచి చూసుకుంటే ఉంగరం కనబడలేదు. ఏ నదిలోనో జారిపోయిందేమో అనుకొంటుండగా-నేను మెల్లగా నా వ్రేలి నుండి తీసి ఆయనకు ఇచ్చి నవ్వాను. దీన్ని ఒక పెద్ద శృంగార లీలగా చెప్పుకున్నారు, ఆనాడు మేమున్న ఆశ్రమ ప్రాంతంలోని వృద్ధ తపస్వినులు. అప్పటి మా ఇద్దరి ప్రేమ కథా విశేషాలు సెలయేళ్లకు తెలుసు, నదులకు తెలుసు. ఇప్పటి నా దుఃఖ కథా వ్యవహారం ఈ సముద్రానికి, ఆ ఆకాశానికి తెలుసు. అయితే నా యీ దుఃఖం తెలిసిన ఈ సముద్రము, ఆకాశము రెండూ గూడా నీ బాహు వేగానికి లొంగిపోయాయి. రామ లక్ష్మణులు వాడియైన బాణాలతో, అస్త్రాలతో ఈ సముద్రాన్ని లొంగదీయ గలరు. మీరు రాక్షసుల్ని యుద్ధంలో చీల్చి చెండాడవచ్చు. ఇంకోవిషయం, వాలి రావణునికి మిత్రుడన్న సంగతి ఇంతకు పూర్వమే నేను విన్నాను. ఆ పాపియైన వాలినివధించి, రాముడు సుగ్రీవుణ్ణి దగ్గరకు తీశాడు. ఇలాజరగడం గూడా ఒకందుకు మంచిదేలే! ఎందుకంటే- వాలి గనక బ్రతికి వుంటే- మీరు రావణుడితో యుద్ధం చేస్తుంటే స్నేహితుణ్ణి ఆదుకుందామని అటునుంచి వాలి తన వానర సైన్యంతో వచ్చి వుండేవాడు. కాబట్టి ఇలా జరగడం రాజనీతికి కొంత అనుకూలంగానే వుంది. ఇంకో చిన్న విషయం గూడా తెలుసు

కున్నాను. ఈ రావణునికి విభీషణుడని ఒక తమ్ముడున్నాడు. చాలా శాంత మైన స్వభావం గలవాడు. నన్ను రామునికి అప్పచెప్పమని కొలువులో తన అన్నగారైన రావణునితో చెప్తూ వుంటాడు. అతని పెద్ద కూతురి పేరు 'అనల'. వాళ్లమ్మ ఆ అమ్మాయిని నా దగ్గరకు పంపిస్తూ వుంటుంది. నాకీ సంగతులన్నీ ఆ అమ్మాయే చెప్తూ వుంటుంది. ఈ విషయం గూడా మనకు అనుకూలంగానే వుంది. ఆలస్యం చెయ్యకుండా మనవాళ్లు విజృంభించి ఇక్కడకు రావడమే ఇంక మిగిలివున్న పని. ఇబ్బందులు లేని శత్రువుని పరాభవించడం కష్టం కాని, స్వంత తమ్ముడైన విభీషణుని పేరుతో ఇబ్బందిని పడే రావణుని ఎదుర్కోవడం తేలిక. మీరంతా వచ్చి కార్యాన్ని చక్క బెట్టండి. లోపల బడబాగ్ని బద్ధలై ఇక్కడి స్త్రీ, బాల, వృద్ధుల్ని దహించి వెయ్యక మునుపే మీరంతా వెంటనే రండి."

"ఆ రాక్షసుడు పెట్టిన సంవత్సరాంతపు గడువుగూడా రెండుమాసాల్లో పూర్తవుతుంది. నెల తిరక్కుండానే రఘురాముణ్ణి తీసుకురా హనుమా! నన్ను వీళ్లు కోసుకుతింటారుట ! ఈ మాట వింటుంటేనే నాకు అసహ్యం వేస్తోంది. చచ్చినా మనం ఇలాంటి మాటలు అనలేము. ఇలాంటి పనులు చూడలేము. మీ అంగదుడు అన్నాడని ఏదో చెప్పావు నువ్వు ఇంతకుముందు, ('ప్రాణాలు ఎప్పటికైనా, ఎలాగైనాపోయేవే. ఆ ప్రాణాలు పోకముందు ఒకసారి ఆ రామ చంద్రుని ఇల్లాలైన సీతను చూసిం తర్వాతనే పోవటం మంచిది' అని అంగదుడు అన్నాడని హనుమ చెప్పాడు.) అలాగే 'ప్రాణాలు పోకముందు ఒకసారైనా నా రాముణ్ణి చూసే అదృష్టం నాకున్నదంటావా?

"చెట్ల ఆకుల కదలికకు కలిగే మంజుల స్వనాలతోను, ప్రాతఃకాలపు చల్లని గాలులతోను పర్ణశాల కిటికీలగుండా వచ్చే పిల్లతెమ్మెరల తరంగాలకు సంపెంగ రెక్కల్లాగా స్నిగ్ధ సుకుమారంగా విచ్చుకునే నా రాముని కను రెప్పలు నాకు గుర్తుకు వస్తున్నాయి. హోమ సమయంలో రేగిన పొగ కళ్లను ఎఱ్ఱ తామర పూవులులాగా చేసి ఇబ్బంది పెడుతూంటే-చెంతనే వున్న నన్ను, నా చిత్తాన్ని మెత్తగా స్పృశించే నా రాముని ఓర చూపులే నాకు గుర్తుకు వస్తున్నాయి."

"ఏవేవో ఉబుసుపోకకు ఆ కబుర్లు ఈ కబుర్లు చెబుతూ చాల్లే ఇంక

నిద్రపోదాం అంటూనే మళ్లీ ఏదో మొదలుపెట్టి, నా కళ్లు మూసుకుపోతూ వుంటే మధ్యలో ఏవో సరస హాస్యపు మాటలతో ప్రొద్దుపోయేవరకు అలా చెబుతూ చెబుతూనే నేనూ తానూగూడా నిద్రపోయే వాళ్ళం అవన్నీ గుర్తుకు వస్తున్నాయి. ఆయన కళ్లే నా కళ్లల్లో మెరుస్తున్నాయి. ఇంకా రెండు నెలల కాలం ప్రాణాలు కూడగట్టుకొని ఉండగలనా? ఈ పది నెలలు తిండి, నిద్ర లేక బ్రతికి వున్నానంటే ఈ రామవార్త వినడం కోసమే! 'సముద్రాన్ని దాటాను. భూజాతను చూశాను. నేను చూసినపుడు నీ పద భక్తురాలైన సీత బ్రతికేవుందని చెప్పు రామునితో, అంతకంటే ఇంకేం చెప్పమని చెప్పను" అన్నది. సీత మాటలను విన్న హనుమ–

# హనుమ నిర్ణయం

"అమ్మో ఈ మహితాత్మురాలు యోగిని, నిర్మమురాలు, నీతివిశారద, యుద్ధనీతి కుశల, భక్తురాలు, దీనురాలు. ఈమె సాక్షాత్తు అగ్నిశిఖ. ఇటువంటి ఈమెకు నేను చెయ్యగలిగింది, చెప్పగలిగింది అంటూ ఏముంటుంది క" అని అనుకొని–

"నేను వెళ్లడమేమిటి, ఆయన రావడమేమిటి, ఈ రాక్షస సంహారం జరగడమేమిటి- ఏమాత్రం సందు లేకుండా అన్నీ జరుగుతాయి. ఏ యోగ శక్తిచేత గడచిన పదిమాసాలు దేహాన్ని నిలపగలిగావో ఆ యోగశక్తిచేతనే మహితాత్ముడైన రాముణ్ణి అనుగ్రహించు. నన్ను మన్నించు తల్లీ! 'రామ కార్య హితారంభు'డనే పేరు నిల్పి,మహిమాన్వితమైన మహాసాగరాన్ని దాటిన వాణ్ణనే మర్యాద ఆ చంద్ర తారార్కము నాకు దక్కేటట్లు అనుగ్రహించు తల్లీ! ఆ రామచంద్ర ముఖపద్మాన్ని చూడాలనే వాంఛ నీకు దుర్భరమైతే ఇంకెందుకు ఆలస్యం. నీ పద పల్లవాలతో నా భుజాల మీద అధిరోహించు. నీ పతి దగ్గర దించుతాను. నా అంసఫలకం మేరుసానువు వంటిది. దీనిపై నిన్ను క్రొత్త పెళ్ళి కూతురును పల్లకీలో మోసుకు వెళ్లేటట్లు తీసుకువెళ్ళి రామప్రభువు దగ్గర దించుతాను. బాగా దట్టంగా అల్లుకొనిన నా దేహం మీద రోమాలు నీకు పట్టుపరుపులాగా వుండి, నీ నవపల్లవ కోమలారుణారుణ చరణాలకు మెత్త

దనాన్నిచ్చి పుణ్యం మూటకట్టుకుంటాయి. ఇలా చెయ్యడం వల్ల రామచంద్ర ప్రభువుకు ఏదైనా కించిత్ మర్యాదా లోపం అవుతుందనుకుంటే వెంటనే ఇవాళ నిన్ను ఎలా తీసుకు వెళ్తానో రేపు అలాగే తీసుకువచ్చి ఇక్కడ దించు తాను. మనం ఎలా వెళ్ళింది, ఎలా తిరిగి వచ్చిందీ ఆ రాక్షసులకే అంతు పట్టక దిగులుతో గుండెలు నీరసించాల్సిందే!" అన్నాడు. హనుమ మాటలకు సీతమ్మ నవ్వి—

## హనుమ సామర్థ్యం

"నాయనా హనుమా! ఎంతటి ఉత్సాహమయ్యా నీది! అయితే నీ ఆశకు సరిపోయే లాగా నీ రూపం వున్నదంటావా ? నేను నీ అంసఫలక మెక్కితే నా కాళ్లు నేలకంటుతాయి గదా! అన్నది. అప్పుడు హనుమ- "నువ్వు తల్లిగా ఇలా నన్ను అన్నావు గాబట్టి నేనేమీ అనలేను. కాని ఒక్క సంగతి చెబుతా- నా యీ భుజాలమీద రామ లక్ష్మణు లిద్దరినీ ఎక్కించుకున్నాను. అనంతుడు తన వెయ్యి పడగలతో ఈ సమస్త భూమిని మోయగలిగినట్లు నేను నా భుజా లతో మోయగలను. గగనవీధిలో గరుత్మంతుని వేగాన్ని మించిన వేగం గలవాడిని. సూర్యోదయం దగ్గఱ నుండి అస్తమయం వరకూ సూర్యునితో పాటే ఆకాశంలో గమిస్తూ, ఆయన దగ్గర నవవ్యాకరణ శాస్త్రాలను చదువు కున్నాను. శివలింగం యొక్క పానుపట్టాన్ని చుట్టుకొని పట్టుకొని వుండే శేషునిలాగా నా తోకతో ఈ లంకను యావత్తు చుట్టి, పెల్లగించి, రఘు రాముని పద సమీపములో పెట్టి నువ్వు స్వామిని చూడగలిగేలాగా చెయ్య గలను. వాళ్లూ వాళ్లూ ఎదురుపడి, అక్కడే యుద్ధం చేసుకుంటారు; నా పని పూర్తవుతుంది. అసలు స్వామి ఆ రావణుని ప్రాణాలు తీసుకు రమ్మనలేదు గాని లేకపోతే ఈ లంకాయాగాన్ని నేనొక్కణ్ణే, ఇక్కడే సంపూర్తి చేసివుండే వాణ్ణి. నా భుజాలమీద నిన్ను ఎక్కించుకుని ఆకాశమార్గంలో పోతున్నప్పుడు ఉగ్రులైన దానవులు చూసి వెంటపడి ఏమన్నా చేస్తారేమోనని నీకు భయమా? ఆ భయం నీకు అక్కర్లేదు. నా తోక చివరతో నేను చేసే మహా విచలనానికి పుట్టే సుడిగాలి దుమారంలో పడి- ఉక్కిరి బిక్కిరై, ముక్కలై సముద్రంలో పడి నామరూపాల్లేకుండా చచ్చిపోతారు. ఎప్పుడెప్పుడు ఎంతెంత వాడుగా అవడం అవసరమో- అప్పుడప్పుడల్లా అంతఅంతవాణ్ణి కాగలను. కోరుకున్న,

అనుకున్న పనులను సాధించి ఫలప్రదం కావించడంలో కల్పవృక్షం లాంటి వాడిని" అంటూ విజృంభించసాగాడు.

విజృంభిస్తున్న ఆంజనేయుణ్ణి సీతచూస్తూ ఉండిపోయింది. ఆ విక్రమానికి అవధులు లేనట్లుంది. మేరుపర్వతంలా భాసిస్తున్నాడు. ప్రచండ అగ్నిహోత్ర ప్రభలాగా ఉన్నాడు. తామ్ర వక్త్రంతో, వజ్రదంష్ట్ర నఖాలతోను, భయంకరమైన ఆకారంతోను వున్న హనుమను కళ్లప్పగించి చూస్తూ వుండిపోయిన సీత కాస్సేపటికి తమాయించుకుని-

# సీత నిర్ణయం

"నీ ఆకృతి చాలా భయంకరంగా ఉంది. ఇంక ఉపసంహరించు" అనంగానే హనుమ పూర్వపు చిన్న రూపంతో నిలబడ్డాడు. అప్పుడు సీత-

"నువ్వు ఎంతటివాడవని చెప్పాలో అంతటివాడివేనయ్యా! నువ్వు నీరధిని దూకానన్నపుడు మొదట్లో చాలా ఆశ్చర్యపడ్డాను. ఒక్క సముద్రమేమిటి ఇంకా మూడు సముద్రాలైనా అవలీలగా దాటగలవు. నీపట్ల నీరధులు పిల్లకాలవలే! నాయనా హనుమా! రాముని తలంపు నాకు ఇప్పుడు చిత్రంగా అనిపిస్తోంది. శత్రువులందరినీ నిశ్శేషంగా నింగికి పంపించగల నువ్వు దూతగా వుండగా ఇంకా ఆ రాముడు ముల్లోకాలకు భీతిని కలిగించే కార్యాన్ని చేపట్టడం, కపివీరు లందఱినీ సంఘటితపరచడమూ మరి దేనికయ్యా! నన్ను నీ భుజస్కంధాలమీద తీసుకువెళ్లడం ఎందుగ్గాని ఆ అన్నాదమ్ములిద్దరినీ ఈ దైత్య సంహారానికి వెంటనే ఇక్కడికి తీసుకురా! ధనుర్ధారులై ఆ అన్నాదమ్ములిద్దరూ నిలబడితే వారిముందు యక్షులైనా, రాక్షసులైనా, దేవతలైనా నిలవగలరా ? రామచంద్రుని నయన కమలం కొద్దిగా ఎఱ్ఱపడి అరమూత పడినా సమస్త భూతజాలానికి అస్తమయ తమస్సే గదా!"

"నీ భుజాలమీద నేను ఎక్కినా, ప్రచండమైన నీ గమన వేగానికి నేను తట్టుకోలేక సముద్రంలోకి వ్రాలిపోయినా పోవచ్చు. కాబట్టి ఇంతకంటె నువ్వు వెంటనే రామ లక్ష్మణు లిద్దరినీ ఇక్కడకు తీసుకురావడమే వెయ్యిరెట్లు మేలు. పర పురుషుణ్ణి స్పృశించనని చెప్పడం నిన్ను పరాభవించడమే

అవుతుంది. నువ్వు పరాయివాడి వెలా అవుతావు? నువ్వు పాపం లేనివాడివి. పాపం అంటని బిడ్డవు. వెంటనే వెళ్ళి రఘురాముణ్ని తీసుకురా. నీ సముద్ర లంఘనం గూడా సత్ఫలవంతం అవుతుంది. బిడ్డ పని చేసిపెడితే బిడ్డడే పని చేసి పెట్టా డంటారు. పురుషుని ప్రయోజకత్వం ఏముంటుందిక ! రాముడు ప్రయోజకుల్లో ప్రప్రథముడు. ఆ రావణాసురుణ్ని నువ్వూ చంపగలవు, లక్ష్మణుడూ చంపగలడు. పూర్వం వాలిగూడా రావణుణ్ని జయించాడు. రావణుణ్ని జయించగలవారు లేరని కాదు. ఆ రావణునికి ఏ శిక్ష విధించి ఎలా చంపాలో నా రఘురామునికే తెలుసు. చూద్దాం ఎలాంటి శిక్ష విధి స్తాడో ! 'తండ్రి చేస్తే ఒకటి, కొడుకు చేస్తే ఇంకోటి అవుతుందా ?' అని నువ్వూ నేనూ అనుకోవచ్చు. కాని ఈ విచిత్రలోకం అలా అనుకోదు నాయనా!" అన్నది.

## నొచ్చుకన్న హనుమ

'సీత అన్నమాటలకు హనుమంతుడు సిగ్గుపడినా- ప్రశంసింపబడినట్లు గాను, లాలింపబడినట్లుగాను, ప్రేమింపబడి, గౌరవింపబడినట్లుగానే మనస్సులో తలచాడు. కాస్సేపు ఏం మాట్లాడలేదు కొంతసేపైన తరువాత-

"తల్లీ! నేను నిత్య బ్రహ్మచారిని. ఎంత బిడ్డనైనా, తాను కన్న బిడ్డే అయినా తన కళ్లతో చూచినపుడు పెరిగినట్లుగానే కనబడతాడు. అలా పెరిగిన బిడ్డైనా ఈ లోకంలో పరాయిపురుషునితో సమానంగానే చూస్తారు. పర పురుషుణ్ని స్పృశించను అన్న పలుకులు మూడు లోకాలవాళ్ళూ మెచ్చుకునేవే! నువ్వూ, ఆ రఘురాముడు పూజ్యులు. రఘువంశీయుల కోడలవు. అందుకు తగ్గట్టుగానే మాట్లాడావు. స్త్రీలందరకూ నీ చరణములు శిరోధార్యములు. నేను లక్ష్మణునికంటే గొప్పవాణ్ణా? అతడు బాణాదులచేత చేయగల పనులను నేను నా బాహుహస్త పదాదులలో చేస్తాను. అంతే భేదము. ఆ భేదమైనా ఎందుకొచ్చిందంటే ఆ లక్ష్మణుడు నరుడు, నేను వానరుడను. కాని నేను ఇక్కడకు వచ్చి సీతను చూశాను అని చెప్తే దానికి, తగినంత ఆధారముగాని. గుర్తుపట్టేది గాని వుండకపోతే నావంటివాణ్ణి గూడా నమ్మడం కష్టమౌతుంది. కాబట్టి నువ్వేదైనా నాకు అనుగ్రహించు తల్లీ!" అన్నాడు.

# సీత సమయస్ఫూర్తి

హనుమ అలా అనంగానే సీత అర్థం చేసుకుంది. తన మాటలకు హనుమ కొద్దిగా మనస్సులో నొచ్చుకున్నట్లు గ్రహించింది. అతనికి ఆ బాధ పోయే విధంగా కొంత ప్రశంసాపూర్వకంగా–

"నీ బాహుబలమే నీకు అభిజ్ఞానము. వేరే అభిజ్ఞానం కావాలా? (అంటే 'నువ్వు ఇక్కడకువచ్చి నన్ను చూడగలిగావు'-అన్నదాన్ని నమ్మడానికి గుర్తుగా నీ బాహుబలమే చాలు. వేరే నేనేదో దాన్ని ధ్రువపరుస్తూ నా దగ్గఉన్న వస్తు వేదైనా ఇవ్వాల్సిన అవసరం లేదు అని అర్థం.) సర్వలోకాలకూ నీ సత్యవచనమే అందుకు అభిజ్ఞానం. ఇంతటి పుణ్యశీలుడైన నిన్ను, నీమాటను మహానుభావుడైన రఘురాముడు నమ్మకుండా వుండలేడు! 'సీతను చూశాను' అని నువ్వంటే– 'ఆ! హనుమ సీతను చూసి వచ్చాడు' అని రాముడు అను కోవడమేగాని మరోలాజరుగదు. అయినా 'సీతను చూశాను'అని ఈ భూమ్మీద ఇంకొకరెవరైనా చెప్పగలరా? నీ భుజబల విక్రమం మరి ఎవరికుంటుందని అలా చెప్పగలరు?' 'గుర్తు కావాలని' అనడం ఏదో ఎగతాళి కంటున్న మాట లాగా వుంది. నాలుగు దిక్కులాసాగే నీ తండ్రైన వాయుదేవుడే నీకు అభి జ్ఞానం. రాఘవుని సత్యదర్శన శక్తే నీకు అభిజ్ఞానం. ఇక్కడ నిన్ను, అక్కడ లక్ష్మణుణ్ణి విడిచిపెడితే ఈ భూమ్మీద మిత్రుడు అని చెప్పగల వారెవరు చెప్పు ? నీ సత్యవాక్య ధోరణిలో యమధర్మరాజు తీరు, అగ్నిహోత్రుని పవిత్రత గోచరిస్తాయి. సర్వజీవకోటికి నీ తండ్రి వాయుదేవుడు ప్రాణము. నువ్వు జగత్పతికే ప్రాణము."

"వానరులు నన్ను వెదకడానికి నాలుగు దిక్కులకు వెళ్లారని చెప్పావు. అందులో దక్షిణ దిక్కుకు వచ్చింది పదహారుమంది యోధులన్నావు. ఈ పదహారుమంది యోధుల్లోను మళ్లీ ఏరిఏరి [illegible] రాముడు నీకు తన ఉంగర మిచ్చాడు గదా! నువ్వు మళ్ళీ ఆయన ఉం[illegible] తిరిగి ఆయన చేతికి ఇవ్వు. నిరంతర బాష్పధారల కన్నులతో చూడబడిన ఈ ఉంగరమే- 'నువ్వు నన్ను చూసి, ఈ ఉంగరాన్ని నాకు ఇచ్చావనే నమ్మకాన్ని రామునకు కలిగిస్తుంది. ఈ ఉంగరం యువరాజు పదవిని సూచించేది. చిక్కకూడనివాడికి ఈ

ఉంగరం చిక్కితే తప్పకుండా అతను అహితచర్య చేయవచ్చును. అల్లాంటి ఉంగరాన్ని మహితాత్ముడైన రాముడు నీ చేతికి ఇచ్చాడు. నిన్ను మించిన హితుడు రామునికి ఎవరైనా ఉంటాడా?"– 'అమ్మ నాకు కనిపించింది' అని చెప్పు చాలు. అంతకంటె అభిజ్ఞానము అనవసరం. ఒకవేళ రాముడు నిన్ను 'అమ్మను తీసుకుని రాకపోయావా?' అంటే, 'తీసుకురమ్మంటావా?' అను అంతే! నీకు అభిజ్ఞానం ఇస్తే నువ్వు దాన్ని తీసుకుని వెళ్ళిపోతావు. ఇన్ని రోజులకు ఇలా వచ్చిన నీవుగూడా వెళ్ళిపోతే ఈ మహారాక్షసుల మధ్య నాకు దిక్కెవరు చెప్పు? పరాక్రమానికి పరాకాష్ఠ అయిన పరమాత్మను చెప్పి తరువాత నిన్నే చెప్పాలి. అంతటి వాడివైనా నువ్వు నన్ను తల్లిగా భావిస్తు న్నావు. మరి బిడ్డ వినకూడని రహస్యంగాని బిడ్డదగ్గర దాచవలసిన విషయం గాని వుంటాయా?"

## సీతారాముల ఏకాంత విషయాలు

"అరణ్యవాసానికి వచ్చినపుడు ముందుగా చిత్రకూటంలో ఉన్నాం. ఒక పర్వతానికి క్రింద ప్రాంతంలో ఒక రెల్లు పాకను వేసుకుని వున్నాం. పుష్పఫలభరితమైన సుందర తరు లతా వన సంపదతో వున్న ఆ పర్వతం ఎంత అందంగా వుండేదో! అయినా పర్వతాల గురించి నీకు చెప్పాలా? అన్ని రకాల ఆకర్షణలతో విహారయోగ్యంగావున్నా తిండితినకుండా వుండలేం గదా! పాపం మరది లక్ష్మణుడు ఏలోటూ రాకుండా ఆహార వ్యవహారాలన్నీ చూస్తూ వుంటే- అడవుల్లో వుండడం గూడా ఎంతో ఆనందంగా వుండేది. రాజకుమారుడిగా యథేచ్ఛగా అయోధ్యలో తిరగడానికి అవకాశం లేదు కాని అడవుల్లో నన్ను వెంటపెట్టుకొని గుట్టలు ఎక్కడం, గుహల్లో దూరడం, చెట్లు ఎక్కడం. చెరువుల్లో జలకాలాట లాడడం- మీ స్వామి మహా స్వతంత్రంగా వుండేవాడులే! మునిపల్లెల్లో తిరిగి తిరిగి, కాళ్ల బొప్పికట్టి దానవులతో దారుణ యుద్ధాలు చేసి చేసి, వనవాసం ప్రాతబడి ఇప్పుడైతే పెద్దమనిషి తరహాలో కనబడుతున్నాడు గాని అప్పుడు ఎప్పుడూ చిలిపిగా, చలాకీగా, క్రీడాభిరాముడి లాగానే వుండేవాడు. అప్పుడాయనకు మహా వుంటే పాతిక యేళ్లుంటాయేమో! ఆటపాటలలో నేను వెంట వుండాల్సిందే! రానని, రాలేనని అనడానికి వీల్లేదు."

"నాకై నేను ఆయన వెంటబడి అడవులకు వచ్చాను గదా, ఆయన మాట కాదనటానికి వీల్లేదు మరి ! ఒక్కొక్కచోట గోతుల్లోకి దూకుతూ పోవాల్సివచ్చేది. చెట్లు ఎక్కాల్సివచ్చేది. చేతులు నేలమీద ముందుకు వంచి మృగాల్లాగా సంచరించాల్సి వచ్చేది గూడా!"

"కలువ తూడుల గొట్టాలతో తేనెలను పీల్చుకుంటూ వుండేవాళ్లం. మెల్లగామెల్లగా వెనకవైపుగా వెళ్ళి చెట్లకొమ్మలమీది చిన్నచిన్న పిట్టలను పట్టుకొనేవాళ్లం. సీతాకోకచిలుక రెక్కలు పట్టుకుని గుట్టకొమ్మలపై నుండి దూకేవాళ్లం. జనపదాల్లోని పిల్లలు ఆడే ఆటలు ఆడుకునేవాళ్లం ఆనాడు. అయితే తల్లిదండ్రుల ఆటలు తనయులకు ఏమనిపిస్తాయో ఆలోచించకుండా చెప్పేస్తున్నాను. ఒకరోజున ఏం జరిగిందో తెలుసా ? ఏరులొంచి కోసుకుంటూ వచ్చిన నీటితో పూర్తిగా నిండి వున్న ఒక పెద్దచెరువులోని నీటిలోకి నన్ను త్రోసి, మళ్లీ నన్ను పైకి తియ్యడానికి తాను దూకి, ఆ నీళ్లలో నన్ను పట్టుకోడానికి ఆడుతూ, నీళ్లు చిమ్ముతూ నానా హడావుడీ చేసి, చివరకు నన్ను పట్టుకున్నాడు. నేను వదలకుండా ఆయనకు తీగలాగా చుట్టుకు పోయాను. ఇద్దరం ఒడ్డుకు చేరాము. వళ్లు ఆరబెట్టుకొని తామరపూవుల సెజ్జపై చేరాము."

## కాకాసుర కథ

"నా తొడమీద తన తల పెట్టుకుని స్వామి నిద్రపోతున్నాడు. తెలిసీ తెలీకుండా అలవోకగా నా కనురెప్పలు గూడా అప్పుడే మూతపడ్డాయి. అంతలోనే ఏదో ఎక్కడో బాధ పుడుతోందనిపించి కొద్దిగా మెలకువ వచ్చే సమయంలో- రొమ్ముమీద కలిగే ఆ బాధ తెలిసి, కళ్లు తెరిచి చూద్దునుగదా- ఒక కాకి నా వక్షం మీద ముక్కుతో పొడుస్తోంది. నిద్రమత్తులో వున్న నాథుని కిదేం తెలియదు. ఆ నిద్రమత్తులోనే ఒద్దికగా ఒత్తిగిలి పడుకుంటూ, ఆ లోపలే నా చేతులను స్పృశిస్తూ, పరవశిస్తూ, అతి రమణీయంగా తామర మొగ్గలాగా విచ్చుకుంటున్నాడు తన కళ్లు కొద్దిగా తెరవడానికి ప్రయత్నిస్తూ, ఒక్కసారి ముద్దుగా నవ్వి, మళ్లీ కళ్లు మూసుకుని నిద్రపోయాడు. నేను

కదిలితే నాథునికి నిద్రాభంగం అవుతుందేమోనని, ఆయనమీదగల ప్రేమకొద్దీ, అలానే బాధను సహిస్తూ వుండిపోయాను. నాకూ నిద్ర వస్తోంది. కాని, కాకి నా మీద మీదకు రావడం మానడం లేదు. నేను అతినెమ్మదిగా దాన్ని తోలడానికి ప్రయత్నించాను కాని చిత్రం, అది ఎంతసేపటికీ కదలిపోదు. తారాడుతోంది. దగ్గరకు వచ్చినపుడు వక్షం మీద గీఱుతోంది. నేను వారించినా అది పోదు. అదంతా దానికి ఒక ఆటలాగా తయారైంది. ఇంతలో స్వామికి నిద్రాభంగం అవనే అయింది. కళ్లు సగం తెరుస్తూనే నా వక్షంమీద నెత్తురు గీరలను చూసి, తన సహజ పరిహాస ధోరణిలో—

"నీ పతినైన నేను నిద్రపోతుంటే- నీకు నామీద 'రాగం' మరింత ఉబుకుతుందల్లే వుంది. లేకపోతే నా గోరు గూడా తాకని నీ వక్షం మీద ఆ రాగరేఖ లేమిటి?' అంటూ మళ్ళీ నిద్రలోకి జారుకున్నాడు. (రాగం= ఎఱుపు, ప్రేమ అని అర్థాలు; రేఖలు=చిహ్నలు, చారలు అని అర్థాలు;) చెప్పొద్దూ ! నాకు కోపం వచ్చింది. నాక్రోధం వచ్చినట్లు నాథుడు చూడ లేదు. నిద్రలోనే వుండిపోయాడు. కాకి మళ్ళీ వక్షాన్ని జేరి గీరింది. స్త్రీ ప్రకృతి ఎంత విచిత్రంగా వుంటుందో చూశావా హనుమా! స్త్రీలు తమ స్వంత విషయానికి సంబంధించిన బాధను బయటకు చెప్పరు. అలా సిగ్గు తెరచాటునే బ్రతుకుతూ వుంటారు. తల్లితో చెబుతారు. మళ్ళీ తనయులతోనూ చెబుతారు. కాని అదేం చిత్రమో భర్తతో చెప్పడానికి సిగ్గు పడతారు. ఆమె బాధను భర్త గ్రహించుకొని అడగాలి. ఇలా తప్పనప్పుడు తప్ప మామూలుగా చెప్పరు. చూడు ఒక ప్రక్క కాకి వక్షాన్ని గీఱడానికి వస్తోంది. నాథుని లేపి- 'మాయకాకి లాగా వుంది. దీని సంగతి చూడండి' అని ఒక్కమాట అంటే చాలు. బాధ పడుతున్నానేగాని 'ఈ కాకి చూడండి ఇక్కడ ఎలా గీరేస్తోందో' అని చెప్పలేకపోయాను. ఈ విలక్షణ మనస్సుతోనే స్త్రీజన్మ యావత్తు గడిచి పోతుంది. వక్షం నెత్తురు ముద్దైంది. స్వామి ఒత్తిగిలడంతో వళ్లు నెత్తురుకు తడిసి మెలకువ వచ్చింది. ముక్కు ఎఱ్ఱగాను, కళ్లు గర్వంగాను వున్న ఆ కాకిని కోపంగా చూస్తూ, నావైపు ప్రశ్నార్థకంగా చూశాడు. నేను కళ్లు వాల్చి, అవునన్నట్లు తల వూపాను. అప్పుడు గూడా ఆ గడుసు కాకి, మీదకు వచ్చి

వక్షాన్ని తాకడానికి ప్రయత్నించింది. స్వామికి కోపం పెరిగి ఒక గడ్డిపరకను బ్రహ్మాస్త్రం లాగా మంత్రించి దానిమీదకు వదిలాడు.

"ఆ కాకి ఇంద్రుని బిడ్డ అయి వుండడం వలన ఇంద్రలోక, బ్రహ్మలోక, శైవలోకా లన్నిటికీ వెళ్ళి వెళ్ళి, ఎక్కడా ఆశ్రయం దొరక్క, మళ్ళీ స్వామి పాదాలనే ఆశ్రయించాడు. బిడ్డలాంటి కాకిమీదనే అలాంటి బ్రహ్మాస్త్రం వేసిన స్వామి– కళ్లకు గంతలు కట్టి నెత్తిమీద కొట్టినట్లు చేసిన ఇప్పటి ఈ రాక్షసాధముని ఏం చేస్తాడో చూడాలి. శ్రీరాముని విషయంలో మూడురకాల చిత్రాలు చూడవచ్చు. మొట్టమొదట్లో ఎంతగానో ప్రేమించి, అటుపైన రాజ్యం నుండే వెడలగొట్టి, దుఃఖాలపాలు చేసిన కైకమ్మ విషయం ఒక చిత్రం. రాముణ్ణి ద్వేషించి, చివర్లో మేలు చేకూర్చిన కబంధుని విషయం మరో చిత్రం. రామునిచేత శిక్షింపబడి చావు తప్పి కన్ను లొట్టై చివరకు రాముని ఆశ్రయాన్నే పొందిన ఇప్పటికథలోని కాకాసురుని విషయం-ముందు రెంటికన్న మరీ విచిత్రం లాగా అనిపించటం లేదూ!"

## సీత అభ్యర్థనలు

"మెడలో తాళికట్టాడు, ఎడమపాదాన్ని మెట్టాడు: కుడిచేతిని పట్టాడు- అనే చనువుచేత నేను రాముని విషయాన్ని ఏదో పలచని వూహలతో విశ్లేషించానేమో! ఇందువల్ల పాపంవస్తే ఆపాపాన్ని నేను పొందాల్సిందే! దయతో నన్ను క్షమించు- దాశరథీ! కరుణాపయోనిధీ! మా జనకుడు యజ్ఞయాగాది నిర్వాహకులు, బ్రహ్మవేత్తలు అనే భావం నా మెదలో ఒకప్రక్క ఉన్నదో ఏమో, ఆ కూడని వూహ ఈ నాటికిలా నన్నీస్థితిలో వుంచిందేమో ! నన్ను క్షమించు, దాశరథీ; కారుణ్యవారాన్నిధీ! నీ వెంటబడి అడవికి వస్తున్నపుడు గాని, నువ్వు రాక్షసులను వధించేటప్పుడుగాని, నువ్వు నన్ను అపారమైన ప్రేమానురాగాలతో చూసుకుంటున్నపుడు గాని నీపట్ల నేను వెలితిగా ప్రవర్తించానా? నాయెడ దోషం లేదుగదా! ఉన్నట్లైతే నన్ను క్షమించు రఘువరా! జానకీ మనోహరా! కైకేయి మాటగా రాజ్యాన్ని భరతునకిచ్చినపుడు, గుహుడు గంగను దాటించగా అడవులను పట్టినపుడు- ఏదైనా నాయెదలో భాగవతాపరాధం జరిగితే క్షమించు రఘువరా ! జానకీ మనోహరా ! ఏకాంతంగా

వున్నపుడు ప్రేమాతిశయంతో నీవు నా పాదాలను పట్టుకొని, నీ పాదాలకు జంటగా స్పృశింపజేసినపుడు-దుష్టకామావిలచిత్తంతో అదేదో నువ్వు ప్రేమాతిశయంతోనే చేశావని ఎంచి, ఏమీ వారించకుండా వుండిపోయాను. సాధ్వీ లక్షణానికే వంకతెచ్చాను, నన్ను క్షమించు, రఘువరా! జానకి మనోహరా! స్వామీ ! నువ్వు నాహృదయాధి నాథునివి. నేను గడ్డిపరక లాంటిదాన్ని. ఈకలాంటిదాన్ని. హృదయాంతర్గతమైన అజ్ఞానాన్ని- నీపై భక్తి అనే నందకంతో తుదముట్టిస్తావనే నమ్మకంతోనే నీయందు నా ప్రాణాలను నిలబెట్టుకున్నాను. నన్ను రక్షించు నాథా! నువ్వూ, నీతమ్ముడూ జ్ఞానులే ! అయినా నాకోసం, నామాటమీద, అజ్ఞానులై మాయలేడి వెనకపడ్డారు. లక్ష్మణుడు మరిదే కాదు. చెల్లెలిభర్తగూడా! అయినా నా అమర్యాదకు తల ఒగ్గాడు. ఈ తప్పు నాతోనేపోయేటట్లు ఇద్దరూ తోడై కాపాడండి ప్రభూ! ఇంకా ఒక్కనెల దాటి నేను బ్రతికి ఉండను. నీ కమల నయనాలను కనే భాగ్యమే నాకు కలుగజేయాలనుకుంటే- నువ్వు వారి సముద్రానికి వారధినే నిర్మిస్తావో, ఈ కపీశ్వరుని అధిరోహించే వస్తావో నీ ఇష్టం, నీ దయ."

'నీమీద ఆధారపడి వున్నాను హనుమా ! నా నాథునికి నువ్వు చెప్పే దాన్నిబట్టి వుంటుంది స్వామి ఏంచేసేది? నువ్వు మేలైన బ్రహ్మచారివి. నీకు ఈ భార్యాభర్తల ప్రేమగోలలు తెలియవు. ఈ ప్రేమల్లో కోటివిధాలు. విభిన్న ప్రవృత్తులు, స్థూలంగా కనబడే సుందరు లందరూ పతులనుకుంటూ కాలగమనంలో ఏఏ విధాలుగా ప్రవర్తిస్తారో, ఏమైపోతారోచెప్పలేం! ఇదంతా నీకు గందరగోళం. ఈ జగత్తంతా కామంతో లగ్నమైవుంటుంది. ఈ కామం ఎంత చిత్రాతిచిత్రమైందో జగద్విభుడైన రఘురాముడు గూడా చెప్పలేడు. శ్రీరాముడు ధర్మకీర్తులందు కామంకలవాడు కాదనుకున్నావా ఏమిటి? "ఈమె నా భార్య. ఎవడో దీన్ని అపహరించుకు పోయాడు. వాణ్ణిచంపి, నాకాంతను తెచ్చుకొని, సుఖంగా వుంటాము" అని భావించే వాడి భార్య ఈ భూమ్మీద కృతార్థురాలు. పది ధర్మాలు భుజాన వేసుకొని, ఆభార్యనే పట్టించుకోనివాడు నాథుడనే పదానికి (న+అథ='ఇంతకంటె పైన ఎవరూలేరు అనే వాడెవరైనా వుంటే వాడు నాథుడు'- అని నాథ అనే పదానికి అర్థం) తొమ్మిది కాదు తొంభై శబ్ద శాస్త్రాలు చదివినా, నేర్చినా- స్త్రీ ఒప్పించి చెప్పగలిగేటట్లు

పురుషుడు చెప్పగలగడం కష్టం. నువ్వు స్వామికి సరసంగా ఎలా నచ్చచెబుతావో మరి! చూచింది చూచినట్లుగా, విన్నది విన్నట్లుగా తూచినట్లు చెప్పాలి- 'నెలదాటి సీత బ్రతుకదు' అని చెప్పు. నెల లోపల రాముడిక్కడకు వచ్చేటట్లుగా చెప్పు-"

## చూడామణి వెనుక కథ

"ఏదో ఒక కాకి కథ చెప్పాను అనుకోవద్దు. అభిజ్ఞానంగా (గుర్తుగా) ఇది చెప్పాను. ఈ వృత్తాంతం స్వామికి తెలుసు, నాకు తెలుసు, ఆ కాకికి తెలుసు. ఆ కాకైనా వారిలో కనబడి నీకు చెప్పిపోదు గదా ! అందుకు చెప్పాను. ఆ రోజున రాముడు నన్ను పరిహాస మాడాడు. ఆనాటి ఆ పరిహాసమే తర్వాత గూడా అప్పుడప్పుడు ఆడుతూ వుండేవాడు. ఇది అతి రహస్యమైనది. మా ఇద్దరికే తెలుసు ఈవృత్తాంతం. ఆ సంగతి నీకెందుకులే! స్వామికి ఇది తెలిసినంతగా ఇంకా ఏదీ తెలియదు. ఆయనకు దయకలగాలంటే ఇదొక్కటే!" అంటూ సీత తన కొంగున వున్న ముడి ఊడదీసి చూడామణిని పట్టుకొని దానివంక ఒక్కనిమిషం నిశ్చలంగా చూసి—

"నువ్వు కనక ఇక్కడకు రాకపోతే నా బ్రతుకునే అంతం చేసుకుందామని దీన్ని దాచాను. ఇంక ఇప్పుడు ఆ కరుణామూర్తి వస్తాడని తెలిసి, ధైర్యంతో ఈ చూడామణిని ఇచ్చేస్తున్నాను. నిజానికి ఈ శిరోమణిని నీకివ్వడం నా కిష్టం లేదు. కాని నా ఇప్పటి స్థితి నీకిలా ఇప్పిస్తోంది.

"ఈచూడామణిని చూశాడంటే నాథునికి అయోధ్యాపురం, తల్లి కౌసల్యా మహాదేవి, ఆ అత్తగారికి నామీద గల ప్రేమ, ఇవన్నీ వరసవరసగ్గా గుర్తుకొచ్చి, మనస్సు వాటినే స్మరిస్తూ వుంటుంది. తాను ఎప్పుడూ కైకేయినే వెన్నంటి వున్నందువల్ల కౌసల్యాదేవికి కలిగే బాధను ఉపశమింప చెయ్యడం కోసం మా మామగారైన దశరథ మహారాజు ఈ శిరోమణిని ఆవిడకు ఇచ్చారు. ఈ ఉంగరాన్ని ఆయన ఇంద్రుడికి గూడా ఇవ్వలేదుట! ఈ శిరోమణిని మా అత్తగారు కౌసల్యాదేవి గొప్ప నిధిలాగా చూచుకునేది. నేను నా యెదనిండా రామచంద్రుని లోకేశునిగా ఆరాధించడం చూసి ఆనందించి, మా అత్తగారు ఆ శిరోమణిని నాకు కానుకగా ఇచ్చింది. దీన్ని వదలకుండా

నేను ఎప్పుడూ ధరిస్తాను. ప్రాణం పోయినప్పుడే దీన్ని త్యజిస్తాను. నేను చనిపోయి ఇక్కడ వున్నానని చెప్పు. ఈ శిరోమణిని స్వామి చేతికి ఇచ్చి మరల ఆ మణిని నాకిచ్చి బ్రతికించుకోమని చెప్పు."

"నేనింకో విషయం చెప్పనా ? తండ్రి వాగ్దానాన్ని సత్యం చెయ్యడం కోసం సరాసరి అయోధ్యను విడిచి అడవులకు వచ్చాడంటే- 'రామునికి ఆ తండ్రి అంటే అంత ఎక్కువ ప్రేమ'- అని అనుకుంటారుగాని, నిజానికి తల్లి మీద రామునికి గల ప్రేమ ఇంకా ఎక్కువ. ఆనాడు చనిపోయినది అత్తే అయితే భరతుడు రామచంద్రుడిచ్చిన పావకోళ్లు గ్రహించి సమాధానపడి వుండేవాడు కాడు (అంటే- రాముడు అయోధ్యకు వస్తే గాని భరతుడు వూరుకునేవాడు కాదు అని భావం. ఎందుకంటే- "దశరథుడు పోతే తను (అంటే భరతుడు) అయోధ్యలోనే వున్నా-అరణ్యంలో ఉండిపోయిన రాముణ్ణి చూసుకోడానికి- రాముని ప్రేమను పూర్తిగా పొందిన కన్నతల్లి కౌసల్య అయోధ్యలో వుంటుంది- అదే కౌసల్య కనక పోయివుంటే, అదేవిధంగా రాముణ్ణి చూసుకునేందుకు రాముని ప్రేమను అంతగా పొందిన కౌసల్యను మించిన వ్యక్తి మరొకరు ఉండేవారు కాదు కనక-" అని అర్థం.) మామగారు పోయినపుడు స్వామి నన్ను ఊరడించాడు. అదే అత్తే కనక పోయివుంటే నేను స్వామిని అంతగా ఊరడించగలిగి వుండేదాన్ని కాదు. రామునికి అత్త మీద అంతటి ప్రేమ. ఈ విషయం నాకే తెలుసు: మరెవ్వరికీ తెలియదు. నువ్వు ఈ మణిని తీసుకువెళ్ళి ఆయన కివ్వు" అని సీతాదేవి చూడామణిని హనుమ చేతికిచ్చింది. హనుమ దానిని గ్రహించాడు. సీతమాటలే మనస్సులో మళ్ళీ మళ్ళీ మెదుల్తూ వుంటడంతో నోటమాట పెగలి రాలేదు. ఏం చెప్పాలో పాలుపోక,తడబడుతూ—

"స్వామి వస్తాడమ్మా, తప్పకుండా వస్తాడు. రాకపోతే నా భుజాలమీద మోసుకుని తెస్తాను. అయినా రావడానికేగా నన్ను ముందు ఇక్కడకు పంపింది. రాముడు ఇప్పుడు లంకకు రాడని చెప్పడానికి వీలులేదులే! అవతల మహా వానర సైన్యం- వద్దన్నా యుద్ధం లేదన్నా, ఆగేట్టు లేరు. లంకమీద దండెత్తడం ఎప్పుడా ఎప్పుడా అని ఎదురుచూస్తున్నారు. ఆ సుగ్రీవుడు చాలా నిక్కచ్చైన మనిషి. 'ఒకే ఒక బాణంతో వాలిని వధించి, సర్వ కపిసైన్యాన్ని

నాకు దక్కించావు. నీకు ఆ అప్పు నేను తీరుస్తాను. ఆ రావణుణ్ణి చంపి ంతను తీసుకు రాకపోతే సుగ్రీవుడనే నా పేరే మార్చుకుంటాను చూడు' అని ప్రతిజ్ఞ చేశాడు. ఒకరు రాకపోయినా, తనకు తానై పోరుకు బయలుదేరి ?రతాడు. వామ భాగంలో ఆ తల్లి లేకపోతే శంకరుడు ఎలా వెదురుబద్దలా అవుతాడో, నీవు లేకపోతే రాముడు అంతకంటె తక్కువగా అయి నీరసించి పోతాడు. అలాంటప్పుడు-నేను ఇలా వార్ధిని దూకి రావడం, నిన్ను చూడడం ఈ తతంగమంతా ఎందుకు? వృధా ప్రయాస గాదూ! "నోటికి అన్న హితవు లేదు. నిద్రపట్టక కన్ను మూతపడదు, ఇదీ- అక్కడ రాముని పరిస్థితి" అన్నాడు. హనుమ మాటలు విని "ఇంక ఆలస్య మెందుగ్గానీ నువ్వు వెళ్ళిరా! సర్వ దేవతలు నీకు మార్గంలో రక్షించుదురుగాక!" అని-

# సీత భక్తి వాత్సల్యాలు

"అమర కాంతలు అసూయ పొందేటట్లు శౌర్యగుణ సంపన్నుడు, మహానుభావుడు అయిన రాముణ్ణి కన్న మహా ఇల్లాలు కౌసల్యకు నా నమస్కృతులు చెప్పు. 'సుమిత్ర' అనే పేరు ఒక్కటీ నువ్వు వింటే విని ఉండవచ్చు. అంతకుమించి నీ కామె గురించి తెలియదు ఓర్పుకు, నిదానానికి పెట్టింది పేరు, మామగారు లేనపుడు అయోధ్యను, రాముణ్ణికన్న కౌసల్యను ఆదుకున్న మహా సాధ్వి. ఆవిడకు నా నమస్కృతులు చెప్పు. ఆ తల్లి తితిక్షా తీవ్రతకు ఫలంగా పుట్టి, ఆ తల్లివద్ద నీతి వినయాలను నేర్చుకున్న లక్ష్మణుణ్ని అడి గానని చెప్పు. అతి బలపరాక్రమ సామర్థ్యాలు గల శ్రీరాముడు ఎవరిని తనకు సాయంగా కోరాడో- అటువంటి సూర్యపుత్రుడైన సుగ్రీవుణ్ని నేను ఎన్నడూ చూడలేదు. అయినా నాకెందుకో చూసినట్లే ఉందని చెప్పి, నా కుశలాన్ని గూర్చి గూడా చెప్పు. తన తండ్రి చనిపోయినా, పినతండ్రిని అంతటి భక్తితోనూ సేవించే అంగదుణ్ని అడిగానని చెప్పు. అతణ్ని చూడా లని వుందయ్యా నాకు. నా కోసం యుద్ధానికి సన్నద్ధులై రామునికి సహాయ పడే కపి వీరులందరికీ- పేరు, పేరునా- నా దీవెనలు తెలిపానని చెప్పు. లోకాలనే దహించి వేయడంలో ఎవరినీ లక్ష్యపెట్టని అగ్నిలాంటి తిరుగు లేనిదైన నా ఆశీస్సు నీకు వుంటుంది. అలాంటి అగ్ని గూడా నా ఆశీస్సును ఆజ్ఞగా తీసుకొని నీ పట్ల మండిపడక అండగా ఉంటాడు వెళ్ళిరా!" అని

చూరుకుంది. ఇంకా సీత ఏమన్నా చెబుతుందేమోనని హనుమ కాస్సేపు ఆగాడు. హనుమ ఏదన్నా చెబుతాడేమోనని సీత ఆగింది. హనుమ ఇంక పోవడానికి ఉద్యుక్తుడై మళ్ళీ ఎందుకో సీతవంక చూచాడు, అప్పుడు సీత—

"నా నాథుని చరణ కమలాలకు నా నమస్కృతులు చెప్పు, నా మస్తక భూషణ బంధురమైన చరణ పరాగ సంశోభితునికి నా నమస్కృతులు చెప్పు. నా పాపటలో-చెంగల్వ కుసుమపరాగం లాగాను, కన్నులలో కాటుకలాగాను, ముఖంమీద లొద్దుగ పూల దుమ్ములాగాను, పెదవిమీద మంకెనల పుప్పొడి లాగాను, మెడలో చందన లేపముగాను, వక్షంపైని కుంకుమ దుమ్ము లాగాను, జఘనమందు భాస్వర పత్రాల లాగాను, పాదాలయందు లత్తుక లాగాను- నా స్వామి పాద నీరజ రజమే దర్శనమిస్తుంది. ఆ నా స్వామి కాలి దుమ్ముకు నా నమస్కృతులు చెప్పు. మేము అయోధ్యాపురంలో హాయిగా వుండే రోజుల్లో జరిగిన ఒక సంగతి నా జీవితగతికే శ్రుతి కలిపింది. నేను ఎప్పుడూ ఏదీ కోరలేదు గాని ఒకసారి ఎందుకో నాకు కోరిక కలిగి, ఒక ఎఱ్ఱంచు నల్లచీర కట్టుకున్నాను. అంచుల్లో జరీ నెమళ్లు మెరుస్తూ ఆ చీర నాకు బాగా నచ్చింది. దాన్ని ధరించి, విప్పారిన కళ్లతో విభుని వెంట సాయంత్రం అలా బయటకు నడుచుకుంటూ వెళ్లాము. అది వర్షాకాలం. స్వామి కాళ్లకు బాగా బురద పట్టి చారికలు గూడా ఏర్పడ్డాయి. ఇంటికి వచ్చి ఆ కాళ్లను నా చీరతో తుడుచుకున్నాడు. చెప్పొద్దూ! నేను ముఖం ముడుచుకున్నాను. అంతే! అప్పటినుండి నా బ్రతుకంతా ఆయన కాలిదుమ్ముగా అయింది. దుమ్ము దులుపుకున్నా మళ్ళీ కొత్త దుమ్ముగా ఎప్పటికప్పుడు పడుతూనే వుంది. చివరకు ఆ దుమ్ము లేకపోతే ఎప్పుడూ నిద్రగూడా పట్టనంతగా నా బ్రతుకు తయారైంది. ఈ గడచిన పది మాసాలు అది లేనందువల్లే నాకు నిద్రగూడా లేదు. అందుకే నా స్వామి కాలి దుమ్మును మళ్ళీ నా మస్తక భూషణంగా ప్రసాదించమని కోరేది" అన్నది. అందుకు హనుమ—

తల్లీ! రఘురాముడు వస్తాడు. ఆయన పాద పంకేరుహాంజో దర్శన స్పర్శనాదులతో నీ సీమంత, నయన, వదన, అధర గ్రీవాదులన్నీ పరాగ రంజితాలౌతాయి. నీ జీవిత వసంతోదయానికి శుక, పిక కూజితాలు స్వాగత గీతికలౌతాయి", అని మరల మరల ప్రణామాలు చేసి, కనురెప్పలు మూసి,

సెలవు తీసుకుని వెనక్కి వెళ్లడానికి ప్రయత్నం చేస్తూ- ఆమె కళ్లను చూశాడు. ఆ కళ్లల్లో తాను అంతతొందరగా వెళ్లిపోవడం ఇష్టం లేనట్లుగా వున్న భావాన్ని, ఆమె ఏదో చెప్పబోతోందనీ గుర్తించి, అందుకు తాను సావధానంగా వున్నానని అర్థము వచ్చేటట్లు నిలబడ్డాడు. అప్పుడు సీత —

## సీత బుద్ధి నైశిత్యం

"రావణుని నువ్వు చంపవద్దని నేను అన్నప్పుడు నీకు కష్టం కలిగించినట్లనిపించింది. ఇందులో గూఢంగా వున్న ఉద్దేశం చెబుతాను విను. ఇలా అనడం నిన్ను తక్కువచేసి కాదు సుమా ! నీ బాహుబల పౌరుషపరాక్రమాల గురించి అహర్నిశలు ఈ సముద్రం తన నిరంతర తరంగాలతో ఘోషిస్తూనే వుంటుంది. శౌర్యం అనేది వాయువు, వెలుగు లాంటిది. వీటి ద్వారా ఇవి ప్రసారమౌతున్నపుడు, ఏ విధంగా వాటి గమన విధానాల్లో వైవిధ్యం వుంటుందో- అట్లాగే శౌర్యం కూడా దీక్షను బట్టి భేదాన్ని కలిగి వుంటుంది. దీక్ష అనేది వెనక వున్న నిదాన తీవ్రతమీద ఆధారపడి వుంటుంది. అది పురుష ప్రయత్నం చేత లక్షితమై, దైవానుగ్రహంచేత రక్షితమౌతుంది. సర్వమూ శౌర్యమే అయినా ఒకని శౌర్యం ఒకచోట ఫలిస్తుంది. ఇంకొకరి శౌర్యం ఇంకొకచోట ఫలిస్తుంది. చూడ్డానికి అంతా సమానబలాలుగానే వున్నట్లు కనిపిస్తుంది, తీరా చెయ్యబోతే అనుకోనివి (ఊహించనివి) ఏవేవో అడ్డంకులు పుట్టుకొచ్చి, ఫలితాన్ని చెడగొడతాయి. మళ్లీ అదేపని మరొక సారి ఏ అడ్డంకులు రాకుండా చిన్న ప్రయత్నంతోనే సానుకూలమౌతుంది. కాబట్టి. ఈ విషయాన్ని జాగ్రత్తగా అర్థంచేసుకుంటే- శౌర్యంలోనే అంతా లేదని తెలుస్తుంది."

"హరిహరు లిద్దరూ మహానుభావులు, జగత్ప్రభువులే గదా! హరి హాలకూట విషాన్ని మ్రింగలేకపోయాడు, హరుడు దాన్ని మ్రింగగలిగాడు. కాని హరుడు-భస్మాసురుడు, గజాసురుడులాంటి రాక్షసులవల్ల ఇబ్బందిపడితే- హరి ఆ ఇబ్బందులను నివారించి, ఆ రాక్షసులను సంహరించాడు. ఇట్లాటి శౌర్యాల్లోను భేదాన్ని గుర్తిస్తే పాపం కట్టుకున్నట్లే ! అయినా ఒకచోట ఒకరు,

ఇంకొకచోట మరొకరు అధికులుగా కనబడుతున్నారు. ఒకరికి లొంగిన విషయం ఇంకొకరికి లొంగదు. రాముని భార్యను దొంగతనంగా తీసికొని రావణుడిక్కడకు వచ్చాడు. అందువల్ల రామునికి రావణుడు లోకువ. ఇప్పు డిక్కడకు రాముడొస్తే రావణుడు బెదురుతాడుగాని ఇంకొకడెవరన్నా వస్తే రావణుడు బెదరడు. అంతేగాక రావణుణ్ణి రాముడు చూసినట్లుగా ఇతరు లింకెవరూ అలా చూడరుగదా ! అతని భార్య దొంగిలింపబడితే అతనికి కోపం వుంటుంది. అంతకోపం నీకెందుకుంటుంది ? 'ధర్మవిరుద్ధం' అలా చెయ్యడం' అని మాత్రం నీకుంటుంది అంతే ! చూశావా ఇద్దరి భావాల్లో తేడాలు. నువ్వు అతనికి సహాయంగావెళ్ళి ఫలితం రాకపోతే 'చెయ్యగలిగినంత చేశాను, ఫలితం రాకపోతే, అతని భాగ్యం అట్లావుంటే నేను మాత్రం ఏం చెయ్యగలను?' అని సర్దిచెప్పుకుంటావు. అదే అతడైతే అలా వదిలిపెట్టడు. ఫలితం రావడంకోసం చనిపోవడానికి గూడా సిద్ధపడతాడు. మనస్సులో అతను పడే బాధ నువ్వెందుకు పడతావు ? ఇద్దరూ శౌర్యంలో సమానులే, అయినా వ్యధను పొందినవాడు చేసే ప్రయత్నానికి-వ్యధ పొందనివాడు చేసే ప్రయత్నానికి ఆ తేడా వుంటుంది ఇంకో సంగతి విను! ఎవరి పనైనా వాళ్ళ చేతుల్లోనే వ్యర్థమైతే- లోలోపలే దుఃఖిస్తూ ఏమీ అనుకోలేక ఊరుకుంటారు. అదే ఇతరుల చేతుల్లో తన పని వ్యర్థమైతే 'అంతా పాడుచేసి వదిలిపెట్టాడు. పని చెప్పకుండా వున్నా పోయేది' అని సణుక్కుంటారు. సహాయపడేవారు ఈ నిందను గూడా పొందాల్సి వుంటుంది అనవసరంగా! అవునా? కాదా? నువ్వెందుకు ఆ నింద పడాలి?"

"బ్రహ్మచేత, శివునిచేత వరాలు పొందాడు రావణుడు. ఆ వరాలు ఎలాంటివో, వాటికి ప్రతిక్రియలేమిటో అందరికీ తెలియాలని లేదు. తెలియవు గూడా ! నువ్వు మహాబలుడివి. బలం అంతా ఉపయోగించి వాడి తలమీద మోపుతావు. అయినా ఎంత దెబ్బవేసినా ఆ తల పగలదు. అది బ్రహ్మవరం. ఈ సంగతి తెలియకపోతే, ఇవతల నీకు ఎంత బలం, ఎంత శౌర్యం వున్నా లాభం లేదు. 'రాముడైతే మాత్రం అప్పుడేమి చేస్తాడేమిటి?' అని నువ్వు అనవచ్చు. "ఏం చేస్తాడో మనకెందుకు? అతని భార్య దొంగిలింపబడింది, ఆ సంగతేదో అతనే చూసుకోవాలిగాని నీకూ నాకూ ఆ సంగతెందుకు? నీకు

చెప్పినపని, నువ్వు చెయ్యాల్సినపని- నువ్వు చెయ్యాలి. చేశావు, చేస్తావు గూడా!" అన్నది. (ఇక్కడ అతను, నువ్వు- ఈ మాటలు రాముడికి హనుమకే కాదు, ఏపని జరుగుతున్నపుడైనా ఆపనిలో పాల్గొనే వారందరికీ వర్తిస్తాయి.)

సీత తనకు అర్థమైందనే అనుకున్నాడు మొదట్లో హనుమ. మళ్ళీ ఇప్పుడు అర్థం కానట్లే అనిపించింది. అంతేగాదు ఇంతకుపూర్వం 'ఈమెను వదలిపోవడం ఎలాగబ్బా' అని దిగులుపడ్డ హనుమ, సీత చేసిన సుదీర్ఘోప న్యాసం విన్న తరువాత దిగులుపోయి సులభంగా ఇక్కడనుండి సెలవు తీసి కొని వెళ్ళడమే కర్తవ్యమని భావించి, చూడామణినిభద్రపరచుకొని-'రాముడు-రాముడే! సీత-సీతే! అతడు-భర్త. ఈమె-భార్య. దేనికెంత వెలో, దానికంతే! తాను మారుతి. వట్టి రామదూత. అంతే !' అనుకుని సీతను వదలి వెళ్ళి పోయాడు.

అశోకవృక్షంమీద వున్న ఆంజనేయుని అంతరంగం అగ్నిగుండం లాగా వుంది. సీత దైన్యస్థితి హృదయమంతా చోటుచేసుకుంది. మనస్సు నిండా రామకార్యం నిండి వుంది. రాక్షసరాజు మీద తీవ్రమైన కోపంతో వళ్ళంతా మండిపోతోంది. అసురాధిపతి అంతంచూస్తే గాని ఆ అగ్ని చల్లారే టట్లులేదు. రాముని ధర్మపత్నిని దొంగిలించిన సంగతికే రావణుని మింగే ద్దామన్నంత కోపం వచ్చింది, అట్లాంటిది రావణుని ఎదురుగా చూసినాగూడా ఆ పని చెయ్యకుండా వెనక్కు తగ్గవలసి రావడంతో మనస్సు మరింత కలత చెందింది. దానికితోడు రావణవధ విషయంలో యోగ్యాయోగ్యాల విశ్లేషణ చేస్తూ సీతమ్మ తనను నివారింపచెయ్యడంతో కోపాగ్ని మరింత రగిలి, సముద్రగర్భంలో పుట్టిన బడబాగ్నిలా వున్నాడు. ఈ బడబాగ్నిని చల్లార్చే జలాలు గూడా ఉండవు. అశోకవనంలోని మహీరుహా లన్నిటినీ మాడ్చి, మసిబొగ్గులుగా చేయందే ఊరుకునేట్టుగాలేదు ఆంజనేయుని 'వాల'కం. ఈ దూత దూకుడు ధాటిని చూసి, దూతను పంపిన రాముని సామర్థ్యం ముందు తను ఎంత అల్పుడో ఆ రావణునికి తెలిసివచ్చేలాగా చెయ్యాలి.

## సామదానభేద దండోపాయాలు

సామంతో ఈ రావణుణ్ణి చక్కదిద్దలేమని విభీషణ, సీతారాములు

ముందే చెప్పారు. త్రిలోక విజేత అయినవానికి దానం పనిచేయదు. ఇక భేదం- విభీషణుడు అసురజాతిలో ఉన్నా సాధువే అని తెలిసింది. రాక్షసేశ్వరుని పద్ధతులు గూడా నచ్చనివాడు. అతని ద్వారా శత్రురహస్యాలను గ్రహింపవచ్చు. ఇంతటి సముద్రాన్ని దాటి ఎవడూరాలేడు అనుకునే వాడికి కనబడి తీరాలి. ఎవడో లంకకు వచ్చాడుట, వెళ్లాడుట అని మాత్రమే తెలిస్తే సరిపోదు. వచ్చినవాడు, వాడి వెనకాల వున్న ప్రభువుసత్తా తెలిసేట్లు చెయ్యాలి. దొంగతనంగా వచ్చి వెళ్లాడన్న పేరు ఎందుకు రావాలి ? రామ ప్రభువు రాజసానికి తగ్గట్టుగానే వెళ్లాలి. చూపులో అగ్ని వున్నవాణ్ణి చూడమంటే కాల్చవలసినదాన్ని చూడమనడమేగదా ! మరి నన్ను ఇక్కడ చూచి రమ్మనమన్నప్పుడు గూడా అదే అర్థం. ఇంకొకడెవరూ ఇక్కడకు రావడానికి అనుకూలంగా లేనంత దూరం వచ్చి-వట్టిగా ఇక్కడ సంగతులు ఏమీతెలుసుకోకుండా వెళ్తే ఎలా? ఇక్కడ నీతి ఎలాంటిది? ఇక్కడ పరాక్రమవంతులు ఎంతమంది? ఎక్కడెక్కడ దుర్గాలున్నాయి ? వీళ్ల కాల్బలము, గజబలము, అశ్వబలము మొదలైనవి తెలుసుకోకుండా పోతే వాడు దూత ఎలా అవుతాడు? 'శత్రుపక్షంనుంచి ఒకే ఒకడు దూతగా వచ్చాడమ్మా! ఊరూ, ఏరూ ఏకంచేసి పోయాడు. ఇంకా ఈ దూత వెనక వున్న ప్రభువే కనక ససైన్యంగా వస్తే మన దానవాళికి నిలవనీడ వుంటుందా?' అని అనుకోవాలి.

"అయినా ఇంకో ముఖ్యమైన సంగతి వున్నది. నేను రావణుడు నిద్రిస్తున్నప్పుడు చూశాను. ఆ దర్పం, ఆ వర్చస్సు మెలకువగా వున్నప్పుడు చూడకుండా వెళ్ళిపోవడం దూత లక్షణంకాదు. తనకిష్టమైనది దైవంచేత నష్టమైతే ఎవరికైనా దుఃఖం వస్తుంది. అదే ఇతరులచేత నష్టమైతే కోపం వస్తుంది. అయితే 'ఎవరికి ఏది ఇష్టము?' అన్నది అందరికీ ఒకేరకంగా వుండదు. మనుష్యులు వారి ప్రవృత్తులనుబట్టి ఇష్టాయిష్టాలు ఎంచుకుంటారు. దైవం మీద, ధర్మం మీద నమ్మకం కలిగినవారికి భార్యాబిడ్డలమీద ఇష్టమెక్కువ వుంటుంది. ఇతరులకు తాము అనుభవించే భోగవస్తువుల మీద ఎక్కువ ఇష్టముంటుంది. ప్రస్తుత విషయానికివస్తే దైవధర్మాలకు దూరుడైన ఈ రాక్షసాధిపతికి ఈ అశోకవనం భోగవస్తువు కాబట్టి, దీన్ని నాశం చేస్తే కోపం వచ్చి మండిపడతాడు. ప్రస్తుతం ఉపయోగించాల్సిన ఉపాయం గూడా అదే- అని దండనీతినే నిశ్చయించుకున్నాడు.

# విజృంభించిన హనుమ

అశోకవనంలోని చెట్లు, చెట్లమీద పక్షులు అన్నీ చిన్న కోతిగా వున్న హనుమను గతరాత్రి చూసినప్పుడు 'ఇతడు చాలా సాధువు' అనుకున్నాయి. స్వాగతం పలికాయి. రాత్రిపోయి పగలు వచ్చేటప్పటికి "ఇతడు ఘాతుకుడు సుమా, మనం నిన్నరాత్రి పొరపడ్డాం" అని అనుకునేలా తయారయాడు హనుమ. పది నెలలబట్టి ఈ వనంలో సీత వున్నా, ఎప్పుడూ చెట్లజోలికిగాని, పక్షుల జోలికిగాని పోలేదు. అంతటి దయగలతల్లి. తానొక్కడూ చెట్లన్నిటినీ పెల్లగిస్తున్నాడు. ఈ వనానికి యమునిలా దాపురించాడు. అంతవరకూ అంగుళాల ప్రమాణంలో ఉన్న దేహం రాను రాను పెద్ద పెద్ద వృక్షాలను మించుతోంది.

భూకంపమేమన్నా వచ్చిందేమోనని ఒక చెట్టుమీద పక్షులన్నీ చెట్టును వదలి వెళ్ళిపోయాయి. పక్షులు ఒక చెట్టుమీదకు వచ్చి వ్రాలదామనుకునే సమయంలోనే ఆ చెట్టు నేలకూలిపోతోంది. చివరకు వ్రాలడానికి ఏ చెట్టూ లేకపోవడంతో ఆకాశంలో గుమిగూడి చరిస్తున్నాయి. వాయుదేవుడే ఈ కోతి రూపంలో వచ్చాడేమోనని అనుకుంటున్నాయి.

చెట్లకొమ్మలు ఛిన్నాభిన్న మవుతూ, విరుగుతూ, ఫెళఫెళామని చప్పుడు చేస్తూ నేలకొరుగుతున్నాయి. మరికొన్ని వృక్షశాఖలు ఆకాశంలోకి విసరబడుతున్నాయి. గృహాలకు వృక్షాలకు కాపలా వుండే రాక్షసులే క్రూర దంష్ట్రిలతో రుద్రుని లాగా వున్న కోతిని చూసి భయభ్రాంతులతో హడలిపోతే- ఇంక పక్షులు పైకి ఎగిరిపోయి ఆకాశగుహలో దాక్కున్నాయి అంటే- వింతేముంది? ఎక్కడన్నా రాక్షసుల్ని చూసి గుండెపగిలి చావటం అన్నది ఉంటుంది గాని, ఇక్కడ ఒక కోతిని చూసి కొంతమంది రాక్షసులు చచ్చిపోతున్నారు అదీ విచిత్రం! 'వ్యాధికుదరక, మంచంపట్టి కాళ్లు చేతులు ఆడనివానికన్న చనిపోయినవాడే నయం' అని సూచించే విధంగా కొన్నిచెట్లు పెళ్లగింపబడక మొండిగా వున్నాయి. ఇంక ఇవి చిగిర్చే అవకాశంలేదు. ప్రళయకాలంలో కాశీలో అన్నపూర్ణాదేవి నిలయంలాగా, పచ్చని పుచ్చపాదులాగా వున్నది జానకి వున్న ఒక్క వృక్షప్రదేశమే!

"తోటంతా ఇలా నాశనం అయిందన్నమాట రాజుతో చెప్పకుండా ముందే చనిపోయిన రాక్షసులు అదృష్టవంతులు" అనుకున్నారు వన పాలకులు. ఆకారం చూడ్డానికి వానరమే అయినా, వ్యాఘ్రాన్ని మించిన భయాన్ని కలుగజేస్తోంది. బెదిరిస్తే వెళ్ళిపోయే మామూలు కోతి కాదు. ఇక్కడి రాక్షసుల మదాన్ని అణగద్రొక్కడానికి వచ్చిన ప్రళయకాల రుద్రునిలాగా వుంది" అని అనుకుంటూ తాము కనబడితే ఎక్కడ మీదపడుతుందో అని హడలిపోతూ, పడిపోయిన కొమ్మలు చాటుగా దాటిపోయి రావణునికి విన్నవించుకోడానికి వెళ్ళారు.

'సీత ఉన్న చోటు' అనే గౌరవ భావంతో అక్కడున్న వృక్షాన్ని మాత్రం పెకలించకుండా, అక్కడున్న రాక్షసాంగనలకు ముప్పు కలిగించ లేదేమో- అనుకున్నారు పరిపాలకులు. అంతవరకూ నిద్రమత్తులో వున్న రాక్షసాంగనలకు విరిగే వృక్షాలు చేసే విలయరావాలకు గుండెలు బ్రద్దలై మెలకువ వచ్చి భయకంపితులై మెల్లమెల్లగా జానకిని జేరి–

## సీతను నిలదీసిన రాక్షసాంగనలు

"ఓయమ్మా ! ఇంతవరకు మే మిక్కడే మగత నిద్దురలో వున్నాము. ఇంతలోకే తోటంతా ఇలా రూపం మారిపోయింది. వనాన్ని ఇలా చేసిన ఆ కోతి నీ దగ్గరకు వచ్చినట్లున్నాడు. నీకు తెలుసా? నీకేమౌతాడు ? ఏం పని మీద వచ్చాడు? నీతో ఏమన్నా మాట్లాడాడా ? ఇంకా నువ్వేదో దుఃఖంలో మునిగి వున్నావనుకొని జాలిపడ్డాం! అంతా వట్టిదన్నమాట! నీవన్నీ కల్లబొల్లి ఏడ్పులే నన్నమాట ! పైన ఏడుస్తూ లోపల్లోపల గోతులు త్రవ్వే జాణవు నువ్వు. నీ మొగుడేదో బిచ్చగాడని అన్నాడు మా రాజు. ఆ సంగతి అవునో కాదో మాకెందుకు గాని, ముందు ఈ కోతి సంగతి చెప్పు. ఏదో చెట్లమీద కసుగాయలు తిని, ఆకలి తీరి చక్కాపోకుండా- కళ్లు మూసి కళ్లు తెరిచేలోపలే ఇంత ఉపద్రవాన్ని సృష్టించాడు ! బొటనవ్రేలంత వున్నవాడు ఇంతింతై కర్మసాక్షినే కబళించ గలిగేటంత ఎత్తుకు ఎదిగాడు. వీడెవడో గారడీవాడై వుండాలి. అసలు నీకూ, నీ పతికి, ఈ కోతికి ఏం సంబంధం? ఏసంబంధమూ లేకపోతే ఎందుకు నీ దగ్గరకు వస్తాడు? చెప్పు ముందు?"

"ఒకటే కిచకిచలు విన్నాం. ఆ కోతి కిచకిచల భాష నీకూ తెలిసి వుండాలి. ఎక్కడ నేర్చుకున్నావు? లేకపోతే ఆ కోతితో నువ్వు తిరిగి ఎలా మాట్లాడావు. లేకపోతే తోక కత్తిరించి జుట్టును పెంచిన నువ్వూ ఒకకోతివేనా? మమ్మల్నిక్కడ బ్రతకనీయవా ఏమిటి? మా రాజుకు అత్యంత ప్రీతిపాత్రమైన ఈ వనాన్ని ధ్వంసం చేసిన ఆ కోతితో నువ్వేదో మంతనా లాడావని తెలిస్తే నీ బ్రతు కేమౌతుందో ఆలోచించుకో ! ఒక్క వనాన్ని ధ్వంసం చేసినంత మాత్రాన అంతా అయిపోయిం దనుకుంటున్నావేమో ! నీకొక్కదానికి చావు రాబోతోందని ఈ తోటకు, ఊరుకు ముప్పు తెచ్చిపెడతావా! ఆ కోతికి ఏం శాస్తి జరుగుతుందో నీ కళ్లతో నువ్వే చూద్దువుగాని. ఇప్పటికైనా మించి పోయింది లేదు. మా రాజుకు ఆగ్రహం రాకపూర్వమే- ఈ కోతి ఎవరో చెప్పేసెయ్యి. గోళ్ల చివళ్లను బెజ్జాలు చేసి, ఆ బెజ్జాల సందు సందులో సల సలా కాగే నూనె పోయిస్తే- నువ్వు కాదు, నీ తల్లో జేజెమ్మ చెప్తుంది, తెలుసా? అంతదూరం రానీయకుండా ముందే చెప్పేసెయ్యి. వాడెవడో, నీకూ వాడికీ సంబంధ మేమిటో, మీ ఇద్దరూ ఏం మాట్లాడుకున్నారో అన్నీ చెప్పు" అన్నారు.

## సీత సమాధానం

రాక్షసాంగనల కడుపుమంట మాటలను విన్న జానకి-'అమ్మా ఇప్పటికి ఒక్క రామదూత కనిపించాడు' అన్న ధైర్యంతో-

"మీ రన్న మాటలకు అర్థాలు మీకే తెలియాలి. ఊరికే మీరు ఏమేమో ఊహిస్తున్నారు. నాకు మాత్రం ఏమీ తెలియదు. ఒక్కళ్లు చనిపోతే తీపి, ఎక్కువమంది చనిపోతే చేదు అవు ? ప్రేమ వున్నచోట ఆపద వాటిల్లితే అక్కడ దుఃఖపడతారు సామాన్యంగా. బ్రతికినన్ని రోజులూ దుఃఖ సముద్రంలోనే సతమతమై పోతూ ఉండడం కంటె మరణించడమే ఎన్నో రెట్లు మేలు. బ్రతికినన్నాళ్లు పాపాలు చేస్తూ బ్రతకడం కంటె గూడా మరణించ తమే ఎన్నో రెట్లు మేలు. నిజంగా నాకేమీ తెలియదు. నేనేమీ అతణ్ణి ఇంతకు మున్నెన్నడూ ఎఱగను. చూడలేదు గూడా! మీరైనా, నేనైనా అతణ్ణి చూడ్డం ఇప్పుడే ! ఇక్కడే !! వృక్షాలు పెకలించడం, కొమ్మలు విరవడం

లాంటివి కపి లక్షణాలని తెలుసుగాని అంతకంటె ఈ కపి గురించి గాని, కపి భాషగాని నాకు కొంచెమైనా తెలియదు. నన్ను నమ్మినా సరే నమ్మకపోయినా సరే! నే చెప్పేది నిజం. నన్ను సరిగ్గా అర్థంచేసుకోండి. అంతే నేనుమిమ్మల్ని కోరేది." (వాస్తవానికి ఇంతదాకా వచ్చిన తరువాత హనుమ తానిక్కడకు వచ్చిన సంగతి రావణునికి చెప్పడానికే నిశ్చయించుకుని వుంటాడు. అలాంటప్పుడు సీత గూడా కొంత విషయాన్ని బయట పెట్టవచ్చు. కాని, సీత చెప్ప లేదు. దుష్టులకు వచ్చే దుర్ఘటన గురించి వాళ్లు దానిని ఎదుర్కొనటానికి సిద్ధంగా లేనపుడే చెప్పాలి అనే ఉద్దేశ్యంతో చెప్పలేదు.)

రాక్షసస్త్రీలకు ఏవిషయమూతెలియక, గుండెల్లో రాయిపడి గగ్గోలుపడ్డారు. సీతకు కాపలా వున్నవాళ్లు, వనపాలకులు కలిసి రావణుని దగ్గరకు వెళ్లారు.

## వనపాలకుల విన్నపం

రావణుడు చాలా డస్సిపోయినట్లున్నాడు. పదిమంది పురుషుల యెదుట ఒక పురుషుడు ఏదైనా అవమానం చేస్తే భరించవచ్చునేమోగాని, పదిమంది స్త్రీల యెదుట ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి అవమానపరచి చీదరించుకుంటే- దాన్ని భరించటం చాలా కష్టం. హృదయం ఆ అవమానాగ్నితో దహించుకు పోతుంది. ప్రస్తుతం రావణుని పరిస్థితి అలానే వుంది. ముఖంలో కోపం, సిగ్గు, విషాదం, మూడూ పులుముకుని వున్నాయి. ఆ స్థితిలో వున్న రావణుని ఎదురుగా నిలబడడానికే బెదురుతున్నారు వనపాలకులు. చివరకు వచ్చినందుకు ఎలాగో అలా ఉన్న విషయాన్ని విన్నవించక తప్పదని–

"స్వామీ! మా విన్నపం కాస్త మన్నించాలి. మీరు మాకు విధించిన వనపాలనా కార్యంలో పూర్తిగానే నిమగ్నమై వున్నాం. ఈ రోజు ఉదయం మేమున్న చోటుకు దూరంగా వున్న వృక్షాల వద్దనుండి ఉరుములు ఉరిమిన శబ్దాలతో వృక్షాలు, వృక్షశాఖలు అదేపనిగా విరిగి నేలకొరుగుతున్నట్లు విని పించింది. వెంటనే ఆలస్యం చెయ్యకుండా అక్కడకు వెళ్ళి చూద్దుము గదా- అనుకున్నంత పనీ అక్కడ అవనే అయింది. ఒక ఉద్దండమైన కోతి

వాయుదేవునిలాగా చరిస్తూ, మహా భూరుహాలను మట్టు పెడుతున్నాడు. ఉగ్ర భీకర రావాలతో వాలాన్ని త్రిప్పుతూ, ప్రళయకాల రుద్రునిలా వున్నాడు. మా చేతుల్లో కర్రలు ఈటెలు వున్నాయి. ఏం లాభం? కర్రలతో సింహాన్ని తాకడానికి ప్రయత్నం చెయ్యగలమా ? మా దీనస్థితిని అర్థం చేసుకొని మమ్మల్ని అనుగ్రహించాలి మహాప్రభూ ! సీతవద్ద వున్న రాక్షసాంగనలు కూడా- 'ఆ వానరాన్ని తామూ చూశామని, ఆ కోతే మొదట సీతతో ఏవో మాటలాడిందని, ఏం మాట్లాడిందో తమకు తెలియలేదని, సీతను గూడా అడిగామని, అందుకు సీత గూడా ఏమీ చెప్పలేదని' అన్నారు. మరి మీకే మన్నా తెలుసునేమోనని ఇలా వచ్చాము. ఈ ఆపదనుండి మమ్మల్ని మీరే కాపాడాలి" అన్నారు. రావణుడు వాళ్లు చెప్పిన మాటలు విని విసుగుతోను, కోపంతోను 'ఇక్కడనుండి ముందు మీరు పొండి' అని పంపించి వేశాడు. దీర్ఘాలోచనలో పడి చాలాసేపయిన తరువాత తనలో తనే—

## రావణుని ఆలోచన

"రాముడే కనక పంపకపోతే ఆ కపి సీతను ఎందుకు పలకరిస్తాడు? రాముడే పంపాడంటే తప్పకుండా ఆ కపి పరాక్రమవంతుడే అయి వుండాలి. లేకపోతే ఇంతటి మహాసముద్రాన్ని సామాన్యుడైతే దాటి ఇక్కడకు రాగలడా? నరులకు, వానరులకు కామ గమనం తెలియదు. అయితే యోగశక్తిచేత ఆకాశ గమనం మాత్రం చెయ్యగలరు. దేవతలకు సాయం చేయడం కోసం నరులు వెళ్ళిన సందర్భాలు చాలా వున్నాయిగూడా! కాని ప్రస్తుతసందర్భంలో ఈ కపి తన భుజబల పరాక్రమాలను తెలియచెప్పడం కోసమే సాహసో పేతంగా ఇక్కడకు వచ్చి, ఈ పని చేసినట్లు అనిపిస్తోంది. ఇది నిజంగా సాహసమే! అలాంటప్పుడు ఈ కపి మీదకు ఎవరినో ఒకరిని పంపితే లాభం లేదు. ఆ భుజ బలానికి తగ్గవాణ్ణే పంపాలి. సీత ఈ కపివీరుని కేదో చెప్పి రాముని దగ్గరకు పంపుతుంది. ఆ రాముడు ససైన్యంగా దండెత్తి రావచ్చు. ఇదంతా జరగడానికి అవకాశమే రాకుండా, ఇక్కడే ఈకపివీరుని హతమార్చే ప్రయత్నం చెయ్యాలి. చిన్న పామునైనా పెద్ద కఱ్ఱతో కొట్టాలి. ఇక్కడ

చిన్న పాముకూడా కాదు. మహాభుజంగమే! కాబట్టి ఒక్కుమ్మడిగా సైన్యాన్ని పంపి, కిక్కురుమనకుండా పరిష్కారం చెయ్యాలి" అని ఆలోచించి, సైన్యానికి కబురు పెట్టాడు. తనంత సామర్థ్యం గల ఎనభై వేల రాక్షస సైన్యాన్ని పంపించడానికి సన్నద్ధుడయాడు. పైన కోస్తుంటే క్రింద నెత్తురు తాగే మనస్తత్వం గలవారు వాళ్లందరూ. అంతేకాదు రాజు కోసం యుద్ధంలో చావడమే పరమార్థంగా భావించేటట్లుగా శిక్షణ పొందినవారు. వాళ్లందరూ వివిధ శస్త్రాస్త్రాలతో, తోమర, శక్తి,ముసల, ముద్గరాది మహాయుధాలతో బయలు దేరారు. ఆ సేనావాహిని చూడ్డానికి—

ఒక నల్లని పెనుమబ్బు పెరిగి పెరిగి నాలుగు దిశలు వ్యాపిస్తున్నట్లుగా ఉంది. కొడవళ్లవంటి కొమ్ములతో, అడవిదున్నల మందలు భూమినంతా ఆక్రమిస్తున్నట్లుంది. యమునానది వరదలు కట్టి, మిట్టపల్లాలను మ్రింగుతూ పోతున్నట్లుంది. అశోకవనాభిముఖంగా పోతున్న ఆ సైన్యం గాలిసోకితే ఆకాశంలో పిట్ట కదలదు. భూమ్మీద ప్రాణి నిలవదు. అకస్మాత్తుగా బయలు దేరిన సేనావాహినిని చూసి- లంకలో ఏదో ప్రళయం వచ్చిందేమోనని సంభ్రమాశ్చర్యాలతో అందరూ భయ కంపితులయారు. సేన నాలుగు దిక్కులకు వెళ్తూవుండగా వనాన్ని చెఱచిన వానరం కనబడింది.

పెద్ద చిమ్మచీకటి ముద్ద తెరకట్టి నల్లని మేఘం లాగా మీది మీదికి వస్తున్నట్లనిపించింది హనుమకు. వస్తున్నదెవరోకాని తనమీద ఒక్కుమ్మడిగా మహాతీవ్రమైన ఆయుధాలను ప్రయోగించారన్న సంగతిని ఇట్టే పసిగట్టాడు. ఇంక ఆ సేనావాహినిని మట్టుపెట్టాలేగాని మరలించటం కాదని నిశ్చయించు కొని, మహాభయంకరాకారాన్ని దాల్చి, ఒక్కసారి తన పెద్దతోకను నేలకేసి కొట్టాడు లంకాపురం యావత్తూ నాలుగు దిక్కులూ మార్మోగేటట్లు-

## చెక్కు చెదరని హనుమ

"శ్రీరామచంద్రమూర్తికి ఎదురులేదు. లక్ష్మణునికి తిరుగులేదు. రామ రక్షితుడైన కపిరాజు సుగ్రీవునకు ఎదురులేదు. రామచంద్రుని దూతను. ప్రచండ బాహు సమన్వితుడను, అరివీర భయంకరుడను. వెయ్యిమంది రావణులొచ్చినా నాయెదుట నిలవలేరు. నిల్చినా బ్రతకలేరు. సర్వశత్రువులను

మట్టి కరిపిస్తారు. నేను ఎవరనుకుంటున్నారో! వాయుసుతుణ్ణి, హనుమంతుణ్ణి. ఎదురుగా వెయ్యిమంది రావణులొచ్చి యుద్ధానికి నిలబడ్డా- ఒక లిప్తకాలంలో ఆ వెయ్యిమందిని హతమారుస్తాను. మాయారాక్షస వాహినిని మటుమాయం చేస్తాను. లంక నంతటినీ తుదముట్టించి, భూజాత సీత పాదాంబాలను శిరస్సు పైదాల్చి, రక్కసులందర్నీ లెంకలు, తొంకలు పట్టి నేలమీద పేడపురుగుల్లాగా, పీతలలాగా ప్రాక్కుంటూ పోయేటట్లుచేసి రామచంద్రుని చేరుకుంటాను" అన్నాడు. రాక్షసిమూక ఒక్క నిమిషకాలం హనుమ మాటలకు దిగ్భ్రమచెంది, తెప్పరిల్లి హనుమమీద పెద్దపెద్ద ఆయుధాలను ఒక్కుమ్మడిగా ప్రయోగించారు. వెంటనే హనుమ తానున్న తోరణస్తంభానికి చెందిన మహా యసదండాన్ని పెరికి, పరిఘలాగా త్రిప్పుతూవుంటే- ప్రళయాగ్ని చక్ర భ్రమణం లాగావుంది. రాక్షసులందరూ దాన్నిచూచి ఆశ్చర్యంతో తత్తర పాటు పడుతుండగానే- అది ఎప్పుడు వచ్చి మీద పడిందో, వెనకనుంచి వచ్చిందో, ముందునుంచి వచ్చిందో, ఆకాశంలోంచి వచ్చిందో, క్రిందనుండి పెళ్లగించుకొని వచ్చిందో యమధర్మరాజు దంష్ట్రలాగా కాటువేసింది ఎదురుగా వున్న అందర్నీ!

రాక్షసులందరూ ఒక్కుమ్మడిగా వేసిన ఆయుధ శతసహస్రం ఏమైందో తెలియదు. అసలవన్నీ హనుమ దేహానికి తగిలాయా ? తగిలినప్పుడు హనుమకు బాధకలిగిందా? లేదా ? గుండె కమిలిపోలేదా ! ఆయుధాలన్నీ హనుమ శరీరాన్ని తూట్లుతూట్లుగా పొడవలేదా? పొడిస్తే మరి హనుమ శరీరం నుండి రక్తం చిమ్మాలికదా ! శ్రమపడాలి గదా ! ఇలాంటివేమీ కనబడవు. ఇదేదో భూతమో ప్రేతమో అయివుండాలి అన్నట్లున్నాడు హనుమ చెక్కు చెదరకుండా!

## జంబుమాలి రంగ ప్రవేశం

"రాక్షస సైన్యం అంతా నిశ్శేషంగా నాశనమైన సంగతి రావణునికి తెలిసింది. ఎంత సైన్యాన్ని పంపితే అంత సైన్యం అంతమైంది. పైగా ఏ ఒక్కరూ తక్కువవారేంగాదు. మహాస్త్రాలగ్గాని మరణించని వారు సైతం- చేతిలో కార్ముకం గూడా లేని ఒక కోతి చేతిలో హతమైనారంటే- అలో

చించాల్సిన విషయమే !" రావణుడిలా అనుకుంటున్న సమయంలో తన పంద్రెండుమంది మంత్రులలో ఒకడైన ప్రహస్తుడు అనే వాని కుమారుడైన జంబుమాలి అక్కడకు వచ్చాడు. ఇతడు చాలా పరాక్రమవంతుడు. ఇంద్రజిత్తు లాంటి వాళ్ళకంటె గూడా తాను గొప్పవాణ్ణనుకుంటాడు. అయినా అంతటి తనకు రాక్షసరాజు సరియైన పదవి ఏదీ ఇవ్వలేదనుకునేవాడు. ఈఅవకాశాన్ని వినియోగించుకొని తనేమిటో, తన పరాక్రమ మేమిటో తెలియజెప్పి, మంచి పదవిని సంపాదిద్దామనుకుని అక్కడకు వచ్చాడు. రావణునితో ఏదో మాట్లాడుతుండగా- అదే సమయానికి అశోకవనాన్ని కాపలా వుండే తోట కాపరు లక్కడకు వచ్చి—

"దేవర వారి అనుమతితో విన్నవించుకుంటున్నాం; ఆ జానకిని చూడ్డానికి వచ్చిన కోతి సామాన్యుడు కాదు. మన రాక్షసిమూక నంతనూ మట్టుపెట్టడమే కాకుండా, బుసలు కొడుతూ అశోక వనాన్నంతటినీ దున్ని పారేశాడు. ప్రాకారపు గోడ ఎక్కి, ఎంతో ప్రౌఢితో ప్రవేశద్వార దూలాలను మర్దించి మర్దించి విడగొట్టి విసిరాడు. బాదులు, గుజ్జులు, కొమ్మలు ఒకటని లేదు. అన్నిటినీ మహా వేగంగా విసురుతున్నాడు. దూలాల రాపిడి మధ్యలో ఎక్కడో ఒక నిప్పురవ్వ పుట్టింది. అది కర్పూరం లాగా సర్వప్రాసాదాన్ని భస్మం చేసింది. గాలి నేలమీద నుండి సముద్రం వైపుగా వీయడం మంచిదైంది. అశోకవనానికి, సముద్రానికి మధ్య ఏమీ ఊరులేకపోవడం మన అదృష్టం, లేకపోతే అదీ దక్కేది కాదు. 'ఓరి బాబోయ్! వాడు శతసహస్ర కింకర సైన్యాన్ని హతమార్చాడురా !' అన్నా వినకుండా ఆ కోతి మీదకు తగుదునమ్మా అని వెళ్ళిన ప్రాసాద రక్షకులు వందమంది ఉక్కిరి బిక్కిరై ఉసూరుమంటూ చచ్చారు ప్రభూ ! గుడిని మ్రింగేవాడికి గుడి తలుపులు అప్పడం కాదా? కింకరులనే కిమ్మనకుండా చేసిన కీశపతికి భవన రక్షకులు ఒక లెక్కా! అప్పడం ముక్కలై పోయారంటే పోరూ!" అన్నాడు.

తన కిష్టమైన వనానికి పట్టిన దుర్గతికి, తోటకాపరులు చెప్పినమాటలకు రావణునికి కోపం వచ్చింది. కోపమంతా రావణుని గుండెనిండా ధూపంలాగా నిండిపోయింది. అప్పుడు జంబుమాలి కల్పించుకుని–

"నా అంతవాడు డుండగా నీకెందుకింక చింత, ఆలోచన. నాపరాక్రమం

సంగతి నీకు తెలియదా ? నీపాదాల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను, ఆ కపి నేతను నేను వధిస్తాను. బడబాగ్నిని ఆర్పేస్తాను. దిక్సీమంతాల వద్ద వున్నా, శత్రువును హతమార్చగలను- నీ ఆజ్ఞకై నిరీక్షిస్తున్నాను ప్రభూ!" అన్నాడు.

జంబుమాలి మాటలను విన్న రావణునికి కోపం తగ్గి, 'వెంటనే కపివధ చూడు ముందు' అని జంబుమాలిని పంపేశాడు.

## జంబుమాలి - హనుమల యుద్ధము

సమస్త సన్నాహాలతో జంబుమాలియుద్ధానికి బయలుదేరాడు. హనుమకు జంబుమాలి వస్తున్నట్లే తెలియదు. తీరా దగ్గరకు వచ్చిన తరువాత చూస్తే వైభవం ఎక్కువ, విక్రమం తక్కువ, అనిపించింది హనుమకు. అంత హంగుతో దగ్గరకు వస్తున్నా- హనుమ కదలడు మెదలడు. జంబుమాలికి విషయం అర్థం కాలేదు. ఒక్కుమ్మడిగా, ఎడతెరపి లేకుండా హనుమపై ప్రగర వర్షం కురిపించాడు అప్పటికీ హనుమ కదలలేదు మెదలలేదు. జంబుమాలికి ఒళ్లుమండి విల్లును అర్ధచంద్రాకారంగా వచ్చేటట్లు ఆకర్ణాంతం నారిని లాగి, బాణాన్ని అర్ధచంద్రాకృతిలో వున్న హనుమ ఫాలభాగం మీదకు సంధించాడు. హనుమ ఫాలభాగంలో నెత్తురు పెల్లుబికింది. తీవ్రమైన కోపంతో ఒక్కసారి తోకను నేలపైకొట్టాడు. దిక్కులుపిక్కటిల్లేటట్లు అతి భీకరంగా ఆవులించాడు. అప్పటి హనుమ ముఖం క్రొత్తగా విచ్చుకుంటున్న అరుణాంబుజం లాగా వుంది. దద్దరిల్లే కంఠనాదంతో..

"శ్రీరామచంద్రమూర్తికి ఎదురులేదు, లక్ష్మణునికి తిరుగులేదు. రామరక్షితుడైన కపిరాజు సుగ్రీవునికి ఎదురులేదు. రామచంద్రుని దూతను. ప్రచండబాహు సమన్వితుడను. అరివీర భయంకరుడును. వెయ్యిమంది రావణులొచ్చినా నా ఎదుట నిలవలేరు. నిల్చినా బ్రతకలేరు. సర్వ శత్రువులను మట్టికరిపిస్తాను. నేను ఎవరనుకుంటున్నారో వాయుసుతుణ్ణి, హనుమంతుణ్ణి, ఎదురుగా వెయ్యి రావణులొచ్చి యుద్ధానికి నిలబడ్డా ఒక లిప్తకాలంలో ఆ వెయ్యిమందిని హతమారుస్తాను. మాయారాక్షస వాహినిని ఘటుమాయం చేస్తాను. లంకనంతటినీ తుదముట్టించి, భూజాత సీత పాదాం

కాలను శిరస్సుపై దాల్చి రక్కసులందరినీ-లెంకలు, డొంకలు పట్టి పేడ పురుగుల్లాగా, పీతల్లాగా ప్రాకుకుంటూ పోయేటట్లుచేసి, రామచంద్రుని చేరు కుంటాను" అని ఒక్కసారి సింహంలాగా గర్జించి ఒకపెద్ద వృక్షాన్ని పెఱికి వానిమీద విసిరాడు. దాన్ని వాడు తన బాణాలతో నూరుముక్కలుగా నరికాడు. హనుమ మళ్ళీ తోరణ స్తంభాన్ని ఆశ్రయించి కూర్చున్నాడు.

హనుమ నిరాదరణ భావానికి జంబుమాలికి చాలా కోపం వచ్చి, హనుమ నెలాగైనా చంపాలని అనుకొని ఒక తీవ్రమైన బాణాన్ని హనుమపైకి వదిలాడు. అది సరిగ్గా హనుమ బొమ్మ మధ్యకు తగిలి రక్తం ఉవ్వెత్తున లేచింది. అప్పటికి హనుమకు కోపం వచ్చింది. నిప్పులురాలే కళ్ళతో ఒక్కసారి కుప్పించి ఒక పెద్ద కొండరాతిని జంబుమాలి మీదకు విసిరాడు. జంబుమాలి ఆ రాయి తన దగ్గఱకు రాకమునుపే తన బాణాలతో దానిని తునాతునకలు చేశాడు. హనుమ మళ్ళీ తోరణ స్తంభమెక్కి కూర్చున్నాడు. హనుమ తనని మాటిమాటికీ ఇలా ఇబ్బంది పెడుతూ, ఏడిపిస్తున్నాడని గ్రహించి కోపావేశంతో తన రథాన్ని హనుమకు దగ్గఱగా పోనిచ్చి బాణ వర్షాన్ని కురిపించాడు. జంబుమాలికి, అతని బాణాలకు మించిన వేగంతో హనుమ ఒక పరిఘను పట్టుకుని పిడుగు పడ్డట్టు జంబుమాలి రథం పైకి ఉరికి రెండు గుఱ్ఱాలను చంపి, రథకేతనాన్ని ఊడబెరికి, రథాన్ని నుగ్గునుగ్గుచేసి, రాక్షసుణ్ణి నేలమీదకు నెట్టి, తల బ్రద్దలుగొట్టి చితకబాదాడు. అప్పుడు వాడి కాళ్ళు, చేతులు ముక్కలు ముక్కలై ఐదారుచోట్ల పడ్డాయి. హనుమ జంబు మాలుల యుద్ధాన్ని కళ్లారా చూచిన తోటమాలులు బెంబేలెత్తి, పరుగు పరుగున రావణుని దగ్గఱకు వెళ్ళి- జరిగిన సంగతి చెప్పారు. అప్పుడు రావణుడు—

## రావణుని నిర్ణయం

"పెద్దగా పర్యవేక్షణ లేకుండా పట్టించుకోని రాజుల ఆశ్రయంలో, పరిమితమైన పరాక్రమాలతో ఈ వీరులు ఏదో గుట్టుగా కాలం గడిపేస్తారు. అవసరమైనపుడు నియోగిస్తే అసలు రంగు బయటపడుతుంది. అప్పుడైనా రాజుకు తెలుస్తుంది గాని, వారి పరాక్రమ పటిమ అంతటిదేనని వాళ్ల

గుర్తించరు. పైగా అంతవరకు దర్పంగానే చరిస్తారు. ఇల్లాంటి సైనికులు గాని, సైన్యంగాని తనంతటతానుపోతే ఇంతే ! ఇంతకంటె నిర్వ్యాఘమైన బాహుబల పరాక్రమ సంపన్నుడు, చాపకళాప్రవీణుడు, దివ్యాస్త్రవిజ్ఞాతుడు అయిన ఒక్కణ్ణి ఎంచుకోవడం మంచిది" అని నిర్ణయించుకుని "తన పెద్ద కొడుకు ఇంద్రజిత్తుకు ఏమీ తీసిపోనివాడు, తన రెండవకొడుకూ అయిన-అక్షకుమారుణ్ణి పంపిస్తే తప్పకుండా కపివీరుణ్ణి జయించి వస్తాడు. ఒకవేళ కపి తన కుమారుణ్ణేమన్నా చేస్తే, తాను మాత్రం చూస్తూవూరుకోడు గదా !" అని ధైర్యంతో ఈసారి తన కుమారుడైన అక్షకుమారుణ్ణి పంపిద్దామను కున్నాడు రావణుడు.

(ఒకకార్యాన్ని చక్కబెట్టాడుగదా అని అన్నిటినీ వాడికే చెప్పడంగూడా ఎంతవరకు సమంజసమో ఆలోచించరు. 'తను కొడుకును కపిపైకి పంపించిన తరువాత కొడుక్కి ఏదన్నా అయితే తాను లేనూ !' అనుకున్నాడు గాని అజేయుడైన కపి చేతిలో తన కొడుకు చచ్చిపోతే, తాను కొడుకును మరల బ్రతికించుకోగలడా? తర్వాత ఏం జరిగినా ముందు కొడుకు చావడం ఖాయం. శత్రువు తనవారిని చంపినందుకు ప్రతిక్రియ చెయ్యడానికే చూస్తారు గాని, ఎందుకు ఇలా జరిగింది?' అని దానికి సంబంధించిన పూర్వాపరాలు ఆలోచించి బ్రతుకును చక్కదిద్దుకొని సుఖంగా వుండడానికి ప్రయత్నించరు. అహంకారం అంతటి అవివేకాన్ని ప్రేరేపిస్తుంది. అహంకారానికి ప్రతిరూపమైన రావణుడు మరి ఇంకోలా ఎందుకు ఆలోచిస్తాడు?)

## మంత్రి పుత్రుల మంతనాలు

ప్రహస్త పుత్రుడైన జంబుమాలి హనుమ చేతిలో నుగ్గు నుగ్గు అయిన తరువాత, జంబుమాలిపై మాత్సర్య బుద్ధి కలిగిన మిగిలిన మంత్రుల పుత్రులు అందరూ ఒకచోట చేరి, ఒకళ్లను చూసి ఒకళ్లు "చూశావా మన అనంగుణ్ణి అంటూ నవ్వుకున్నారు.' మనకన్న తాను సాధించింది ఏముంది? తన తండ్రి ప్రహస్తుడు రాజు సరసన చేరి ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుతూ, పొగడుతూ మంచి చేసికొని తన కొడుకును ఇంద్రజిత్తు అంతటివాడని చెప్పబట్టే గదా ఈ మాత్రం అవకాశం జంబుమాలి కొచ్చింది. ఇదంతా తండ్రి పెత్తనంగాని,

తన పరాక్రమం ఏమిటో తెలిసిపోయింది గదా ! మనకైతే ప్రభు దర్శనం దుర్లభం గాని తండ్రి పెత్తనంవల్ల ఆ జంబుమాలి బుడింగిన లోపలికి వెళ్ళి పోయేవాడు. ఇప్పుడు ఆ యముని దర్శనానికి గూడా అట్లాగేపోయాడు. వస్తున్నాననిగాని, వస్తానని గాని మాటైనా పంపలేదు. ఇంతకీ ప్రభువు మహా సమర్థుడు. ఎల్లాంటి ఆపద వచ్చినా- ఆయనకు అంతగా ఆనదు, అంటదు. అంతటి వీరుడైన ప్రభువుకు- తనను ఆశ్రయించుకుని వున్న భటులకు బాహు బలం లేకున్నా తన భద్రత కేమీ భయం లేదనే ధీమా వుంటుంది. దానికి తగ్గట్టు చుట్టూ చేరేవాళ్లు 'నీముందు ఎవరు నిలవగలరు ? నీకు సమానమైన వాడు ఈ ముల్లోకాలలోను ఒక్కడు గూడా లేడు' అంటూ మరింత పాడు చేస్తారు. దాంతో నిజమే కాబోలు ఈ భూమిమీద తనకు సాటి రాగలవాడే లేడనుకుంటాడు. అట్లాంటి వారితో ఏర్పడే ప్రభుత్వం ఎలా వుంటుందో ఊహించవచ్చు. ఇతర మంత్రుల పుత్రు లందరూ కలిసి ఈసారి తమ శక్తి సామర్థ్యాలు రాజుకు తెలియచెప్పే అవకాశం వచ్చింది. ఈ అవకాశాన్ని వదులుకోకూడదనుకొని యుద్ధసన్నద్ధులై, సైన్యాన్ని ఊరి వెలుపల ఉంచి, ప్రభువైన రావణుని దర్శించి–

"ముల్లోకవాస శూరులను ముప్పతిప్పలు పెట్టి, వాళ్ల పరాక్రమాన్ని నేలరాచిన మీ శౌర్యకార్యాన్ని చెయ్యడానికి ఎన్నో రోజులనుండి అవకాశం కోసం నిరీక్షిస్తున్నాము. ఈసారి మాకు ఆ అవకాశాన్ని ఇవ్వవలసినదిగా కోరుతున్నాము. స్వామి చరణాలందు మాభక్తిని తెలుపుకోడానికి ఇన్ని రోజులుగా నిరీక్షిస్తూ వున్నాము. ఇప్పటికి మాకు అవకాశం లభించింది. నీ పాదాలమీద ప్రమాణం చేసి చెబుతున్నాం. ఆ వానరుణ్ణి వధించి, మాభక్తిని చాటుకుంటాం. అనుగ్రహించు" అన్నారు.

## రావణుని లౌక్యబుద్ధి

ఇతర మంత్రిపుత్రుల మాటలు విన్నాడు రావణుడు. "ప్రహస్తుని కొడుకు లాగానే వీరూ అయితే- ప్రహస్తునికి ప్రత్యేకంగా పుత్రశోకంఉండదు గూడా! అదీగాక ఇప్పుడు వీళ్ల వ్యవహారం గూడా తేలిపోతే, అక్షకుమారుణ్ని పంపి పరిష్కరిస్తే, అది అక్ష కుమారునికి శౌర్య పరీక్ష కూడా అవుతుంది.

తన కొడుకు మీద తనకున్న ఈ అభిప్రాయాన్ని గూడా ప్రహస్తుడితో సహా మిగిలిన మంత్రులందరూ ఇంక మరోలా అనుకోడానికి గూడా వీలుండదు" ఈ విధంగా వూహించి—

"నాకు జంబుమాలి ఒకటి, మీరొకటి కాదు. అందరూ నా దృష్టిలో సమానమైన సాహసవంతులే! అప్పుడు అతడక్కడ వున్నాడు కాబట్టి పంపాను. ఇప్పుడు మీరు వచ్చి ఇక్కడ వున్నారు కాబట్టి మిమ్మల్నే పంపుతాను. మీరు మరోలా వూహించ నక్కరలేదు. ఇంకో విషయం కూడా చెబుతాను. అది సామాన్యమైన కోతి కాదు. సందు గూడా ఇవ్వకుండా ఒక్కొక్కరిని వేర్వేరుగా చంపుదామనుకునే బుద్ధి వుంటుంది ఆ కోతికి. మీరు అందరూ కలిసి అలాంటి పరిస్థితి రానీయకుండా యుద్ధం చెయ్యండి. ఏమాత్రం తెరిపి లేకుండా యుద్ధం చేసి మంచివార్త తీసుకురండి. కోతిని మాత్రం వదలకండి. జాగ్రత్త వెళ్లండి," అని వాళ్లను పంపించాడు.

మంత్రి పుత్రులను యుద్ధానికి పంపగానే ఆ పుత్రుల తల్లులు, భార్యలు సౌధాల నుండి చూసి హాహాకారాలు చేస్తూ, తెలియనివ్వకుండా కళ్లనీళ్లు పెట్టుకున్నారు- రాక్షసరాజు ఈ సంగతి గ్రహిస్తాడేమోనని, అంతలోనే ఏమీ తెలియనట్లు ఒకళ్ల నొకళ్లు పైపైకి నవ్వుతూ పలకరించుకోసాగారు.

## హనుమ దృష్టికి ఆనని అసురవీరులు

రాక్షస మంత్రి పుత్రులు సైన్యాలతో వస్తున్నట్లు వారు దూరంగా వున్నప్పుడే మారుతి చూశాడు. నవ్వులు, సింహనాదాలు, మహాయుధ ఘట్టన ధ్వనులు రివ్వున వచ్చే బాణధ్వనులు, పెడబొబ్బలు- అంతా కోలాహలంగా వుంది. సైన్యమంతా పదకొండు భాగాలుగా వుంది. ఒక్కొక్క భాగానికి ఒక్కొక్క నాయకుడు చొప్పున పదకొండు మంది వున్నారు. అయినప్పటికీ, అందరూ మూకగా ఒకే గుంపుగా వస్తున్నారు. ఎవరంతట వాళ్లు విడివిడిగా యుద్ధం చేస్తే ఎలా వుండేదో ఏమో కాని రావణాసురుడు వేసిన పిరికి మందు వలన అందరూ కలిసే మారుతి మీదకు వస్తున్నారు. ఇలా రావడం మారుతికి

మరింత కలిసివచ్చింది. అందరూ అలా కలిసి గుంపుగా రావడంలోనే తెలుస్తోంది- వాళ్ల భయం. అందరూ కలిసి మారుతిని చంపాలన్న కోరిక కంటె, అందరూ విడిగా వుంటే చచ్చిపోతామేమోనన్న భయం ఎక్కువగా వుంది. హనుమ వాళ్లను చూసి-

"ఏమిటో ఈ దైత్యరాజు ఇలాంటి అల్పులైన వారిని పంపిస్తాడు. ఇటువంటి వారిని చంపి మెప్పు పొందినా గొప్పగాదు. ఒక్కొక్కప్పుడు రాజులు అలాగే చేస్తారనుకుంటాను. తమకు అంతగా ఇష్టం లేని సైన్యాన్ని యుద్ధానికి ముందుకు తోస్తారు. ఇలా చెయ్యడంవల్ల తన కిష్టంలేని సైన్యాన్ని, సైన్యాధిపతులను వదిలించుకోవడం ఒకటి, దానితోపాటు అవతల శత్రు సైన్యాన్ని కొంత సడలించటం మరొకటి- ఇలా రెండు లాభాలు కలిసి వస్తాయి."

"నాకు శక్తి సడలిపోవడం, అలసట చెందడం ఏ మాత్రం ఉండదని పాపమా రావణాసురునికి తెలియదు. ఎవరెవర్ని ఎలా మర్దించి మట్టి కర పించాలో, అందుకు తగిన బాహుబల సంపన్నత ఎంత వుండాలో, నేను అందుకు ఎంత సమర్థుడనో శత్రువులకు తెలియదు. అందుకే ఎప్పుడూ వారు ఊహించిన దానికి వ్యతిరేకంగానే జరిగి మరణిస్తూ వుంటారు."అనుకున్నాడు.

## మారుతి - మంత్రి పుత్రుల యుద్ధం

ఖడ్గాలతో, బాణాలతో సైన్యాన్ని వెంటబెట్టుకొని సైన్యాధిపతులు ఒక్కుమ్మడిగా వస్తున్నారు. వాళ్లల్లో ఆవేశము, ఉత్సాహము పెల్లుబికి అశోక వనం ప్రవేశించి, హనుమంతుని సమీపిస్తున్నారు. వాళ్లందరినీ చూడంగానే హనుమకు అమితమైన ఉత్సాహము వచ్చి, ఒక్కసారి వనమంతా ప్రతి ధ్వనించేట్లు పెడబొబ్బ పెట్టాడు. హనుమ పెట్టిన పెనుభీకర ధ్వని లంక దశ దిశలకు వ్యాపించింది. సౌధాలమీద వున్నవారు హడలిపోయారు. తమ పతులు, సుతులు హతమైపోయి వుంటారని గగ్గోలు పడ్డారు. హనుమ చేసిన ఉగ్ర కంఠ నిస్వనాన్ని విన్న సైన్యం యావత్తూ బెంబేలుపడి, ముఖాల్లో భీతి తాండవించింది. అయినా తమ వంతు చెయ్యాల్సిన కర్తవ్యంగా మంత్రి కుమారులు ముసల, ముద్గర, తోమరాదులను హనుమ మీదకు గుప్పించారు.

మంత్రి కుమారులు గుప్పించిన బాణాలు తన కంఠంమీద, తలమీద, వక్షంమీద వచ్చితాకంగానే కోపం వచ్చింది హనుమకు. పూర్వం జంబుమాలితో తాపీగా యుద్ధం చేసినప్పటి ఓర్పు ప్రస్తుతం లేదు. కోపం పెల్లుబికింది. ఒక్కసారి ఎగిరి గంతేసి, శత్రువుల రథాల మీదకు ఉరికి, వాళ్లందరినీ విరగదన్ని, నేల కొరిగేట్లు చేశాడు. వాళ్లు మళ్ళీ తలలు పైకి ఎత్తలేకపోయారు. ఏ కీలు కా కీలు విరగ్గొట్టి, పదకొండుమంది వీరులనూ గోళ్లతో గీరి నానాభీభత్సంగా నేలమీదకు విసిరాడు.

మహావీరులను మహా భీభత్సంగా వధించిన ఆ సన్నివేశం చూస్తున్నపుడు- గుండెలు అదిరి, కాలు సత్తా కొద్దీ పరుగులు పెడుతున్న వీరుల సైన్యాలను- తన మహా వాలంతో ఒక పెద్ద కొండచిలువ అడవిదున్నను పెనవేసుకొని పట్టినట్లు చుట్టి, అందరికీ ఊపిరాడకుండా నిర్జీవులను చేసి, దూరంగా విదిల్చాడు. వంటిమీద ఆయుధాల తాకిడిలేదు, అంగవైకల్యము లేదు. వారు ఎలాచచ్చారో ఎవరికీ అంతుపట్టని విధంగా చచ్చారు. పారిపోయే వాళ్లనలా పట్టి వధించడ మెందుకు అంటే- 'ముందు రాబోయే యుద్ధంలో శ్రీరాముని చేతిలో చావబోయే రాక్షసమూక వ్యథ తీరు ఎలావుంటుందో మచ్చు చూపించాలిగదా- అందుకు-' అనిపించేట్లు చేశాడు హనుమ.

## భగ్గుమన్న రావణుడు

మంత్రి కుమారుల వధ తీరు విన్న రావణుడు భగ్గున మండిపోయాడు. పూర్వం హనుమ బలపరాక్రమాలను మెచ్చుకున్నవాడే కాని ఇప్పుడు హనుమ క్రూరంగా మంత్రి కుమారులను, సైన్యాన్ని వధించిన తీరుకు చాలా కోపం వచ్చింది. ఇక వూరుకుంటే లాభంలేదని హనుమను పట్టి తెప్పించి, రాజయోగ్యమైన దండన విధించాల్సిందేనని నిశ్చయించుకున్నాడు. రాచరికంలో ఇలా చెయ్యడం మామూలే. దీనివల్ల ప్రయోజనం చేకూరినా చేకూరకపోయినా పద్ధతి ప్రకారం చెయ్యాల్సిందే! శత్రువును పట్టి కొలువులో విచారించి, న్యాయ నిర్ణయం చెయ్యాలి. తన అభీష్టాన్ని అనుసరించి శిక్ష విధించినా అది ప్రజల, మంత్రుల ఒప్పందంతోనే ఈ నిర్ణయం జరిగినట్లు చెయ్యాలి ఇదొక తంత్రం.

శత్రువు సామాన్యుడు కాడు. ఒక్కడు వెళ్ళి శత్రువును పట్టి తీసుకు రావడం అంత తేలికైన విషయంగాదు. అక్ష కుమారుణ్ణి పంపినా- శత్రువుని చంపగల్గుతాడేమో గాని, బంధించి తేలేడు. పట్టి తీసుకు రావడానికి కనీసం ఐదారుగురన్నా కావాలి. వాళ్లుగూడా అతి సమర్థులై వుండాలి. ఇందుకు సరియైనవారు. చతురతలో పనిని సాధించుకురాగల వ్యూహరచనా ధీమంతులు- అయిన విరూపాక్ష, యూపాక్ష, దుర్ధర, ప్రఘస, భాసకర్ణులను పిలిపించాడు. వాళ్లు రాంగానే రావణుడు వారితో-

"మీరు యుద్ధానికి వెళ్లబోయేది ఎవరితో అనుకుంటున్నారో! సామాన్యుడు గాడు. ఉగ్రమైన పరాక్రమ సంపన్నుడు. అద్భుతమైన ధీశక్తి, బాహుబలం కలవాడు. సకల అస్త్ర శస్త్ర విద్యలు తెలిసినవాడు. ఎటువంటివాడి వ్యూహాన్నైనా పసిగట్టి, పటాపంచలు చేయగల ప్రతిక్రియ గలవాడు. అందరికీ సాధ్యమయేవాడు గాదు. మహానుభావుడు గూడా! వట్టి వానరమే గదా అని అనుకోకండి! కోతిచేష్టలు తెలియనివి కాదనుకోకండి. మామూలు కోతుల సంగతివేరు. ఈ జాతికోతుల రీతులేవేరు! మంచిచేవగలవారు. వాళ్లలో వాలీ, సుగ్రీవుడు, నీలుడు, జాంబవంతుడు, ద్వివిదుడు, మైందుడు మొదలైన వారెందరో వున్నారు. వీళ్లకి వీళ్లేసాటి. పోటీకి ఎవ్వరూ నిలబడలేరు. మునుపు మనచేతుల్లో చిత్తుగా ఓడిపోయిన ఇంద్రుడు, ఆ బృహస్పతి పాదాలు పట్టుకుని కాళ్లా వేళ్లా పడి ఏం పూజ చేశాడో, ఏం హోమం చేసాడో ఏమోగాని- ఇదిగో! ఘోరశక్తి కలిగిన- ఈ భూతాన్ని సృష్టించాడు. ఆ భూతాన్ని మీరు ఎదుర్కోబోతున్నారు. ప్రస్తుతం వళ్లు దగ్గఱ పెట్టుకోండి.

మీరు ఒక్కొక్కరు విడివిడిగా అతణ్ణి గెలవలేరు. అందరూ ఒక్కుమ్మడిగా బాణవర్షం కురిపించి, ఆ బాణపంజరంలో ఇరుక్కున్న అతణ్ణి నా దగ్గరకు ప్రాణాలతో తీసుకురండి. వానితో నేను మాట్లాడాలి. తనెవరో ఎందుకు ఇక్కడకు వచ్చాడో, వచ్చినవాడు ఈ వనమంతా ఎందుకు నాశనం చేశాడో, ఇంతమందిని ఎందుకు వధించాడో- అన్నీ అడిగి తెలుసుకోవాలి. మీరు గూడా ఏమీ తక్కువ వాళ్ళేమీకాదు. అమిత తేజస్వంతులు. వీరులు, ధీరులు. మరి మీరు వెళ్ళి ఆ వానరుణ్ణి బాణాలతో బంధించి ప్రాణాలతో తీసుకురండి. లంకంతా పాడుచేసిన ఆ దుష్టునికి తగిన బుద్ధి చెప్పాలి. బాగా

సమర్థులైనవారు ఐదారుగురు వెళ్తేచాలు. వెయ్యిమంది వెళ్ళి వానిచుట్టూ మూగి, అరవడానికి వెళ్ళక్కర్లేదు. సర్వసైన్యాన్ని మీ ఆధీనంలో ఉంచుతున్నాను. మీక్కావలసినంతమందిని ఎంచుకుని తీసికొని వెళ్లండి. నాక్కావలసినదల్లా ఆ వానరాన్ని బంధించి ఇక్కడకు తీసుకుని రావడం. మీకోసం ప్రతి నిమిషం ఎదురుచూస్తూ వుంటాను." అని వాళ్లను పంపించేశాడు.

## అసుర వీరులతో హనుమ యుద్ధం

'బంగారు టెక్కాలు ఆకాశాన్ని రాచుకుంటున్నాయా-' అన్నట్లుగాపోతున్న రథాలమీద నిశాచర నాయకులు బయలుదేరారు రథచక్రాల ధ్వనితోపాటు వాళ్లుపెట్టే కేకలతో చేసే శంఖారావాలతో నలుదిశలు దద్దరిల్లుతున్నాయి.

సూర్యోదయ రాగరంజిత మహోజ్జ్వల మూర్తులు- ప్రచండ పంచాగ్నులవలె ప్రభవిస్తూ, కండలు తిరిగిన బాహు భుజ వక్షములతో, క్రౌర్యం, శౌర్యం తాండవించే ముఖాలతో హనుమవైపుకు వస్తున్నారు. వస్తూనే- కళ్లల్లో కాంతులు విరజిమ్మే ప్రచండ ప్రకాశ వానర మూర్తిని చూశారు. 'మేరుపర్వత శకలాగ్రం ఒకటి ఇక్కడకు ఊడిపడిందా!' అన్నట్లున్నాడు హనుమ.' 'ప్రళయాగ్ని వానరరూపు కట్టుకొని ఇక్కడకు రాలేదు గదా!' అన్నట్లున్నాడు హనుమ. 'సాక్షాత్తు ఆ సూర్యుడే మల్లయుద్ధం చెయ్యడానికి సన్నద్ధుడై వున్నాడా?' అన్నట్లున్నాడు హనుమ. లేదా 'వాయుదేవుడే ఇలా ఘనమైన రూపాన్ని ధరించి నిల్చున్నాడా?' అన్నట్లున్నాడు హనుమ.

తనవైపు వచ్చే మహావీరులను హనుమ చూశాడు. వళ్లు ఉప్పొంగింది. ఒక్కసారి సింహంలా గర్జించాడు. ఆ నాదం విని అతని ఔదార్యానికి సంతసించారు రాక్షసవీరులు.

హనుమ సింహంలాగా గర్జించినవాడు అంతటితో ఊరుకోలేదు. 'శ్రీరామునికి ఎదురులేదు. నేను రామదూతను. సుగ్రీవుని బంటును. సీతజాడ తెలియడం కోసం ఇక్కడకు వచ్చాను. వెయ్యిమంది రావణులైనా నాముందు నిలువలేరు.' అంటున్నాడు. అలా హనుమ అంటున్నంతలోనే ఐదుగురు అసుర వీరులు హనుమ చుట్టు నైపులకు వెళ్ళి, తీక్షణమైన బాణాలను క్రుమ్మ

రించారు. మారుతి మూర్ధం రక్తం చిమ్మింది. ఇప్పటికి తగినవాళ్లు ఎదురు పడ్డారని హనుమ సంతోషించాడు. ఆ వెంటనే తీవ్రంగా ప్రతిస్పందించాడు. వాళ్లలో ఒకణ్ని ముందు చంపాలని హనుమ సందుకోసం చూస్తున్నాడు. అంతలోనే దుర్ధరుడనేవాడు హనుమను బాణాలతో ముంచెత్తాడు. హనుమ ఒక్కసారి మహావేగంతో దుర్ధరుని రథం మీదకు దూకి అక్కడున్న గదతో వాణ్ని వంద ముక్కలుగా చేశాడు. హనుమ ఎప్పుడు తన మీదకు వచ్చిందీ గూడా తెలుసుకోలేనంత వేగంతో హనుమ దుర్ధరుణ్ని ముక్కలు ముక్కలు చేశాడు. మిగిలిన నలుగురికి ఇలా జరగడం చాలా ఆశ్చర్యాన్ని, భయాన్ని, ఆందోళనను కలుగజేసింది. వాళ్లు కుపితులయ్యారు. వారిలో యూపాక్ష, విరూపాక్షులిరువురు ఆకాశంలోకి ఎగిరి హనుమతో తలపడబోగా హనుమ ఒక్కసారి నక్షత్రం నేలమీద వాలినట్లు క్రిందకు దిగాడు. హనుమతోపాటు విరూపాక్ష, యూపాక్షులు గూడ అనుసరిస్తూ వుండగా- హనుమ ఒక మహా వృక్షాన్ని వేసి, వారిద్దరినీ చంపాడు. దాంతో ఉడికిపోయిన మిగిలిన ప్రఘస, భాసకర్ణు లిద్దరూ భూమిపైకి చేరిన హనుమతో తలపడ్డారు. ఒక పెద్ద పర్వత శిఖరాన్ని వాళ్ళమీదకు వేసి, హనుమ వాళ్ళిద్దర్నీ చంపేశాడు.

సేనా నాయకులు హనుమను పట్టి తీసుకువస్తారని నిండు కొలువులో ఎదురుచూస్తున్న రావణునికి- సైనికులు జరిగిన వృత్తాంతాన్ని తెల్పారు. రావణుడు ఉగ్రుడయ్యాడు. భయపడుతూ సైనికులు ఇంకా-

"అతని శౌర్యం, బలం ఎంత వున్నాయని ఏం చెప్పగలం ? వాయు వేగానికి పదిరెట్లు వేగంతో ఆ వీరుడు విసిరిన వృక్షం తాకిడికి. పర్వతశిఖరం తాకిడికి మన సేనా నాయకులు చచ్చిపోయారు. ఇంతకీ ఇదంతా ఒక్కనిమిష కాలంలోనే జరిగిందంటే ఆలోచించు ఆ మహావీరు డెలాంటివాడో!" అన్నారు.

## అక్షునిపై ఆశ

సైనికుల మాటలకు రావణుడు భయ, కోపావేశ సమ్మిశ్ర మనస్కు డయాడు. హృదయంలో ఎవరో బలంగా తన్నినట్లైంది. ముఖం వివర్ణమైంది. అంతలోనే ప్రచండమైంది. ప్రళయకాల రుద్రుడు ముఖంలో తాండవించాడు.

ఆ స్థితిని చూడలేక, మంత్రులు దానవేశ్వరుని శాంతి వచనాలతో శాంతింపజేశారు. రావణుడు కోపావేశాలను ఉపశమింపజేసుకొని అక్షుని చూశాడు. ఆ చూపులో ఏదో ఆశ, ప్రేమ, భయము, ఆజ్ఞ కలిసి పెనవేసుకున్నాయి. ఉదయ సూర్యుని కిరణాలుపడ్డ పద్మంలాగా తండ్రి చూపులకు తనయుడైన అక్షుని ముఖం విప్పారి, తండ్రి వద్దకు జేరి, వంగి నమస్కరించి—

పూర్వం ఒకప్పుడు నువ్వు, అన్నయ్య (ఇంద్రజిత్తు) దేవతలతో యుద్ధానికి వెళ్ళి మీ సత్తా చూపించారు. అయితే అప్పట్లో నేను మీకు అంతగా అనవసరం అనిపించలేదు. ఇప్పుడు నేను నీ దయవల్ల వివిధాస్త్ర శస్త్ర విద్యా సముపార్జితుడ నయాను. వానరాన్ని నిగ్రహించి నీపట్ల నా ఋణం తీర్చుకుంటాను. నందీశ్వరుడు నాకు ముఖపతాక మొకటి ఇచ్చాడు. నా తపస్సుకు పరితృప్తి చెందిన సాక్షాత్తు ఆ మహాదేవుడు దిగివచ్చేంతవరకు నా కెదురు ఎవరూ నిలబడలేరు. అవతల వచ్చినవాడు శివుడు కాకపోతే నన్నింక ఎవ్వరూ గెలవలేరు. శివుడే వానరాకృతితో వచ్చినవాడైతే అప్పుడు నాకు నష్టం లేదు. నీ అనురాగ దృష్టికి, మహాదేవుని కరుణా దృష్టికి నోచుకున్న నాకు దుర్గతి పట్టదు, సుగతే దక్కుతుంది" అని దానవ సభలోని వారందరికి ఆశను రేకెత్తించాడు. ఆయుధాలతో, బలిష్ఠమైన అశ్వాలతో దివ్య పతాకమైన రథమెక్కి ససైన్యంగా వెళ్ళి మహాశ్మశానంలో వుండే ప్రళయ రుద్రునిలాగా వున్న మహావానర మూర్తిని చూసి—

## అక్ష కుమార ఆంజనేయుల యుద్ధం

"ఇతడు మహాబాహుబల సంపన్నుడు. ఇతణ్ణి గెలవడం కష్టం. గెలవలేం. గెలవడమే అసాధ్యమైతే, పట్టుకుని తీసుకువెళ్ళేది ఎలా? మహా సైన్యాధిపతులకే ఇతణ్ణి పట్టుకోడం కుదరక కూలబడ్డారు. ఒక్కటే మార్గం. ఇతణ్ని నా ధనుర్విద్యా ప్రావీణ్యంతో మెచ్చుకునేట్లు చేస్తాను ముందు, అనుకొని అక్షుడు ఒక్కసారి హనుమ మూర్ధానికి, కంఠానికి, బొమ్మల మీదకు, బాహువుల మీదకు కంటిభాగం మీదకు, తొడలమీదకు, పాదాలకు గురిచేసి వాడియైన పది బాణాలను కొట్టాడు. హనుమకు కించిత్తు నొప్పి కలిగింది. ఒక్కసారి అక్షుని కళ్ళల్లోకి చూస్తున్న సమయంలో- అక్షుడు హనుమ

హనువుపైకి మరో బాణం వేశాడు. హనుమ ఒక్కసారి తన దవడను తడుము కున్నాడు. ఎప్పుడో తగిలిన గాయం ఎండిపోయినా- పచ్చి ఆరక కొద్దిగా సలిపినట్లు- హనుమ దవడను తడుముకున్నాడు. అక్షుని రథాన్ని, ముఖాన్ని, చేతులను, బాణవిద్యా నైపుణ్యాన్ని చూసి దిక్కులు పిక్కటిల్లేటట్లుగా గంభీరమైన నాదాన్ని చేసి, ఒక్కసారి మహా వృక్షం లాగా పెరిగిపోయి, భయంకర శరీరంతో ఆకాశానికి ఎగిరాడు. అక్షుడు కూడా హనుమను అందు కోవాలని ఆకాశంలోకి ఎగిరాడు. రథంతో హనుమను ఢీ కొంటూ, హనుమ శరీరానికి గాయాలు చేస్తూ, ఎదురులేని ఐదు వాడి బాణాలను హనుమ పొట్ట లోకి కొట్టాడు. కాని అవి హనుమకు తగిలినా-హనుమ వాటిని పుచ్చుబాణాల క్రింద లెక్కగట్టి- ఇంకొకచోట నిలబడ్డాడు. అక్షుడు వదిలే బాణాలను అన్నిటినీ చేతులతో అందుకుంటూ, అక్కడికక్కడే విరిచి పోగులు పెడు తున్నాడు. అక్షునికి కోప మొచ్చింది. విపరీతమైన వేగంతో దూసుకుపోయే బాణాలను హనుమ పైకి వదిలాడు. ఈసారి హనుమ వాటిని విరవలేనంతటి ధాటిగా దూసుకుపోయాయి. కాని, హనుమ అంతలోనే పైనుండి భూమి మీదకు దూకి, ఒక పెద్ద వృక్షాన్ని పెరికి, దాని చిగురుటాకుల నన్నిటినీ దూసి అక్షుని పైకి మహావేగంతో విసిరాడు. తన నిశితమైన బాణాలతో అక్షుడు ఆ వృక్షాన్ని తునాతునకలు చేశాడు. అయినా అక్షుణ్ని కవ్విస్తూ హనుమ–

"శ్రీరామచంద్రమూర్తికి ఎదురులేదు, లక్ష్మణునికి తిరుగులేదు. రామ రక్షితుడైన కపిరాజు సుగ్రీవునికి ఎదురులేదు. నేను రామదూతను. నేను సుగ్రీవుని బంటుని. సీతమ్మను చూడవచ్చాను. వెయ్యిమంది రావణులైనా నా ఎదుట నిలవలేరు' అన్నాడు. అక్షునికి కోపం పెచ్చు పెరిగి భుజబలం అంతా ఉపయోగించి, ఆకర్ణాంతం నిశితమైన బాణాలను లాగి, హనుమ ముక్కుకు ఎక్కుపెట్టి వదిలాడు. ఆ బాణాలు తగిలీ తగలంగానే హనుమ నాసికా రంధ్రాలనుండి నెత్తురు ప్రవాహం కట్టింది. హనుమకు ఎక్కడలేని కోపం వచ్చి, ఒక మహా పర్వత శిఖరాన్ని పెకలించి మహా ఆగ్రహంతో, ఆవేశంతో అక్షుని పైకి విసిరాడు. ఆ పర్వత శిఖరాన్ని తన బాణాలతోనే పొడిపొడిగా చేసి, ఏమాత్రం సందు ఇవ్వకుండా హనుమ మీదకు ఉగ్రమైన

బాణాలను క్రుమ్మరించాడు. హనుమకు తీవ్రంగా కోపం వచ్చింది. అక్షుని పతాకను పెల్లగించాలనుకొని, అంతలోనే-"ఎందుకులే వీడు పసివాడు, ఇలా అవమానపరచడం భావ్యం కాదు" అనుకొని ఆకాశంలోకి ఎగిరాడు. కాని, హనుమ ఎక్కడకు వెళ్తే అక్కడకు వెన్నంటుతూ తరుముకు వచ్చేలాగా అక్షుడు బాణాలు హనుమ పైకి ఎడతెరపి లేకుండా వేశాడు. ఆ బాణాల తాకిడి తాళలేక, ఇంక వీణ్ణి చంపకుండా విడవకూడదని నిశ్చయించుకొని, ప్రళయ కాల పర్జన్యునిలాగా అక్షుని రథం పైకి హుటాహుటిని దూకి, 'హనుమ దూకుతున్నాడు తన మీదకు' అని అక్షుడు అనుకునే లోగానే రథాంగాలను విరిచి, ముక్కలు ముక్కలుచేసి, గుఱ్ఱాలను చంపి, అన్నిటినీ ఆకాశంలోకి విసిరాడు. అక్షుడు విరథుడయ్యాడు. బాణాలను హనుమ పైకి గుప్పించాడు.

అక్షుని బాణాలకు అందకుండా ఆకాశంలోకి ఎగిరి గమనిస్తున్నాడు హనుమ. గరుత్మంతునిలా వున్నాడు. ప్రళయాగ్నిలా వెలిగిపోతున్నాడు. అంతలోనే ఎప్పుడు క్రిందకు వచ్చాడో ఏమో అక్షుని క్రిందకు వచ్చి, వాని పాదాలు రెండు పుచ్చుకొని, పాము తోకను పట్టుకుని గిరాగిరా త్రిప్పినట్లు అక్షుణ్ణి త్రిప్పి, మహావేగంతో ఒక్కసారిగా నేలమీదకు విసిరాడు. దాంతో అక్షుని దేహాంగాలన్నీ నేలమీద-పడినచోట పడకుండా-చెల్లాచెదరై పోయాయి. ఈ దృశ్యాన్ని చూసి అక్షుని సైన్యం హాహాకారాలు చేసుకుంటూ, కాళ్లకు బుద్ధి చెప్పారు. హనుమ ఒక పెద్ద తోరణ స్తంభాన్నెక్కి, వెళ్ళే సైన్యం వంక చూస్తూ కూర్చున్నాడు.

## రావణుని దుఃఖావేశం

అక్ష కుమారుని యథార్థ వధ విధానం రావణుడు విన్నాడు. పది తలలూ వాలిపోయాయి. కళ్లనుండి వెలువడిన బాష్పాలు ఇరవై కాలువలుగా ప్రవహించాయి. సభలోని రాక్షసులందరూ రెప్పపాటు పడక ఆ కాసేపు అనిమిషత్వాన్ని పొందారు. ఎప్పుడూ సందు లేకుండా- విలాస, హాసాలను వినడమేతప్ప వేరొకదాన్ని వినడమే ఎఱుగని రాక్షసేంద్రుని అంతఃపురంలో-మబ్బులు ఉరిమినట్లు దుఃఖారావాలు మిన్నుమిట్టాయి. దానికితోడు మాటి

మాటికి అశోకవనంనుండి కపిమూర్తి సింహరావం వినబడుతోంది. సభంతా దుఃఖం పెల్లుబికి కోడికూతలు మారు మ్రోగినట్లైంది.

ఏది అసాధ్యమనుకున్నారో అది ఈ గద్దరి కోతి చేత సుసాధ్యమైంది. మరి ఆ రామచంద్రుడు ఇలాంటి గద్దరి కోతుల గుంపును వెంటపెట్టుకొని వస్తాడు. తప్పకుండా వచ్చితీరుతాడు. ప్రస్తుతం ముందుగా తను పోయి పట్టపురాణి మండోదరిని ఆదరించాలో, కపి ఆటలు కట్టేలా చూడాలో మనస్సులో నిశ్చయించుకోలేక శోకభారంతో సతమతమౌతున్న రావణుణ్ణి చూసి- మదగజ కుంభస్థలాల వంటి భుజాగ్ర సంపన్నుడైన ఇంద్రజిత్తు లేచి-

## ఇంద్రజిత్తు రంగప్రవేశం

"సహజమైన జీవ సంకలిత మోహవశంచేత జీవుడు శోక తప్తుడౌతాడు. ఎంత డాంబికంగా పట్టనట్లు కనిపిద్దామనుకున్నా- స్వంత పుత్రుడు మరణించినపుడు వారిపట్ల ప్రేమ మరింత పెల్లుబికి శోకంలాగా వెలువడుతుంది. దీనికి నిరూపణమే ఈనాటి మన అక్షుని మరణం. ఒక జ్యోతిలోంచి వేరై, వేరొక జ్యోతిగా రూపొందాల్చి, పెద్దదై, తానూ మాతృక జ్యోతిలా శోభిల్లుతుంది. ఇలా వేరైన జ్యోతు లన్నిచోట్ల ఒకేరకంగా వెలుగును ప్రసరించలేవు. కొన్ని కొన్నిచోట్లకు చేరగానే అలా వేరైన జ్యోతులు-కాంతులు పలచనై, చీకటిలో మ్రగ్గిపోతాయి. అలా అని, అన్ని జ్యోతులు అలా మ్రగ్గిపోవు. వేరైన మరి కొన్ని జ్యోతులు- ఉజ్జ్వలంగా రెట్టింపు కాంతులు గూడ చిమ్ముతూ శోభిల్లుతాయి. నేనూ. అక్షుడు గూడా నీ నుండి వేరైన వాళ్ళమే!" అన్నాడు. అర్థవంతంగా, సమయ సందర్భోచితంగా మాట్లాడిన పుత్రుని మాటలను విన్న రావణుడు- అతణ్ణి చూసి—

మహా శౌర్యనిధి, శత్రు భయంకరుడు అయిన నిన్ను ముందుగా పంపించాలని అనుకోకపోవడం వలన తగిన ప్రతిఫలాన్ని పొందాను. రాచరికపు మర్యాదను అనుసరించి ఆ కపి మీదకు నేనుగా ముందు పోకూడదు. నా బదులు నువ్వు వెళ్ళి వాణ్ణి కాళ్లూ, చేతులు కట్టేసి ఈకొలువుకు తీసుకొనిరా. కట్టివేయబడిన ఆ కపిమూర్తిని కసిదీరా, కళ్లారా చూడాలి. మన అక్షకుమారుణ్ణి చంపినందుకు ఈ కపికి మన ప్రాడ్వివాకులు ఏం శిక్ష విధిస్తారో,

ఏం చెయ్యమంటారో! ఎట్టని నిప్పులో కట్టులు కాల్చినట్లు కాల్చమంటారో, శివుని కంటికి ఆహుతి అయిన మన్మథుని లాగా చెయ్యమంటారో చూడాలి. మొదట్లోనే నిన్ను పంపివుంటే బాగుండేది. తలకు మించిన పని అయితే నువ్వు, నేనూ వెళ్ళాలి గాని ప్రతి చిన్న విషయానికి ఎందుకు అని నిన్ను పంపలేదు. కాని ఇప్పుడు నువ్వు తప్ప ఈ పనిని చక్కబెట్టగలవాడు లేడు" అన్నాడు.

## ఇంద్రజిత్తు - హనుమల యుద్ధము

ఇంద్రజిత్తు తండ్రికి నమస్కరించి సెలవు తీసుకున్నాడు. కవచకుండల కిరీటకేయూరాలు ధరించి, కొంత సైన్యాన్ని తీసుకుని నల్లని కాంతులీనే ధనుస్సు పూని, రథమెక్కి బయలుదేరాడు. దూరంగా తోరణ స్తంభం మీద వున్న హనుమంతుని చూచి, ధనుష్టంకారం చేశాడు.

వాలి వధ నాడు విన్నాడు హనుమ అటువంటి ధనుష్టంకార ధ్వని. మళ్ళీ ఈనాడు విన్నాడు. ఇంతలో శంఖాన్ని పూరించాడు ఇంద్రజిత్తు. ఆ శంఖారావం సుడులు సుడులు తిరుగుతూ హనుమ చెవుల్లో గింగురుమంది. ఇంద్రజిత్తు సింహంలాగా గర్జించాడు. అది ప్రళయకాల పర్జన్యగర్జనలావుంది. హనుమకు ఒడలు ఉప్పొంగింది. హనుమ గూడా ప్రచండరావంతో ప్రతి స్పందించాడు. ఇద్దరూ యుద్ధ సన్నద్ధులయ్యారు. ఆకాశంలో నాగ, సిద్ధ, యక్ష, పక్షి, చక్రధర మహర్షి సంఘాలవారు మహాధ్వానం చేశారు. వారిని చూసి, వారి నిస్వనాలను హనుమ, ఇంద్రజిత్తులు ఇద్దరూ విని, తాము ఒకరి కొకరు సమానమైనవారని నిశ్చయించుకొన్నారు.

ఇంద్రజిత్తు వదలిన బాణ పరంపరలు ఆకాశవీధిలో పరుగెత్తే పాముల లాగాను, హనుమ విసిరిన కొండరాళ్లు, మహావృక్షాలు గ్రహ, ఉపగ్రహ సూర్యకుటుంబాలలాగానుపోతూ, మధ్యలోనే తగులుకొనికొట్టుకుంటున్నాయి. ఇంద్రజిత్తు బాణాలన్నీ పొడిపొడి అయిపోతున్నాయి. హనుమ విసిరిన పర్వత శిఖరాలు, వృక్షాలు తీవ్రమైన వేగాల ధాటినుండి రథాన్ని తప్పించే ప్రయత్నంలో ఇంద్రజిత్తు సతమతమౌతున్నాడు. ఇంద్రజిత్తు వదిలిన బాణపరంపర బారినుండి తప్పించుకోడానికి మింటికెగిరే ప్రయత్నంలో సతమతమౌతున్నాడు

హనుమ. హనుమ ఆయువుపట్లకు గురిచూసి బాణాలను కొట్టటానికి ఇంద్ర జిత్తుకు కుదర నివ్వటంలేదు హనుమ. రథం మీదకు దూకి రథాన్ని విరిచి ముక్కలు చెయ్యడానికి హనుమకు అవకాశం రాకుండా అతి జాగ్రత్తగా, నైపుణ్యంగా, అప్రమత్తంగా వున్నాడు ఇంద్రజిత్తు. ఆగ్నేయాస్త్రం వేశాడు. హనుమ శౌర్యాగ్ని రెట్టింపయింది. ఇంద్రజిత్తు వాయవ్యాస్త్రం వేస్తే హనుమ వేగం ఏడు రెట్లయింది. ఇంద్రజిత్తు వేసిన మేఘాస్త్రానికి హనుమ వంటిపైన నెత్తురు ఆరిపోయింది. ఇంద్రజిత్తు శైలాస్త్రం వేస్తే హనుమ విసిరే పర్వత శిఖరాలు, మహావృక్షాలు ఆరింతలయాయి, హనుమ మీదకు అస్త్రాలు ప్రయోగిస్తే ప్రయోజనం లేకపోగా, అవతల శత్రువు శక్తి మరింత పెరుగు తోందని ఇంద్రజిత్తు గ్రహించాడు. ఎన్ని రకాలుగా ఆట కట్టిద్దామన్నా కుదరనీయకుండా హనుమ ఎప్పటి కేది- అనుకూలమో అలా పెరుగుతూ, తప్పించుకుంటూ, శక్తిని పెంచుకుంటూ యుద్ధాన్ని క్రీడలాగా ఆడుకుంటు న్నాడు. హనుమ శక్తిలోతు ఇంద్రజిత్తుకు, ఇంద్రజిత్తు పరాక్రమ పటిమ లోతు హనుమకు తెలియడంలేదు. చక్రవాళ పర్వతాన్ని సముద్రం ముంచ గలదా? సముద్రాన్ని చక్రవాళ పర్వతం పూడ్చగలదా?'-అన్నట్లుంది వారిరు వురి యుద్ధం. హనుమ కోపోద్రిక్తుడయాడు. ఆవేశం పెరిగింది.

"లంకలో ఒక గంధమాదనం గాని, వింధ్యపర్వతం గాని, పారియాత్రం, కుల పర్వతం లాంటివి ఏ ఒక్కటి వున్నా ఈపాటికి కూకటి వేళ్ళతో పెళ్ళగించి ఇంద్రజిత్తు నెత్తిమీద మొత్తేవాణ్ణి: అప్పుడు తప్పించు కున్నా ఆ ఇంద్రజిత్తుకు తలదాచుకోడానికి లంకే వుండదు. ఇంక ఇల్లేమి వుంటుంది. అయినా తను రావణుణ్ణి చూడాలి ఇలా చేస్తే ఎలా?" అనుకుని హనుమ శాంతించాడు. అయితే ఇంక పర్వతశిఖరాలు, మహా వృక్షాలను రువ్వటం మానేసి, మహాకాయంతో మహోగ్రరూపంతో నిలిచాడు. ఇంద్రజిత్తు ఒకదాని వెంట ఒకటి సందు లేకుండా శరపరంపరను హనుమపైకి గుప్పిం చాడు. వాయువేగ మనోవేగాలతో అవి మీదపడినా మారుతి కదల్లేదు, మెదల్లేదు, చెదరలేదు, బెదరలేదు. మదమెక్కిన భల్లూకం త్రాగి విదల్చిన తేనె బిందువుల్లాగా హనుమ తనమీద పడే బాణాలనన్నిటినీ విదిల్చి అవతల పారేస్తున్నాడు. తన బాణాలు హనుమపై ఏమీ పని చెయ్యకపోవడం

ఇంద్రజిత్తుకు బాధ కలిగించింది. ఈ కపి సామాన్య పద్ధతులతో వధింవబడడు అని, మరి తండ్రి కిచ్చిన మాటను ఎలా చెల్లించుకోవాలా అని ఆలోచించి ఆలోచించి, చివరకు అన్ని అస్త్రాలను మించిన మహనీయమైన బ్రహ్మాస్త్రంతో హనుమను బంధిద్దామని నిర్ణయించుకొని, తన పితామహుడైన బ్రహ్మను తన చిత్తంలో నిల్పి, ధ్యానించి హనుమపై ప్రయోగించాడు. అంతే! చేతులు పాదాలు, తలకాయ మెడ బిగుసుకుపోయినట్లై హనుమ నేలమీద కూలి పోయాడు. ఇంద్రజిత్తు ప్రయోగించిన దివ్యాస్త్రానికి అధిదేవతయైన సాక్షాత్తు సృష్టికర్త అస్త్రమందు ప్రవేశించి మహా యోగిలాగా ఉన్న హనుమను ఎదు ర్కొన్నాడు. బ్రహ్మాస్త్రానికి ఎప్పుడో ఒకప్పుడు కట్టుబడి వుండవలసిన ఒప్పందం, అది గూడా—తన ఇష్ట ప్రకారం ఎప్పుడైనా ఒకప్పుడు మాత్రమే అనే ఒప్పందాలతో బ్రహ్మ నుండే వరాన్ని పొందిన హనుమ—ఆ బ్రహ్మా స్త్రానికి బ్రహ్మ మీద గౌరవం కొద్దీ కట్టుబడి నిశ్చేష్టుడైనాడు.

## హనుమపై బ్రహ్మాస్త్ర ప్రభావము

నేలమీద వ్రాలిన హనుమకు చిత్రమనిపించింది. తనకు తాను బుద్ధి పూర్వకంగా నేలమీదకు వ్రాలిపోయాడో లేదా బ్రహ్మాస్త్రానికే కట్టుబడి అలా అయాడో సరిగ్గా నిర్ధారించుకోలేకపోయాడు. అయితే ఇంతకూ తన కాళ్లు చేతులు కదిలించగలడా లేడా? కాని కాళ్ళు కదిలడం కష్టంగానేవుంది. కాళ్ళు కదలడం లేదు. కాని చిత్తానికి కట్టువిట్టం లేదు . అయితే దేహానికే బ్రహ్మాస్త్ర ప్రభావమా? ఏమో! చివరకు బ్రహ్మకు గూడా ఈ సందర్భంలో తన అధికారం మీద స్పష్టమైన అభిప్రాయం తనకే కుదరలేదు. హనుమకు చిత్తంలో తన కాళ్ళు చేతులు కదల్చాలని సంకల్పం కలుగుతోంది ఆ సంకల్పాన్ని బ్రహ్మాస్త్రం నిరోధించలేకపోతోంది అయితే సంకల్పాలన్నీ జీవాధీనాలేనా దైవాధీనాలు కావా? అనే విచికిత్సకు దారి తీస్తోంది ప్రస్తుత పరిస్థితి.

గుంటలో కూలిపోయి చిక్కిన అడవి ఏనుగు చుట్టూ చేరే ఆటవికు ల్లాగా హనుమ చుట్టూ రాక్షస సైనికులు చేరారు. హనుమ కళ్ళు తెరచి వుండడం చూసి సజీవంగానే వున్నాడని భయపడి దూరంగా పోవడం ప్రారం

భించారు. అయినా హనుమలో ఏ మాత్రం కదలిక లేకపోవడం చూసి— 'బహుశః నిశ్చేష్టుడయి వుంటాడని, సమాధానం చెప్పుకుని క్రమ క్రమంగా ఒక్కొక్కళ్ళే హనుమను సమీపించారు. హనుమ ఏమీ చెయ్యని స్థితిలోనే వున్నాడని నిర్ధారించుకొని గట్టి త్రాళ్ళతో బంధించి అటుపైన ధైర్యంగా పిడికిళ్ళతో హనుమను పొడుస్తూ, శూలాలతో, కత్తులతో, బాధిస్తూ వుండంగా ఇంద్రజిత్తు హడావుడిగా వచ్చి వాళ్ళు చేసిన పనికి నిరుత్సాహపడిపోయాడు. బ్రహ్మాస్త్రం ఇతర బంధాలను సహించదు. బ్రహ్మాస్త్రం ప్రయోగించినా ఇంకా అది పని చేస్తుందో చెయ్యదో అని త్రాళ్ళతో కట్టి సంధించడం బ్రహ్మాస్త్రాన్ని అవమానపరచడమే! ఇంత జరిగింతర్వాత హనుమపై తన బ్రహ్మాస్త్ర ప్రభావ మేముంటుంది? తను సాధించిన పనిని అంతటినీ ఈ సైనికులు హనుమను త్రాళ్ళతో బంధించి వ్యర్థపరచారు. అని నిట్టూర్చి, పెదవివిరిచి, తన దారిన తానుపోయాడు. రాక్షస సైనికులు హనుమను రావణుని దగ్గరకు తీసుకు వెళ్ళారు.

## రావణుని కొలువుకూటంలో హనుమ

ఫాలభాగం మీద త్రేతాగ్నుల వంటి భస్మరేఖలలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతూ, త్రిలోకవిజేత లక్షణం ప్రస్ఫుటంగా, ప్రత్యక్షంగా కనుపించే బాహుభుజస్కంధ సంఘటిత శైలసన్నిభ దేహబల సమన్విత క్షాత్ర తేజస్సుతో, రత్నకుండల హారకేయూరాభరణాలంకృత సుందరవదన వజ్ర వక్ష సమన్వితగాత్ర వైభవ గాంభీర్యంతో కొలువుతీరి వున్న రావణుణ్ని హనుమ చూశాడు. రావణుని శౌర్యతేజో విలాసానికి, ఠీవికి, దర్పానికి హనుమ ఆశ్చర్యచకితుడయాడు.

"ఇంతటి వాడు పరకాంతా వ్యామోహ దుర్బుద్ధి ఒక్కటీ లేకుండా, సాధుధర్మవర్తనుడైతే ఎంతటి వాడై వుండేవాడో!" అనుకున్నాడు.

'ఇంతటి ఐశ్వర్యం, ఇంతటి వైభవం, ఇంతటి పరాక్రమం గలిగి, మహోగ్రమైన తపస్సుతో మహేశ్వరుణ్ణి మెప్పించి, త్రిలోక విజేత అయిన వీనికి కామబుద్ధి ఎంతటి కళంకాన్ని తెచ్చిపెట్టిందీ! 'మతులు మలినమైతే- మహాభక్తులైనప్పటికీ- మహేశ్వరుడు గూడా మార్చలేడు గదా!' అని అను హనుమ,

నేత్ర సుషమా హర్యక్షుడు, మహా కార్యదక్షుడు, అజాను దీర్ఘబాహుడు, మహాశైలవక్షుడు, నిర్భీకుడు అయిన హనుమంతుని చూచి రావణుడు-

"ఆనాడు నేను కైలాసంలో శివునికై తపస్సు చేసి మెప్పించి వరాలు గైకొన్నపుడు- పడగవిప్పి నిలబడ్డ నాగుపాములాగా తోకను ప్రసారించి, చెవులు జ్వాలల్లాగా పైకి నిక్కబొడిచి ఎఱ్ఱనైన కళ్ళతో నావంక మాత్సర్య బుద్ధితో నంది చూశాడు. ఆనాటి కోపం తీర్చుకోవడం కోసం ఈనాడు ఇలా వానర రూపంలో వచ్చాడు కాబోలు. నీలకంఠుడు భక్తజనుల పట్ల అనుగ్రహ సంపన్నుడే గాని, ఆగ్రహావేశుడు కాబోడని తలచి, నంది ఆ శివునితో చెప్ప కుండా ఇలా ఇక్కడకు వచ్చివుంటాడు. అశోక వనాన్నే పెకలించడానికి పూనుకున్నాడు- కాని, ఈ లంకను యావత్తూ పెల్లగించాలని తలచుకోలేదు. నయమే! ఆ శ్రీరామచంద్రునికి సర్వాధికారి అయిన సౌమిత్రి ఒక్కడూ చాలక ఈ మహా వానరమూర్తి ఎక్కడ దొరికాడో ! ఆనాడు మారీచుడు భావిసూచకంగా చెప్పాడు- చూస్తావుగా ఆ రామునితో వైరం ఎలా వుంటుందో; రాముడెలాంటివాడో, ఎంతటివాడో' అని. దానికి తగినట్లుగానే దూతగా ఇతడు శ్రీరామునికి లభించాడు. ఈ సృష్టి ప్రణాళికలో కొందరికి విచిత్రంగా అన్నీ అలా సమకూరుతాయేమో!" అనుకున్నాడు.

మహా జలధిలాగా వుండే రాక్షసేశ్వరుని ఎట్టఎదుట-హనుమ భయంతో బిక్కుబిక్కుమంటూ కుంచుకుపోయి, పిట్టలాగా నిలబడి వుంటాడని కొలువు లోని కొందరు ఊహించారు. విస్ఫారిత నేత్రాలతో, నిర్భయంగా, ధీమాగా నిలబడిన హనుమ వాళ్లని ఆశ్చర్యచకితుల్ని చేశాడు. కాని,లోతులు చూడగల కొందరు పెద్దలు మాత్రం ఆ యిద్దరూ ఒకరి నొకరిని చూచుకుని మదిలోనే గౌరవించుకున్నట్లు భావించారు. ఈ విధంగా సభలో కొంతసేపు- సూది రాలినా వినిపించేటంత నిశ్శబ్దం తాండవించింది ఆ మీదట రావణుడు-

## హనుమ వా[illegible]రి

"ఎవడితను? తనెందుకు ఇక్కడక [illegible]డు. వచ్చినవాడు చక్కని పూలతోటను కుక్కలు చింపిన విస్తరిలా ఎందుకు చేశాడో" కనుక్కోమని ప్రక్కనున్న ప్రహస్తుని ముఖం చూసి నిర్దేశించాడు. అప్పుడు ప్రహస్తుడు హనుమ దగ్గఱ కెళ్లాడు. ఆ ఇద్దరి మధ్య సంభాషణ ఇలా జరిగింది.

ప్ర :- "నీ పేరేమిటి?"

హ :- "ఆంజనేయుడు"

ప్ర :- "తండ్రి పేరు?"

హ :- "కేసరి"

ప్ర :- "నీ తల్లి పేరు?"

హ :- "మా అమ్మ పేరు అంజనాదేవి."

ప్ర - నీ తండ్రి పెట్టిన పేరు?"

హ :- "నాకు నా తండ్రి పేరు పెట్టలేదు. ఇంద్రాగ్ని యమ వరుణుల సమక్షంలో బ్రహ్మ నన్ను 'హనుమంతు' డన్నాడు. అదే నా పేరైంది."

సభలోని వారు హనుమ మాటలు వినంగానే— అంతవరకు నవ్వులతో నిండిన వాళ్ళ ముఖాల నుండి నవ్వు మెల్లగా పలచబడి, మళ్ళీ ప్రశాంతంగా వాళ్ళ సంభాషణ వినడం ప్రారంభించారు.

ప్ర : "నీ పుట్టుకకు దేవతలకు ఏమిటి సంబంధం?"

ప్రహస్తుడలా అడగంగానే- సభలో మళ్ళీ ఒక్కసారి వికృతమైన పరిహాసాలు ప్రారంభమయాయి. కాని అంతలోనే హనుమ కంఠంలోంచి ఒక్కసారిగా కొండ గుహల్లో ప్రతిధ్వనించే భీకర నాదం వెలువడడంతో ఎక్కడి నవ్వులు అక్కడ సద్దుమణిగి పోయాయి. అప్పుడు ప్రహస్తుడు మళ్ళీ- 'నువ్వు ఇక్కడకు ఎందుకు వచ్చావు?' అన్నాడు. అందుకు హనుమ—

"ఎందు కొచ్చావిక్కడ కంటే ఏం చెప్పను ? ఈ ప్రపంచంలో ఒక్కొక్క జాతికి ఒక్కొక్క లక్షణం వుంటుంది. మీ దానవ జాతివారు మనుష్యులను తింటారు. మా జాతి వారందరమూ చెట్లమీద, గుట్టలమీద తిరుగుతూ, ఆకులు పళ్లూ తింటూ, వనాలన్నీ తిరిగి ఈ దేహాలను కడ తేరుస్తాము. అందరూ "లంక" గురించి చెప్పుకుంటూంటే విని, అదేమన్నా నందనవనం లాంటిదో, లేదా ఇంకా పెద్దదో అయి వుంటుందని వారధిని దాటి ఇలా మీ వనానికి వచ్చాను. తీరా చూస్తే ఇదంతా ఒక మన్మథుని పూలతోటలా వుంది. నాకు వెగటు పుట్టి, తోటంతా విరిచి, నా దారిని నేను పోదామనుకున్నాను. ఇంతలో మీ వాళ్ళు నన్ను చంపడానికి వస్తే ఆత్మరక్షణకు నేను వారిని చంపక తప్పింది కాదు. అయితే ఇదీ ఒకందుకు లాభమే

అయింది. ఈ వంకను మీ దానవ చక్రవర్తిని గూడా చూసిపోయినట్లుంటుం దనిపించింది. దిగంతాల దాకా మాసిపోని కీర్తిని సంపాదించిన ఆ పది తల కాయలు, ఇరవై బాహువుల దేహధారి ఎలా వుంటాడో అనుకున్నాను. ఇలా రావడంతో అది కూడా నాకు సమకూడింది. ఈ విధంగా ఇక్కడి నారాకకు ప్రతిఫలం దక్కింది" అన్నాడు. అప్పుడు ప్రహస్తుడు మళ్ళీ– "నీది ఏవూరు? నీ వృత్తి ఏమిటి?" అన్నాడు. అందుకు హనుమ–

"మాది కిష్కింధా నగరము. కిష్కింధకేకాక, సర్వజగద్వానర లోకానికి చక్రవర్తి అయిన సుగ్రీవునికి నేను మంత్రిని. నువ్వు అడిగే ప్రశ్నలన్నీ ఒక బంధితుణ్ణి అడిగే విధంలాగా వున్నాయి. నేను సుగ్రీవుని దూతను. ఏ బ్రహ్మాస్త్రంచేత నేను కట్టుపడ్డానని మీరనుకుంటున్నారో- ఆ బ్రహ్మాస్త్రం నాకు తెలుసును. నాకా బంధం ఎప్పుడో తీరిపోయింది. కాని, నాకు దాన వేశ్వరుణ్ణి చూడంగానే ఆశ్చర్యం కలిగింది. ఏమి బ్రహ్మ తేజస్సు! ఏమి రూపం! చూడ్డానికి నా కన్నులు చాలడం లేదు! ఆసుగ్రీవుడు నాకు పాలకుడు. దైత్య స్వామితో ఏవో కొన్ని మాటలు చెప్పమన్నాడు. మా సుగ్రీవుడు సాధు సత్తముడు. పుణ్యశీలుడు. బాహుబల పరాక్రమ సంపన్నుడు, అనంత సైన్య పతి, కృతజ్ఞుడు. మిత్రుని కార్య నిర్వహణలో నిమగ్నమైనవాడు- వాలి చేత తఱుమబడి నాలుగు దిక్కులకు తిరిగాడు. చివరకు వాలి చేరలేని మతంగ ముని ఆశ్రమం వున్న ఋష్యమూక పర్వతం మీద వసించాడు."

"ఒకనాడు ఇద్దరం ఏదో రాచకార్యం గూర్చి మాట్లాడుకుంటున్నప్పుడు దూరంగా వనంలో కళ్లకు ప్రచండంగాను, రమ్యంగాను కూడా కనబడు తున్నట్లుంటే- భయాకర్షణతో మిశితమైన గుండెతో అటుగా పోయి చూశాను. కోదండాలు ధరించిన ఉగ్రతేజోమూర్తుల నిద్దరిని చూశాను. ఎదురుగా పోయి నిలిచి ముఖమెత్తి చూద్దామనుకుంటే- ధైర్యం చాలలేదు. వినయంగా వెళ్ళి, మొట్టమొదటగా ఆ రఘురాముని ప్రసన్న వదనాన్ని చూశాను. తరువాత వాలిని సంహరిస్తున్నప్పుడు ఆయన భయంకరత్వాన్ని చూశాను. ఆయన సుగ్రీవునికి రాజ్యాన్ని సమకూర్చి పెట్టి తన మాట చెల్లించుకున్నాడు. సుగ్రీవుడు సీతాన్వేషణకై అనంత సంఖ్యలో గల, మహోజ్జ్వల జవసత్త్వాలు

గల శాఖామృగసంతతిని నాలుగుదిక్కులకు పంపాడు. ఈదిక్కు నావంతైంది. సీతమ్మను ఈ అశోకవనంలో నేను చూశాను. హృదయం తరుక్కుపోయింది. త్రిలోక విజేత అయిన ఆ దైత్యేశ్వరుని తేజః ప్రకర మేమిటి ? ఇక్కడ ఈ దుస్థితిలో సీతమ్మ ఉండటమేమిటి? ఒకదాని కొకటి పొసగక తికమకపడ్డాను. సద్గుణరాశి అయిన ఉర్వీజాతకు, అంతకుముందు తెచ్చిన లలనాజాతికీ భేదమే కనబడలేదా? ఎందుకు చేసినట్లు ఈ పనిని? ఇహానికా? పరానికా? లేక తన ఇంతటి శౌర్యాన్ని ప్రకటించుకోడానికా? అర్థం కాలేదు. సీతమ్మను చూశాను. నిండు దుఃఖాంబుధిలో మునిగి వుంది. నూరు యోజనాల పయోధిని దాటాను. సీతా దుఃఖపయోధిలో పెల్లుబికిన తరంగాలకు శ్రీరామ వార్త అనే మలయ మారుతోపశాంతిని చేకూర్చ గలిగాను." అని రావణుని వైపు చూస్తూ—

## శత్రుపక్ష బలాన్ని గురించి హెచ్చరించటం

"శ్రీరాముడేమన్నా అపకారం చేసాడని గాని, బంధువుల నందరినీ చంపాడని గాని తలిస్తే దానికి ప్రతిక్రియగా చేత ధనుస్సు ధరించి నువ్వు ఎదురు నిలబడ గలవాడివే! తక్కువ వాడివేమీ కాదుగదా ! మరి ఎందుకిలా చేసినట్లు? ఈ చేతకాని పనికి ప్రతిగా అవతల శ్రీరాముని విల్లు చిందులు త్రొక్కుతోంది మరి చూసుకో ! రాముని పిన్ననాటి శివధనుర్భంగ నిస్వనం ఏ ఏ లోకాల్లో ఎవరెవరికి ఎంతగా ప్రభావం చూపిందో ఇప్పటికీ మర్చి పోలేముగదా! ఒకవేళ అలాంటి శ్రీరాముని కెదురు నిలబడ్డానికి భయపడ్డావా? భయపడినా తప్పులేదు అంటాను. ఎందుకంటే శివుడు కూడా రాముని కెదురు నిలవలేడు. పరశురాముని ప్రతాపం రాముని ముందు ఎంత చల్లబడి పనికి రాకుండా పోయిందో తెలియంది కాదు. ఒకదానితో ఒకదానికి సంబంధంలేని ఏడు తాళ వృక్షాలను ఒకే ఒక్క బాణంతో పెకలించి వేశాడు. అంతకంటె విచిత్రం చెప్పనా ? సాధారణంగా శరీరంలో ఒక్కొక్క భాగానికి సత్తువ ఎక్కువ వుంటుంది. కొందరికి ఎడమవైపు, కొందరికి కుడివైపు. కొందరికి కుడి చెయ్యివాటం ఎక్కువ. మరి కొందరికి ఎడమ చెయ్యివాటం వుంటుంది. కొందరికి చేతులకన్న కాళ్లలో వుంటుంది సత్తువ. రాముని కలా కాదు. దేహం యావత్తు బలాధిక్యమే! పెద్ద పర్వతంలాగా పడివున్న దుందుభి అనేరాక్షసుని కళేబరాన్ని అతి సులువుగా రామచంద్రుడు తన కాలి బొటనవ్రేలితో ఆరు

ఆమడల దూరానికి విసిరాడు. ఆ విషయం గుర్తుకు వచ్చినప్పుడల్లా నాకు వళ్లు పులకరిస్తుంది. రాత్రే నాకు సీతమ్మ తల్లి చెప్పింది. ధరణీజాతకే అపకారం చెయ్యబోయిన వానిపై కోపం వచ్చి రాముడు ఒక గడ్డి పరకను మంత్రించి అస్త్రం లాగా ప్రయోగిస్తే- హరబ్రహ్మాదులు కూడా దానికి ఎదురు చెప్పలేక చేతులు జోడించారుట! రాముడు ఎంతటి వాడో- మళ్ళీ తమ్ముడు లక్ష్మణుడు గూడా అంతటివాడే ! ఇంకా నాలాంటి వనచరులు వేలు లక్షలు వున్నారు. అందరూ ఒక్కసారిగా లంక పైకి రావటం ఎంతవరకు మేలో ఆలోచించుకో!"

"నిన్ను క్రుంగదీయడం అనేది మహాగొప్ప పనేం కాదు- అని చెప్పటం కాదు గాని, ఒక్కటి చెబుతాను. నన్ను చూశారు గదా ! నేనేమి చేశానో చూశారు గదా! నాలాంటి మా వాళ్లందరూ వచ్చి లంకమీద పడితే మీ లంకే మౌతుందో ఆలోచించు. మీ వాళ్లందరూ చావటం చూడ వేడుకైతే నేను చెప్పలేను మరి! నువ్వే గెలుస్తావన్న నమ్మకం నీకుండవచ్చు. పోనీ అలాగే గెలుస్తావనుకుందాం. ఆ గెలవటం ఎప్పుడు? ఇటువైపు శ్రీరాముడు మేమందరం, అటువైపు నువ్వూ నీ దనుజులు ఎదురుపడి యుద్ధం చేసిన తరువాత గదా! ఆ యుద్ధంలో అటు నీవాళ్లు, ఇటు రాముని వైపు వాళ్లు లక్షలమంది చచ్చిపోతారు. నువ్వు అప్పుడు గెల్చి ఎవరిని ఏలతావు? ఏమి గడిస్తావు? అతడు గెలిస్తే తన భార్యను అపహరించిన వాణ్ణి చంపానని సంతోషిస్తాడు, నువ్వు గెలిస్తే కూరగ్గూడా సరిపోని సీతను చప్పరించి సిగ్గుపడతావు (రాక్షసులకు మనుష్యులు ఆహారం గదా ! ఆ విషయం వ్యంగ్యంగా, వెటకారంగా చెప్పడం). ఇంతకీ యుద్ధం సంగతి విచారిద్దాం."

"నీ కొలువులోని వారిని కాస్త విచారించుకో. నీ ఈయుద్ధవిషయంలో, (చెప్పాల్సింది చెప్పి, భయపెట్టాల్సింది భయపెట్టి, ఇప్పుడు పాలకునకు, పాలితులకు మధ్య భేదాన్ని సృష్టించడానికి అంటున్నాడు) నీ కోసం, నువ్వు చేసిన పనికోసం వాళ్ళెందుకు చావాలి? రాజుకోసం బంటు ఎందుకు చావాలి? నీకు పాలకుడవనే అహంకారం వున్నట్లే-వాళ్లకూ పాలితులమనే అహంకారం వుండదా ! అహంకారం ఇరువైపులా వుంటే- ఎవరు ఎవరికోసం చావాలో నిర్ణయించడం కష్టం. యుద్ధంలో ఎక్కువమంది చనిపోయారనుకో. ఏ వైపు

గెలుపు, ఏ వైపు ఓటమి అనేది ఎలా నిర్ణయమౌతుంది? ఏ వైపు చావగా మిగిలిన వారు ఎక్కువో ఆ వైపు గెల్చినట్లు. ప్రస్తుతం లెక్కల్లో చూసినా నీ వైపు కంటె అవతల అత్యధికంగా వున్నారు. నేనొక్కణ్ణే ఎంతమందిని చంపానో తెలుసుగదా! దాన్ని బట్టి ముందు ఏం చెయ్యాలో ఆలోచించుకో! 'నువ్వు కూడా ఆ శ్రీరామునిపై దాసభావంతో ఇక్కడకు వచ్చానంటున్నావు. నువ్వూ చావవచ్చు గదా' అని నువ్వు నన్ను అడగవచ్చు. నువ్వు అనుకున్నట్లు నేను అన్నిటా, అందరి చేతుల్లోనూ చచ్చేవాణ్ణి గాదు. మీ వాళ్లందరి చావు నిశ్చయమైందని ధ్రువ పరచడానికి వచ్చాను" అన్నాడు.

హనుమ పలికిన మాటలకు సభ అంతా నిస్తబ్ధమైంది. ఎవ్వరూనోరెత్తి ఒక్కమాట మాట్లాడలేదు. అప్పుడు హనుమ మళ్ళీ—

"జిగిబిగి అల్లికలుగా కనిపించే ఈ జీవసృష్టికి వెనుక కనపడకుండా నడిపించే శక్తి వుండి వుంటుంది. ఆ శక్తిని నిర్వచించి, నిరూపించేవే వేదాలు. ఆ వేద మార్గ దుర్గమాలను విడదీసిన నీకే తెలియాలి ఆ విషయం గూర్చి మరి కంచే చేను మేస్తే ఏం చెయ్యగలం? ఏం చెప్పగలం? జీవులను అన్నిటి కంటె అధోమార్గానికి పట్టించేది కామమే! దీన్ని నిగ్రహిస్తే ఉత్తమమైన ఉన్నత మార్గాన్ని పొందవచ్చు. "నాకన్న గొప్పవాడెవడు? నా కంటె అధికుడైన నా ఆరాధ్య దైవాన్ని గూడా నా హృదయ పంజరంలోనే బంధించాను" అని నువ్వు అనవచ్చును, కాని అంతమాత్రం చేత నువ్వు కామవైరి అయిన శివుడివై పోతావా? రాముని భార్యను కోరి తీసుకువచ్చి, నిన్ను నువ్వే సరాసరి అంధతామిస్ర లోకాలకు దారి పట్టించుకున్నావు. సమస్త జీవులకు భూజాతపై తల్లి భావనే వుంటే- నీవు మాత్రం ఆమెను మరో భావంతో ఇక్కడకు తీసుకువచ్చావు. నీ హృదయంలో నీవు పడే క్షోభ నాకు తెలుసు. దాన్ని వారించి, భూజాతను విడిచిపెట్టు. నా మాటలకు బదులుగా మాట్లాడటం గూడా నీకు కష్టమై, నీవు మౌనం వహించినట్లు కనబడుతోంది. అయితే కానీ నా మాటలు నువ్వు వినవద్దు. నీ ఇష్టప్రకారమే నిర్ణయం తీసుకో!" అన్నాడు.

హనుమ మాటలు విన్న కొలువులోని వారందరూ రావణుని వంక

నిశ్చలంగా చూస్తున్నారు. రావణుడు తలలు వంచి కూర్చున్నాడు. సందర్భం చూసి హనుమ మళ్ళీ—

## రామలక్ష్మణుల గూర్చి

"ఆకారంలో మన్మథుడు, ఏకపత్నీవ్రతుడూ ఐన అజమహారాజు యొక్క పుత్రుడు దశరథుడు. దేవదానవ యుద్ధంలో ఇంద్రునికి సాయమై, రాక్షసమూకను చెండాడిన వాడు. పరమ శాంతస్వభావుడు. ఆయన ముగ్గురు భార్యలకు నల్గురు కుమారులు. శివుని విల్లు విరిచి సీతమ్మ పాణిని గ్రహించిన వాడు పెద్దకొడుకు శ్రీరామచంద్రమూర్తి, భూమినంతటినీ గడ్డిపోచగా వదిలిన త్యాగమూర్తి. త్యాగమొక్కటే పరమార్థం. అదే మోక్ష మార్గానుసంధాయి. సర్వాంగములకు మూలము. అటువంటి త్యాగానికి భౌతికమైన ఆకృతి రామ చంద్రుడు. సృష్టి సమస్తాన్ని హరించగలడు, కావాలంటే మళ్ళీ పునః సృష్టిని చేయగలడు. ధాత్రీ పాలనలో లాలించి, పాలించగలడు. ఈ సమస్తానికి ఈశ్వరుడని తెలుసుకో! ఆ తమ్ముడికి తెలుసు తన అన్నగారు పరమాత్ముడని. వాస్తవానికి ఆ తమ్ముని కన్న రోజున్నర కూడా పెద్దవాడు కాదు. అయినా అన్నగారు 'పరమాత్మ' అన్న గౌరవమే ఆ తమ్మునికి. రాముడు శాంతమూర్తి ఐతే అతని తమ్ముడైన లక్ష్మణుడు శౌర్యమూర్తి. ఆ సౌమిత్రిని గూర్చి ఇలాంటి వాడని ఎలా చెప్పగలను ? తానొక్కడూ ఈ సర్వధాత్రిని మోయ గలడు (ఆదిశేషుని అవతారం అని చెప్పడం). వాళ్లు వేసే బాణ పరంపరలకు తలలు- రాముడైతే, తోకలు- లక్ష్మణుడు. అగ్ని- రాముడైతే, జ్వాల- లక్ష్మడనుకో! వారి అనుసంధానం అటువంటిది. నీ ఆయుష్షుకు స్వస్తి. ఆ ఇనకుల దీపకునికి నీ ఆరాధ్య దైవం అయిన శివునికి విభేదాన్ని సృష్టించు కోకు. నీ రాజ్యం వెయ్యి కల్పాల వరకు వుండాలి. దిగ్గజ కుంభ స్థలాలకు నీ కీర్తి పరిమళం తాకాలి. అన్నాళ్లు నువ్వు పరిపాలించాలి. మరో ఆలోచన మాను. లక్ష్మణుడుండగా ఆ రాముణ్ణి గెలవడం నీ వల్లనేకాదు, ఎవరివల్లా కాదు. ఆ పరిశీలనా పటిమ, విమర్శనాబుద్ధి, సూక్ష్మగ్రహణము, హేతుకల్పన లక్ష్మణునికి తప్ప ఇతరులు పది వందల తలలకు గూడా ఉండవు" అన్నాడు.

హనుమ అలా చెప్పుకుపోతూ ఉంటే-రావణుడు హనుమను విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నాడు. వారిరువురి నేత్రాంశు ప్రసారంలో ఒకానొక మైత్రీ భావం పొడసూపినట్లు కొలువులో ఉన్న వృద్ధ దైత్య పుంగవులకు భాసించింది. హనుమ సందర్భం చూసి మళ్ళీ-

"సౌమిత్రి వైష్ణవుడు. నువ్వేమో శైవుడివి. నాకు ఇద్దరూ ఒకటే అనుకో! 'భూజాత'- అని 'హిమశైలపుత్రి'- అని ఇద్దరూ వేరు వేరు అని నాకనిపించదు. ఎందుకొచ్చిన విచికిత్స! ఆ తల్లిని తీసుకొనిపోయి వెంటనే ఆయన వద్దకు జేర్చు. నువ్వు తీసుకుని వెళ్ళడానికి అభిమానం అడ్డువచ్చి మొహమోటపడితే, సీతమ్మను నేను తీసుకుని వెళతాను. నీ మన్త్రుల్లో ఒకరిని నా వెంటపంపు. రాముడీ పనికి ఒప్పుకోవాలి. అయినా, ఆ బాధ్యత నేను చూసుకుంటాను" అంటూ రావణుని ముఖాన్నీ, కళ్ళనూ చూసి మళ్ళీ-

"నేడో, రేపో ఈ లంకలో అగ్నిజ్వాలలు రేగుతాయి. బాణపరంపర నిరాఘాటంగా చుట్టుముట్టుతుంది జానకీదేవి దుఃఖాగ్ని జ్వాలలు నీటికితోడై లంకంతా మాడి మాడి మసి మసి అయిపోతుంది. ఇంటింటా ఆర్తనాదాలు వినబడతాయి. ప్రక్క ప్రక్క ఇళ్ళన్నీ అగ్నితోరణాల్లో జాజ్వల్యమానంగా వెలిగిపోతూ, ప్రళయాగ్ని ప్రకోపాన్ని గుర్తుకు తెస్తాయి."

"జయాపజయాలు దైవాధీనాలు. శ్రీరాముడు దైవస్వరూపుడు. ఈ విషయం ఏమాత్రం తెలిసినవాడైనా వివేకరహితుడు కాలేడు. వాలి వధ సందర్భంలో రాముడే ఈ మాటను అన్నాడు. ఆ నాడు వాలి విషయంలోనే కాదు, ఈనాడు నీ విషయంలో కూడా ఆ వాక్యార్థం చెల్లుతుంది. కొందరు కామంలో పడి ఒక విచిత్ర వ్యూహాన్ని నిర్మించుకుంటారు. మరొక త్రోవ లేకుండా తమచుట్టూ తాము సృష్టించుకున్న ఆ వ్యూహంలో ఇరుక్కుని, దానికి భంగం వాటిల్లినపుడు మరణ బాధను బుద్ధిపూర్వకంగా కొని తెచ్చుకుంటారు. ఇవి నేను అనే మాటలుకావు. శ్రీరాముడన్న మాటలు ! నేను చెప్పవలసిన మాటలు అయిపోయాయి. ఇంక నీ ఇష్టం" అని ఊరుకున్నాడు. రావణుడు ప్రహస్తునివంక చూశాడు. హనుమను చూసి, ప్రాడ్వివాకులవంక చూసి-

# హనుమపై దోషారోపణలు - హనుమ సమాధానాలు

"మా ఆజ్ఞ లేకుండా మా పట్టణంలోనికి దొంగలాగా రావడం ఒక దోషం. పుష్పఫల భరితమైన వనాన్ని నిర్భయంగా త్రుంచిపెట్టడం మరొక దోషం. అదుపులో పెడదామని ప్రయత్నించిన రాజభటులను చంపడం మరొక దోషం. నిండు సభలో మహారాజు సన్నిధిలో- ఎదురెత్తుగా, ధూర్తుని లాగా అనకూడని మాటలు పలకడం ఇంకొక దోషం. ఇతని యందు ఇన్ని దోషాలున్నాయి. ప్రాడ్వివాకులు వీటిని విచారించి, న్యాయాన్ని అనుసరించి ఏమి శిక్ష విధించాలో నిర్ణయించ వలసినదిగా విన్నవించుకుంటున్నాను" అన్నాడు. అప్పుడు ప్రహస్తుని మాటలు విన్న ప్రాడ్వివాకులు, అధికారులు దీర్ఘంగా విచారణచేసి–

"దూత అయినవాడు ముందుగా తన రాక రాజుకు తెలియపరచాలి. రాజు అనతిమీద తను చెప్పదలచుకున్నది చెప్పాలి. ఈ విధంగా చెయ్యని ఇతడు దూత కాదు, దుశ్చరితుడే ! కాబట్టి వధార్హుడు అని మా నిర్ణయం. ఇందుకు తనేమన్నా చెప్పదలచుకుంటే చెప్పవచ్చు" అన్నారు. అందుకు హనుమ–

"కుసంస్కృతితో సీతను దొంగిలించిన జాతి వారి దగ్గరకు నన్ను పంపడం రాముని అనుగ్రహ దోషమే మరి ! అయితే నాకై నేను కొంత తీవ్రమైన ధోరణిని వ్యక్తపరిచి ఉండవచ్చు. ఇందుకు తగిన శిక్షను నిర్ణయించడానికి, దైత్య కృత్యాలకు- శిక్షను విధించడానికి ప్రమాణంగా ఒక స్మృతి ఈ రాక్షసజాతికి లేదా? విషయం చెయ్యిదాటిపోయి, విషమ పరిస్థితి సంక్రమిస్తే- దూతకూడా తన పరిధిని మించి ప్రవర్తిస్తాడు. నన్ను కపీశుడైన సుగ్రీవుడు పంపించాడుగాని, రాముడు పంపగా నేను రాలేదు. సీతమ్మ ఇక్కడ ఉందో లేదో చూడ్డానికి వచ్చినవాణ్ణి ఏమి మాట్లాడతాను ! అయితే అపార నీరధిని దాటగలిగి వచ్చిన దూత ఎటువంటివాడై ఉంటాడో మీ వాళ్లకు తెలియలేదు మరి!" అన్నాడు. అప్పుడు ప్రహస్తుడు ఈ రాజపక్షము వైపు వారెవరన్నా ఈశిక్షితుని పక్షంగా ఏమైనా చెప్పదలచినవారున్నారా?" అన్నాడు. అప్పుడు విభీషణుడు లేచి–

## విభీషణుని రాజనీతి

"సీతను వెదికి చూడ్డం వరకే ఇతని మాత్యం. సీత కనుపించిన తర్వాత రాజుదగ్గరకు రావలసిన అవసరం లేదు. కాబట్టి ఆ విషయంలో ఇతను దోషి కాదు. వెదకడానికి వచ్చాను అని ముందు చెప్పి వెతికితే- కనపడినా కనపడకపోయినా వెళ్ళేముందు మళ్ళీ చెప్పి వెళ్ళాలిగాని, ఆ సంగతి గురించి మనకు ముందుగా చెప్పనప్పుడు-వెళ్ళేముందు చెప్పి వెళ్లకపోవడంలో దోషం లేదు. పూలతోటలాంటి సీతను దొంగిలించినందుకు ప్రతిగా పూల తోటను హరించాడు. కాబట్టి అదీ దోషం కాదు. రాజదర్శనం కోసం వచ్చి రాజుగారి తాలూకు వాళ్లని తెలిసి చంపటం తప్పు కావచ్చు. కాని, తన ప్రాణాలనే హరించడానికి వచ్చినవాణ్ణి ఆత్మ సంరక్షణ కోసం చంపినా తప్పు లేదు. తాను అనిన మాటలన్నీ తనవి కావు. ఎవరు పంపారో వారివి. అందుకు శిక్షవేస్తే పంపినవారికి వెయ్యాలిగాని, వచ్చిన వానికి కాదు. పంపే వాడు తాను భగవంతుడని చెప్తే- వచ్చిన వీడు 'అతడు భగవంతుడని' చెప్పాడు. దీనినిబట్టి పంపినవాడు భగవంతుడని అర్థమా ? చెప్పినవాడు భగవంతుడని అర్థమా? తాను భగవంతుణ్ణని చెప్పలేదు కాని, వార్ధిని దాట గలిగి వచ్చిన వాడని మాత్రం మనకు తెలుస్తూనే ఉంది. అవతల రాముణ్ణి దుఃఖపెట్టాలంటే ఇతణ్ణి వధించకుండా ఉండటమే మంచిది. ఎందుకంటే— ఇతను వెళ్ళి, సీత లంకలో ఉంది, చూశాను అని చెబుతాడు. మనమీద ప్రతిక్రియ చెయ్యాలన్నా ఆ రాముడు ఈ అంభోనిధిని దాటి రాలేక ఏమీ పాలుపోక, చేసేదిలేక చెయ్యవలసినది చెయ్యలేక, ఆకాశం చూస్తూ, నిరుత్త రుడై, నిరాశతో దుఃఖిస్తాడు. పోనీ ఈ కపి వెళ్ళి వాళ్లతో సీతసంగతి చెప్పి తన భుజాలమీద వాళ్ల సేననంతా ఎక్కించుకుని వస్తాడా ? అదీ చూద్దాం. వాళ్లు ఎలాగో అలా ఇక్కడకు వచ్చినా- త్రిలోక వాసులందరినీ ముప్ప తిప్పలు పెట్టినా మన దైత్యలోక చక్రవర్తిని గెలవగలరా ? ఈ జలనిధిని వీడు కాక మరొకడు దాటలేడు. అలాంటప్పుడు వీణ్ని ఇక్కడ ఇప్పుడు వధిస్తే, సముద్రాన్ని దాటివెళ్ళి సీత ఇక్కడ ఉన్న వార్త చెప్పి రామునికి దుఃఖం కలిగించడానికి ఎవరు ఉంటారు ? మన పిల్లలను చంపిన వీణ్ని చంపితేనే కసితీరుతుందనుకుంటే-సీతను చూడ్డానికివచ్చినపుడు ఈకపితోపాటు

ఆ రామ సుగ్రీవులను కూడా కలిపి చంపవచ్చు. దానికి ఇప్పుడే తొందర పడనక్కరలేదు. వ్యాధి రావడానికి గల కారణాన్ని నిర్మూలించడానికి మందు వెయ్యాలిగాని, ఆ వ్యాధివల్ల బయటకు వెల్లడయే లక్షణాలకు లేపనాలు రుద్దడం కాదు. ఇతణ్ణి ఇక్కడ చంపేస్తే ఇదంతా జరగడానికి వీలుండదు. ఇతణ్ని చంపితే వాళ్ళు వచ్చే మార్గాన్ని మూసినట్లే అవుతుంది. కాబట్టి వీణ్ని చంపకూడదు. వీడువెళ్ళి చెప్పగానే వాళ్ళు ఏ పద్ధతిని అనుసరిస్తారో చూసి దానినిబట్టి వాళ్ళందరినీ తుదముట్టించవచ్చు. అదీ రాజనీతి పథానికి సరియైన విధానం దేన్నైనా పెరగనిచ్చి, పెరగనిచ్చి ఏవైపుగా ఎక్కడనుండి ప్రారంభమై పెరుగుతోందో చూసి- ఆ వైపు సమూలంగా నరకాలి- మళ్ళీ పెరగకుండా వుండాలంటే!"

"అసలు వనంలో అలజడి అయినపుడే ఇతణ్ని మంచిగా కొలువులోకి పిలిపించి విషయం తెలుసుకుంటే బావుండేది. కాని మనం అలా చెయ్యలేదు. ఏదో చిన్న చిలిపి కోతి అని అనుకున్నాం. ఇపుడు అసలు సంగతి తెలిసింది. కాబట్టి, రాజనీతి ప్రకారం పోవడం మంచిది. మరి దూతను చంపటం రాజనీతి కాదు. దూతను చంపడం శత్రువుయొక్క బలానికి భయపడి చేసేపని అవుతుంది. అలా చంపడం మూలంగా బలమైన శత్రువు యొక్క క్రోధాగ్నిని కోరి నాలుగింతలు చేసికోడమే అవుతుంది. శత్రువనే విష సర్పానికి తోక లాంటివాడు దూత. తోక తెగిన మొండిపాముకాటు ప్రాణనిర్భరమైన విషాన్ని కక్కుతుంది. కోపావేశంతో సాహసం తీవ్ర పరిణామాలకు దారితీయవచ్చు. ఆ తీవ్రమైన ఆటోపాన్ని భరించడం గూడా కష్టమౌతుంది. అందులో శత్రువును సమయం కాని వేళల్లో రెచ్చకొట్టకూడదు. శత్రువును సులభంగా చంపాలంటే వాణ్ని అన్నివిధాలా రెచ్చకొట్టకూడదు. నిద్రమత్తులాంటి ప్రమత్త స్థితిలో వుండేట్లుగా చేసి త్రుంచాలి."

"ఒకసారి రాజు దూతను చంపడమే జరిగితే- ఇక భూమ్మీద మిగతా రాజుల సభల్లో ఆ రాజు పరాభవం పొందడమే జరుగుతుంది. మిగిలిన రాజులు ఇంక ఎప్పుడూ నమ్మరు. ఈ దూతను చంపిన రాజు వద్దకు తమ దూతలను మిగిలిన రాజులెవ్వరూ పంపరు. సామదానభేదదండోపాయాలలో-

ఒక్క దండాన్ని మాత్రమే ఆశ్రయించుకుని పరిపాలించే రాజుకు- తోడుగా ఇరుగు పొరుగు రాజుల్లో ఎవ్వరూ మిత్రులుగా వుండరు. ఎంత దూరానికి దారితీస్తుందో అని ఆలోచించకుండా సాగనిచ్చి, వాలి విషయంలో మౌనం వహించి అలుసు ఇవ్వడం మూలంగానే-వ్యవహారం ఇలా ముదిరి ఇంతవరకు వచ్చింది. ఎంత ఎత్తుకు దారితీస్తుందోనని ముందే ఊహించి అంకుర దశలోనే త్రుంచివేస్తే ఇంతదూరం వచ్చేదా? దైత్యరాజును మించిన శత్రువు ఉన్నాడన్నదే లేకుండా సాగింది ఇన్నాళ్లు అటువంటిది ఈ రోజు నీతిని త్యజించి, దూతగా వచ్చినవాణ్ని చంపారనే అపకీర్తి పాలవడం తలవంపులు కాదా? మా రాజు ఎలాంటివాడు? పరాపరాలు రెండూ తెలిసినవాడు, వేద వేత్త, సూక్ష్మధర్మవిత్తముడు, రాజనీతితత్త్వజ్ఞుడు, కైలాస పర్వతాన్నే భుజ స్కంధాలపై మోపగలిగిన బాహుబల సంపన్నుడు. తెగువతో శివునికి తన తలలనే కోసి అర్పించి, అర్చించినట్టి భక్తశిరోమణి. అటువంటి రాజు దూతను చంపడమే జరిగితే- శాస్త్రజ్ఞానం. దశకంఠ, ద్విదశబాహుబల ప్రాభవం నిజంగా వృధానే అవుతుంది. లేకపోతే నిరాయుధుడు, నిరస్త్రుడు అయిన ఒక దూతను నిర్లజ్జగా చంపడం జరిగితే అంతకాక ఏమౌతుంది?" అన్నాడు.

## హనుమ స్పందన

విభీషణుడు అలా మాట్లాడుతున్నపుడు హనుమ అతని ముఖ లక్షణా లను పరిశీలిస్తూ, రాత్రి తాను చూచిన ఒక నిరాడంబర శాంతస్వభావుని సాధులక్షణాలతో సరిపోల్చుకొని, దైత్యసభలో ఇటువంటి విడ్డూరానికి అబ్బురపడి పూర్తిగా సమన్వయం కుదరక తనలో తాను-

"దానవేశ్వరుని సభలో ఇతనొక్కడు ధర్మపరాయణుడు, సన్మతి, చర్చాకమనీయ సాధుమతి, సమ్యగ్దృష్టి, వాగ్వైఖరీ చతురప్రౌఢుడు, ధర్మ వివక్షాయత్న సద్బుద్ధి. చనిపోయిన వీరులలో ఇతనికి ఏ ఒక్కడూ పుత్రుడు కాడు. అయినా ఎంత ధర్మబద్ధంగా మాట్లాడాడు. అక్కడ లక్ష్మణునివాదనకు సరిపోయిన విధంగా వుంది. ఒకే భేదము ఇద్దరికీ. లక్ష్మణస్వామి తీవ్ర స్వభావుడు, ఇతను సాధుమూర్తి. ఇద్దరి పేర్లు తెలుసుకోవాలి- బ్రహ్మాస్త్రం నా మీద ప్రయోగించిన వాని పేరు, కొలువులోని రమ్యమూర్తి అయిన ఈ సాధుపుంగవుని పేరు" అనుకున్నాడు. అప్పుడు రావణుడు తన మనస్సులో-

## రావణుని స్పందన

"ఈ కపిని వధించడం ఈ విభీషణునికి ఇష్టం లేదు. ధరాత్మజను తెచ్చిన పని ఇతని మనస్సుకు ఇష్టం లేదు. అప్పటి నుండీ రఘురాము డిక్కడకు రావాలనే కాంక్షిస్తూ చేసిన వాదన ఇది. కాని, పూర్తిగా నీతి యోగ్యమైనది కాదు. వాదన వినడానికి నన్ను ప్రశంసిస్తున్నట్లే వుంది. నీతి బద్ధంగా, ధీశక్తి నిండినదిగానే వుంది. మరి రేపు రాముడే కనక వస్తే ఈయనగారు ఏ మార్గాన్ని ఎన్నుకుంటాడో చూడాలి. నేను, కుంభకర్ణుడు నిర్భరమైన తపస్సుచేసి శత్రువులకు ప్రళయాగ్నులమవాలని కోరితే వీడు దైత్యపద్ధతికే వ్యతిరేకంగా చిత్తశాంతిని నింపుకున్నాడు. హృదయాంతరంలో గూడా నా శౌర్యప్రతాపాలకు అభిమానపడతాడు. బలహీనులకైనా బలవంతుల విక్రమం ఆహ్లాదం కలిగించాలనేముంది?" అని అనుకొన్నాడు. రావణుని ముఖమండలంలో ప్రసన్నత, మందహాసాంకూర ప్రసాదము దీపించగా సభలోని వారందరిలో, విభీషణుని మాటలకు అనుకూల ముఖవైఖరీ చిహ్నాలు కనబడ్డాయి. అప్పుడు విభీషణుడు మళ్ళీ—

## శిక్షలో విచక్షణ

"దూతను చంపకూడదన్నాను గదా అని వీనిని ఊరకే పంపకూడదు. చేసిన తప్పుపనికి వధ్యుడైనా దూతత్వం చేత అవధ్యుడైనాడు తప్ప శిక్షా రహితుడు కాలేదు ఇంద్రజిత్తు అంతవాడు మాత్రమే ఇతన్ని బంధితునిగా చెయ్యవలసి వచ్చింది. భుజబల సంపన్నుడు. సర్వమహాస్త్ర విశారదుని చేత మాత్రమే బంధితుడైన ఇతడు- బాహుబల పరాక్రమ దర్పం గల్గినవాడై తీరాలి. సీతను చూచి రమ్మని మాత్రమే ఇతని రాజు చెప్పి వుండవచ్చు గాని, వనాన్ని నాశం చెయ్యమని, కొందరిని చంపి రమ్మని చెప్పి వుండడు. అయినా తన రాజుగారి మెప్పు పొందడం కోసం చెప్పిన పని కన్న మరింత విజృంభించి బాహుబల గర్వంతో దుర్నీతి మార్గాన్ని అనుసరించాడు. అందు చేత, ఇతనిని అవమానపరచి పంపించడం ఉత్తమం. నీతిపథం ప్రకారం గూడా ఇటువంటి దూత దండ్యుడేగాని వధ్యుడు గాదు. దూతయందు దుష్టత అధికమైతే దండ్యుడే అవుతాడు. దండనంలో మొదటిది కొరడా దెబ్బలు

కొట్టడం, శిరోముండనం రెండవ పద్ధతి. ఇంకా దుష్టుడైతే విరూపుని చెయ్యడం మూడవ పద్ధతిగా చెప్పబడింది. దండన శిక్ష నాల్గవదైనా ఇక్కడ శిక్ష ఒకటి చాలదు. 'నాకు ఎదురు లేద'నే దర్పం గల ఇతనికి ఆ దర్పం పోయే విధంగా చేసే అవమానం గూడా జరగాలి. అయితే ఇతని బాహువులపై బాణాలు గ్రుచ్చుకొని నెత్తురు చిమ్ముతోంది కాబట్టి వంటిపై కొరడా దెబ్బలు కొట్టడం జరిగినట్లే! వానరులకు శిరోజాలు వుండవు కాబట్టి శిరోముండన శిక్ష ఇతనిపట్ల కుదరదు. ముండన శిక్షలోని రహస్యార్థం ఏమిటంటే- సౌభాగ్య నిర్మూలన లేదా అమంగళత్వం. వానరులకు లాంగూలము (తోక) శిరోజ స్థాన సమానం కాబట్టి ఇతని తోకకు గుడ్డలు చుట్టి, నూనె పోసి, నిప్పంటించి లంకాపుర వీధులందు ఇతనిని త్రిప్పాలి. తోక కాలి నష్టమైపోతే మూడు శిక్షలూ పడినట్లే అవుతుంది." (బాహువులకు బాణఘాతాల వలన కొరడా దెబ్బలు, తోకకు నిప్పంటించడం వలన అమంగళత్వం, తోక లేకుండా మాడిపోవడం వలన విరూపత్వం జరిగినట్లౌతుంది) శిక్షా వచనాలను వ్రాస్తుంటే హనుమ విభీషణుని వంక చూశాడు. ఆ చూపులోతుల్లో-

"తన సామర్థ్యం తెలియక అట్లా అన్నాడా లేదా దండనకు దండనగానే చెప్పాడా ? లేదా చంపకూడదని చెప్పినందు వలన సభలోని దైత్యులకు కోపం వచ్చే సూచన గమనించి అందుకు తగ్గట్లు ఇలా అన్నాడా ? లేదా సహజ రాక్షసత్త్వంతో అలా అన్నాడా ? ధర్మం కంటె దైత్యకులాభిమానమే ఎక్కువైందా ఇతనికి" అనే భావాలు పొడసూపాయి.

శిక్ష విన్న తర్వాత గూడా హనుమ ముఖంలో బిగుపు, దర్పం పోక పోవడం రావణుడు గ్రహించాడు. చిత్తంలో హత్తుకున్న భావాలు ఒక్కసారి కదిలాయి." నా పుత్రుడు వీణ్ణి చంపలేదు, బంధితుణ్ణి చేసి వెళ్ళిపోయాడు. అతని దృష్టిలో ధీశక్తి, బలం, విక్రమం కలిగివున్న ఇతడు అవధ్యుడే అయి వుండాలి. ఇతడు తన భీకరాకృతితో లంకంతా తిరిగినా దానవులు గుర్తుపట్టక పోవచ్చు. కాని ఆ సమయంలో సూక్ష్మరూపం ధరిస్తే బంధాలు వృథా అవుతాయి. అసలే కోతి. దీనికి తోడు తోకకు నిప్పొకటి. ఏమి ముప్పు వస్తుందో! అస్త్రం దహించకపోతే అగ్ని దహిస్తుందా అని సందేహం. అస్త్రం -శక్తి, అగ్ని పంచభూతాల్లో ఒకటి. వారుణాస్త్రాన్ని తట్టుకోవచ్చునేమో

గాని సముద్రంలో పడితే తడవకుండా మునగకుండా వుండడం ఎట్లా సంభవమౌతుంది."

## జ్వాలావాలం

శిక్షా పత్రాన్ని చదివిన వెంటనే రాక్షసులు హనుమను పిడికిళ్లతో పొడుస్తూ: కత్తి పిడులతో నొక్కుతూ, కత్తులతో గ్రుచ్చుతూ, శూలాలతో పొడుస్తూ ఆ చోట నుండి తీసుకుని వెళ్ళిపోయారు. వాళ్లు పెట్టే బాధలన్నీ ఓర్చుకుంటూ, ఏమీ చెయ్యకుండా మారు పలక్కుండా వుండిపోయాడు. రాత్రివేళ తాను ఊరంతా సరిగ్గా చూడలేదు. ఏ దారిని పోతే ఏమొస్తుంది, ఎవరెవరి ఇళ్లు ఎక్కడెక్కడున్నాయి ముందే తెలుసుకుని వుంటే-రేపు రాముడు వచ్చినపుడు పని సులువౌతుంది అనుకున్నాడు.

అవతల రాక్షసులు ఇంటింటికి తిరిగి బళ్లకొలది పాతగుడ్డలు తెచ్చి హనుమ తోకకు చుట్టుతూ వుండగా ఎదురు చూస్తున్న ఆంజనేయుడు తోకను పెంచసాగాడు. అలా పెరిగిపోతోంది. తెచ్చిన గుడ్డలన్నీ అయిపోయాయి. ఒత్తుగ నూనెలో ముంచి తడిపి, జ్వలిస్తున్న అగ్నిహోత్రాన్ని తగిలించారు. రాజుకుని మంట రావడం కోసం చేటలతో విసిరారు. కొద్దిసేపట్లోనే ఆరిపోకుండా ఇంకాఇంకా పాతగుడ్డలు తెచ్చి కట్టి మళ్ళీ నూనెపోసి అంటించారు.

రాక్షసులు హనుమను పెద్ద పెద్ద వీధుల్లో త్రిప్పాలనుకున్నారు. సందుల్లోకి పోతాడు మారుతి. వికృతమైన భయంకరాకృతిలో హనుమను చూసి ఊళ్లో వున్న రాక్షస స్త్రీలు, పిల్లలు అందరికి గుండెలు నిలువక తల్లడిల్లారు. కొందరు తప్పెటలు వాయిస్తూ, మరికొందరు డప్పులు కొడుతూ హనుమను నాలుగు వీధులూ త్రిప్పారు. రక్షకభటులు దిక్కులను సూచిస్తూ అరుస్తున్నారు.

"ఈ కపి దొంగలాగా రాత్రి మన పట్టణంలో ప్రవేశించాడు. వీడి చరిత్ర చాలా వుంది. దుష్టుడు. వేలమంది మన రాక్షసులను, ప్రభువు పుత్రుడైన అక్షకుమారుణ్ణి చంపాడు. వీడు దూత గదా అని వధించడానికి అజ్ఞ ఇవ్వకుండా ఈ విధంగా వీడికి సిగ్గు కలిగేటట్లు తోకకు నిప్పు ముట్టించి ఊరివెంట త్రిప్పుతున్నాము. కాబట్టి దానవులందరూ వచ్చి చూడండి. వీన

దేహం వీడిది. చూడండి పిప్పళ్ల బస్తాలాగా ఎలా బలిసి వున్నాడో! వానరుడే కాని మొండి జాతి. ఎంతగా కొట్టినా అబ్బా అనడు, నొప్పి అనడు" అంటూ రాక్షసులు హనుమను నాలుగు వీధులూ త్రిప్పుతున్నారు.

కోతి అంటే ఎలా వుంటుందో అని కొంతమంది రాక్షసులు వచ్చి చూచిపోతున్నారు. రాక్షస బాలకులు భయంతో తలుపులు వెనుక దాక్కొని చూస్తున్నారు. రాక్షస స్త్రీలు తిట్టి పోగులు పెడుతున్నారు. దారి వెంట పోయే దానవులు చేతిలో ఏదివుంటే దానితో మోదుతూ పోతున్నారు. బంధించిన చేత్తో పట్టుకుని మధ్యమధ్యలో బిగిస్తూ నడుస్తున్నారు. ఒక్కొకసారి హనుమ తోకను పైకెత్తి చుట్టూ తిప్పితే వింతగా చూస్తున్నారు. నాలుగు మార్గాల కూడళ్లు. శృంగాటకాలు, ఘంటాపథాలు, రచ్చలు, రాజమార్గాలు, విపణి వీధులు త్రిప్పి త్రిప్పి- తమ ఒడళ్లు, దుస్తులు మంటసెగకు కాలితే- హనుమను ఒక శృంగాటకం వద్ద నిలిపారు. దీంతో హనుమకు ఆ లంకా పట్టణంలో తెలియని సందులేదు. చూడని దారిలేదు. తెలియని భవనం లేదు.

## లంకా దహనం

తోకకు వున్న నిప్పు పాకాన పడింది. పావనికి బాధ పెరిగింది. అప్పుడు ఇంక ఊరుకు నిప్పంటించాలో, జలధిలో చల్లార్చుకోవాలో ఇంకా తేల్చుకోలేదు. బంధాలను విదలించుకున్నాడు. సముద్రజలాల్లో తోకను ముంచి మంటలను ఆర్పుకుందామనుకున్నాడు. కాని, అంతలోనే దీనికి ముందుగా లంకను దహిస్తే ఎలా వుంటుందనే ఊహ వచ్చింది. ఊహ రావడమేమిటి తోకకు వున్న అగ్ని విజృంభించింది. కాని అంతలోనే తోకకు వున్న అగ్ని తనకు చల్లగా తోచినట్లనిపించింది. ఆహా! ఇది మా అమ్మ సీతమ్మ మహిమ తప్పితే ఇంకోటి కాదు, లేకపోతే అగ్ని చల్లగా వుండడమేమిటి? నా తోకకు నిప్పంటించారని మా తండ్రి రామచంద్రునికి తెలియకపోవచ్చు. తల్లి కెవరో చెప్పి వుండాలి. లేకపోతే ఒకప్రక్క తోక మంటలు మండుతున్నా చల్లగానే వుండటం ఏమిటి? సాధుశీలవతి అనుగ్రహమే ఇది. మా పితృదేవుని స్నేహితుడైన అగ్నిదేవుడు గూడా నాకు అనుకూలుడై అనుగ్రహించు గాక! ఇలా అనుకొంటున్న

హనుమకు గాలి తగలకపోయినా- చుట్టూ వున్న చెట్లకు గాలి ఫెళ్లున విసిరి నట్లై ఊగిసలాడుతున్నాయి. హనుమ తోకయందుగల అగ్ని బాగారాజుకుంది. జ్వాలలు రేగుతున్నాయి. హనుమ ఒక్కసారిగా సూక్ష్మాకారాన్ని పొందాడు. బంధాలన్నీ పూర్తిగా విడిపోయాయి. మనస్సులో సీతమ్మ తల్లిని స్మరిస్తూ నమస్కరించాడు. మనస్సులో ఉత్సాహం పెల్లుబికింది. వంటిపై రోమాలు నిక్కబొడుచుకున్నాయి. యుద్ధం చేసినప్పటి వేళకంటె నాలుగు రెట్లు ఉత్సాహశక్తి పెరిగింది. ఒక్కసారి ఆకాశంలో ఎగిరాడు. రాక్షసులకు ఏదో అగ్నిగోళం ఆకాశంలో పోతున్నట్లు అనిపించింది.

అంతవరకూ బోనులో వుండి ఒక్కసారి విడివడిన సింహాన్ని చూసినట్లు భయకంపితులైనారు. మేస్తున్నప్పుడు భూమి బ్రద్దలై రెండు భాగాలుగా విడిపోతే ఎలా వుంటుందో- అలా మృగాల గుండెలు హడలి, తునిగిపోయినట్లై నాయి. రాక్షసులు గంగవెఱ్ఱులెత్తి నాలుగుదిక్కులకు తూలుతూపోతుండగా తోక చిచ్చు కొందరి తలలకు, కొందరికి గడ్డాలకు, కొందరి భుజాలకు, తగిలి పాముకాటు వేస్తే భయంతో చచ్చినట్లు అక్కడికక్కడే చచ్చిపోయారు. సౌధాల నుండి చూస్తున్న రాక్షసులు పట్టుకుని పై ప్రాణాలు పైనే వదెలారు. తోకకు ఉన్న విలయాగ్నికి భయపడి ఆర్పుదామని దానిచుట్టూ మూగినవారిని అగ్నిజ్వాలలతో వున్న తోకను అమాంతంగా ఝాడించి విసిరాడు. చక్రం లాగా గిఱ్ఱున త్రిప్పాడు. అందరూ ఎవరికి వారు చెల్లాచెదరైపోయారు. హనుమ అక్కడనుండి లంకాపుర సింహద్వారం మీదకు ఉరికాడు. ఎదురుగా వున్న కొందరు రాక్షసులు హనుమ మీదకు ఆయుధాలను ప్రయోగిద్దామను కుని, అతి భీకరంగా మహోగ్రంగా విజృంభిస్తూన్న హనుమను చూసి ఇటు వంటప్పుడు ఆయుధాలను ప్రయోగించడం వాళ్లకే సద్యోమృత్యువని తెలిసి ఊరుకున్నారు ఆ స్థితిలో హనుమ- లంకాపురిని పరశురామ ప్రీతికై ఎత్తిన పరశువులా వున్నాడు. ప్రళయకాల రుద్రుని నిటలనయన జ్వాలలపైన వెలుగు తున్న చంద్రఖండంలాగా, తన వాలశిఖాజాలంతో ఆకాశాన్ని అంటించాడు. అంతటితో ఆగకుండా ప్రహస్తుని ఇంటికి వెళ్ళి ఇంటి కిటికీలు, తలుపులు దూలాలను ముట్టించాడు. ఆ ఇల్లు తగలబడి పోతుంటే—

"ఎదురులేదు శ్రీరామునికి. ఎదురులేదు లక్ష్మణునికి. రామరక్షితుడైన

సుగ్రీవుని కెదురులేదు. అంజనాదేవి నా తల్లికి అనిల దేవునకు నేను ఔరస పుత్రుడను. నా తండ్రి కేశరాజైన కేసరి. నవ్వండి నన్నుజూచి దానవుల్లారా! ఆనాడు సభలో అవహేళనగా నవ్వడం గాదు. ఇప్పుడు నవ్వండి. ఏదో అధికారిగా, విజ్ఞానిగా, ఏదో ఆనాడు బంధితుడై వున్న నన్నుచూసి వెట కారంగా అడిగినట్లు కాదు. కాలే ఇల్లు చిటపటల మధ్య చిరునవ్వులు చిందించండి" అన్నాడు.

ప్రహస్తుడు ఆలోచించాడు. ఈ రాక్షస జాతి దురంతాలకు స్వస్తి చెప్పదలచి, దానవ జాతి నిర్మూలనకు మిశ్రరక్తంతో జన్మలు పొందే జాతిని తెచ్చినట్లున్నారు దేవతలు. లేకపోతే ఇంతటి భుజబలం, ఆవేశం, ఉద్వేగం, ఉత్తేజం, తీవ్ర వివేకం మామూలు జాతికి ఉండవు అనుకున్నాడు.

## పూరణ హోమం - స్వైరవిహారం

హనుమ బంధితుడైనాడన్న ఆనందంతో క్రుద్ధులైన దానవులు కొందరు ఊరిలో ఉపన్యసిస్తుంటే-వాళ్ల వాళ్ల పేర్లు-'మహాపార్శ్వుడు, వజ్రదంష్ట్రుడు, శుకసారణులు, సుమాలరశ్మికేతులు, సూర్యశత్రుడు, హ్రస్వకర్ణ హ్రస్వ దంష్ట్రులు, రోమశ ధ్వజగ్రీవ, విద్యుజ్జిహ్వా హస్తిముఖులు' అని విని వాళ్ల వాళ్ల ఇళ్లకు వెళ్లాడు. అధికృతులయొక్క, ప్రాడ్వివాకుల యొక్క నివాసాలకు నిప్పంటించాడు. దిక్కులు ఒక్కటయేట్లు గుప్పుమనిపించాడు. అగ్నిజ్వాలలు పాముల్లాగా వెడలి విజృంభిస్తున్నాయి. ఇంకా— కరాళ, పిశాచ, శోణితాక్ష, మకరాక్ష, యజ్ఞశత్రు, బ్రహ్మశత్రు, నరాంతక, కుంభ, నికుంభులు, మహా దుర్జనులని విని వారి ఇళ్లకు కూడా నిప్పంటించి నిశ్శేషంగా పరశురామప్రీతి గావించాడు. అంతలోనే ఒక నల్లని రంగులో వుండే మరో ఇంటి పైకి ఎక్కి, పై కప్పు పెంకులను వేరు వేరుగా విడదీసి నిప్పంటించాడు. డప్పు మ్రోతలు లాగా ఫెళఫెళా రావాలు వినబడ్డాయి.

నల్లని రంగులోవుండే ఆ భవనమూ, పైకి చెలరేగిన నల్లని ధూమము- ఈ రెండూ వాటిమధ్యలో వున్న అగ్నికి రెండువైపులా ధూమకేతుల్లా వున్నాయి. గాఢ నిద్రలో వున్న ఒక మహోగ్రకాయాన్ని అలాగే మోసుకు పోవ ప్రయత్నిస్తున్నారు ఒక వెయ్యిమంది రాక్షసులు. ఆ మహాకాయం

ముక్కుపుటాల్లోంచి దూసుకువచ్చే గాలికి నిలబడలేక పడిపోతున్నారు. ఉచ్ఛ్వాసం వేళ లోపలకు జేరిన గాలికి మరింత భారం పెరిగిన ఆ కుంభో దరుణ్ణి మొయ్యలేక మొయ్యలేక తెగిన వరిపైరులా కాళ్ల చేతులు ఆడిస్తూ నేలమీద పడుతున్నారు. ఇది చాలదన్నట్లు పైనుండి క్రిందపడే పండుతున్న తబకల మంటకు తట్టుకోలేక పోతున్నారు. ఆ రాక్షసులు ఇంత అవస్థలు పాలుకావడానికి కారణభూతుడైన ఆ మహాకాయుడెవరో హనుమ గుర్తించాడు. సుషుప్త స్థితి ఇంత తీవ్రభావంలో వుంటే జాగ్రదవస్థ కూడా ఇంతకన్న తీవ్రంగా వుంటుంది. ఎదురులేని ఆ జాగ్రదవస్థలోని ఈ మహాకాయానికి రామచంద్రుని బాణమే మోక్షాన్నివ్వ గలిగేది. వీడు నేలమీదపడి దొర్లినా వానర సమూహం పప్పు పప్పు అయిపోతుంది. వీడింకా ఒక మాసం ఇలానే నిద్రపోతాడు. కాబట్టి ఒక మాసం లోగానే వీణ్ణి చంపడం జరిగేలాగా చూడాలి. అటుపైన చంపడం చాలా కష్టం" అనుకుంటూ హనుమ ఇంద్ర జిత్తు భవనానికి వెళ్లాడు.

ఇంద్రజిత్తు భవన ప్రాంగణంలో ముందున్న తోటలోని ప్రతిమలను ముక్కలు ముక్కలుగా విఱుగదన్నాడు. ఇంద్రుని ఐరావతాన్ని(తెల్లఏనుగు), పావురంలా ముంజేతితో విదిలిస్తున్నట్లు చెక్కబడిన ఇంద్రజిత్తు ముంజేతిని విరగ్గొట్టాడు.

ఇంద్రుని ఉచ్చైశ్రవమనే అశ్వాన్ని పెద్దగా సకిలింప చేయడానికి మింటిలో మీటుతున్నట్లున్న ఇంద్రజిత్తు ప్రతిమను మంటగలిపాడు. ఇంద్రుని పారిజాత వృక్షాన్ని పట్టి గిల్లుతున్నట్లు కనబడే గోరుగలిగిన ఇంద్రజిత్తు ప్రతిమలోని బాహుమూలాన్ని కాళ్లతో ఒక్క తన్ను తన్నాడు. ఇంద్రుని వజ్రాయుధాన్ని అవలీలగా తోసి అవతల పారేస్తున్నట్లుగా కనబడే ఇంద్రజిత్తు ప్రతిమలోని భుజాదండాన్ని ఒక్కపోటు పొడిచాడు. ఇలా అక్కడున్న ఇంద్ర జిత్తు శౌర్యచిహ్నాలను సూచించే ప్రతిమలన్నిటినీ గుర్తు పట్టలేనంతగా పాడు చేశాడు. పూలతోటను పూర్తిగా నాశనం చేశాడు. దిగుడు బావులకు, అక్కడ వున్న హంసలను, పూలతో వున్న లతానికుంజ భూరుహాలను సర్వనాశనం చేశాడు. ఇంద్రునికి జరిగిన అవమానభారానికి వాయు సంబంధికుని ద్వారా

షలా ప్రతిక్రియ జరగటంతోపాటు మిగిలిన దిక్పాలకులకుకూడా ధైర్యాన్నిచ్చే విధంగా అక్కడ వున్న అన్నిటినీ అగ్ని దహించి వేశాడు.

## జ్వలించిన ఉత్సాహం

హనుమ ఒకచోట స్థిరంగా నిలబడలేదు. ఒకచోట నుండి ఇంకొక చోటుకు, అక్కడనుండి మరొక చోటుకు ఇలా ఒక నిశ్చయం లేకుండా తిరుగుతున్నాడు. గెంతుతున్నాడు. ఎగురుతున్నాడు. ఏ ఒక్క చోట గూడా ముహూర్తకాలం గూడా స్థిరంగా వుండటం లేదు. కొందరు రాక్షసులు హనుమ పైకి విసిరే ఆయుధాలకు అందకుండా తిరుగుతూ తిరుగుతూ చిట్ట చివరకు రావణుని ఇంటిమీదకు వెళ్ళి, దాని ప్రధానమైన కట్టడానికి నిప్పు పెట్టి తనుచేసిన పరాభవ ప్రతిక్రియకు ఆనందోత్సాహాలతో నానారకాలుగా విచ్చలవిడిగా సంచరించాడు.

ఒక్క ఇల్లు అంటుకుంటే ఊరిలోని మిగిలిన ఇళ్ల వాళ్లు పదిమంది చేరి ఆర్పవచ్చు. కాని ఇన్ని ఇళ్లకు ఒక్కసారే నిప్పుచుట్టి ముట్టితే ఎవరేం చెయ్య గలరు ? ఇంట్లోనుండి ఎలాగో బయటపడి ప్రాణాలను దక్కించుకోడమే భారంగా వుంది. ఎలాగో అలా బయటపడినా- అగ్నిశిఖల సెగలనుండి రక్షించుకోడం, పిల్లలను కాపాడుకోడం అసాధ్యమౌతోంది. దీనికితోడు హనుమ వేసే కుప్పిగంతులు తోక ఝాడింపులు, అందరికీ కపి భీతి కంటె కపి లాంగూల భీతి భయభ్రాంతుల్ని చేస్తోంది. ఎప్పుడు ఎవర్ని ఎలా చుట్టి వేస్తుందో తెలీదు. కొట్టబడిన దేహాలన్నీ బొగ్గు బొమ్మలై పోతున్నాయి. ఇళ్ల లోపల ఇంటి మూలల్లో వున్న బూజును దులుపుతున్నట్లు గాను, కిటికీలకు తలుపులకు రంగులు వేస్తున్నట్లుగాను, పడకగదుల్లో కర్పూరం వెలిగిస్తున్నట్లు గాను, వంట ఇళ్లల్లో పొయ్యిలు రాజేస్తున్నట్లుగాను, ఎటు వెళ్ళాలో తెలియక పోయే పాములాగా ఇక్కడుంది అక్కడలేదు అనే భేదం లేకుండా- అంతటా హనుమ లాంగూల వహ్ని చుట్టు ముట్టేసింది.

మైత్రీ భావంతో నానా సౌధాల నుండి రేగిన జ్వాలలు ఆకాశంలో కలిసిపోయాయి. వాటిని చూసి దుఃఖాకృతులతో, దీన పత్రాలతో వృక్షాలన్నీ సహవేదనను, సానుభూతిని ప్రకటించాయి. ఇరుగు పొరుగు వృక్షసౌధాలు

ఈ విధంగా ఒకరినొకరు పరామర్శించుకుని తమ చిరకాల మైత్రికి అర్థం చెప్పుకున్నాయి.

ఆటులో వున్న సముద్రంలాగా వున్న వాలాగ్నిని ఆర్పడానికి హనుమ తోకను సముద్రంలో వుంచితే- సముద్రంలో అదేదో 'బడబాగ్ని' పుట్టిందని దూరం నుంచి చూసే రాక్షసులు భయపడి దగ్గఱ కెళ్లడానికే వెనుకాడారు. ఇదేదో లంకకు చేటు వచ్చిందని దూరం నుంచే విలపించారు. తోక చల్లార గానే సముద్ర జలంలోంచి చిన్నచిన్న పొగలు వెలువడ్డాయి. అవి సముద్ర జలంలో ప్రతిబింబమై మంటలు పూర్తిగా సముద్రంలో దిగబడి చల్లబడి ఆరిపోయాయేమో ననిపించాయి.

## కోపాగ్నిలో రగిలిన వివేకం

కోప దుఃఖాలు రెండూ మనోవికారాలే! ఈ రెంటినీ గూడా అగ్నులే అంటారు. ప్రస్తుతం దుఃఖాగ్ని సీతమ్మను, కోపాగ్ని హనుమను బాధిస్తున్నాయి. అయితే ఈ రెండు అగ్నులకు తేడా వుంది. దుఃఖం అగ్నే అయినా- అది మనిషిని లోలోపలే కుములబెడుతుంది. కోపాగ్ని అట్లాకాదు. దాని విజృంభణ జాజ్వల్యమానంగా బయటకు పొంగుతుంది. దుఃఖం ఒక్కొక్కప్పుడు వైరాగ్యాన్ని తెప్పించ వచ్చునేమోగాని కోపం మాత్రం వైరాగ్యాన్ని తెప్పించక పోగా- మనిషిలో ఉద్రేకాన్ని, ఆవేశాన్ని రెచ్చగొట్టి పెంచి పెద్ద చేస్తుంది. ప్రస్తుతం హనుమ పరిస్థితి అలావుంది. కోపంతో వళ్లు మండిపోయి తానేం చేస్తున్నాడో, ఈ పనివల్ల ఏమౌతుందో అన్న పూర్వాపర విచక్షణ లేకుండా విజృంభించి, అశోక వనాన్ని, లంకను అగ్నికి ఆహుతి చేశాడు. అశోకవనం లోనే తల్లి సీతమ్మ ఉన్నదన్న సంగతి గూడా గుర్తుకురాలేదు. అంతా అయి పోయిన తర్వాత ఇప్పుడు "ఈ అగ్నిజ్వాలలకు ఆ మహాతల్లి ఏమైపోయిందో, ఇంతా చేసి చివరకు స్వామి కార్యాన్ని 'మంట' గలిపానుగదా!" అని హృదయం నిండా బాధ నిండిపోయింది. ఆ తల్లి ఎలా వుందోనని అశోక వనానికి వెళ్ళి, దూరంగా వుండే చూశాడు. దగ్గఱకు పోతుంటే అగ్ని సెగ పెరుగుతూ వళ్ళు వేడికి కాలిపోతోంది. హనుమకు ఆశ్చర్యం వేసింది. ఇంతకు పూర్వం రాక్షసులు తన తోకకు నిప్పంటిస్తున్నప్పుడు మొదట్లో తన తోకకు

చల్లగానే అనిపించింది. కాని, ఆ తర్వాత లంకనంతా కాల్చింది. ఇప్పుడు గూడా అదే రకమైన అనుభూతి కలుగుతోంది. సీతమ్మ దగ్గఱకు పోతున్న కొలదీ- వేడి పెరుగుతోంది. ఆ అగ్నిహోత్రుడు తన ఉష్ణాన్నంతటినీ సీతమ్మ వద్ద దాచి, తన తోకను ప్రవేశించాడా ? ఇంతవరకు సీతమ్మ వద్ద నుండి వచ్చిన అగ్నివల్లనే లంకంతా తగలబడిందా ? సీతమ్మ చుట్టూ వున్న రాక్షస స్త్రీలు దూరం దూరంగా, భయం భయంగా వేడికి తామెక్కడ కాలి పోతామోనన్నట్లు ఉండడంతో హనుమకు తన అనుమానం నిర్ధారణ అయింది.

సీతమ్మకు దూరంగానే నిలబడి, అంజలి ఘటించి, మనస్సులో రాముణ్ణి తలుచుకున్నాడు. అవతల సీతమ్మ కన్నులు ఒక్కసారి తెరిచి నవ్వింది. అంతలోనే అగ్ని సెగ రానురాను తగ్గిపోయి చల్లబడింది. హనుమ ఒక్కసారి సీతమ్మ పాదాల వద్దకు చేరాడు. ఏదో అనాలి కాబట్టి- "ఓ దేవీ ! సుఖంగా వున్నావా" అన్నాడు. అందుకు సీత 'ఓరాక్షసాంతకా! ఇదిగో ఇలా వున్నాను' అంటూ—

"శ్రీరఘురాముని రాకకై గుప్పిటలో ప్రాణాలను పెట్టుకొని వేచి ఉన్నానని చెప్పు. మాసం పూర్తి కాకుండానే నా రాముడు ఇక్కడకు వచ్చి నన్ను తీసుకు వెళ్లాలని చెప్పు. ఈ భూజాత సీత బ్రతికి ఉండగా చూడాలనే కోర్కె వుంటే వెంటనే రాముడు ఇక్కడకు రావాలని చెప్పు. రాక్షస మూక నంతటినీ చంపగల రాముని గర్వముఖం కన్న నాకు ముందు రాముణ్ణి చూడడమే ముఖ్యం" అన్నది. అప్పుడు హనుమ—

"అమ్మా నా వల్ల ఎందుకు జరిగిందో ఒక మంచిపని జరిగిందను కుంటున్నాను. రాముడు ఈ సముద్రాన్ని బంధించి వారధి కట్టే ప్రయత్నం చేస్తున్నప్పుడు- లంకలోని రాక్షసులు ఆ ప్రయత్నాన్ని అడ్డుకుని విఘ్నం చెయ్యడానికి తీరిక లేకుండా చేశాను. కోట గుమ్మాలు, ద్వారాలు, తలుపులు, వీధులు, వాకిళ్లు ఒకటేమిటి అన్నిటినీ ధ్వంసంచేసి తగులబెట్టాను. వాటన్నిటినీ బాగుచేసుకోడంలోనే నిమగ్నమౌతారు తప్పితే వారధి ప్రయత్నానికి అడ్డు రారు. అవతల వాళ్ల పని పూర్తి అయ్యేలోపల మనవాళ్ల వారధి నిర్మాణం పూర్తవుతుంది. సులభంగా రాక్షస సంహారం జరుగుతుంది." అని చెప్పాడు.

# హనుమ తిరుగు ప్రయాణం

సీతమ్మ దగ్గర అనుజ్ఞ తీసుకుని హనుమ లంకా సముద్రతీర పర్వత శిఖరాన్ని ఎక్కి, ఒక్కసారి కుప్పించి ఆకాశంలోనికి ఎగిరాడు. హనుమ పాద ఘట్టనానికి కోటగోడలు ఊడిపడ్డట్టు పర్వతం నుండి పెద్ద పెద్ద కొండ ఖండాలు క్రిందకు పడ్డాయి. ఒక్కసారి పర్వతం యావత్తూ కదిలి ప్రకంపించింది. కుందేళ్ళలా పరుగులెత్తే రాళ్ళు, అడవిదున్నల లాగా దొర్లుకు పోయే పర్వతఖండాలు, తొండాలెత్తి ఘీంకారాలు చేసుకుంటూ పోయే ఏనుగు లాగా, జూలు విదలించుకొని ఒక్కసారి ముందుకు దూకే మృగరాజుల లాగా- పర్వతఖండాలు ఉరుములు ఉరిమిన ధ్వనులు చేసుకుంటూ క్రిందకుపడ్డాయి. పర్వతం యావత్తూ ప్రళయగర్జనలతో నిండిపోయింది. లంకలోని రాక్షసులు ఇదేదో ప్రళయం రాబోతోందేమోననే భ్రాంతితో వచ్చి చూశారు. తోకకు తాము నిప్పు పెట్టిన కపీశ్వరుణ్ణి ఆకాశమార్గంలో చూశారు. ఆ వేగానికి పుట్టిన ధ్వని చెవుల్లో సుడులు తిరిగింది. గుండెలు చెరువులై, నదులై, సముద్రాలై పోయాయి. ఒక్కసారి తమ రాజు చేయించిన పని ఎంతకు దారి తీసిందోనని ముక్కున వ్రేలు వేసుకొన్నారు. ఇంతమందిని చంపాడు, ఇంటింటిని ముట్టించాడు. ఇందుకు ప్రతిగా హనుమను దానవరాజు ఏమన్నా చెయ్యగలిగాడా? రేపు ఈ పర్వతాన్నంతనూ సముద్రంలో అదిమి పట్టి దాని మీంచి శత్రువు లందరూ వచ్చి మీద పడ్డా ఏమీ చెయ్యలేడని నేడే నిర్ధారణ జరిగిపోయింది.

ఆకాశ మార్గంలో పోతున్న హనుమ- చూడ్డానికి- నువ్వు చేను మీద పోయే తూనీగలాగాను, పచ్చని వరి చేల మీద పోయేపాలము పిచ్చుకలా గాను, ముందుకు లంఘించే సింహంలాగాను, సింహజాలాన్ని అతిక్రమించే శరభ మృగం లాగాను, ఆకాశ పథంలో చరించేవారికి పయనిస్తున్న మేరు శిఖరంలాగాను ఉన్నాడు. హనుమ చేసే కంఠనాదాలు గింగిరులెత్తుతూ దశదిశలలో వెన్నంటి మారుమ్రోగుతున్నాయి. మహేంద్రగిరి రానే వచ్చింది. గిరిపై ఎదురుచూస్తున్నారు కపిపుంగవులు. పైన హనుమ చేసే నినాదాలకు నింగి బ్రద్దలైపోతుందా అన్నట్లుంది. క్రింద నున్న కపివీరులు మొదట్లో గుర్తు పట్టక హనుమ చేసిన రావానికి భయపడ్డారు. జాంబవంతుడు వాళ్ళకు ధైర్యం

చెప్పి "ఎవరను కుంటున్నారు వచ్చేది? మన మారుతి మహావేగంతో వస్తు న్నాడు. ఆ వేగము. ఆ చేసే నాదము మనకు మహోత్సాహాన్నే కలుగ జేసేట్లున్నాయి. ఆ రావం వింటూంటేనే ఏదో కార్య సాఫల్యరేఖాసమ్మోదం కలుగుతోంది" అనగానే కపివీరులందరూ అవునవునని నిర్ధారించారు. వెంటనే జాంబవంతుడు హనుమ రావానికి ప్రతిస్పందనగా పెద్ద పెట్టున నినాదం చేశాడు. ఆ రెండు రావాలు దిగంతాలదాకా వ్యాపించి మారు మ్రోగాయి. కపివీరులకు చెవులు చిల్లులుపడి నోళ్లుతెరుచుకున్న వారు తేరుచు కున్నట్లే వుండిపోయారు. కళ్ళు తెరిచిన వాళ్ళు తెరిచినట్లే వుండిపోయారు. పిలిచినట్లుగా హనుమ చేసిన భీకర రావం మిన్ను నుండి వచ్చి, భూమి నంతనూ వ్యాపిస్తే, అందుకు ప్రతిగా పలికినట్లు జాంబవంతుని రావం భూమి నుండి మింటిని చుట్టు ముట్టింది. అందరూ చూస్తున్నప్పుడు ఆకాశంలో ఎఱ్ఱని కాంతులు విరజిమ్ముతూ వెలసిన చిన్న తారామణి లాగా హనుమ కనిపిం చాడు. అంతలోనే పర్వత శిఖరాగ్రం మీదకు తిన్నగా వ్రాలాడు చిన్న హనుమ. పర్వతం మీద వున్న వృక్షాల నుండి ఆకులు జలజలా రాలాయి. హనుమను వానరమూక చుట్టు ముట్టింది. హనుమ కనుకొనల్లో సీతమ్మను చూడడానికి తొందరపడుతూ హనుమముందుకు సాగుతున్నారు. హనుమ ఏం చెబుతాడో ఆలకిద్దామని ఆతుత పడుతున్నారు.

## కనిపించింది సీత

"కనిపించింది, సీత కనిపించింది" అంటూ నిట్టనిలువుగా నిలబడ్డాడు హనుమ. 'చూశాను జానకిని చూశాను' అంటూ చెక్కిళ్ళు ముడతలుపడేలా నవ్వాడు. 'అశోకవనంలో వుంచాడు మన తల్లిని దుష్టు డొకడు' అంటూ ముఖాన్ని బిగించాడు. 'అతి దీనంగా దుఃఖిస్తూ వుంది వైదేహి' అంటూ కోపంతో పళ్ళు కొరికాడు. ఎదురుగా ముందు కనబడిన జాంబవంతాది వృద్ధు లకు పాద నమస్కారం చేశాడు. సూర్యుడు క్రమంగా అస్తమిస్తున్నాడు. దక్షిణ దిశవైపు నుండి గాలులు వీస్తున్నాయి. మహేంద్ర పర్వతశిఖరం మీద చేరిన వానర సేనా సమూహం ఆ సమయంలో రకరకాలుగా కనబడింది. చంద్రుని కిరణాల చివరలు ఎఱ్ఱనై ఒకచోట జేరాయా అన్నట్లుంది వానర సమూహం. మహేంద్రగిరి పైన రాళ్ళు వెన్నెలకు చిగిర్చాయా- అన్నట్లుంది

వానర సమూహం. హనుమ సీతమ్మను గూర్చి ఏం చెబుతాడోనని చెవులు దొన్నెలలాగా చేసి ఎదురుచూస్తున్నారు- కపి వీరులందరూ హనుమను చూస్తూ. అప్పుడు జాంబవంతుడు కల్పించుకుని-

"నాయనా హనుమా! అక్కడ ఏం జరిగింది సమగ్రంగా చెప్పు. ఏమి ఏమి జరిగాయి? ఎక్కడెక్కడ తిరిగావు? సీతమ్మ ఎల్లా కనబడింది ? చెప్పు అన్నాడు. అప్పుడు అంగదుడు కల్పించుకొని " ధరణీ జాత సీతమ్మను గూర్చి చెప్పు. దుఃఖిస్తోందా? లేకపోతే ఆ రాక్షసరాజుని లెక్క చెయ్యట్లేదా! భోగాలను వద్దంటూందా? ఎదుట వున్న రాక్షసుల హెచ్చరింపులకు చలించటం లేదా!" అనంగానే- హనుమకు చెక్కిళ్ళపైన, పెదవులపైన, కన్నులపైన చంద్రకాంతులు తాండవిస్తూండగా-

## హనుమచెప్పిన సంగతులు

"అవును. అమ్మతో నేను మాటలాడడం అయిన తరువాత నాకింకా చెయ్యవలసిన పని ఏదో మిగిలి వుందనిపించింది. నా మనస్సులో అశోకవనం మెదిలింది. ఆ వనాన్ని చూపత్తూ ఒక్క ఆకునాను పువ్వుగాని, కొమ్మగాని లేకుండా నాశనం చేసి వదలిపెట్టాను. ఈ సంగతి తెలిసి అరవై వేలమంది రాక్షస సైన్యాన్ని, సైన్యాధిపతులను, ప్రహస్తుని కొడుకు జంబుమాలిని, ఇంకా పన్నెండు మంది ఇతర మంత్రి పుత్రులను, అక్షకుమారుణ్ణి, రాక్షస నాథుడు నామీదకు పంపాడు. అందర్నీ అవలీలగా అంతమొందించాను. దైత్యరాజు ఉగ్రుడై, తన కుమారుడైన ఇంద్రజిత్తును పంపాడు. ఇంకో విధంగా నన్ను ఎదుర్కోలేక అవధ్యుడనని తెలుసుకొని నన్ను బ్రహ్మాస్త్రంతో బంధించాడు. రావణుని చూడాలనే కోరికతో అలస్యం అవకుండా ఆ బ్రహ్మాస్త్రాన్ని అనుసరించి కొలువులో రావణుని చూశాను. చెప్పవలసిన మాటలు చెప్పాను" అనంగానే మిగిలిన వానరు లందరూ "ఆ రావణు డెలాంటివాడు, ఎలా వుంటాడు?" ముందు చెప్పమన్నారు. అందుకు హనుమ-

"పండు వెన్నెలలు విరజిమ్ముతున్నట్లుగా కనబడే అందమైన భస్మ త్రిపుండ్రకములతో ఫాలభాగము కలిగినవాడు, విప్పారిన పాము పడగలవలె ఒప్పారే గండభాగము, రుద్రాక్షహారముల కంఠం, శివలింగశోభితమైన

వక్షస్థలం, స్వచ్ఛమైన ముత్యాల హారాల్లాంటి జంధ్యములు, దీర్ఘమైన మొసలి దంష్ట్రల ముఖం కలవాడు. అహంకారం అంతా ప్రోగు పోసినవాడు. కళ్ళకు మళ్ళీ చూడాలనిపించేవాడు ఆ రావణుడు. - అతని తమ్ముడు విభీషణుడు. ఇద్దరూరాజనీతిబాగా తెలిసినవారు. తమ్ముడు మంచి వాక్చతురుడు. అన్న పరమేశ్వరుని లాగాఉగ్రమూర్తి."

"నేను చేసిన పనికి 'వధ్యుడ'నని ప్రాడ్వివాకులు నిర్ణయిస్తే, అవధ్యుడనని విభీషణుడు నిర్ణయించాడు. చివరకు నా తోకకు నిప్పంటించి వదిత్తే సరిపో తుందని నిర్ణయించారు. తత్ఫలితంగా పట్టణమంతా పరశురామప్రీతి అయింది. నిజానికి ఆ ఇద్దరికీ నేను అవధ్యుడనని తెలుసు, బ్రహ్మాస్త్రముక్తుడ ననీ తెలుసు. మోహచిత్తులైన ఆ రాక్షస మూకకు నా గురించి తెలుసు ననుకోవాలో తెలియదనుకోవాలో నాకు తెలియదు."

"మృత్యువు తప్పదు, నిశ్చయమే అని తెలిసినా స్వల్ప సుఖాలకే ప్రాకులాడి ప్రయత్నం చెయ్యడం లోక వృత్తి అయిపోయింది. రామునికి దుఃఖం కలిగించడంలో వాళ్ళ ప్రయత్నం అలాంటిదే గదా!" అని ఇంకా ఏదో చెప్పబోతుండగా అంగదుడు-

"ఆ రాక్షసుని సంగతి, వాని కొడుకు సంగతి, తర్వాతచూసుకోవచ్చు కాని- ముందు మన సీతమ్మతల్లిని గూర్చి చెప్పు. నీ తోకను చల్లపరచి దానికున్న అగ్నినంతా, తనశరీరమందు వహించిందన్నావు, మరి ఆ వహ్నితో చుట్టూరా వున్న దైత్యుల నందరినీ ఎందు క్కాల్చదు? ఆ సీతాదేవి మహత్త్వం ఏమిటో నాకు వినాలని మరీమరీ కుతూహలంగా వుంది. ఆషాఢ మేఘం చాటు మెరుపు తీగ లాంటి తనూవిలాసం గలదియై 'తన నాథుని ఎప్పుడు చూస్తానా' అనే బుద్ధితో అంత అగ్నిని తన దేహంలోనే ఇముడ్చుకుని వున్న ఆ సీతమ్మ తల్లి దర్శనం చెయ్యాలని నా మనస్సు ఆరాటపడుతోంది. నా హృదయ పారిజాతం భక్తిరసంతో తొణుకుతోంది. నువ్వు గురువు అన్న ఆ తల్లి ఎంతటి తల్లి అవుతుందో ఆ తల్లిని గూర్చి ముందు చెప్పు" అన్నాడు. అప్పుడు హనుమ—

# హనుమ దృష్టిలో సీత

"కన్నులు కలిగివుంటే ధరణీజాతను చూడాలి. నమస్కారం చేసి గౌరవం తెల్పుకోవాలంటే ఆ సీతమ్మకే చెయ్యాలి. మాటలు వినాలంటే ఆ ధరాసుత పలుకులే వినాలి. సాన్నిధ్యాన్ని అనుభవిస్తూ, ఆనందానుభూతితో వసించాలంటే ఆ శ్రీరాముని భార్య అయిన సీతమ్మ తల్లి పాదారవిందాల చెంతనే వసించాలి. ధీరులైన వారి ఆత్మసంపత్తి- వాళ్ళకు ఆపదలు వచ్చిన వేళ తెలుస్తుంది. సాధారణంగా సామాన్య జీవులందరూ ఆపదవస్తే దీనాతి దీనంగా తయారై, ఆత్మాభిమానం కోల్పోయి, ధర్మమార్గాన్ని విడనాడడానికి వెనుకాడరు. నైచ్యానికి లొంగి, విద్రోహాత్ములౌతారు బంగారానికి గీటురాయి లాగా ఆత్మగుణౌన్నత్యాన్ని నిర్ణయించగలిగేది ఆపద ఒక్కటే! మన సీతమ్మ తల్లి విషయంలో ఇది ప్రత్యక్ష నిదర్శనం. ఆవిడ ఆత్మగుణ నైశిత్యాన్ని అవగాహన చేసుకోడానికి నేను ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలుణ్ణి అయ్యాను. నా ఊహకు అందలేదు. ఆమెకు వచ్చిన ఇంత ఆపదకు కారకుడైన ఆ దైత్యపతి యందు ఎందుకో కొంత జాలిపడుతుంది. అన్నిటికన్న ఈవిషయం నాకు మరింత చిత్రమనిపిస్తుంది. ఆవిడను విరహిణి అందామంటే విరహిణి కాదు, రాఘవుని హృదయపద్మానికి లక్ష్మి. భయభీతురాలంచామంటే ఆవిడేమో భయభీతురాలు కాదు, దైత్యరాజు పట్ల కాళరాత్రి. దీనురాలా అంటే దీనురాలేం కాదు, ధైర్యలక్ష్మి. రాక్షసరాజు ఇచ్చిన గడుపు ఒకసంవత్సరం. అందులో ఇక మిగిలింది ఒక నెల మాత్రమే! ఈ గడువు లోపల శ్రీరాముడు వచ్చి కలిస్తే సరి, లేకపోయినా ఆమె తన ప్రాణాలను వాయుమార్గంలో శ్రీరాముణ్ణి చేర్చగలననే స్థైర్యం గలది.

"రాక్షసరాజు పెట్టిన గడువు లోపల ఒప్పుకోకపోతే సీతమ్మను తాలింపు పెట్టి తినడానికి వెనుకాడని స్థితిలో ఆ రాక్షసులున్నారు. విసిగెత్తి సీత తన ప్రాణాలను తీసుకుంటామని ప్రయత్నించినా ఆమెపై గల మోహంతో ఆ పని చెయ్యకుండా రాక్షసరాజు నివారిస్తూనే వుంటాడు. కాని అవధి దాటి కోపమే కనక వస్తే ఆ రాక్షసేశ్వరుడు ఏమైనా చేస్తాడు. వాని కోపం నేను

చూశాను. నేను చెట్టుమీద వుండగా వాడు వచ్చాడు. గడ్డిపరక కన్న హీనంగా వాణ్ణి చూసింది మన సీతమ్మ తల్లి. వాడు పడగ విప్పిన పాములా బుసలుకొట్టాడు. కోపమొచ్చి కత్తితో సీతమ్మ తల్లి కంఠాన్ని ఖండిద్దామనుకున్న సమయంలో ధాన్యమాలిని అడ్డుకొని వారించింది. లేకపోతే ఆరోజు నేను గరుత్మంతునిలా వాడి నెత్తి మీద దూకి హతమార్చి వుండేవాణ్ణి. సుగ్రీవుని చేత చక్కబడవలసిన ఈ కార్యం యావత్తూ ఆనాడే పూర్తయి వుండేది. కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని, రఘువీరుని కోసం ఎదురుచూస్తూ, జీవితాన్ని కొనసాగిస్తూన్నది. కళ్ళకు నిద్దుర ఎఱుగదు. అన్నం తినదు. రామనామామృత పానమే ప్రాణాధారంగా బ్రతుకుతోంది" అప్పుడు అంగదుడు-

"నువ్వు ఈ మహాసాగరాన్ని దాటిపోగలవు. తిరిగి రాగలవు గూడా! అలాగే నేను వంద యోజనాలు గల ఈ సముద్రాన్ని దాటగలను. తక్కిన మనవాళ్లు గూడా అంతకు కొంత కొంత తక్కువగా రాగలరు. వాళ్ళు రాగలిగినంత వచ్చినా, ఆపైన నువ్వూ, నేనూ వాళ్లని ఈదించుకొని లంక్కెళ్ల గలం. నువ్వు తగులబెట్టి వచ్చిన లంకను అందరంకలిసి పెళ్లగించి, అవనిజను తీసుకువచ్చి రామునికి అప్పగిద్దాం. సముద్రంలో మునిగి రత్నాలను తీసుకు రారా ఏమిటి? 'చూచి రమ్మంటే కాల్చి రావటం లాంటి దానికంటే ఎక్కువే అనుకో ఇలా చెయ్యడం, కాని, దానివల్ల రాముడు మరింత పరితుష్టుడౌతాడు. ముందు ఆ తల్లిని చూస్తే గాని నా హృదయం సంతుష్టి చెందదు. నన్ను చూడంగానే ఆ దైత్యేశ్వరునికి గుండె బీటలెత్తాలి" అని ఆవేశాన్ని ఒలకబోశాడు. సీత వద్ద సీత అభిప్రాయాన్ని తెలుసుకున్న వాడైన హనుమంతుడు అంగదుని ఆవేశాన్ని గమనించి-

"నువ్వు చెప్పిన పని అంత సులభంగా అయేది గాదు. ఇందులో చాలా ఇబ్బందులున్నాయి నాయనా ! క్ష్మాసుతను రథమెక్కించి తీసుకురావాలంటే మన భుజాలే గదా ఆ రథాలు. అసూర్యంపశ్యల్లాంటి రాచపట్టమహిషులు మన భుజాల నెక్కుతారా? మన జాతి ఆలోచనలు, ఆచారాలు వేరు, వాళ్ళ ఆలోచనలు, ఆచారాలు వేరు. సీతమ్మ తల్లి మానవ వనితయే కాదు, రాజ వంశ వనిత గూడా!" అన్నాడు.

హనుమంతుని మాటలలోని అంతర్యం అంగదునికి అర్థంకాక వూరు

కున్నాడు. జాంబవంతునికి మాత్రం అర్థమైంది. అయినా ఊరుకున్నాడు. అప్పుడు మైందుడు హనుమంతుని ఉద్దేశించి-

"ఆంజనేయా! నువ్వు ఆకాశ మార్గంలో సముద్రంలో పై నుండి ప్రయాణించావు గదా. పోతున్నప్పుడు గాని, వస్తున్నప్పుడు గాని నీప్రయాణం అంతరాయాలేమీ లేకుండా సుఖంగానే సాగిందా ? రాక్షసమూక ఏమన్నా అడ్డుకున్నారా?" అన్నాడు. మిగతా వానరు లందరూ అడుగుదామనుకున్నది, అంతవరకు ఎవ్వరూ అడగనిదీ మైందుడు అడగంగానే హనుమంతుడు వాళ్ళందరినీ ఉద్దేశించి—

## సంక్షిప్త సమాచారం

"నేను మాత్రం ఎక్కువ దూరం పోయిందేమున్నది? మీ కంటే మహా అయితే పదో, ఇరవయ్యో మించి పోయుంటాను. అంతే! మీరూ ప్రయత్నం చేస్తే వెళ్ళగలిగేవారే! నా పని మీకు సాధ్యమయేదే. మీ ప్రతాపాలు సామాన్యమైనవా? దైత్య సభలో మీ అందరి శక్తి సామర్థ్యాలను గురించి పేరు పేరునా చెప్పినప్పుడు వాళ్ళందరి గుండెలు గుభేల్ మన్నాయి. నేను ఆకాశమార్గంలో పోతున్నపుడు నా బాహువుల మధ్య నుండి తొడల మధ్య నుండి రివ్వున ఝుంఝూమారుతం శ్రీరాముని శరంలా దూసుకుపోయింది. నా తండ్రి నన్ను గాఢంగా కౌగలించుకున్న, ముద్దు పెట్టుకున్న సుఖానుభూతి నాకు కలిగింది. కొడుకొక చోట తండ్రి ఒకచోట వుంటారు ఈప్రపంచంలో. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూచుకోడమే ఒక్కొక్కప్పుడు కొన్ని ఏళ్ళ తర్వాత జరుగుతూ వుంటుంది. కొందరికి అదీ వుండదు. చూడండి. ఎప్పుడో 'పురాణాల్లోనో, కొన్నియుగాల క్రిందటో పర్వతాలకు రెక్కలు వుండేవనీ,ఇంద్రుడు వాటిని నరికేశాడ'ని విని వుంటారు."

"ఇంద్రుడు వజ్రాయుధంతో మహాపర్వత రెక్కలను నరుక్కొంటూ వెళ్తున్నప్పుడు మైనాకుడు భయపడి, సముద్రం అట్టడుక్కుపోయి దాక్కున్నాడు. అలా కొడుకు మైనాకుడు నాగలోకంలో వుంటే- తండ్రైన ఆ మహాచలం నాగలోకంలోకి కొమ్ములాగా చొచ్చుకొని నిలబడ్డాడు. కొడుకు పరిస్థితికి తండ్రైతే పైకి తేలకుండా నిలబడ్డాడు గాని, మేనక హృదయం దుఃఖంతో

నిండిపోయింది. అయినా ఏం చెయ్యగలదు? గుండెరాయి చేసుకుంది. ఇదీ లోక వృత్తాంతం. నేను ఆకాశ మార్గంలో దూసుకుంటూ పోతున్నపుడు, క్రింద సముద్రం అట్టడుగున వున్న మైనాకుడు- పైకి వచ్చి నా గమనానికి అడ్డుగా నిలబడ్డాడు. ఎవడో రాక్షసుడు వచ్చి నిలబడ్డాడని నేను నాపాదంతో ఒక్కసారి అణగద్రొక్కాను. వెంటనే ఆ మైనాకుడు "నీకు అడ్డు పడదామని కాదయ్యా! కాసేపు నీవు నాపై విశ్రాంతి తీసుకుంటావని, నా ఆతిథ్యం స్వీకరిస్తావని వచ్చాను. మీ నాన్నగారు (వాయుదేవుడు) సముద్రునితో చెప్పి నన్ను అట్టడుగున దాక్కోడానికి సహాయపడ్డాడు. దానికి కృతజ్ఞతా భావంతో నీకు సహాయపడదామని వచ్చాను అంతే!" అని మైత్రీభావంతో అన్నాడు. నేను- నేను చేసిన పనికి విచారించి, అటుపైన ముందుకు పోయాను. సామాన్యులకు ఎల్లాంటి ఉపకారాలైనా చెయ్యవచ్చు. కాని లోకోత్తరులకు సాయపడకపోతే అందరూ పరీక్ష చేసేవారే! ఒక పని చెయ్యడానికి ఇంకో పని చేసి చెడకొట్టడం కంటే అసలు చెయ్యకుండా వుండడం ఉత్తమం. నేను నిర్వహింపబోయేది లోకహితమైన కార్యం. దాన్ని చక్కబెట్టగల నేర్పు నాకుందో లేదో తెలియకుండానే వెళ్తున్నాను. పైన దేవత లందరూ సంశయించే వారే! పరీక్షించే వారే!"

"నాగమాత- 'సురస' నా దారికి అడ్డువచ్చి నిలబడింది. నన్ను అడుగు ముందుకు కదలనీయలేదు. నన్ను 'మ్రింగుతా' అని పట్టుపట్టి కూర్చుంది. నేను పట్టగలిగినంత నోరు తెరవాలి అని నేను నా ఆకారాన్ని పెంచాను. తాను తన నోటిని పెంచింది. ఇలా ఒకరి కొకరు పోటీలుపడి పెంచుకుంటూ పోయాం. ఇలా లాభం లేదని ఉపాయంతో బయటపడాలని, ఆమె కళ్ళు తెరచేలోగా ఒక్కసారి మిన్ను పట్టని నా ఆకారాన్ని అతి సూక్ష్మంగా తగ్గించి ఆమె నోటి లోపలికి వెళ్ళి బయటకు వచ్చి ఆమె పాదాలకు నమస్కరించి—

"తల్లీ! ఇంత అల్పమైన శరీరం గల నేను నీ అంతటిదాని క్షుద్బాధను ఏం తీర్చగలను?" అన్నాను. అందుకు ఆమె నవ్వి "నిన్నెవ్వరు ఏమి చెయ్యగలరు, పోరా కోతి సన్యాసీ!" అని ముద్దుగా అంది. ఆమె అనుజ్ఞ తీసుకొని మరల నా గమనాన్ని సాగించాను.

"ముందుకు పోతున్న నన్ను ఎవరో పట్టి, వెనక్కు లాగుతున్నట్లని

క్షించింది. కాని, ఎవరూ నన్ను పట్టుకోలేదు. నేను మాత్రం ముందుకుపోలేక పోతున్నాను. తీరా క్రిందకు చూస్తే పెద్ద నోరును విప్పి వున్న ఒక పెద్ద రాక్షసి కనబడింది. దాని కోరల మధ్యపడి చావవలసినదే ఇక. సముద్రంమీద పడిన నా నీడను పట్టి నన్ను క్రిందకు లాగింది. ఇలాంటివి వుంటాయని మన సుగ్రీవరాజు నాకు ముందే చెప్పాడు. ఒక్కసారి దాని నోట్లోకి దూకి లోలోపలకు వెళ్ళి, దాని గుండెను పెకళించి, పిండిచేసి దాని దవడలు మూసుకోక మునుపే బయటపడ్డాను. చచ్చి వెల్లకిలా పడి నీటిపై తేలే తిమింగలం లాగా, ముక్కలై కొట్టుకుపోతున్న నావలాగా, వృక్షరహితమైన పైతల్లంకలాగా దాని శవం సముద్రంలో కొట్టుకుపోయింది. నేను సూర్యుడు అస్తమించే సమయానికి లంకానగరం ప్రాంతం చేరుకున్నాను."

"మూరెడు కన్న తక్కువైన ఆకారం దాల్చి, కోటగోడ పైన చేరి, పుర ప్రవేశం చేయబోయాను. అంతే! భయంకరమైన ఆకారంతో ఒక పెద్దరాక్షసి నన్ను చూసి 'ఎవరు నువ్వు? ఏ వూరు? ఇక్కడకెందుకు వచ్చావు? నీకేం పని ఇక్కడ?' అని నన్ను చంపడానికి ఉద్యుక్తురాలైంది నేను దాన్ని చంపాను. అది నెత్తురు కక్కుకుంది. రావణాసురుని ఆజ్ఞయే కామరూపంగా అలా చరిస్తూ లంకను కనిపెట్టుకుని కాపాడుతోంది. అది చచ్చిపోవడంతో లంకలో రాక్షసరాజు ఆజ్ఞ అంతమైనట్లే! ఇక రాజు మాట మీరడానికి కూడా ఆ రాక్షసులు జంకరు. రాక్షసరాజు భుజపరాక్రమాలకు అంతవరకు ఎదురు లేదు. తిరుగులేదు. కాని, ఈనాటి నుండి ఆజ్ఞతోపాటు అన్నీ నిర్వీర్యమై పోయాయి. రేపు మన శ్రీరాముడు దండెత్తి వచ్చినప్పుడు తెలుస్తుంది రావణుని ఆజ్ఞను ఈనాడు నేను చంపిన ఫలితం. రాక్షసులందరూ రాజుకు ఎదురు తిరుగకపోరు. ఆజ్ఞకు విలువలేని రాజు పాలన మేమిటి? అంతకంటె అతనికి ఘోరమైన విపత్తు ఏముంటుంది కనక ? అతనూ చివరకు ఏదుగు కృత్రిమ బిలంలోకి దిగబడి పోయినట్లు పోవల్సిందే ! చనిపోవల్సిందే" అన్నాడు.

## మధువనం మజిలీ

రాత్రల్లా కపులందరూ కబుర్లతో కాలం ఆనందంగా గడిపేశారు. తొలి సంజ ఎఱ్ఱి వెలుగు రంగులో వున్న గున్నమామిడి తోపు- ఆకాశంలో కదలు

తోందా-అన్నట్లు ఆకాశమార్గంలో వానరు లందరూ పయనిస్తున్నారు సూర్య కిరణాలు రాబోతుండగానే చిరుమేతలకు నిశ్శబ్దంగా, కూతలు కూయకుండా, తోరణాలు తోరణాలుగా బయలుదేరే పక్షుల వరుసల్లా వున్నారు వానరులు. శరత్కాలంలో మానస సరోవర జలాలకై వెళ్ళే హంసల గుంపుల్లాగా వున్నారు వానరులు. ఆకాశంలో ఎండ గోరువెచ్చగా అయే సమయానికి పొలాల్లోని పిచ్చుకల గుంపు కిచకిచల్లాగా- కపి సంతతి కిచకిచలు విన వచ్చాయి. మగపులి చేత చంపబడిన దున్నపోతు చుట్టూ చేరి తినడానికి తాపత్రయపడే ఆ పులి కుటుంబంలాగా కపి సంతతి ఒకచోట జేరారు.

వానరులందరూ ఆకాశంలో వేగంగా పోతున్నారు. ఆ వానర సమూహాన్ని చూస్తుంటే ఆకాశం చాప చుట్టలాగా చుట్టుకుని కిష్కింధవైపు పోతున్నదా అన్నట్లుంది. కిష్కింధకు దాదాపు దగ్గఱకు వచ్చేశారు అను కుంటూండంగా అంగదుడు క్రిందకు పరికించి చూశాడు. ఇప్పచెట్లు, ద్రాక్ష తీగలు, ఖర్జూరాది వృక్షాలు కంటికి ఇంపుగా కనబడ్డాయి. అది సుగ్రీవుని మధువనం. అందరికీ కాస్త విశ్రాంతిని పరితృప్తిని కలుగచెయ్యాలని క్రిందకు దిగవలసినదిగా సూచన చేశాడు. అందరూ కేరింతలు కొడుతూ క్రిందకు దిగారు. మధువనం చూడంగానే అందరికీ నాలుకలు ఊరిపోతున్నాయి. ఉత్సాహం పెరిగినకొద్దీ ఊరింతలు, కేరింతలు, నూరింతలుగా పెరిగి పోయాయి.

చెట్లమీద కట్టిన మద్యభాండాలలో చేతులు పెట్టబోయేసరికి ఒక్కసారి ఎవరో ఆగు, అన్నట్లై, గుండెలు కొట్టుకున్నాయి. ముఖాలు చిట్లించారు. చెట్టుమీదకు ఎక్కి శీధుభాండాల్లో చెయ్యి చాపబోయేంతలోనే వానరాధిపతి ఆజ్ఞ గుర్తుకు వచ్చింది. ముగ్గిన పళ్లగల గెలలను త్రుంచబోయేంతలోనే ప్రభువుయొక్క ముఖం వారిస్తున్నట్లు కనిపించింది. అలమటించిన మనస్సుతో ఆగిపోయారు. వాళ్లందరూ ఎవరికి వారికి తానే సీతను చూచానన్న గర్వం, ధీమా ఉన్నట్లుగా కనబడినా- క్రమంగా అది తగ్గినట్లు అనిపిస్తోంది. శ్రీరామ చంద్రుని చూద్దామన్న అభిలాష కంటె, సీతాన్వేషణా కార్యసిద్ధి వల్ల వచ్చిన సంతోషం కంటె, గడిచిన కష్టాలు కడలి నుండి ఒడ్డుకెక్కుచున్న ఆనందం కంటె- సుగ్రీవాజ్ఞ బలంగా మనస్సులో మెదిలింది. కాని నోరు చప్పరిస్తూ, గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయారు. వాళ్ళను చూసి అంగదుడు—

"ఎవరి వలన ఉపకారం పొందామో వారికి కాస్త చనువు గూడా ఇవ్వని నాయకుడు నాయకుడనిపించుకోడు. మన సుగ్రీవు డలాంటి నాయకుడు కాడు. కృతజ్ఞతకు పెట్టింది పేరు. సీతను చూడకుండా వచ్చాను అంటే మెడకు ఉరిత్రాడు అవుతాడు. సీతను చూచి వస్తున్నామంటే మెడకు పూల త్రాడు అవుతాడు. మనం సీతమ్మ తల్లిని చూసిన వార్త చెప్పాలి. ఇల్లాంటి శుభవార్త వినిపించేవాడు ఏక్కమొగం వేసుకుని, నిరుత్సాహంగా వుంటే- విన బోయేవాడికి ముందు గుండె గుభేల్ మంటుంది. చెప్పేవాడు ఉత్సాహంగా కనబడడమే చెప్పబోయే వార్త శుభమైందని తెలియజేస్తుంది. మీరందరూ ఈ మధువనాన్ని యథేచ్ఛగా ఉపయోగించుకోండి" అన్నాడు.

అంగదుడు అలా అన్నాడో లేదో మరుక్షణంలోనే వనం వనం ఒక్కసారి మారిపోయింది. అంతవరకు కునుకుతున్న కోతులు కొన్ని ఒక్కసారి కుప్పించి ఎగిరి, ద్రాక్షపళ్ళన్నీ కొరికి, కొమ్మలు రెమ్మలు విరగ్గొట్టేశాయి. అంతవరకు అరచేతిలో ప్రాణాలు పెట్టుకుని నిరాశగా వున్న కోతులు ఒక్కసారి మద్యభాండాలను పట్టి మదమెక్కి తైతక్కలాడాయి. గోళ్లు కొరుక్కునేవి కొన్ని, పేలు చూచేవి కొన్ని, తోక కొరికేవి కొన్ని, కొమ్మల మీంచి దూకడం, ఎగరడం, తల్లక్రిందుగా వ్రేలాడడం, ముద్దులు పెట్టుకోడం, మొట్టికాయలు కొట్టడం, గోళ్లతో వీపు, తొడలు గోక్కోవడం, గొంతు కూర్చోడం, కాయలు పళ్లు సగం తిని, సగం కొరికి అవతలకు విసరడం, ఒకళ్ళను మించి ఒకళ్ళు ఎగరడం- వీటితో వనమంతా నానా భీభత్సంగా, నానా గందరగోళంగా తయారైంది. ఈ సంగతి ప్రమత్తంగా వున్న వన పాలకులకు తెలిసి, వచ్చి, వారించడానికి ప్రయత్నించగా-

ఒక్కొక్క వనపాలకుని చుట్టూ నలుగురు నలుగురు చేరి, ఒక్కసారిగా వాణ్ని అందరూ రక్కి, కరచి, రాచి రంపాన పెడుతూంటే- ప్రాణాలను దక్కించుకోవడం కోసం పారిపోయి, ఊపిరి తీసుకుని, తమకు పట్టిన గతిని వాళ్ళ అధిపతి అయిన దధిముఖునితో విన్నవించుకున్నారు. దధిముఖుడు సరాసరి అంగదుని దగ్గరకు వెళ్ళి "నీ కిది తగునా?" అన్నాడు. నిండుగా మద్యపాన మత్తులో వళ్లు తెలియని స్థితిలో వున్న అంగదుడు అతణ్ణి చూసి విరగబడి నవ్వాడు. దధిముఖునికి కోపం వచ్చింది. చేసేది లేక అప్రాంతంలో

మద్యం తాగివున్న మత్తులో వున్న మర్కటాలను కొట్టాడు. దాంతో ఆవానర మూక తిరగబడి దధిముఖుని మీదకు విరుచుకు పడ్డారు. అతడు గూడా వాళ్ళందరినీ ఎదుర్కొని పోరుకు సిద్ధమయ్యాడు. కపులందరూ కలిసి గుట్టలు గుట్టలుగా రాళ్లని వృక్షాలను వానిమీదకు విసిరారు. తాను ఒక్కడు ఎదురుగా పెక్కుమంది అవడంతో ఏం చెయ్యలేక పోయాడు. మధువనం యావత్తూ ధ్వంసం అయింది. చేసేదిలేక దధిముఖుడు వాళ్ళని వదిలి ఆకాశమార్గంతో పోయి శ్రీరాముని సన్నిధిలో వున్న సుగ్రీవునికి విన్నవించాడు. అప్పుడు సుగ్రీవుడు శ్రీరామునితో—

## సుగ్రీవుని విజ్ఞత

"శ్రీరఘురామా! అతసీ కుసుమ సంకాశా! సఖా! ధరణీజాత కనబడింది. ఆ పద్మనయనను చూచి వుండకపోతే మనవానరులు నా మధువనాన్ని పెకళించరు. అందునా వాళ్ళందరూ సామాన్యులు గారు. మహావీరులు. వివేక సంపన్నుడైన ఆంజనేయునితో వున్నారు. వెఱ్ఱివాళ్లై ప్రవర్తించరు. వాళ్ళందరూ వివేక నిధులు. అంగదుడు మంచి సమయజ్ఞుడు. ఇప్పుడిట్లా చేసినా నాకు కోపంరాదని అంగదునికి తెలుసు. నాహృదయపు లోతులు తెలిసినవాడు అంగదుడు. ఎటువంటప్పుడు నా హృదయం కోమలమౌతుందో, కఠిన మౌతుందో బాగా తెలిసినవాడు. నేను కాదనే దాన్ని పట్టుకోడు, కాదనలేని దాన్ని వీడడు. అందునా అవనిజను చూసిన ఆనందంలో వున్నవాడు ఎంత గట్టిగా వుంటాడో ఆలోచించగలను," అని దధిముఖుణ్ని చూచి- 'వానరు లందరినీ వెంటనే రమ్మనమన్నానని' చెప్పమన్నాడు అది విని దధిముఖుడు గుడ్లప్పగించి సుగ్రీవుణ్ణి చూస్తూవుండగా 'ఊఁ వెళ్లు' అన్నాడు సుగ్రీవుడు.

ప్రస్రవణగిరిపై వెయ్యికళ్ళతో ఎదురుచూస్తున్న రామలక్ష్మణ సుగ్రీవుల ముందుకు జాంబవంత, అంగద, హనుమంత, మైంద, ద్వివిదాదులు వచ్చి ఒత్తిగిల్లి నిలబడ్డారు. మిగిలిన వారు హనుమంతుని ముందుకు తోశారు. అప్పుడు హనుమంతుడు శ్రీరామచంద్రునకు నమస్కరించి—

"చూచాను సీతను. బాష్పధారల కళ్ళతో రామనామాన్ని జపిస్తూ, రాక్షస స్త్రీలమధ్యలో తనకోసం ఎవరో వస్తారన్న ఆశతో ఎదురుచూస్తూవున్న

సీతమ్మను లంకలో చూశాను. రాక్షసేశ్వరుడు ఒక మాసం గడువిచ్చాడు. అప్పటిలోగా మీ ముఖ దర్శనానికి నోచుకోకపోతే రాక్షసేశ్వరుని వంట శాలకు అంటుకుపోతుంది" అన్నాడు.

హనుమ "చూశాను సీతను" అన్న మాట విని కళ్లు పెద్దవయాయి శ్రీరామునికి. ఆశ, ఆతృత, ఆనందం ఒక్కసారి కళ్లలో విరిసింది. ఈ ఆనంద పారవశ్యంలో తను చెప్పిన రెండో మాట శ్రీరాముడు విన్నాడో లేదోనని మళ్ళీ అవే మాటలు ఆగిఆగి చెప్పాడు. శ్రీరాముడు ఆ మాటల్లోని అర్థాన్ని గ్రహించి, బాష్పధారల కళ్ళతో ముహూర్తకాలం అలాగే నిలుచుండి పోయి, అక్కడనుండి గిరిశిఖర మధ్యంలోకి పోతూండగా హనుమ శ్రీరాముని అనుసరించాడు.

## శ్రీరాముని కృతజ్ఞత

ఒకచోట రాముడు కూర్చుని ఏదేదో వూహిస్తూ వుండగా- ఒక సమయంలో ప్రక్కనే వినమ్రుడై నీటిలో నిలబడిన తామర మొగ్గలాగా చేతులు జోడించి వున్న హనుమంతుని చూశాడు. వెంటనే 'కూర్చో' అని సంజ్ఞ చేశాడు. హనుమను తన రెండు కళ్ళతో తాగేస్తున్నాడా అన్నట్లున్నాడు రాముడు. హనుమ నిలబడే వున్నాడు. రాముని రెండు చేతులు హనుమను కౌగిలించుకోబోతున్నట్లు కదిలాయి.

"ఇతడు సముద్రాన్ని ఎలా దాటగలిగాడు ? రాక్షసుల పట్టణంలో గుట్టుగా ఎలా ప్రవేశించాడు? దుర్భరమైన వాళ్ళ ప్రవృత్తులకు ఎలా తట్టుకో గలిగాడు? చూడ్డమే కాక ఆమెతో ఎలా సంభాషించ గలిగాడు? ఈపనులన్నీ చెయ్యడానికి నిజంగా ఇతడే తగినవాడు కాబట్టి చెయ్యగలిగాడు" అని అనుకుంటూ ఏం మాట్లాడావు ?" అని అడిగాడు. రాముణ్ణి చూసి హనుమ ఆశ్చర్యపడి—

## హనుమ చెప్పిన సంగతులు

మొదట్లో రఘువంశ రాజులఘనచరిత్రను పాడాను. ఆమె ఆలకించింది,

అనుగ్రహింపబడ్డానని వెంటనే ఆమె మంజుల ముఖదర్శనం చేసుకుని, ఎదురు నిలబడి, అటుపైన నీ దివ్యచరిత్రను పరవశంతో పలికాను. నేను అన్ని మంచి మాటలు చెప్పి, ఆమెను మెప్పించి, నమ్మకం కలిగేలా ప్రవర్తించినా అదంతా ఆ రాక్షసరాజు ఆడే నాటకం అని ఆమె భ్రాంతి పడింది. నీ వియోగవిలాపం చెప్పాను. లంకలోనికి ప్రవేశించబోయే నీ బాణపరంపర గూర్చి చెప్పాను. అప్పటికీ నమ్మలేదు. నీ రూపురేఖలను సవిస్తరంగా చెప్పమంటే నేను ఎఱుగున్నంత వరకు చెప్పాను. దేవికి కాస్త నమ్మకం కలిగింది. ఇదే సమయం అనుకొని- నీవు ఇవ్వమన్న చూడామణిని ఇచ్చాను. ఆ శిరోమణిని చూడగానే ఆమె నేత్రాలు బాష్పధారలు కట్టాయి. శిరోమణిని స్పృశించి, ఆనందించి కళ్ళకద్దుకుంది. ఋషి వాటికలో నీవు నిద్రపోతుంటే- ఆమె నీ చేతినుండి అతి మృదువుగా తీసి తన వ్రేలికి పెట్టుకున్న రహస్య విషయాన్ని చెప్పి దుఃఖించింది. నన్ను అనుగ్రహించింది." అన్నాడు. అప్పుడు రాముడు "అప్పుడు ఆమె ఎలా వుంది?" అన్నాడు. అందుకు హనుమ —

"పరమ వేదాంతులైన మిథిలాధీశుని కూతురు, రఘువంశపు కోడలు, నిత్య సత్యవ్రత నిష్ఠుడైన నీకు ధర్మపత్ని" అని అంటూండగానే రామ చంద్రుడు తన లోలోపలకు వెళ్ళి పెల్లుబికిన అశ్రునయనాలతో "ఓ హనుమా ఏమన్నదయ్యా సీత? నువ్వు చూచినది చూచినట్లు నాకు ఏమని చెప్పమన్నదో చెప్పు" అన్నాడు" అప్పుడు హనుమ—

"లంకను వదిలి సముద్రాన్ని దాటి ఇటురాబోయే ముందు సీతమ్మ తల్లి కాకాసుర కథను చెప్పి, అది తనకూ రామునికీ మాత్రమే తెలిసిన వృత్తాంత మనీ, ఆ సమయంలో రాముడు గడ్డి పరకను మంత్రించి కాకాసురునిపై ప్రయోగిస్తే అది వాడి పాలిట బ్రహ్మాస్త్రంలా పనిచేసి, త్రిమూర్తులకు కూడా దాన్ని నిరోధించ శక్యంకాక, తిరిగి కాకాసురుడు రాముని దగ్గరే శరణు కోరమన్నారన్న వృత్తాంత రహస్యాలను చెప్పి, తన బొడ్డున ఉత్తరీయపు కొంగుకు కట్టి భద్రపరచిన చూడామణిని తీసి "స్వామీ ! ఈ చూడామణిని తమకు అందజేయమన్నది మా తల్లి సీతమ్మ" అని రాముని దోసిలిలో వుంచాడు.

హనుమ చెప్పిన రహస్య వృత్తాంతాలకు, ఇచ్చిన చూడామణికి- సీతా స్మరణ సంజాత పరదీనమైన రాముని సుకుమార నయనాలు చెమ్మగిల్లాయి. ఆ నయనాలను చూసి హనుమ—

"తన తరువాత ఈ మణిని తాల్చడానికి అర్హురాలు ఆమె అని మీ తల్లి కౌసల్య ఆ చూడామణిని సీతమ్మకు ఇచ్చినదట! అంతకు పూర్వం ఈ మణిని దేవేంద్రుడు మీ తండ్రి అయిన దశరథునికిస్తే- ఆయన పట్టమహిషి అయిన కౌసల్యాకిచ్చాడట ! అప్పటినుండి కౌసల్యాదేవి ఆ మణిని ప్రాణప్రదంగా చూసుకుంటూ చివరకు తన తరువాత ధరించడానికి అర్హురాలైన సీతమ్మ తల్లి కిచ్చిందట!" అన్నాడు.

హనుమ చెప్పిన చూడామణి వృత్తాంతం రాముడు విన్నాడు. కుడి చెయ్యి కుడి తొడపై ఆన్చి, ఎడమ చెయ్యి గడ్డంక్రింద ఆన్చి అశ్రుధారలు నిండిన కన్నులతో హనుమను ఒక్కసారి పరికించి, ముఖపద్మాన్ని ఒక్కసారి పైకి క్రిందకు ఆడించాడు. ఆ సమయంలో అక్కడకు దగ్గరలో అంగద లక్ష్మణులు, జాంబవంత-సుగ్రీవులు, శతవలి-మైందులు, సుషేణ-ద్వివిదులు, నీల-వినతులు మొదలైన వారు జంటలు జంటలుగా ప్రసవ్రణ పర్వతంపై ఒకళ్లతో ఒకళ్లు ఏవేవో కథలు కథలుగా చెప్పుకుంటున్న వాళ్ళను చూసి హనుమ రామునివద్ద శెలవు తీసికొని వెళ్ళిపోయాడు.

రాత్రి శ్రీరాముడు ఫలభక్షణం చేస్తున్నప్పుడు లక్ష్మణుడు—

"తల్లీ ! నాభుజం మీద కూర్చుంటే- ఈ లంకనుండి ముందు నిన్ను విముక్తురాలను జేసి, సముద్రాన్నిదాటి, మనోజ్ఞమూర్తి అయిన ఆ శ్రీరాముని పాదసన్నిధిని దించుతాను. అటుపైన మేము వచ్చి, రావణ వధ గావిస్తాము" అన్నాడుట హనుమ సీతమ్మ తల్లితో. అప్పుడు శ్రీరాముడు "అయితే మరి తీసుకురాలేదేమి" అన్నాడు. అప్పుడు లక్ష్మణుడు—

## సీత ఆంతర్యం

"తీసుకు రాకపోవడానికి రెండు కారణాలను ఊహిస్తున్నాను. ఒకటి పరపురుష స్పర్శ ఇష్టపడని సీతమ్మ తల్లి అంగీకరించి ఉండకపోవచ్చు.

లేదా సముద్రం మీద నుండి పోతున్నపుడు భయం కలిగి సముద్రంలో పడి, తాను పోవచ్చుననే ఉద్దేశ్యంతో- తల్లి అంగీకరించకపోయి ఉండవచ్చు "సకలచరాచర జగత్తుకు అధినాథ వైభవ సంపన్నుడైన ఒక నిష్కళంక శౌర్యునికి ఇల్లాలినై, ఎవడో చేతకాని వాడి భార్య లాగా, దొంగలాగా, లంక లోంచి బయటకు వస్తానా? రావణుడు దొంగ. రాముడు దొర. నేను నీ వెంట వస్తే దొర అయిన రాముడు కూడా దొంగ అవుతాడు. ఆయన అయినా కాక పోయినా నేను అవుతాను. అయోగ్యమైన ఇలాంటి పనులు చేయడం దేనికి? రఘువంశరాజ మర్యాదకు తగ్గట్టు నడుచుకోవాలి. నీ హృదయంలో రాముని మీద వున్న మర్యాద, భక్తిభావాలు నాకు చాలా ఆనందాన్ని కలుగజేశాయి. నన్ను ఆ రామచంద్రుడే వచ్చి తీసుకువెళ్ళాలి. ఇలా అన్నానని బాధపడకు నాయనా!" అన్నదట ఆ మహాదేవి. ఈ సంగతి జాంబవంతుడు తనతో చెప్పాడని అంగదుడు నాతో అన్నాడు.

లక్ష్మణుడు చెప్పిన మాటలకు రాముని వదనంలో సహజమైన ఒక చిరునవ్వు రేఖామాత్రంగా భాసించింది. దాన్నిచూసిన లక్ష్మణుడు అన్నగారికి ఈ విధంగా అయినా కొంత సేదదీరింది అనుకున్నాడు. చాలా ప్రొద్దుపోయిన తరువాత సుగ్రీవుడు వచ్చి ఇనకులతిలకుణ్ణి చూసి—

## హనుమ విషయాలు

"సాధులోక చూడామణీ! సుధాసుధీమనోజ్ఞా! ఓరామచంద్రా! 'రావణుడు పరాక్రమంలో సముద్రుడనీ, తేజోవిభవుడనీ, శూర శిఖామణి అనీ, వేద విద్యా విశారదుడనీ, శేముషీశేవధి అనీ, మారుతి నాకు అతి గోప్యంగా చెప్పాడు. ఆ రావణుని పుత్రుడు ఇంద్రజిత్తు మన మారుతిని బ్రహ్మాస్త్రంచేత బంధితుణ్ణి చేశాడుట. ఆ బంధిత స్థితిని ఆసరాగా చేసుకుని వెళ్ళి, దేవేంద్రుని సభలాగా వుండే దైత్యేశ్వరుని సభలో ప్రవేశించి, రావణుణ్ణి చూసి వచ్చాడుట మన పవనుడు. అంతటి పరాక్రమ సంపన్నుడు, బుద్ధిశాలి, సమయస్ఫూర్తి కలవాడు. సీతమ్మను తీసుకుపోయిన ఆ రావణుడెవరో, ఎలాంటివాడో చూసి గూడా రావాలని నిర్ణయించుకొని, అందుకు ముందుగా అశోకవనాన్ని భగ్నం చేశాడు. రావణాసురుని సేనలను, సేనాపతులను, మంత్రి కుమారులను,

చివరకు సాక్షాత్తు రావణుని కొడుకునుగూడా సంహరించి, ఆ పైన ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రానికి కట్టుబడినట్లు నటిస్తూ, ఆ బ్రహ్మాస్త్రాన్ని గౌరవించి, చిట్ట చివరకు అనుకున్న ప్రకారం రావణుణ్ణి దర్శించాడు. అయితే ఈ విషయా లన్నీ నీకు చెప్పవద్దన్నాడుట. నీకు కోపం వస్తుందేమోనని అనుకొని ముందుగా తాను సీతను చూచాను అని మాత్రమే చెప్పాడు. కాని, ఆ పైన రాక్షస వన నివాసాలనే భగ్నం చేసాడు. అంతదూరం వెళ్ళి ఆ రావణుని ముఖం చూడకుండా రావడం ప్రాణమొప్పలేదుట! అందుకనే ఇంత తతంగం జరిపి, రాక్షసేశ్వరుణ్ణి చూసి వలచి వచ్చాడు. ఇంకొక నవ్వొచ్చే విషయం వుంది. మేమంతా ఆ రాక్షసరాజుకు నువ్వంటే భయం అనుకుంటున్నామా? కాని అదంతా భయం కాదు భక్తి అంటాడు మారుతి. ఇంకొక కొంటెపని గూడా చేసి వచ్చాడు. అది నీకు చెప్పవచ్చో చెప్పకూడదో" అని తటపటా యిస్తుంటే శ్రీరాముడు 'అదేమిటి?' అని అడగక పోవడంతో సుగ్రీవుడు మాట్లాడకుండా రాముని దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోతూ—

"సీతను చూడ్డం జరిగింది. 'ఇక సీత వచ్చినట్లే'- అనే భావంతోనే ఉన్నాడు శ్రీరాముడు. ఏది చెప్పినా, ఎంత వింత గొల్పే విషయం చెప్పినా ఆశ్చర్యపడడు. అదేం చిత్రమో! సన్నగా రేఖామాత్రమైన చిరునవ్వు తప్ప ఇంకేమీ చూడలేము. అదే గొప్ప అయిపోయింది. 'మన మంటే ఇష్టమే' అన్న ఒక్క భావం తప్ప ఇతర విషయాలు కొంచెం గూడా తెలియవు. 'హృదయం ఇవ్వలేదు' అనలేము. హృదయాన్ని దోచుకున్నట్లు గానే కనబడతాడు.

రాత్రి గడచిపోయింది. కాని, రాత్రి కట్టిన తన ధోవతీఉత్తరీయాలను, రాముడు తొలి సంజవెలుగులో ఎండవేస్తున్నపుడు వినత, సుషేణ, శతవలులు శ్రీరాముని దర్శనార్థమై వచ్చి చూసిన తర్వాత—

"ఇంత కఠినమైన కార్యం సర్వ సమర్థుడు అయిన పవన సుతుడు తప్ప ఇంకొకరెవ్వరూ చెయ్యలేరు. పట్టుకొన్నవారు ఊరుకోకుండా 'విరూపమే' శిక్ష అని హనుమ తోకకు నిప్పంటించి వదిలారు ఆ రాక్షసులు. ఇంక మన హనుమ లీలా వీరవిహారం చేస్తూ, లంకంతటినీ తగులబెట్టి మరీ వచ్చాడు. మనం ఇప్పుడు దండెత్తి వెళ్ళినా ఆ రాక్షసులకు మనకు అడ్డు నిలబడే తీరిక

వుండదు. కాలి, మసి అయిన కొంపాగోడులను చూచుకోవడంతోనే సతమత మవుతూ వుంటారు. రాక్షస వినాశానికి ఇదే తొలిమెట్టు" అన్నారు.

"ఇంద్రనీల మణి మంజుల దేహవల్లరీ! లోకమోహన పరాక్రమవార్నిధీ! గుణవంతుడు, కార్యశూరుడు అయిన మన మారుతి జానకీ మాతను చూసి వచ్చాడు ప్రభూ!" అన్నాడు వినతుడు.

"మనోహర మందహాస వదనాభిరామా ! శ్రీరామా ! గుణవంతుడు, పరాక్రమవంతుడు అయిన మన మారుతి నాల్గు దిక్కులా సీతకై వెదకి చూచి వచ్చాడు ప్రభూ!" అన్నాడు సుషేణుడు.

"సరసీరుహలోచనా! సుందరతర మందహాస వదనా! సత్కృపాగుణా! నీ మధురమైన ఆజ్ఞను అనుసరించి కార్యసాధకుడు, స్వామి సేవాపరాయణుడు అయిన మన ఆంజనేయుడు అన్ని దిక్కులు తిరిగి ధరణీజాతను దర్శించి వచ్చాడు ప్రభో!" అన్నాడు శతవలి.

ఇలా ముగ్గురూ రాముణ్ణి దర్శించి, స్తుతించి హృదయపరిపూర్ణ సంతృప్తితో రామానుగ్రహ ప్రాప్తులమయామనుకొని ఉత్సాహంతో వెళ్ళి పోయారు.

## సుగ్రీవుని సమరసన్నాహాలు

ఆరోజు సాయంత్రం ప్రస్రవణగిరిపై పార్శ్వవీధులలో రామలక్ష్మణులు కూర్చుని ఉండగా- అక్కడకు కర్తవ్యనిర్వహణకై- తన సేనాపతులను, సేనావాహినివిఆహ్వానించి సుగ్రీవుడువచ్చాడు. యాత్రాసన్నాహప్రయత్నంగా-

"సీతాన్వేషణకై నాలుగు దిక్కులకు కపి వీరులను పంపించే ముందు 'మీరు కనుక జానకి జాడ తెలుసుకుని రాకపోతే వృక్షాలకే అందర్నీ ఉరి తీస్తాను జాగ్రత్త' అని చెప్పి పంపాను. అది కాదు సీత జాడ కనక తెలిసి ఉండకపోతే- నేనే నాకంఠానికి ఉరి నేసుకుని ప్రాణాలు తీసుకుని ఉండేవాణ్ణి. మూడు దిక్కులలోను లేని జానకి నాల్గవ దిక్కున ఉండాలని మాత్రం ఎక్కడుంది? ఆమె ఆ నాల్గవ దిక్కున వుండడం మన అదృష్టమే మరి ! ఇప్పటికి

ఒక ఘట్టం పూర్తయింది. ఇప్పుడు పడ్డ ఈ నిర్వాహణాబీజం శాఖోపశాఖలతో పెద్ద వృక్షమవాలి. లంకను, లంకేశ్వరుణ్ణి, రాక్షసమూకను భగ్నం చేసేంత వరకు మీరందరూ రామాజ్ఞాపాలనాబద్ధులై, అప్రమత్తులై, అజేయులై నిలవాలి' అన్నాడు. అప్పుడు జాంబవంతుడు లేచి—

"మన దండయాత్ర సాధారణంగా ఒకరాజు ఇంకొక రాజు మీదకు వెళ్ళేటటువంటిది కాదు. మనకు రథ, తురగ గజపదాతులు లేవు. కంచెన కట్టక్కరలేదు. కసపు ఏర్పాటు అవసరం లేదు. పడక విచారణ లేదు. మార్గమధ్యంలో ఆహారాదుల ఏర్పాటు అనసరం లేదు. మన వాళ్ళందరూ ఏ వనమందు మజిలీ చేస్తామో ఆ వనంలోని వృక్ష తరులతా గుల్మములనుండి ఎవరి ఆహారం వారే చూసుకుంటారు. రామలక్ష్మణులకు భోజనాలతో పని లేదు (బలాతిబల విద్యలు గలవారు) శత్రు బలాబలాలను విచారించి మాత్రం బయలుదేరడం సముచితం. "ఈ విషయంలో పూర్తి పరిజ్ఞానం కలిగినవాడు మన మారుతి" అన్నాడు. అప్పుడు హనుమ—

## హనుమ అభిప్రాయాలు

"రావణ, కుంభకర్ణులు, రావణపుత్రుడు ఇంద్రజిత్తు ఈ ముగ్గురు లంకలో అమోఘమైన పరాక్రమం గలవారు. అందులో ఆ రావణుని శౌర్యం ఎంతటిదో అంతగా తెలియదు. మరి ఆ బ్రహ్మను, శివుణ్ణి తన తపస్సుచే మెప్పించి ఏమేమి వరాలు తనకు చావు రాకుండా వుండేందుకు పొందాడో? అయితే అతడు మహా విద్వాంసుడు. తను చేసిన తప్పు తనకు తెలుసు. అదే తన హృదయంలో శల్యం లాగా నాటుకొని వుంది. అదే రాముని చేత అతనికి చావును తెస్తుంది. ఒకప్రక్క లంక యావత్తూ తగలబడి పోతూవుంటే ఆ కుంభకర్ణుడికి నిద్ర మెలకువే రాలేదు. కింకరు లందరూ జేరి మోసుకుని తెచ్చి ఇవతల పడేసినా- గుట్టు మానని నిద్రలో వుండిపోయాడు. వాడు యుద్ధం వేళకు గూడా లేస్తాడనుకోను. గాఢమాయావిల జీవుడైన అతని మహావధ ఎప్పటికైనా మంచిదే! మనకు అది తప్పదు. ఇంకా రాక్షసేశ్వరునికి ఇంకొక తమ్ముడు వున్నాడు. అతని పేరు విభీషణుడు. మన శ్రీరామునికి సౌమిత్రి, రావణునికి అతను- తమ్ముళ్లు. అయితే ఈఇద్దరి తమ్ముళ్ళకు ఉన్న

భేదం ఒక్కటే. అతనికి అన్నగారు అధర్మాత్ముడు. అవి అన్నాదమ్ముల బంధాన్ని ఎంతవరకు నిలపగలదోననే ఆలోచన గల వివేక సంపన్నుడా విభీషణుడు. అతడు పరమ యదార్థ భావమతి. ఉజ్జ్వలమైన నీతి వేత్త. బంధుర తర భావనా ప్రవృత్తి గలవాడు. పక్షపాత రహితుడు, సత్త్వగుణాబ్ధి, ఆ రాక్షస వంశంలో తప్ప పుట్టాడు. శత్రువు సుస్థిరుడైతే ఆ సుస్థిరత్వ రహస్యమేమిటో, కారణమేమిటో తెలుసుకోవాలి. వాడి చరిత్ర లోతులను తెలుసుకొని జయించాలి. అలా తెలుసుకోవాలంటే "భేదనీతి" అనుసరించాలి. ఆ రాక్షస సేనాపతుల ఇళ్ళన్నీ దుర్గతి పాలైనాయి. ఒక విభీషణుని ఇల్లు తప్ప. ఆ ఒక్క సంగతి చాలు అతని ధర్మప్రవృత్తిని అర్థం చేసుకోడానికి. అతని మనస్సును మనవైపుకు త్రిప్పుకోడమే మనం చెయ్యవలసిన పనిగా నాకనిపిస్తోంది. ఇది నిమిషాల మీద జరగవలసిన పని" అన్నాడు.

## కంఠమెత్తి కదలిన కపి సేన

హనుమ మాటలు విన్న వెనువెంటనే సుగ్రీవుడు కళ్ళతోనే ఆజ్ఞలు జారీ చేశాడు. వెంటనే ఒక కపీశ్వరుని కంఠంనుండి జయజయ ధ్వానం ఉరుములా నినదించింది. భేరీ నినాదంలాగా మరొక వానరేశ్వరుని కంఠం మ్రోగింది. ఢక్క ప్రతాడన ధ్వనిని విజృంభింప జేసింది- ఇంకొక వానరేశ్వరుని హుంకార గర్వం. జయ! మహావీర! శ్రీరామ జయ! జయ మహాస్వామి! లక్ష్మణ జయ! జయ! జయ కపీశ సుగ్రీవ జయ! జయ! అంటూ చేసిన కపివీరకంఠీరవకంఠా రావాలు మింటిని, మంటిని ఏకం చేశాయి.

మహాసర్వసేనాధిపతి ఐన శ్రీరాముని ఆజ్ఞ ప్రకారం శత సహస్ర వానరసేనా సమన్వితుడైన నీలుడు- మార్గపర్యవేక్షకుడుగాను, గజ, గవయ గవాక్షులు- దక్షిణ పార్శ్వ రక్షకులు గాను; గంధమాదనుడు- వామపార్శ్వ రక్షకుడు గాను జాంబవంత సుషేణులు- సేనా కుక్షి రక్షకులు గాను నిలబడగా, హనుమ-అంగద భుజ స్కంధాలపై శ్రీరామ-లక్ష్మణులు ఆరూఢులై సుగ్రీవ సేవితులు కాగా ముందుకు నడుస్తున్నారు. దశకోటి కపివీర నాథుడు శతవలి, సర్వసేనారక్షా విధానచరణుడైన కేసరి పనస గజారాతిబలులు పార్శ్వరక్షకులుగా జాంబవంత సుషేణులు సుగ్రీవుని ముందుంచుకొని,

సేనాజఘన భాగాన్ని రక్షిస్తూండగా- దరీముఖ, ప్రజంఘ, రంభ, రభసులు సర్వ సేనా గమయితులుగాను వుండగా,- శ్రీ రామచంద్ర సేనాసాగరం దక్షిణ సాగరాభిముఖంగా నడుస్తోంది.

మార్గమధ్యంలో సహ్యగిరిరాజు- సైన్యం ముందర సాగిలపడ్డాడు. దక్షిణం వైపు నుండి సాగర తరంగాల విజృంభణకు, ఉత్తరం వైపునుండి సేనావాహినీ ప్రకంపనలకు- సహ్యగిరి సతమతమై, చివరకు ఎలాగో అలా నిలద్రొక్కుకున్నాడు. వళ్ళంతా రాళ్ళు, వృక్షాలతో నిండివున్న సహ్యగిరిని వానరులు చూశారు. చెట్ల పువ్వులు, కాయలు, పళ్ళు, అకు లేకుండా-చివరకు చిగుళ్ళను గూడా చిరుతిండిలా తినేసే వానర మూకకు సహ్యగిరి కాబట్టి వాళ్ళ ఆకలిని తీర్చగలిగింది. అంతమంది అన్నిరకాలుగా తినివదిలినా ఆ సహ్యగిరి అందం ఏమీ చెడలేదు. సహనంతో నిలబడింది. (అందుకే అది సహ్య పర్వతం.) ఇంకొక పర్వతం అయితే నామరూపాల్లేకుండా అసహ్యంగా తయారయేది. సహ్యపర్వతం లాంటి వాటిని 'భూధరా' అంటే చెల్లుతుంది గానీ- అన్ని మట్టి గుట్టలకు ఆ మాట చెల్లుతుందా? రెండువైపులా పోతున్న వానరసేనాదళాలనుచూస్తూ ఉంటే- రామచంద్రుని కృపా జలప్రవాహానికి రెక్కలు మొలిచాయా అన్నట్లుంది సహ్యగిరి. వానరసేన తననుండి వీడి పోయిన తరువాత 'తాను ఇదివరకులాగానే వున్నానా? అసలు తాను తానేనా' అనే అనుమానం వచ్చి తన వంటిని తనే ఒకసారి చూసుకున్నాడు. ఎవరి మూలాన సాధారణంగా పర్వతాలకు కష్టాలు వస్తాయో- వారితో (అనగా వానర సేనతో) ఈ రోజు తనకు చుట్టరికం ఏర్పడింది. వాళ్లు తనను విడిచి వెళ్ళిపోతుంటే బాధ కలిగింది- సహ్యగిరికి.

వానరులందరూ యథేచ్ఛగా తమకు కావలసిన వాటిని తినడానికి అనుజ్ఞనుపొంది వెళ్ళిన తరువాత, శ్రీరామచంద్రమూర్తి ఎదురుగా వున్న సముద్రాన్ని చూస్తూ లక్ష్మణునితో–

## రాముని మనోవేదన

"నీకు నీవదిన పాదాలే తెలుసు. ఆమె నేత్రాల గురించి నీకుతెలియదు.

ఇప్పుడు నా ఎదురుగా వున్న సముద్రాన్ని చూస్తూంటే- మీ వదిన నేత్రాలు గుర్తుకు వస్తున్నాయి. ఆ మిథిలా నగరంలో ఆడవాళ్ళకు గూడా వేదాంతార్థాల ఔన్నత్యము, సమన్వయము గురించి సమగ్రంగా తెలుస్తుంది. అవన్నీ వాళ్ళ నయనార విందాలను చూస్తూంటేనే తెలుస్తుంది. వదిన నేత్రాలు చూడక పోవచ్చుగాబట్టి, ఆఊర్మిళ నయనాల్లోని సాహిత్యపు లోతులనైనా చూశావా? లేకపోతే ఆ సీత నయన సాహిత్యానికేనా సముద్ర సమన్వయం? ఈ సముద్రాన్ని చూస్తుంటే సీతకళ్ళ వెనుక నా మీదగల ఒక క్రొత్తవలపు గోచరిస్తోంది. మా ఇద్దరినీ ఈ సముద్రం అలా బంధించినట్లుంది. నా సేవలో పడిన నీకు భార్యగురించే ఆలోచనరాదు. నాకు మాటిమాటికి ఆ సీతే గుర్తుకు వస్తోంది. బుద్ధినిండా ఆ సీతే! నా ప్రాణము, నాదేహం, నాహృదయం నాబుద్ధి, సర్వస్వం ఆమెయే! ఈ సంగతి తెలిసే ఆ రాక్షసుడు ఇలాంటి పనికి పూనుకున్నాడేమో ! మలయమారుతపు పూల గాలులు నా గుండెను గ్రుచ్చి వేస్తున్నాయి. 'ఈ నేల, ఆ నింగి, ఆ నీరధి మన ప్రేమముందు నిలబడలేవు' అని సీత అనేది. ఇప్పుడు ఏమైంది? నా ఎదురుగానే ఆ నేల, నీరధిలేవా? నా ఆశలాగా ఆకాశం మిగిలింది. సీతతో కలిసి వున్నప్పుడు ఈ నీరధిని చూసివుంటే ఎలావుండేదో ఏమోగాని, ఇప్పుడు ఈ నీరధి మాఇద్దరి చూపునకు మధ్య వంతెనలాగా వుంది. నా సీత ఇప్పుడు ఏం చేస్తోందో!"

"ఆ రాక్షసేశ్వరుడు నా సీతను తీసుకువెళ్ళి దాదాపు ఏడాది కావస్తోంది. అయినా నేను బ్రతికే వున్నాను సీతను బాసి నిమిషంకూడా బ్రతకలేనని చెప్పినవాణ్ణి ఒకప్పుడు. ఇంక నేను, నా చరిత్ర ముందుకాలాల్లో ఎలా చెప్పుకుంటారో- దీన్నిబట్టి తెలియడం లేదూ! సీతను దూరం చేస్తే ఈ రాముడు ఇంకేం బ్రతుకుతాడు అని నిర్ధారించుకొని సీతను తీసుకువెళ్లాడు. ఇలా నేను బ్రతికేవుండడం వల్ల ఆ రాక్షసునికి ఎంత అన్యాయం జరిగిందో ! సుఖానుభూతిలో నిన్నువిడిచి నిమిషం గూడా బ్రతుకలేనని ఏవేవో చెప్పేస్తూ ఉంటాము. ఆ మాటలు ఎంతవరకు నిలుస్తాయోచూడు. మోహాబ్ధిలో మునిగిన జీవుని మాట లిలాగే వుంటాయి. దీన్నిబట్టి చూస్తే చిత్తంలో నాకు సీతమీద ప్రేమ ఉందా? ఈ గాలులు, ఈ సంధ్యామేఘాలు నన్ను నన్నుగా వుండనీకుండా కలత పెట్టేస్తున్నాయి. సీత నా ఊహాలోకాన్ని విడిచి వెళ్ళటంలేదు.

లక్ష్మణా! ఎప్పుడు తనువు దాలుస్తామో-అప్పుడే ఈ తను లక్షణాలుతప్పవు. 'ఈ జలధికి ఆవలి ఒడ్డున సీత వున్నదనే వార్త చెప్పాడు కపిశేఖరుడు. అంత దూరం చూడగలగడానికి ఈ కళ్ళకు శక్తిలేదు. ఈ సముద్రాన్ని దాట గలమా? సీతను చూడగలనా? ఆ రాక్షసుడెంతటివాడో? నా విల్లుకు ఎంత వరకు ఎఱుకాగలడో ? కాంతావిరహం నాకింకెన్నాళ్లో ? శాంతి చేకూరందే కాలు ఆడేట్లులేదు. ఈ తాపం తీరే రోజులు దగ్గఱలోనే వున్నాయి అనుకొన్న కొలదీ లోపల తాపం మరింత భగ్గుమంటోంది. నేనేదో నీతో ఈ సముద్రాన్ని దాటే విధానం గూర్చి నీతో చర్చిస్తున్నాననుకుంటూ వుంటారు- మనలను చూస్తూ దూరంగా వున్న ఆ కపి పుంగవులందరూ. నేను చూడొస్తే సీతా క్రీడలను నెమరువేసుకుంటూ, నిష్క్రియుడిగా ఇలావున్నాను. మనిద్దరం ఇలా మాట్లాడుకుంటూంటే-ఎంతసేపైందోగూడా తెలియటంలేదు. సముద్రాన్ని దాటే ప్రయత్నంలోను, శత్రువులను సంహరించే ప్రయత్నంలోను మనం వున్నట్లు కపివీరులకు కనబడాలి. ఆప్రయత్నంలో నాగుండెకు శాంతిచేకూరాలి. కపివీరుల ఊహలను ఆచరణలో పెట్టాలి" అన్నాడు.

## విభీషణు ప్రవేశంపై చర్చ

శ్రీరాముడు అలా అంటూండగానే సుగ్రీవ, అంగద, జాంబవంత హనుమంతులు ఏదో తీవ్రమైన రాచరికపు పనిమీద వచ్చి వినయంగా ఒదిగి నిలబడ్డారు. అప్పుడు సుగ్రీవుడు

"దైత్య నాయకునికి తమ్ముడట ! పేరు విభీషణుడని చెప్తున్నాడు. చూడ్డానికి పేరుకు తగ్గట్టు వినయవంతునిలా వున్నాడు. మన హనుమ గూడా అతణ్ణి లంకలో చూశాడుట ! మన సీతమ్మను అప్పగించెయ్యమని ఇతను, అలా కుదరదని ఆ అన్న- అనుకోడంతో ఇద్దరి అభిప్రాయాలకు తేడావచ్చి అన్నగారి పద్ధతి నచ్చక, అతణ్ణి వదిలి నిన్ను ఆశ్రయించడానికి వచ్చానని చెప్తున్నాడు. తనతోపాటు తన ముగ్గురు మంత్రులు గూడా వున్నారు. మారుతి చెప్పిన దాన్నిబట్టి ఆ వచ్చినవాడు విభీషణుడని తేలినా, ఆ అన్నదమ్ము లిద్దరి మధ్య విరోధము కలిగిన మాటలోని సత్యాసత్యాలు నిర్ధారణ కాలేదు. ముందు సముద్రమంత విరోధం వుండగా ఇక్కడకు ఇలా దగ్గఱగా వచ్చిన

ఈ వ్యవహారాన్ని కాస్త ఆలోచించాలి. ఆ దైత్యరాజు కుటిలనీతి కళా ప్రపూర్ణుడు. ఇదేదో మన ఇక్కడి అంతరంగిక విషయాలను తెలుసుకోడానికి పంపించి ఉండవచ్చు. అతడు గూఢచారి అవ్వచ్చు కాకపోవచ్చు. ఆ అన్న దమ్ముల మధ్య భేదాభిప్రాయాలు రావచ్చునేమోగానీ, ముమ్మందుగా ఒకరిపై ఒకరికి వుండే రాక్షస జాత్యాభిమానం ఉండదనుకోవడం పొరపాటు. ఏమైనా నువ్వు సర్వజ్ఞుడవు. నీ ఆలోచనలకు దోషాలుండవు. దోషములు తోచవు. ఇప్పుడు మనం పోవలసిన మార్గాన్ని నిర్ధారిస్తే దాని ప్రకారం పోతాము. మంత్రి అయిన వాడుగాని, సేనాపతిగానీ ఇలాంటి విషయాల గురించి తమ అభిప్రాయం చెప్పాలి. విషయం కాస్త సందిగ్ధాన్నే కలుగజేస్తోంది. మంచి చెడ్డలనే రెండుకొమ్మలు కలిగిన ఈ చెట్టు యొక్క ఏ కొమ్మ దేనికి చెందిందో తెలియనపుడు, తొందరపడి ఒక కొమ్మను నరకడం మంచిది కాదు. ఏది నరికితే అన్ని విధాలా అనుకూలమో, ఏది నరికితే అయుక్తమో బుద్ధికి పదును పెట్టి నిర్ణయించాలి. తీరా నరికింతర్వాత కలిసొచ్చేదాన్ని పోగొట్టుకోడం జరిగితే విచారించాల్సివస్తుంది. సమస్త సత్త్వము ఇమిడివున్న నీబుద్ధికి గానీ ఇలాంటి 'సత్తు-అసత్తు'ల మిశ్రాన్ని విడదీయగల శక్తి ఉండదు. అందుకని ఈ విషయాన్ని నీ ముందుకు తీసుకువచ్చాను. చిన్న పనికి పెద్ద ప్రయత్నం, పెద్ద పనికి చిన్న ప్రయత్నం చేసి నష్టాన్ని కొని తెచ్చుకోరు నీ బోటి నీతి వేత్తలు, పరిశుద్ధమనస్కులు" అన్నాడు. అప్పుడు అంగదుడు- సౌమిత్రి ప్రక్కనే నిలబడి స్వామిని చూస్తూ—

"హనుమ చెప్పిన దాని ప్రకారం ఈ విభీషణునికి దైత్యనాథునియందు అభిమానం వున్నా- నిర్భరమైన నీతివేత్త, గుణవంతుడు అయివుండాలి. కాక పోతే లంకలో ఇతని ఇంటిని మాత్రం హనుమ కాల్చలేదు. ఈ విషయాన్ని బట్టి ఆలోచిస్తే- రెంటికీ పొంతన కుదరడంలేదు. అవతల తను వదిలివచ్చిన వాడు సామాన్యుడేమీ గాడు. అయినా నిన్ను ఆశ్రయించడానికి వచ్చాడంటే- నీ ధనుర్విద్యా మహిమ గూడా తెలిసేవుండాలి. పైకి మాత్రమే కాకుండా, మనస్సు గూడా మంచిది అయివుంటుంది కాబట్టే మన మారుతి వాని ఇల్లు మాత్రం తగలబెట్టకుండా వదిలేశాడు. కొంతకు కాకపోతే కొంతకన్నా ఇతడు సుగుణవంతుడు అయివుండాలి. మరీ పరాకాష్ఠకు చెందిన రాక్షసుడైతే నేను

చెప్పలేను గానీ, అతనికి తెలియకుండా లోపల దాగివున్న పూర్వ జన్మ సుకృతం పెల్లుబికి బయటపడుతుంది. దైత్యనాథుని పథకమంతా బట్టబయలౌతుంది. నీబోటివారలకు అతనిలాంటి వారిని పరీక్ష చెయ్యటం పెద్ద కష్టంకాదు. నీ నిశితర దృష్టికి నిజానిజాలు బయటపడక తప్పవు. తేడావస్తే నీ నిశితర శరములు గుండెను చీల్చి చెండాడి, అటుపైన లంకను భగ్గుమనిపిస్తాయి. ఇంకో విషయం. ఈ విభీషణునితో ఉన్న ముగ్గురిలో ఏ ఒక్కడన్నా దైత్యరాజుపై మమకారం పోలేని వాడుండవచ్చు. అల్లాంటి పరిస్థితిని ముందే ఊహించి మా కా విషయం వదిలెయ్యి. వాళ్ళలో అల్లాంటి కుటిల బుద్ధి ఏమన్నావుంటే- రట్టుచేసి ఓ పని పడతాం. ఎందుకంటే రాజు వ్యూహాలను బట్టి సేవకుడు పోతూవుంటాడు. ఒక్కసారిగా వ్యక్తిత్వం రమ్మంటేరాదు." అన్నాడు. అప్పుడు సుగ్రీవుడు, హనుమంతుడు ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్లు కనబడీకనబడని మందహాస పూరిత వదనాలతో ప్రక్కచూపులు చూసుకున్నారు. అప్పుడు శరభుడు—

"యువరాజు చెప్పినదంతా యుక్తంగానే తోస్తోంది. ఆ విభీషణ, రావణుల యొక్క, ఈ ముగ్గురి యొక్క అంతర్యాలు ఏమై వుంటాయో గ్రహించి తదనుగుణంగా నడచుకోడం మంచిది" అన్నాడు. అప్పుడు మైందుడు–

"మనిషి ఎదురుగా నిలబడగానే- వాని రూపురేఖలు మాత్రమే గాక వ్యక్తిత్వ అంతర్యాలను ఇట్టే పసిగట్ట గల పరిజ్ఞాతుడవు. ఈ భూమ్మీద గల సర్వజీవుల యెడ సాధ్యము, అసాధ్యము అనేది నీకు ఉండదు. సర్వజ్ఞుడవైన నీకు నిర్ణయాలు తెలియవా ? అతని యోగ్యతాయోగ్యతలకు నువ్వు ప్రమాణంగాని మా మాటలు కాదు" అన్నాడు. అప్పుడు జాంబవంతుడు–

"తాను విభీషణుడనని అంటాడు ఆ దానవుడు. ఆ సంగతి నిజమో కాదో తేల్చి చెప్పగలిగేది ఒక్క ఆంజనేయుడే! ఎందుకంటే మనందరి కంటే ముందు, లంకలో- వాణ్ణి, వాని వ్యవహారాన్ని బాగా చూసినవాడు కాబట్టి. బంధుప్రీతి, కులాభిమానం లాంటివి జీవులకు తెగని బంధాలు అధిగమించలేని అంబుధులు. అల్లాంటి అంబుధులను దాటి ఇంత దవ్వులో ఉన్న నిన్ను చేరాడంటే ఈ రాక్షస శ్రేష్ఠుని మోహాంధునిగా నిర్ణయించ కూడదేమో! తన

ఆశలు తీరవని ఒకడు, తన వారిమీద కోపమొచ్చి ఒకడు ఇలా ఒక్కొక్కడు ఒక్కొక్క విధంగా స్వంత ఇంటిని వదలి సన్యాసం పుచ్చుకుంటాడు. అసలు వాడి ఆశలకు, కోపతాపాలకు మూలం ఏదో తెలుసుకుంటే గాని వాడి సన్యాసేచ్ఛకు కారణం తెలియదు. పైకి సఖ్యాన్ని ప్రదర్శిస్తూ, ఏదో ఒక ప్రయోజనార్థం అంతరంలో గూఢంగా ఆలోచిస్తూ, అవసరమనుకున్నపుడు ఎంతటి విరోధాన్నైనా ప్రదర్శిస్తారు. వాళ్ళ పైపై మాటలు, లోలోపల దాగిన రహస్యాలు కాలాంతరంలో గాని తెలియడానికి అవకాశం వుండదు. ఇక్కడ ఒక సూక్ష్మ విషయం వుంది. పెద్ద పరాక్రమాభిమానం, అంతకంటె ఎక్కువ కుటిలనీతి వుండడం ఒకదాని కొకటి పొంతన లేక పోవడమే! రెంటికీ పొసగని ఈ లక్షణాలు గల రావణుని శౌర్యమార్గాన్ని ఎవ్వరూ లెక్కచెయ్యరు" అన్నాడు. అప్పుడు హనుమంతుడు–

## హనుమ నిర్ణయం

"నన్ను చూసిన తర్వాత, లంకలో భూజాత శీలాన్ని చూచినతరువాత-రాముడంటే ఎలాంటివాడో తెలుసుకోలేని అవివేకి ఈ భూమ్మీద ఉంటాడను కోను. శివధనుస్సును నడుమకు విఱిచి భార్గవరాముని గర్వమడచి, ఇంద్ర సుతుని మదాన్ని త్రుంచిన వాడెవరో, ఎవరు ఎంతటివారో బాగా తెలిసిన ఆ దైత్యరాజు తమ్ముడే ఈ వచ్చిన విభీషణుడు. అతని ఇల్లు, వళ్లు, వేషం, భాష, పలుకు, పలకరింపు శాంత భావాలకు పుట్టినిల్లు. సీతను అప్ప చెప్ప మనడం ఇప్పుడు విభీషణుడంటున్న మాట కాదు, మొదటినుండీ రావణునితో అంటున్నమాటే! శరణు కోరితే నువ్వు ఇస్తే ఇస్తావు. ఇవ్వకపోతే ఆకాశం లోకో, సముద్రంలోకో పోతాడేమో గాని ఇంతటి నీ సన్నిధానాన్ని వదులు కోడు. వదులుకుని ఆ రాక్షస మూకతో కలిసి చావడం దేనికని ఇక్కడకు విభీషణుడు వచ్చాడనే అనిపిస్తోంది నాకు" అన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు మెల్లగా–

## సుగ్రీవుని తెలివి

మనకు శత్రుపక్ష రహస్యాలు తెలియనివి ఎలావుంటాయో వాళ్ళకు

మన రహస్యాలు తెలియనివి అలాగే వుంటాయి. యుద్ధం లోకి దిగినప్పుడు చూసుకోవచ్చు అని ఆలస్యం చెయ్యకూడదు. ఇలాంటివి ఎంత ముందుగా తెలుసుకుంటే అంత మంచిది. ఎందుకంటే తొందరలో తీసుకున్న నిర్ణయాల కంటే ముందే ఆలోచించి తీసుకొన్న నిర్ణయాలు ఎప్పుడూ ఇబ్బందిని కలుగ జేయవు. మన పక్షమే అనుకుంటున్నాం గదా, వాని నుండి శత్రువుల రహస్యాలన్నీ రాబట్టుకోవచ్చునని- కనిపించిన ప్రతివాణ్ణీ నమ్మడం కూడా అంత మంచిది కాదు. పైగా స్వంత అన్నగారినే వదిలి వచ్చిన వ్యక్తి. రామచంద్రునికి శరణాగతుడవాలనే కోరిక వుంటే ఇన్నిరోజులాగడం దేనికి? శత్రురాజుల రహస్యాలు తెలుసుకోడానికి పంపేవాణ్ణి ఎలాంటివాణ్ణి పంపాలి? ఎలా పంపాలి అనేదిగూడా తెలివిగా చేస్తారు. అవతల రాక్షసరాజు సామాన్యుడు కాదు. శత్రుపక్షంలో వాళ్ళకు తన పక్షంలో ఎవరిమీద మంచి అభిప్రాయం వుందో- వాణ్ణే పంపుతాడు కాని చెడ్డ అభిప్రాయం వున్నవాణ్ని పంపడు. ఇప్పుడు వచ్చినవాడు మనందరికీ మంచివాడనే అభిప్రాయం వుంది. ఇదే అవతలి రాక్షసరాజు రాజనీతి. చివరిదాకా వాణ్ని మనవాడే అనుకుంటాం. అంతటి రహస్య ప్రవర్తన, నైపుణ్యం కలవాణ్ణే రాక్షసరాజు పంపివుండ వచ్చు. తాడో, పామో తెలియకుండా తాడే అయివుంటుందని తాకితే- తీరా అది పామే అయితే- ఏంగాను పరిస్థితి ? ముందు కఱ్ఱతో ఒక దెబ్బ కొట్టితే పామైతే చస్తుంది. తాడైతే పోయిందేమీ లేదు, స్వీకరించవచ్చు." అన్నాడు అప్పుడు రామచంద్రుడు సుగ్రీవుని వంక ఒక్కసారి చూసి సన్నగా నవ్వి–

[సుగ్రీవుని వంక చూసి, రాముడు సన్నగా నవ్విన నవ్వుకు చాలా అర్థం వుంది. వాచ్యంగా చెప్పకపోయినా ఆ చిరునవ్వును బట్టి రాముని ఆంతర్యం అర్థం చేసుకోవచ్చు. ఆ చిరునవ్వుకు–

"నాయనా సుగ్రీవా! 'కనిపించిన ప్రతివాణ్ణీ నమ్మడం అంత మంచిది కాదు. అందులోను ఇతడు స్వంత అన్నగారిని వదిలి వచ్చిన వ్యక్తిగూడా!" అని నువ్వన్న ఈ మాటలు ఇక్కడున్న వాళ్లెవరు అన్నా సమంజసంగానే వుంటుంది, ఒక్క నువ్వు తప్ప ! ఎందుకో నేను విడమరచి చెప్పక్కర్లేదను కుంటాను. అన్నగారి అధర్మమార్గం నచ్చక, ధర్మం మనవైపున ఉన్నదని విభీషణుడు ఇక్కడకు వచ్చాడయ్యా అంతే [illegible]న్నగారిని వధించడంలో నా

సహాయం అర్థించడం కోసం గూడా కాదు. పైగా షరతులు లేకుండా నాకు పూర్తిగా శరణాగతుడు. అని తెలుసుకో !" అని అర్థం చెప్పుకోవలసి ఉంటుంది.]

"మీరందరూ ఒకరికంటె ఒకరు బుద్ధి నైశిత్యం కలవారు. మరి ఆ రాక్షసరాజు సోదరుని చూస్తేగాని మీరు చెప్పిన విషయాల్లో మేలైనదేదో నేను తెలుసుకోలేను." అనగానే శరభంగ, మైందులు వెళ్ళి విభీషణునితో తిరిగి వచ్చారు. ఆ విభీషణుడు—

## రాముని దృష్టిలో విభీషణుడు

హార కిరీట కేయూరాది మణి భూషణాలతో దేహమంతా ప్రకాశిస్తోంది. స్వచ్ఛమైన కాంతులతో కళ్లు మిలమిలా మెరుస్తున్నాయి. మేరు శృంగాల్లాగా అంసభాగం విరాజిల్లుతోంది. రాక్షస దేహ సహజమైన దంష్ట్రిలు గల ముఖం, అందమైన వదనం, ఇతర అవయవాల పొందిక యోగ్యంగా వుంది. అటువంటివాణ్ని చూస్తున్నపుడు రామునికి భాగీరథిని దాటించిన గుహుని చూడ్కులు వానిలో కనిపించాయి. పాదుకలు పట్టుకు వెళ్ళిన భరతుని కనులలోని ప్రసన్నత కనిపించింది. సుగ్రీవునితో సఖ్యం కూర్చిన హనుమ కన్నుల వెలుగులు కనబడ్డాయి. ఫలాలనిచ్చి సాధువచనాలు పలికిన శబరి కనుకొన చూపులు కనబడ్డాయి. జానకి చూపుల ప్రశాంతత, సాధుత్వం గూడా కనబడ్డాయి. ఎన్నో జన్మలనుండి వైష్ణవభక్తిలో పరాకాష్ఠ చూచినట్లునిలబడి చాటిచెప్పే పతాకాల లాగా ఊర్ధ్వ పుండరాలతో- బోర్లగిలా పడిన చిలు గవ్వలాగా-వున్న నున్నని స్వచ్ఛమైన ఫాలభాగం కనబడింది. సహజవినమ్రతా భావాన్ని స్ఫురింప జేస్తున్నట్లు అంసభాగం కొద్దిగా వంగినట్లు కనబడుతోంది. ఎక్కువసేపు అర్ధనిమీలితుడై వుంటాడా అన్నట్లు కనబడే కనురెప్పలు, సాధుత్వం, ప్రశాంతత్వం కలిసికట్టుగా వున్నట్లు చాటిచెప్పే-క్రిందకు మలచిన పలుచని మీసకట్టు. పుస్తీలు, జులపాలు, భూషణాడంబరాలు లేని సౌమ్య లక్షణం. చూడంగానే "సాధువు" అనిపించే ప్రస్ఫుటమైన విగ్రహం. ఒక్క ముక్కలో చెప్పాలంటే 'వినయము' ఆకారంగా దాల్చిన దేహము గలవానిగా కనబడ్డాడు. హృదయాంతర్గతమైన సీతా వియోగాగ్నిశిఖాదీప్తిని తన నేత్ర

సరోజ మనోజ్ఞకాంతి చేత చల్లబరచి ఊరడించే లాగా, అవసరానికి ప్రాణం గూడా- అడక్కపోయినా ఇచ్చి ఆదుకునే వాని లాగా వున్న విభీషణుని రాముడు చూచాడు. "సీతను దొంగిలించిన వాడినైనా, ఈ విభీషణుని అవ మానించిన వానినైనా సకుటుంబముగా నశింపజెయ్యాలి" అనే ఊహకలవాని లాగా-సర్వజగద్రక్షానుగ్రహభావం రాముని కనుకొసల్లో మెరుస్తూ కనబడింది.

అనుగ్రహ సంపన్నుడైన రాముని ప్రథమ దర్శనం పొందిన విభీషణుడు—

## విభీషణుని దృష్టిలో రాముడు

"కరచరణాలతో, రమణీయాకృతితో అందం ఇలా రూపుకట్టుకుంటుందా ఈ భూమ్మీద ! పురుషాకృతిలో ఇంత సౌందర్యం అపురూపంగా రూపు దిద్దుకుంది. ఊహలో వుండే అందం మనిషి రూపం దాల్చడం ఆశ్చర్యమే! అసలు ఊహలో మాత్రం ఇంత సౌందర్యం ఒదిగి వుండగలదా? అచేతనంగా పడివున్న మునిపత్ని (అహల్య) యొక్క రాతిరూపును మటుమాయం చేసిన అమృత పాదము యొక్క కవటాకు మృదుత్వం, జమదగ్నిసుతుని చరణాలకే నడవ నేల లేకుండా చేయగలిగిన కరుకుదనం, శివ ధనుస్సును విరవడంలో మింటికెగసిన చేతులు అనే తీగల పూలపొట్లాల లాలిత్యం, లతాంగిసీత వెన్నంటి అడవికి వస్తానన్నపుడు అంగీకరించిన మనస్సు యొక్క సుకు మారత్వం, ఎలా ఎలా వుంటాయని తాను ఊహించాడో అలా అలానే వున్నాయి." అని విభీషణుడు అనుకున్నాడు.

"ఆకాశాన్ని మించడం కోసం మెట్లెక్కుతున్నట్లు అగుపడే ఆ శరీర కాంతి నీలిమత్వం చూశాడు. 'ఒక రాక్షసుడు ఇంత భక్తుడగునా అనేఆలోచన నా పట్ల ఆపదలాగా రాకుండా-ఇంతకు ముందు ప్రహ్లాదుడున్నాడు గదా, అనే సుకుమారభావం ఆనంద నృత్యంలో పురివిప్పిన నెమలి చిందులలాగా స్వామి కనుకొసల్లో తొణికిసలాడుతున్నట్లు" విభీషణుడు భావించాడు. ఇలాశ్రీరాముడు విభీషణుడు ఇద్దరూ ఒకరినొకరు చూచుకోడంలో నిమగ్నమై వున్న తరుణంలో హనుమ విభీషణుని చూచి—

"అయ్యా శ్రీరామచంద్రునికి ఏదో చెప్పుకుంటా నన్నావు గదా!" అని అనంగానే ఒక్కసారి విభీషణుడు తేరుకుని, పులకించిన శరీరంతో శ్రీరాముని పాదాలకు నమస్కరించి—

## విభీషణుని శరణాగతి

"స్వామీ నా విన్నపాన్ని కాస్త వినండి! రాక్షసరాజైన మా అన్న నన్ను అవమానించి పంపాడు. నీకు అంతగా ఇష్టమైతే అక్కడికే పో. అతనితోనే చావు. రాక్షస వంశానికే అపకీర్తి తెచ్చేవాడా! ఇంక నీ ముఖం చూపకుండా వెంటనే వెళ్ళిపో! అన్నాడు. నిన్ను శరణు కోరుకుంటున్నాను. నన్ను నమ్ము. నేను గూఢచారిని కాను. ప్రభూ! నన్ను అంగీకరించు." అంటూ, వానరుల ముఖాలను చూస్తూ నిల్చుండిపోయాడు. ఆ విధంగా నిలబడి వున్న విభీషణుణ్ణి, ఏదో ఇంద్ర సఖునిలాగా కపులందరూ చూస్తూ నిలుచున్నారు. అప్పుడు శ్రీరాముడు అతనితో—

"నీకు శరణమిచ్చాను. నీ అన్న ఎవడు? వాడి బలపరాక్రమాలు ఎలాంటివి? అతనికి అందే సహాయ సహకారాలు ఎలాంటివి? చెప్పు" అన్నాడు. అనంగానే విభీషణుడు—

"ఓ శ్రీరామచంద్రా! మా అన్న రావణుడు. సర్వభూతాలకు, గంధర్వులకు. ఉరగములకు, రాక్షసులకు గూడా అవధ్యుడు. వాడికంటె చిన్న, నా కంటె పెద్ద మా అన్న కుంభకర్ణుడు. ఇంద్రునితో సమానమైన బలం కలవాడు. ఇంక సేనాపతి ప్రహస్తుడు. కైలాసంలోని మాణిభద్రుణ్ణి ఓడించినవాడు. మా అన్న రావణుని కొడుకు యుద్ధం మధ్యలో అగ్నిని ఉపాసించి, అదృశ్యుడై, శస్త్రాస్త్ర అవధ్యకవచ సమన్వితుడై నిలిచి యుద్ధం చేస్తాడు. ఇంకమహోదర మహాపార్శ్వ, అకంపనులు, లోకపాలకులు సేనాపతులు. ఇంకా వీరుకాక కామరూపులైన దశకోటి సహస్రులైన రాక్షసులున్నారు. రావణ కుంభకర్ణులు బ్రహ్మచేత చావు లేకుండా వరం పొందినవారు" అన్నాడు. అప్పుడు శ్రీరాముడు—

"బ్రహ్మ ఇచ్చిన వరం మాట బ్రహ్మ చూసుకుంటాడులే! అగ్నిజ్వాలల్లో

వాడి పదితలకాయలను కొబ్బరికాయలలాగా పూర్ణాహుతి చేస్తాను. ఆచంద్ర తారార్కం నువ్వు ఆ లంకా రాజ్యాన్ని ఏలుకో ! ఈ రాముని బాణాగ్ని ధూమాలు ఈ లంకలో చల్లారకుండా నిత్యాగ్నిహోత్రంలాగా వెలుగొంది నింపుతాయి" అన్నాడు. అప్పుడు విభీషణుడు–

"నన్ను రాజద్రోహి అని బంధితుణ్ణి చేయబోయేంతవరకు వుండి, ఇంక అక్కడ దేనికని లంకను వదిలి, నిన్ను శరణు పొందాలని వచ్చాను. అంతకీ నేను చిలక్కి చెప్పినట్లు చెప్పాను. అయినా మా అన్నగారు వినలేదు, వాని కొడుకు వినలేదు. బ్రహ్మాస్త్రానికి కట్టుబడ్డట్టు వున్న హనుమంతునిపై వాళ్లు చూపిన అహంకారం ఇంతని చెప్పలేను. నోటికి హద్దుపద్దూ లేకుండా మాట్లాడారు. వాళ్ళకేం తెలుసు బ్రహ్మమీద గౌరవంకొద్దీ హనుమ అలాఉన్నాడని." అని అంటున్న విభీషణుని కపివీరులందరూ 'ఏమి జరిగింది ?' అని గుచ్చి గుచ్చి అడిగారు. అప్పుడు విభీషణుడు- లంకా దహనానంతరం రావణుడు మంత్రులను యుద్ధ నీతిపై చర్చకు పిలిచాడు. "జానకిని అప్పగించడం శ్రేయస్కరమని" చెప్పగా రావణుడు నిరుత్తరుడై, ఆనాటికి సభ వీడి, వెడలిపోయి మరునాడు పెద్ద సభ ఏర్పాటు చేశాడు. అప్పుడు గూడా ప్రహస్తుడు, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు, నికుంభుడు మొదలైన వారందరూ "జానకిని వదలడమే వాళ్ళ జీవితాలు నిలిచే మార్గమని" అన్నారు. అప్పుడు సభాసదుల నిర్ణయానికి సరిపడని విధంగా పెద్దపెద్ద మాటలతో రావణుడు ఏదో చెప్తూ ఉండగా అక్కడ ఉండడం ఇష్టంలేక ఇలా వచ్చేశాను' అన్నాడు. ఎదురుగా ఉవ్వెత్తున కెరటాలు లేస్తూ అతి గంభీరంగా "ఎలా దాటతారో నన్నుదాటండి. చూద్దాం" అన్నట్లున్న మహాసాగరాన్ని చూస్తూ రాముడు విభీషణునితో–

"ఇంత సేనతో సముద్రాన్ని ఎలా దాటవచ్చో చెప్పడానికి, బంధువులందరినీ వదలి, బంధువులంకాని మాలో చేరి, మా పక్షాన యుద్ధం చెయ్యడానికి, యుద్ధంలో మీ వాళ్ళందరూ చనిపోతే- ఆ లంకను ఏలడానికి తగిన వాడుగా ఇక్కడకు వచ్చావన్నమాట ! సరే ముందు ఈ సముద్రం మాట చెప్పు" అన్నాడు.

[రావణ వధ కాక పూర్వమే- లంకకు విభీషణుని రాజుగా ప్రకటించే విధంగా రాముడు మాట్లాడిన తీరును చూసి హనుమకు సందేహం కలిగి–

"యుద్ధం జరగక పూర్వమే తను చేసిన పని తప్పనిపించి ఆరావణుడు సీతను నీకు అప్పగిస్తే-అప్పుడు ఏంచేస్తావు? మరి లంకకు విభీషణుని రాజుగా ముందే నువ్వు ప్రకటించావు గదా!" అన్నాడు. అప్పుడు రాముడు.

"బుద్ధిమారి, దుష్టత్వం పోయి, తన తప్పు తెలుసుకుని రావణుడు సీతను నాకుఅప్పగిస్తే-అంతకంటె కావల్సిందేముంది? అలా జరిగిననాడు అయోధ్యనే రావణునికి ఇస్తాను. నీ సందేహం తీరిందా?" అన్నాడు. రామునిది అంతటి ఉదాత్తమైన వ్యక్తిత్వం.

కొన్ని రామాయణాల్లో వ్రాయబడిన ఈ విషయం గూడా ఇక్కడ వ్రాస్తే సందర్భోచితంగా ఉంటుందని వ్రాశాను. —గ్రంథకర్త]

రాముని మాటల్లోని హాస్యమాధుర్యాన్ని, అంతరంలో వున్న ఆమాటల గూఢార్థాన్ని, గడుసుతనాన్ని గమనించి విభీషణుడు—

## కర్తవ్య సూచన

"సగర పుత్రులు త్రవ్విన సాగరం ఇది. నువ్వుగూడా వాళ్ల వంశానికి చెందిననాడవే గదా ! నువ్వు నోరెత్తి అడగాలే గాని లోభిలాంటి వాడైనా ఇవ్వడానికి ముందుకు వస్తాడు. అల్లాంటిది ఇచ్చేవాడు మీవాడే అయితే వేరే చెప్పాలా?" అని చెప్పనట్లుగానే చెయ్యవలసిన దాన్ని సూచించాడు. విభీషణుని మాటలకు కపులందరూ 'సెబాస్' అన్నారు. లక్ష్మణుడుగూడా' బాగుంది' అన్నాడు. శ్రీరాముడుగూడా దీక్షాప్రయత్నంలో వున్నాడు. ఇంతలో రావణుని చేత పంపబడిన "శుకుడు" అనే చారికుణ్ణి వానర సేనాపతులు పట్టుకుని చావ తన్నారు. వాడి మొర ఆలకించిన శ్రీరాముడు- వాణ్ణి తన్నకుండా వదిలి పెట్టించి, దర్భాస్తరణ ఉపవిష్టుడై అబ్ధిరాజును ప్రార్థించాడు. శివధనుస్సును భగ్నంచేసి, పరశురాముని ప్రతాపానికి స్వస్తి పలికి, దుష్టరాక్షసుల వక్షాలను వ్రయ్యలు చేసిన తన బాహువులను వడిలో జేర్చి, పరమ ప్రశాంతచిత్తుడై మూడు రాత్రులు ప్రార్థించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. అప్పుడు రాముడు లేచి లక్ష్మణుని చూసి—

# రాముని కోపావేశం

"ప్రార్థించే వాళ్ల గోడు వినిపించుకోనప్పుడు ప్రార్థన చేసి ఏం లాభం? ప్రార్థనార్హుడైనప్పటికీ, ప్రార్థన వలన ప్రయోజనం కలగనప్పుడు ప్రార్థించి నిరాశ చెందకూడదు. వేరొక ప్రయత్నం చెయ్యాలి. ఈ అబ్ధిరాజుకు తను ఇప్పుడు ఇలా ఉండగలగడానికి కారణం మరిచిపోయి వుండవచ్చు. అమ్మ పుట్టిల్లు మేనమామలకు తెలియదా ! మన వంశస్థులైన సగర పుత్రులు చేసి పెట్టిన పుణ్యఫలమే తానని గుర్తుచేయవలసిన అవసరమొచ్చింది. సగరులు, భగీరథుడు లేకుంటే తనకీనాడు ఇలా ఆటుపోట్ల అహంకార ప్రకంపనా లుండేవా? తనవాడెవడో పరాయివాడెవడోగూడా తెలియని అధికారగర్వంతో వున్నాడు. అవతల వున్న దానవేశ్వరుని గొప్పను చాటడంకోసం తానిలా మిడిసిపడి కాపలా కాస్తున్నాడా ? కార్యసాఫల్యానికి సామమొకటి చాలను కునేట్లయితే రాజులు మిగిలిన ఉపాయాలను ఎందుకు చెబుతారు ? పైగా ఈ ప్రాంతం అంత సాధువైంది కాదు. సాధు జనం తక్కువ. ఎవరో ఒకరు ఈ దౌష్ట్యాన్ని ప్రతిఘటించి తుదముట్టించాలి. గోటితో పోయేదానికి గొడ్డలి ఎందుకనికాని ఆ పని చెయ్యడానికి నిమిషం పట్టదు. మురికి గుంటను పూడ్చ డానికి చక్కెర పొయ్యక్కర్లేదు. పాపాన్ని హరింపచేయడానికి పుణ్యాన్ని ఎత్తుకెత్తు పోస్తామా? పంకం పోవాలంటే కావల్సింది తీక్షణమైన ఎండ పొడ గాని పంచదార కాదు" అన్నాడు.

# రామబాణ తీవ్రత

అలా అంటూనే విల్లు తీసుకుని ధనుష్టంకారం చేశాడు. ఆధనుష్టంకార ధ్వని ఆకాశంవైపు పయనించకుండా, అంబుధి అంతరాంతరాల్లో వున్న జంతువుల కర్ణపుటాలను గింగిర్లెత్తించింది. భీకరమైన ఆ జంతు తతి పడ్డ భయాందోళనలకు అంబుధి అంతా అల్లకల్లోలమైంది. రాముని వాడియైన వేడి బాణం సముద్రం డొక్కలోపలకు దూసుకుంటూ పోయి మర్దన చేసింది. రుద్రమూర్తిలాగా ఉన్న రాముణ్ణి చూసి జంతువులు భయంతో సముద్రం లోలోపలకు వెళ్ళి దాక్కున్నాయి. అప్పుడు రాముడు సముద్రుణ్ణి చూస్తూ—

"ముందు చెప్పకుండా కొట్టాడు అనేమాట దేనికి, విను. నీ గర్భంలో

ఉన్న జంతు సమూహం చేత, నీలో మరుగు పడి ఉన్న రత్నాల చేత, నీ గాంభీర్యానికి ప్రధాన హేతువైన నీటి చేతనే గదా నీ కింత గర్వం, నామాట మీద నిరాదరణ. వీటన్నింటినీ వరుసగా పైపైకి పంపి నీకు దూరం చేస్తాను. నీ గతి ఏమౌతుందో ఆలోచించు. నేనేమీ అసమర్థుడై నిన్నడగలేదు. ఈ కపి సేన అటు ఆకాశంలో ఈదుకుంటూ వెళ్లలేదు, ఇటు ఈ జలంలోను ఈదుకుంటూ వెళ్లలేదు. అందుకని దయతో కాస్త దారి ఇమ్మని ప్రార్థించాను. నా ప్రార్థనను వమ్ముచేసి ముందుగా ఈ సంగతి నీకు చెప్పలేదనే తప్పు నాపై నెట్టకు". అన్నాడు. రాముడు వదిలిన బాణం సముద్ర మథనంచేసింది. లోలోపల దాగిన అసురులు, మొసళ్ళు వారి వారి సంతానము తెకతెకలై, తహతహలై, తికమకపడి అంతర జ్వలనంతో తట్టుకోలేక సగం చచ్చి-బయటపడి, వెల్లకిలా పడ్డాయి. సముద్ర గర్భజీవులకు ప్రళయం ఆసన్నమైనట్లైంది. లోలోపలకు పోయిన వాడియైన వేడి బాణాల దూకుడు తాకిడికి నిప్పులు పుట్టి, నీరధిలోని జంతు సంచయానికి సంకటమొచ్చి, దగ్ధ శరీరాలతో బయటపడ్డాయి. జలధి నీరు సలసల కాగిపోతుంటగా- పాతాళంలోని ప్రాణికోటి కొన ప్రాణాలతో బయటవడ్డాయి. తరంగ శృంగాల వద్ద సన్నని జ్వాలలు ధూమరేఖలు అల్లుకొని ఆకాశానికెగసి చుట్టుకొని వృక్షతతిలాగా భాసించాయి. అప్పుడు చూడ్డానికి నేలమీదనున్న కారడవి అంతా నింగికెగసిందా అన్నట్టుంది. ఇదేదో క్రొత్త హాలాహలం జలధిలోంచి ఉద్భవించిందా అన్నట్లుంది. అడుగు మాడుతోందో? లేకపోతే ఆకాశపు అంచుల కెగసి పొంగి పొర్లిపోతుందో అన్నట్లు- పట్టుకుని దించడానికి పట్టుకుదరని పాలకుండ లాగా సముద్రం చిందులాడుతోంది. 'రామబాణానికి భూమి క్రిందకు నొక్కబడి, ఆదిశేషువు మాడుకు ఒత్తిడి పెరిగి బొప్పికడుతున్నదేమో అని అనిపించేటట్లు లక్ష్మణుని దేహం జలదరించి రాముని చేతిని ఒక్కసారి పట్టుకున్నాడు. ముక్కు పుటాలకు ఒక మాడు వాసన తగలడం ప్రారంభించింది. కాస్తున్నపుడు మరిగి తరిగిన నీటితో ఉన్న కషాయాన్ని త్రాగేవానిలాగా-రాముడు సముద్రాన్ని చూస్తున్నాడు. చూస్తున్నపుడు కనుబొమ్మలు ముడిపడ్డాయి. బాణాన్ని ఎక్కుపెట్టి సముద్రునితో-

# సముద్రునికి హెచ్చరిక

"పనితొందర ఎవరికోసమో తెలుసుకోవలసినవాడే, అలా తొందరపడే వాడెవరో గూడా తెలుసుకోవాలనుకోడం నా తప్పే! సరేకానీ! 'జలనిధివైన నిన్ను ఇంకింప చేస్తే లోకం ఎలానడుస్తుంది? అనిఅనుకోవచ్చు. సాగరులు ఈ మన్నును త్రవ్వి నిండా నీరు నిండేలా నిన్ను చేయక మునుపు ఈ భూమి లేదా ఏమిటి ? నువ్వు లేకపోతే భూమికి ప్రాణం పోతుందనుకునే మోహపు టూహ నాకు లేదు. దురభ్యాసానికి అలవాటుపడ్డ వాడు అది లేకపోతే బ్రతకలేమనుకోడం ఎంతో- ఇదీ అంతే ? నిన్ను ఇంకిస్తే మించిపోయేది ఏమాత్రం లేనేలేదు. నాహృదయాంతరాల్లో గంగాధరుడున్నాడు. నిన్నింకిస్తే ఏర్పడే పల్లాన్ని నింపడానికి ఆయన జట సడలిస్తే చాలునని తెలుసుకో! జానకి కోసమే ధనుస్సును విరిచాను- మన్నించమని ఎప్పుడో ఒకప్పుడు శివుణ్ణి అడగాలనే అనుకుంటున్నాను. ఇప్పుడు రెండుపనులూ కలిసి వచ్చేట్లు చేస్తాను. జానకి కోసం అప్పుడు ఆ ధనుస్సును, నీ మూలం చూసి ఇప్పుడు ఈ ధనుస్సును-ఎక్కుపెట్టవలసి వచ్చింది" అన్నాడు. రాముడలా అంటూండగానే-

గర్భాలయం తలుపులు తెరవంగానే దేవాలయంలో కనిపించే దేవతా సమూహంలాగా కడలి కదలి నిలబడ్డాడు. శ్రీరాముడు అతనిని సముద్రునిగా గుర్తించాడు. కాని ఎక్కుపెట్టిన బాణం వృథా కారాదు. తీరా వార్ధిరాజే వచ్చి ఎదురుగా నిలబడ్డాడు. ఏం చెయ్యాలి ! మర్యాద లేకుండా అగౌరవంగా ప్రవర్తించకూడదు గదా! అందుకని కాసేపు ఆలోచించి 'ఎక్కుపెట్టిన బాణం సముద్రునికి అయిష్టమైన చోట పడుగాక' అని ఆ బాణాన్ని వదిలాడు.

రాక్షసులు తమ వెఱ్ఱి చేష్టలతోను, పాప ప్రవృత్తులతోను, నానా గందరగోళంగాను, పాపభూయిష్టంగాను చేసిన ఉత్తర దిక్కున ఉండే 'ద్రుమకుల్య' అనే పుణ్యభూమి వద్ద వున్న సముద్రంలో రామబాణం పడింది. అప్పుడు వెంటనే దానిలోని నీరంతా ఎండిపోయింది. లోపల వున్న రాక్షస మూక అంతా దగ్ధమైంది. అదంతా రామబాణప్రతాపం అని అప్పటికి అర్థమైంది ఆ నీరధికి.

## సమేతంగా సముద్ర దర్శనం

ఇరువైపులా మల్లి, జాజిపూవులు కొలుస్తూ ఉండగా- విచ్చిన పూలతో ఉండే మంకెన చెట్టులాగా- ఎదురుగా వస్తూవున్న వార్థిరాజుతో పాటు రామునికి గంగా, కావేరీ నదీమతల్లులు దేవతా కృతులతో సముద్రునికి ఇరువైపులా కనబడ్డారు.

ఎదురుగా వచ్చి నిలబడిన అతిథి సాక్షాత్తు నారాయణునిగా ఎంచి రాముడు దర్భాసనాన్ని ఉంచి, భక్తితో అర్ఘ్యము పాద్యము ఇచ్చి, హస్తాంజలి మకుటంతో ఆదరించి, తన బాణ ప్రయోగానికి కాస్త తటాపటాయిస్తూ- గంగా కావేరీ నదీమ తల్లులను చూచి, మందహాసం చిందించి, అబ్ధి రాజుకు అంజలి ఘటించి—

"సృష్టి ప్రారంభానికి సృష్టికర్తకే సహకరించిన వాడివి. అయినా నా అభ్యర్థనను పెద్దగా మన్నించి, చిన్నవాడనని ఎంచక, నా ఎదుట నిలచి కనువిందు చేకూరుస్తున్నావు. నిన్ను రప్పించక తప్పలేదు. మన్నించు. నీతోపాటు లోకోత్తర వాహినియైన గంగామతల్లిని, అమోఘ స్నిగ్ధ సౌందర్య దేవేరి కావేరిని గూడ తీసుకువచ్చావు. తన వంశస్థులలో చిన్నవారమైన మమ్ము చూడడానికి వచ్చింది మా వంశపుటాడపడుచు గంగమ్మతల్లి. మీ రాక నాకు హృదయ, నయనానందకరమైన విందును చేకూరుస్తోంది" అని గంగానదికి ప్రణామం చేసి-

"నేను అయోధ్యలో లేను. మీకు తగిన విధంగా సపర్యలు గూడా చేయలేని స్థితి నాది. రమ్యభోగమూర్తి, రత్నాకరుడవు ఐన నిన్ను బండరాళ్ళ మీద కూర్చుండబెట్టాల్సి వచ్చింది" అన్నాడు. అప్పుడు అబ్ధిరాజు—

## నీరధి నిరాడంబరం

"ఓ మర్యాదా పురుషోత్తమా! మీరు ఈ ప్రాంతానికి వచ్చారని తెలిసి, మహాభాగీరథీ దేవి- 'తనకు మిమ్మల్ని చూడాలని బాగా కోరికగా వుందని, నాతో పాటు వస్తాన'ంటే- తీసుకువచ్చాను. ఆమెతోపాటు తానూ వస్తానని

కావేరి గూడా వచ్చింది. పంచభూతాల తత్త్వాలు వాటి స్వభావాలే! నాకంటూ ఒక ప్రత్యేకత ఏముంది ? స్వతంత్రత ఏముంది ? పాత్రాధారుణ్ణే తప్ప నాకంటూ ఒక పాత్రలేదు. అయితే నిండుగా నీరుపట్టి వుండటంతో అందరి 'దృష్టి' నాకే తగుల్తోంది. ఈ అమరవాహిని మీ ఇంటి ఆడపడుచు. ఆమె అధికారవు మాటలతో నీ సన్నిధికి వచ్చాను రామచంద్రా! విను."

"నీ కపి సేనలో నలుడనే వాడున్నాడు. అతను విశ్వకర్మ సుతుడు అవడంతో నిర్మాణ శిల్ప విద్యలో ఆరితేరినవాడు. నీళ్ళలో వేసిన రాళ్ళు తేలేటట్లు తండ్రినుండి వరం పొందినవాడు. అతని చేతులతో వేసిన రాళ్లు నీళ్ళలో మునిగిపోవు. చిన్నమఱది లక్ష్మణ వీరుని చూడాలని కావేరి నాకంటే ముందు తొందరపడింది. ఆవునూ, ఎంతసేపూ నేనే మాట్లాడాలా? గొప్పింటి ఆడపడుచు నంటూ వచ్చావు అప్పగారివి. మాట్లాడడానికి మాటలే లేవా?" అని గంగవైపు తిరిగాడు. అప్పుడు గంగ—

"మాట్లాడడానికేముంది? అన్నీ మీరు మాట్లాడేశారు గదా!" ఇంతకు పూర్వం గంగని దాటుతున్నపుడు సీత భక్తితో గంగని ప్రార్థించిన మాటలు గుర్తుకు వచ్చి ('మా యింటి ఆడపడుచువి. నిన్ను మ్రొక్కుతున్నాను. మేము అరణ్యవాసం పూర్తిచేసుకుని, మళ్ళీ అయోధ్యకు క్షేమంగా చేరేటట్లుదీవించు, నీకు పూజలు చేస్తాను, అని సీత పూర్వం గంగని దాటుతున్నపుడు మ్రొక్కుకుంది) అకాశగంగాదేవి నేత్ర నీరజం నుండి బాష్పబిందువులు రాలాయి. (ఇప్పుడు వీళ్లకు ఇలాంటి ఇబ్బంది వచ్చింది గదా తానేమీ చేయలేక పోయానని బాధ. అందుకే సాగర పతికి చెప్పాల్సిన మాటలన్నీ చెప్పి ఇక్కడకు తీసుకు వచ్చింది). ఆడపడుచు గంగ కంటినుండి అలా వచ్చిన బాష్ప బిందువులకు రాముని కన్ను చెమ్మగిల్లింది. మమతానుబంధాలు, వాత్సల్య సంస్పర్శలు అలాంటివి మరి ! "కౌసల్యా పాదారవిందాలకు మ్రొక్కి, సెలవు తీసుకుని అరణ్యానికి బయలుదేరేముందు గూడా రాముని కన్ను చెమ్మగిల లేదు. తండ్రిపోయిన సంగతి తమ్ముడు భరతుడు చెప్పినపుడు గూడా చెమ్మ గిలలేదు. సీతా వియోగమప్పుడు గూడా చెమ్మగిలలేదు. విరాధ కబంధుల చేత పట్టుబడినపుడు గూడా చెమ్మగిలలేదు. కాని దివిజ గంగ కంటి చివరల

కన్నీరు ఒలికితే రాముని కళ్లు చెమ్మగిల్లాయి. "అని సౌమిత్రి దివిజ గంగ కన్నీటి తత్త్వమహిమను హృదయంలోనే గుర్తించాడు. శ్రీమన్నారాయణుడు తన తత్త్వంలో పాదభాగాన్ని కరుణాగుణంగాను, పవిత్రతగాను ఈ దివిజ గంగగా ఉత్పాదించాడేమో అనుకున్నాడు లక్ష్మణుడు. (నారాయణుని పాదాల్లోంచే గంగ పుట్టింది గదా!)

సాగరమూర్తి రామునితో 'ఇంక నే వెళ్ళొస్తాను' అన్నాడు. అందరూ ఒకళ్ళనొకళ్ళు పాదాభివందనాలు నమస్కారాలు, మందహాసాలు, వినయ సూచకంగా నయన చలనాలు, శిరః కంపనాలు చేసుకున్నారు. లక్ష్మణుడు సముద్రంలో మోకాటిలోతు వరకు సాగనంపి తిరిగి వచ్చాడు. అప్పుడు లక్ష్మణుని చూచి శ్రీరాముడు—

"తన నాథుడైన సముద్రుని మీదకు బాణం ఎక్కుపెట్టి మాట లన్నందుకు- అప్పగారైన గంగమ్మ తల్లి కోప్పడుతుందేమోనని అను కున్నాను. ఆమె కృపాగుణైకరాశి. ఒక్కమాటగూడా అనలేదు చూశావా! నాది రాతిగుండె అయినా ఆ గంగను జూచి నీరైపోయాను. ఆ వారాశిలోని నీళ్లు నీళ్ళా? ఈ గంగలోని నీరు నీళ్ళు. (రామునికి కళ్లనీరు వచ్చింది గంగను చూడడం వల్లనే గదా !) అందుకే ఈ వారధి కరుణాపయోనిధి. ఇంకో సంగతి చెబుతా విను. ఋష్యశృంగ మౌనిని బట్టి నేను అప్పగారైన శాంతను గౌరవిస్తాను. ఈ దివిజ భాగీరథిని బట్టి బావగారైన సముద్రుణ్ణి గౌరవిస్తాను" అన్నాడు.

## నలునికి కర్తవ్యోపదేశం

దూరంగా ఒడ్డున నిలబడి చూస్తున్న నల,నీలాది వానరసేనాపతులలో నలుని దగ్గరకు పిలిచి, సాగరరాజు ఏదో మాట్లాడాడు. అంతలోనే అబ్ధిరాజు కొంతదూరం ఆకాశమార్గంగా పోయినట్లనిపించింది నలునికి. తీరా చూస్తే నలునికి తర్వాత తెలిసింది తాను సముద్ర మధ్యంలో వున్నానని. అక్కడ నుండి ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చి, నవ్వుతూ- సముద్రుడు తనకు చెప్పిన మాటను అందరకూ చెప్పాడు. అందరూ కలసి శ్రీరాముణ్ణి దర్శించారు. అప్పుడు నలుడు—

'నాకు తోచనే లేదు. పోనీ నువ్వూ నన్ను అడగనైనా లేదు. అధి రాజు చెప్పేంతవరకు నాకు గుర్తుకే రాలేదు. ఇంక ఎందుకు ఆలోచన? ఈ సముద్రాన్ని పర్వతశిలలతోను, వృక్షతతులతోను పూన్చి సేతువు నిర్మిస్తాను. ఆ సేతువు మీదుగా మన కపిసేన యావత్తూ లంకను ప్రవేశిస్తుంది. పది యోజనాల వెడల్పుగల మార్గం మీద సురవైరి అయిన రావణుని లంకా పురాన్ని చేరతాము. మన హనుమ వాక్యాన్ని సత్యం చేస్తాను.

"బెసిగిపోకుండా, బీటలు వారకుండా, ఊగిసలాడకుండా మన కపిసేన అటునుంచి ఇటు, ఇటునుంచి అటు దూకుతూ అడినా ఊడకుండా, చరణ ఘాతాల తాకిడికి, శిలా ఘాతాలకు దెబ్బతినకుండా ఉండే విధంగా నిర్మిస్తాను. మళ్ళీ మనం లంక నుండి తిరిగి వచ్చేటప్పుడు రాక్షసుల రథ, గజ, తురంగా లతో రావచ్చు. అప్పటి పాద ఘట్టనాలకు గాని, రథ చక్రభ్రమణ త్వరణా లకు గాని ఏమాత్రం చెక్కు-చెదరకుండా వుండే గట్టిదనంతో నిర్మిస్తాను. మనపని పూర్తయిన తరువాత గూడా- జలధిని బంధించిన ఈ సేతు బంధన చిహ్నాలు చెడవు. నా నిర్మాణ శిల్పరచనా పాటవం అనితరసాధ్యం. కోటి మంది కోతులందిచ్చే కొండరాళ్లు- చేతుల మీదుగా అటూ ఇటూ ఆడినట్లు గూడా తెలియనట్లు- నీవు బాణాలను ఒకదాని వెంట ఒకటి వేసే విధంగా మధ్యలో కాలవ్యవధి గుర్తించలేనంత నైపుణ్యంగా నిర్మిస్తాను" అన్నాడు. అందరూ శ్రీరాముని వద్ద శెలవు తీసుకుని సముద్రతీరాన్ని చేరారు.

అందరూ నలుణ్ణి 'సేతుబంధనం ఎలా చేస్తావు' అని అడిగారు? అందుకు నలుడు మెల్లమెల్లగా నడుస్తూ మీరేచూస్తారు గదా" అని ఆలోచిస్తూ మధ్యమధ్యలో—

"ముందుగా తనాబి లుంచి, పైన మట్టి ఉండలదిమి, మిద్దెలకు పైకప్పు నిర్మించినట్లు- పెద్దపెద్ద అరణ్య వృక్షాలను కూర్చి, మొదట్లో పెద్దపెద్ద రాళ్ళను పైని అమర్చాలి. నీళ్ళపైన పెద్దపెద్ద వృక్షాలు గూడా తేలతాయి. జలయాన పాత్రల మీద ఏనుగులను ఎక్కించినట్లు- పెద్దపెద్ద శిలలనుగూడా పెట్టవచ్చు. ఎగుడు దిగుడుగా వుండేవి కోణాలతో కరుచుకుని, ఇరుక్కు-పోయి, సమంగా ఏర్పడి- వానరసేన సుఖంగా ప్రయాణం చెయ్యడానికి వీలుగా తయారౌతుంది."

"నా కేవోవో తెగ వస్తున్నాయి ఊహలు. కల్పంలో చెప్పబడినవి, స్మృతుల్లో వక్కాణింపబడినవి గుర్తుకు వస్తున్నాయి. అయితే నేను నేర్చుకున్నది పెద్దగా ఏంలేదు. అంతా మా తండ్రి వర ప్రభావమే! అసలు విద్యలన్నీ తండ్రి నుండి కొడుక్కీ, కొడుకు నుండి మనవడికి ఇలా పరంపరాగతంగా ధారాపాతంగా రావల్సిందే!"

కొంతదూరం నడిచి మళ్ళీ ఏదో హఠాత్తుగా ఊహవచ్చి, నిలిచి, ఎగిరి గంతేసి, అందరిని చూస్తూ, నవ్వి, చిటిక వేసి "పథకమంతా కుదిరింది, సేతువునంతా నిర్మించాను, ఇంక ప్రారంభిద్దాం. నాలుగైదు రోజులకంటె ఎక్కువ పట్టదు."

"ఒక పెద్ద పర్వతాన్ని ఇటువైపు ఆధారంగా వుండి తూగే విధంగా ఈ సేతువు సాగాలి. అలాగే అటు లంకలో ఒక పెద్ద పర్వతం దీనికి లంకెగా వుండి ఉంటుంది, రండి రండి అయిపోయింది నిర్మాణం" అన్నాడు నలుడు. అంతే అంతలోనే—

## సేతునిర్మాణం

సమూలంగా పెకలింపబడినవి, బోదలతో తగిలింప బడినవి, ఫెళ్లున తన్నగా నడిమికి చీలినట్టివి అయిన అనేక సాలాశ్వ, కర్ణ ధనవంశ, కులుజ, అర్జున, తాల, తిలక, తినిశ, బిల్వ, సప్తపర్ణ, కర్ణికార, చూత, అశోకవృక్షాలు తాల, దాడిమ, నారికేళ, విభీతక, వకుళ, ఖదిర, నింబ మొదలైన తరు సమూహాలు సాగరంలో తెప్పలుగా తేలుతున్నాయి. అంత త్రుటికాలంలో కపిసేన విజృంభించి వాటిని సముద్రంలో తెచ్చి పడేసింది. అవి చూడ్డానికి– "దివిజ స్త్రీలు సావిత్రీ గౌరీదేవీ వ్రతోద్యావనము చేసినపుడు- మహాసాగరంలో తెప్పలై ఊగుతున్నాయా" అన్నట్టున్నాయి. ఉద్దండులైన కపులు దట్టమైన అడవులలోని వృక్షాలనన్నిటినీ పెకలించి సముద్రంలో విసురుతున్నారు. దాంతో తరులతా వృక్షాదులన్నీ శూన్యమై దక్షిణా పథమంతా ఈకలు తీసిన కోడిలా అయింది. పర్వతశిలలన్నీ మటుమాయమై నేలంతా మిట్టపల్లాలు ఏకమయ్యాయి. సాగరంలో మరో అడవి వెలుస్తున్నట్లు, పర్వతపంక్తి మొలుస్తున్నట్లు నీళ్ళలో సేతువు తయారవుతోంది. ఈ విధంగా నిర్మింపబడిన

సేతువు మొదటిరోజున పదునాల్గు యోజనాలు, రెండవరోజున ఇరువదిమూడు యోజనాలు, మూడవరోజున ఇరువదిఒక్క యోజనాలు, ఆ మర్నాడు ముప్పది మూడు యోజనాలు తయారై నూరుయోజనాల సేతువు పూర్తయింది. అవతలి వైపున లంక దగ్గర ఒక పెద్ద పర్వతం లంకెగా నిర్మింపబడింది.

హనుమ సేతువును పరీక్షించాడు. ప్రతి యోజనం దూరం వద్ద ఒక్కసారి పైకి ఎగిరి, నూరు పిడుగులు పడ్డట్టు క్రిందకు ఒక్కసారిగా దూకి, తట్టుకుంటోందో లేదో. గట్టిగా నిలబడిందో లేదో పరీక్షించి చూశాడు. సంతోషపడి సరే బాగుందని నలుణ్ణి మెచ్చుకున్నాడు. నలుడు గుడ్లెగరేస్తూ హనుమను కౌగలించుకున్నాడు.

సర్వరాక్షసుల ప్రాణాలను ఒక్కసారే హరిద్దామని చాపిన యముని దక్షిణ హస్తంలాగా వుంది సేతువు. ఒక పెద్ద మొసలి సముద్రంలో ఈ వైపునుంచి లంకవైపుకు దారి తీస్తోందా అన్నట్లుంది సేతువు. సముద్ర కన్యకు తల పాపిటలాగా సేతువు భాసించింది.

## కదిలిన కపిసేన

ఆ హనుమదంగజ భుజస్కంధాలపై రామలక్ష్మణులు కూర్చున్నారు. మళ్ళీ వానరసేనంతా పదియోజనాల చతురస్రంలా సేతువుపై ముందుకు సాగి అర్థదినంలో అవతల తీరానికి చేరారు. చేరిన ఉత్సాహం పెల్లుబికి, సింహనాదాలు చేశారు. లంఘన తరంగ నాట్యం చేశారు. రాక్షసులను హేళన చేస్తూ- నినాదాలు, తోకలు పైకెత్తి-కుప్పిగంతులు వేస్తూ, కేరింతలుకొడుతూ ఆకాశానికెగురుతూ, నానా భీభత్సం చేశారు. ప్రళయ మారుతం ప్రచండంగా వీచింది. భూమి కంపించింది. భూమిలోంచి మహామహీరుహాలు పెల్లగింపబడ్డాయి. మాంసశోణితం వర్షంలా కురిసింది. సంధ్యాకాలం రక్తచందన సంకాశమైంది. సూర్యునిలోని అగ్నులు రగుల్కొని జ్వాలలు చిమ్మాయి. చంద్రుడుగూడా- నల్లని రక్తం వంటికి పూసుకున్న వానిలా- అయాడు. తారకలు ధూమంతో కప్పబడ్డాయి. కాకులు, కుక్కలు, గ్రద్దలు నేలబారుగా ఎగరడం ప్రారంభించాయి. అన్నీ అపశకునాలే! అన్నీ సర్వరాక్షస నాశన

సూచకంగా వున్నాయి. లంకలోని రాక్షస ప్రభువులందరూ వీటినన్నిటినీ చూసి వానరోత్పాతాలుగా చెప్పుకుని నవ్వుకున్నారు. లంక ఇవతల వున్న కపులు ఈ అపశకునాలన్నిటినీ దానవోత్పాతాలుగా అనుకుని బహు విధాలుగా తాండవం చేశారు.

అవతల లంకలో సీతాదేవి తాను ఇంతకు పూర్వం లంకాపట్టణాన్ని దహించినట్లుగా ఊహించింది. ఇప్పుడు తాను దానిని దహించివెయ్యడం ఖాయం అనీ, తన వియోగాగ్నే లంకను అలా చెయ్యగలదనీ లోపలే నిర్ధారించుకుంది.



# అనుబంధము

ఆదర్శప్రాయ జీవితంతో ఆరాధ్య దైవం అయిన శ్రీరాముని చరిత్రను తెల్పే కావ్యమే రామాయణం. ఇది ఇతిహాస ద్వయంలో మొదటిది. రామాయణ భారత, భాగవతాలను పరమేశ్వరుని మూడు నేత్రాలతోను పోల్చవచ్చు. పరమేశ్వరుని దక్షిణ నేత్రం సూర్యతత్త్వ ప్రతీక- రామాయణం గూడా సూర్యవంశరాజ చరిత్ర. అందుకని రామాయణం పరమేశ్వరుని దక్షిణ నేత్రం అనవచ్చు. పరమేశ్వరుని వామనేత్రం చంద్రతత్త్వ ప్రతీక- భారతం గూడా చంద్రవంశస్థులైన కురుపాండవ చరిత్ర. అందుకని భారతం పరమేశ్వరుని వామనేత్రం అనవచ్చు. ఇక పరమేశ్వరుని ఫాలనేత్రం పరం జ్యోతికి ప్రతీక. భాగవతంగూడా ఆ పరంజ్యోతి స్వరూపుడైన పరమాత్మ చరిత్ర. అందుకని భాగవతం పరమేశ్వరుని ఫాలనేత్రం అనవచ్చు.

ఇంకో రకంగా చెప్పుకోవాలంటే భాగవతం మన ఆత్మ వికాసానికి, భారతం మన బుద్ధి వికాసానికి, రామాయణం మన హృదయ వికాసానికీ వ్రాయబడిన గ్రంథాలనవచ్చు. అందుకే రామాయణం హృదయాలను కరగింప జేస్తుంది, "రామాయణాన్ని మించిన కావ్యం ప్రపంచంలో ఇంతవరకూ ఏ భాషలోనూగూడా, ఏకవీ వ్రాయలేదు. ఇక ముందుగూడవ్రాయబడబోదు." అని అందరు విజ్ఞులు ఒప్పుకున్న సత్యం!

ప్రతి ఇతిహాస కథ నాలుగు విషయాలను తెలియజేస్తుంది. (1) చారిత్రాత్మక విషయం (Historical fact) (2) శాశ్వత సత్యం (Eternal truth) (3) ఆవర్తిత విషయం (Periodical fact) (4) ఆధ్యాత్మిక విషయం (Spiritual fact) ఇతిహాసమైన ఈ రామాయణం గూడా ఈ నాలుగు విషయాలను తెలియజేస్తుంది.

(1) త్రేతాయుగంలో ఒకప్పుడు జరిగిన ఒక గాథను వివరిస్తుంది. ఇది చారిత్రాత్మక విషయం.

(2) ఎప్పుడు అధర్మం విజృంభించి ధర్మానికి గ్లాని ఏర్పడ్డా తిరిగి ఒక అవతారమూర్తి వలన అధర్మం [illegible]తమౌతుంది. ఇది శాశ్వత సత్యం.

(3) పరకాంతా వ్యామోహం గల రావణుడిలాంటి వాడు ఎప్పుడు పుడ్తూ ఉన్నా, వాడి రోగం కుదర్చగల రాముడిలాంటి వాడు పుట్టి తగిన గుణపాఠం నేర్పుతూ వుంటాడు. మరల ఇదే రామాయణం లాంటి కథ జరుగుతూ వుంటుంది. ఇది ఆవర్తిత విషయం.

(4) ప్రతి మానవునిలోను జరిగే ఒక ఆధ్యాత్మిక సత్యాన్ని గూడా తెలియ జేస్తుంది.

పై వాటిలో మొదటి మూడు విషయాలను వివరించాల్సిన అవసరం లేదు. కాని నాల్గవ విషయాన్ని కొద్దిగా వివరించి రామాయణాన్ని ఆధ్యాత్మికంగా ఎలా అన్వయ పరచుకోవాలో తెలుసుకుందాం.

ఒక శాశ్వత సత్యాన్ని, లేదా తత్త్వాన్ని వివరించడం కోసం-మనస్సుకు నచ్చేట్లు దాన్ని ఒక కథావస్తువుతో సమన్వయిస్తూ, కావ్యంలాగా రచించే పద్ధతిని ఆంగ్లంలో Veiled writings అంటారు. లేదా Allegoric writings అని గూడా అనవచ్చు. బనియన్ మహాశయుడు వ్రాసిన Pilgrims Progress గ్రంథం ఇలాంటిదే! వేద వివరణకై వ్రాసిన పురాణ కథలన్నీ ఇలాంటివే! ఇతిహాసాలు గూడా అదే పద్ధతిలో వ్రాయబడ్డాయి. బైబిల్ గ్రంథంలోని కథలూ ఇలాంటివే ! జీసస్ (ఏసు ప్రభువు) గూడా "I speek through parables and fables" అన్నాడు. ప్రతి మానవునిలో జరిగే కథనే కావ్యకథా రూపంగా తీసికుంటే- అది ఆధ్యాత్మిక గ్రంథమవుతుంది. సునిశితంగా పరిశీలిస్తే రామాయణంలో ఈ ఆధ్యాత్మిక సమన్వయాన్ని గుర్తించవచ్చు.

## ఆధ్యాత్మిక సమన్వయం

ప్రతి మానవునిలో అంతఃకరణమనే దశరథుడు హృదయమనే అయోధ్యను పాలిస్తూ వుంటాడు. ఈ అంతఃకరణావలంబనములైన సత్త్వ రజస్తమో గుణాలే దశరథుని భార్యలైన కౌసల్యా సుమిత్రా కైకేయిలు. జాగ్రత్, స్వప్న సుషుప్తులకు ప్రతీకలే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు. తురీయమైన ఆత్మ స్వరూపుడే శ్రీరాముడు. ఆత్మతో క్రీడించు బుద్ధియే సీతాదేవి.

బుద్ధిని ఆత్మతో జోడించుటే యోగము. ఈ యోగమే మానవ ధ్యేయము. ఈ యోగానికి- ఇంద్రియాలకు లోబడిన మనస్సే ప్రతిబంధకం. మనలోని కామక్రోధాదులనే రాక్షస సైన్యంతో- సంసార సముద్రంలో దిగబడిన దేహ మనే లంకను- దశేంద్రియాలు (ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు) అనే పది తలలతో పరిపాలిస్తున్న వాడే మన మనస్సనే రావణాసురుడు. ఇంద్రియ లౌల్యానికి గురియైన ఈ మనస్సు అనే రావణుడు— బుద్ధి అనే సీతను తనవైపుకు లాక్కొని వశపరచుకుందామని ప్రయత్నించడమే సీతాపహరణము. ప్రాణాపానవాయువులకు ప్రతీకలే వాలి సుగ్రీవులు. అవి ఎప్పుడూ ఎదురు బదురే! అంటే వ్యతిరేక మార్గమే. వీటి మధ్యగల బ్రహ్మనాడియే వాయు సుతుడైన ఆంజనేయుడు. సంసార ప్రభావానికి గురికాకుండా బ్రహ్మయందే చరింపజేయు బ్రహ్మ నాడికి ప్రతీకయైన ఆంజనేయుని వలన ఈ సంసారమనే సముద్రము దాటబడుతుంది. అట్టివాడే మరల బుద్ధిని కనడం జరుగుతుంది. అదియే సీతా దర్శనము. సంసార సముద్రంలోని దేహమే లంక. ఈ దేహం మీద ప్రీతిని విడనాడి భ్రాంతి తొలగాలనడమే లంకా దహనము.

ఈ మనస్సు యొక్క రాజస గుణానికి ప్రతీకయే రావణుడు. సత్త్వగుణ ప్రతీక విభీషణుడు. తమోగుణ ప్రతీక కుంభకర్ణుడు. దేహ భ్రాంతి తొలగిన మనస్సులోని సత్త్వగుణ ప్రతీకయైన విభీషణుడు-ఆత్మ ఐన రాముణ్ణి శరణు కోరగా- రజోగుణ, తమోగుణ ప్రతీకలైన రావణ కుంభకర్ణులను కూల్చడం జరుగుతుంది. ఈ ప్రయత్నానికి సంసార సముద్రం అడ్డంగా ఉంటుంది. దీన్ని దాటడానికి నాడులు అనే వానర సైన్యంతో సేతువు కట్టాలి. సంసార సముద్రంలోని కష్టసుఖాలు అనే అలల ప్రభావం లేకుండా చేసే యోగ నిష్ఠయే ఈ సేతువు. బ్రహ్మశరంతో నాభికుండలిని భేదిస్తే- మనస్సనే రావణబ్రహ్మ తొలగుతాడు. అప్పుడు బుద్ధి ఆత్మతో కలవడమే సీతారాముల పునస్సమాగమం. అదియే సమాధి స్థితి. ఇదియే మానవ ధ్యేయమైన యోగ సాధనకు ప్రతిఫలం.

# కుండలినీయోగ సమన్వయం

శ్రీమద్రామాయణంలోని కాండలన్నిటికీ దేని విశిష్టత దానికున్నది. రామాయణం కేవలం ఒక కావ్యమే కాదు, ఒక ఇతిహాసమే కాదు. కుండలినీ యోగంతో సమన్వయాన్ని కలిగిన ఒక యోగ గ్రంథం కూడా ! కుండలినీ యోగచక్రాలకూ రామాయణ కాండలకూ ఉన్న సంబంధాన్ని, సమన్వయాన్ని గూర్చి- సాధకుల ఉపయోగార్థం ఈ శీర్షిక క్రింద తెలియజేస్తున్నాను.

రామాయణంలో కాండలున్నట్లే-కుండలినీ యోగంలో చక్రాలుంటాయి. ఉత్తర కాండతో కలుపుకుని ఉండే ఏడు కాండలకు- సహస్రారంతో కలుపుకుని వుండే ఏడు చక్రాలకు విచిత్రమైన సమన్వయాన్ని గుర్తించవచ్చు. 'పృథివ్యాపస్తే జోవాయురాకాశా'లనే పంచభూతాల వరుసక్రమాన్ని అనుసరించి కుండలినీ యోగంలోని చక్రాలపేర్లు వరుసగా (1) మూలాధారం, (2) మణిపూరకం, (3) స్వాధిష్ఠానం, (4) అనాహతం, (5) విశుద్ధి ఈ ఐదూ కాక వీటిపైన వున్న (6) ఆజ్ఞ, (7) సహస్రారాలతో కలుపుకుని మొత్తం ఏడు చక్రాలు. అలాగే వరుస క్రమాన్ని అనుసరించి రామాయణంలోని కాండల పేర్లు వరుసగా (1) బాలకాండ, (2) అయోధ్యాకాండ, (3) అరణ్యకాండ, (4) కిష్కింధాకాండ, (5) సుందరకాండ (6) యుద్ధ కాండ మరియు (7) ఉత్తరకాండ.

**చక్రాలు - తత్త్వాలు :**

జగద్గురువులైన ఆదిశంకరాచార్యులవారు వ్రాసిన "సౌందర్య లహరి"లో కుండలినీ యోగ చక్రాలను, వాటి తత్త్వాలను తెలియజేసే శ్లోకాన్ని ఇక్కడ చదువుకోవడం సముచితం.

శ్లో॥ మహీం మూలాధారే, కమపిమణిపూరే, హుతవహమ్
స్థితం స్వాధిష్ఠానే, హృదిమరుత, మాకాశముపరి, ।
మనోఽపి భ్రూమధ్యే సకలమపిభిత్వాకులపథమ్
సహస్రారే పద్మే (రమ్యే) సహరహసి పత్యా విహరసే ॥

(సౌందర్యలహరి- 9శ్లో॥)

[భావము :- (యోగసాధకుని ఉపాసనలో) కుండలినీ శక్తి అనే అమ్మవారు- మూలాధార చక్రంవద్ద పృథివీ తత్త్వాన్ని, మణిపూరకం దగ్గఱ జలతత్త్వాన్ని, స్వాధిష్ఠానం దగ్గర అగ్ని తత్త్వాన్ని, అనాహతం వద్ద వాయు తత్త్వాన్ని, విశుద్ధి వద్ద ఆకాశతత్త్వాన్ని, కలిగిన 'కుల' మార్గాన్ని భేదించు కుంటూ పై పైకి ఉద్బుద్ధమవుతూ, చిట్టచివరకు పై కొసగవద్దగల సహస్రార మనే పద్మం(లేదాగది)లో, రహస్యంగా అయ్యవారితో కలిసి విహరిస్తుంది.]*

**చక్రాలు - కాండలు :**

మూలాధార చక్రం పృథివీ తత్త్వానికి సంబంధించినది. అంటే మనలో భౌతికమైన బలం (Physical Strength) అంతా ఈమూలాధారచక్రంతో సంబంధాన్ని కలిగివుంటుంది. ఇది వెన్నెముక క్రింది కొసవద్ద ఉంటుంది. దీనిని ఆంగ్లంలో Base Centre అంటారు. అశ్విని, భరణి మొదలైన 27 నక్షత్రాలను మన మస్తకం నుండి పాదాల వరకు వరుస క్రమంలో న్యాసం చేస్తే- వెన్నెముక క్రింది కొసవద్దకు 'మూలా' అనే నక్షత్రంవస్తుంది. అందుకే ఈచక్రానికి 'మూలాధారచక్రం' అనే పేరువచ్చింది. మూలానక్షత్రంధనుస్సు రాశిలో మొట్టమొదట్లో ఉంటుంది. 'బాణం ఎక్కుపెట్టిన విల్లు'- ఈ ధనుస్సు రాశికి గుర్తు. కుండలినీ శక్తి ఇక్కడనుండి ఊర్ధ్వ గతిని పడుతుందనే కుండలినీ యోగ రహస్యాన్ని ఈ బాణం ఎక్కుపెట్టిన విల్లు తెలియజేస్తుంది. కుండలినీ యోగంలో ప్రథమ చక్రం అయిన మూలాధారచక్రం వద్దకు సాధకుని కుండలినీ శక్తి ఉద్బుద్ధమైనపుడు- అది ద్రవ్యాత్మక పృథివీ తత్త్వానికి సంబంధించినదై, భౌతికబలమంతా కేంద్రీకరింపబడి కట్టుదిట్టం కాబడే స్విచ్ లాంటిది అవటం వలన- సాధకునిలోని భౌతికబలం ఇక్కడ వ్యవస్థీకరింప బడుతుంది.

---

*గమనిక : పంచభూతాల వరుసక్రమాన్ననుసరించి మూలాధారం తరువాత మణిపూరకం, తరువాత స్వాధిష్ఠానమయినా- వాస్తవానికి వెన్నెముక వెంబడి వుండే వరుస క్రమాన్ని అనుసరించి మూలాధారం తరువాత స్వాధిష్ఠానం, అటుపైన మణిపూరకం వుంటాయి.

రామాయణంలోని ప్రథమకాండ అయిన బాలకాండలో గూడా భౌతిక బలాల వ్యవస్థీకరణ గురించిన సన్నివేశ విషయాలే ఉంటాయి. ఇటు ఆత్మ సామ్రాజ్యానికి సంబంధించిన సూర్య వంశస్థుడైన శ్రీరాముని తరఫువారి పుట్టుపూర్వోత్తరాలు, వారి శౌర్య సంపత్తి గురించిన- అటు అహంకార సామ్రాజ్యానికి సంబంధించిన బ్రహ్మ వంశస్థుడైన రావణాసురుని తరఫువారి పుట్టుపూర్వోత్తరాలు, వారి శౌర్య సంపత్తుల గురించిన- సన్నివేశ విషయాలు వుంటాయి. బాల్య విషయాలు ఉండడం వలన 'బాల కాండ' అన్నారనే మాట అలావుంచి, బలాబలాల విషయాలు ఉండడాన్ని బట్టి ఈ కాండను 'బాలకాండ' (బల సంబంధమైన కాండ) అనడం గూడా సమంజసమేగదా!

రెండవ చక్రమైన మణిపూరక చక్రం నాభివద్ద వుంటుంది. అందుకే దీనిని అంగ్లంలో **Navel Centre** లేదా **Solar Plexus** అంటారు. ఇది జల తత్త్వానికి సంబంధించినది. తల్లిని - బిడ్డను సంధాన పరచేది నాభి. అంటే ఇది తల్లీ బిడ్డలను కలిపే మమతా బంధం. ఇది ఆ ఇరువురి దేహాల మధ్య వుంటుంది కాబట్టి భౌతికమైన బంధం. 'ఈ మమతా బంధం తెగ వలసినది'- అని బొడ్డు కోయడం సూచిస్తుంది. ప్రేమానుబంధం హృదయ సంబంధమైన ప్రేమకు సంబంధించినది- ఇది తెగవలసిన ఆవశ్యకతలేదు. తిమింగలాలు, మొసళ్ళు మొదలైన వాటితోనిండి వుండే కోనేరు లాంటిది ఈ మణి పూరక చక్రం. ఇక్కడకు కుండలినీశక్తి ఉద్బుద్ధమైనపుడు సాధకునిలోని ఈర్ష్య, అసూయ, రాగ, ద్వేష, శోక, మమకారాలు ఒక్కసారి మకరాది జలచరాలు విజృంభించినట్లు విజృంభిస్తాయి. దీనిని దాటి కుండలినీ శక్తి ఊర్ధ్వ మార్గానికి పోవడం చాలా కష్టం.

రామాయణంలోని రెండవకాండ అయిన అయోధ్యాకాండలో గూడా రాగ, ద్వేష, అసూయ, ప్రకోపాలకు సంబంధించిన మంథర ప్రబోధము, కైకేయీ వరాల ప్రమేయము: శోక మమకారాలకు సంబంధించిన దశరథ రాముల (తండ్రీ బిడ్డల) వియోగము మొదలైన సన్నివేశాలు చిత్రీకరింప బడతాయి.

మూడవ చక్రమైన స్వాధిష్ఠానం అగ్నితత్త్వానికి సంబంధించినది. దీనిని అంగ్లంలో **Spleen centre** అంటారు. శరీరంలోని ఉష్ణోగ్రతా

సమత్వాన్ని, ఆహార పానీయాదుల జీర్ణశక్తిని ఈ చక్రమే కట్టుదిట్టం (control) చేస్తుంది. అంటే ఈ చక్రం జఠరాగ్ని పైన గూడా ప్రభావాన్ని కలిగి ఉంటుందన్న మాట !

రామాయణంలోని మూడవ కాండ అయిన అరణ్యకాండలో గూడా— అగ్ని సంబంధమైన విరాధ, జటాయు, కబంధుల దహనక్రియలకు సంబంధించిన సన్నివేశాలు; భూమి యొక్క ఉత్తరార్థ దక్షిణార్థ గోళాల మధ్య సమత్వాన్ని, తన జఠరాగ్నితో వాతాపి వంటి రాక్షసుల దహనాన్ని చేసిన అగస్త్య మహాముని యొక్క కథా సన్నివేశాలు; అగ్ని శిఖలాంటి సీత అపహరింపబడే సన్నివేశం (రావణుడు సీతను అపహరించడం అంటే తనతో పాటే అగ్నిని లంకకు తీసుకు వెళ్లడమేగా మరి!) ఈ కాండ లోనే చిత్రీకరింపబడతాయి.

ఇక నాల్గవ చక్రం అనాహతం— నాల్గవ కాండ కిష్కింధాకాండ. అనాహత చక్రం వాయు తత్త్వానికి సంబంధించినది. ఈ చక్రానికి స్థానంహృదయం. అందుకే దీనిని ఆంగ్లంలో 'Heart Centre' అంటారు. రాశులలో సింహరాశి హృదయస్థానాన్ని తెలియజేస్తుంది. ఈ సింహరాశికి అధిపతి సూర్యుడు, సూర్యుడు ఆత్మకారకుడు ['కాలాత్మా దినకృత్ మనస్తుహినగుః....' బృహజ్జాతకం అధ్యా–2, శ్లో–1] ఈ సూర్యుని పేర్లలో ఒక పేరు 'మిత్రుడు' అంటే మైత్రికి సంబంధించిన వాడు. అంటే కుండలినీ శక్తి నాల్గవ చక్రమైన అనాహతం వద్దకు ఉద్బుద్ధమైనపుడు సాధకునిలోని వాత్సల్యము, స్నేహము, భక్తి మొదలైన ఆత్మగుణాలు ఉత్తేజితమౌతాయి. వాస్తవానికి వాత్సల్యము స్నేహము, భక్తి మూడూ గూడా ప్రేమ యొక్క రూపాంతరాలే ! తనకన్న చిన్నవారి యందుండే ప్రేమను 'వాత్సల్యము' అనీ, తన ఈడు వానిపై ఉండే ప్రేమను 'స్నేహ' మనీ, తన కన్న పెద్ద వారిపై ఉండే ప్రేమను 'భక్తి' అనీ అంటారు.

రామాయణంలోని నాల్గవ కాండ అయిన కిష్కింధాకాండలో గూడా—

ఆత్మ సామ్రాజ్యంతరపువాళ్లైన శ్రీరాముడు, సుగ్రీవుడు, హనుమంతుడు కలిసే సన్నివేశాలు, వీరి మధ్య ఏర్పడే సఖ్యానికి సంబంధించిన సన్నివేశాలు, సఖ్యంతో సాధించే విషయ సన్నివేశాలు చిత్రీకరింపబడతాయి. ఈ ముగ్గురిలో శ్రీరాముడు- సూర్య కులదీపకుడు, సుగ్రీవుడు-సూర్యాంశ జనితుడు హనుమంతుడు - వాయుసుతుడు, సూర్యశిష్యుడు-అంటే ముగ్గురూ సూర్య సంబంధీకులేనన్న మాట ! ఏడు చక్రాలలో అనాహతం నాల్గవదిగా ఉండి హృదయం దగ్గర కేంద్రంలాగా ఉన్నట్లే- కిష్కింధాకాండ కూడా నాల్గవ కాండగా ఉండి రామాయణానికి హృదయంలాగా కేంద్రస్థానంలో ఉంటుంది.

ఐదవ చక్రం విశుద్ధి. ఇది కంఠం వద్ద ఉంటుంది. అందుకే దీనిని ఆంగ్లంలో 'Throat Centre' అంటారు. కంఠం శబ్దానికి ఉత్పత్తి స్థానం. ఆకాశం శబ్ద గుణకం. అందుకని ఈ విశుద్ధి చక్రం ఆకాశతత్త్వానికి సంబంధించినది. పైన ఉన్న బుఱ్ఱని, క్రింద ఉన్న హృదయాన్ని ఈ కంఠం సంధానపరుస్తుంది. బుఱ్ఱ-బుద్ధికి, హృదయం-ఆత్మకి స్థానాలు. బుద్ధి-సీతను, ఆత్మ-రాముణ్ణి సూచిస్తాయి అని 'ఆధ్యాత్మిక సమన్వయం' లో చెప్పబడ్డాయి గదా ! ఈ ఇద్దరికీ మధ్య సంధాన కర్తలాగా, వార్తాహరుని లాగా, గురువులాగా హనుమ ఉంటాడు. ఈ హనుమ చేసే 'ఆకాశ' గమన సన్నివేశం గూడా ఈ ఐదవ కాండ అయిన సుందర కాండలోనే ఉంటుంది. ఈ కాండలోని విషయం మరింత విపులంగా ఈ పుస్తకంలోనే "సాధకులకు మాత్రమే" అన్న శీర్షికలో తెలుపబడింది.

ఆరవ చక్రం ఆజ్ఞా చక్రం. ఈ చక్రానికి స్థానం ఫాల భాగంలోని భ్రూమధ్యం. అందుకే దీనిని ఆంగ్లంలో 'Brow Centre', అంటారు. ఇక్కడే జ్ఞాన నేత్రం ఉంటుందంటారు. శివునికి అగ్ని నేత్రం కూడా ఇక్కడే ఉంటుంది. అగ్ని ఎలాంటి పవిత్రమైనదో జ్ఞానం గూడా అలాంటి పవిత్రమైనది. అని సూచన ! ['నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'.... భగవద్గీత 4-38] ఈ ఆజ్ఞా చక్రం మనస్తత్త్వానికి సంబంధించినది.

ఆరవ కాండ అయిన యుద్ధకాండలో అహంకార సామ్రాజ్యానికి సంబంధించిన 'మనస్సు' అనే రావణాసురుడు, ఆత్మ సామ్రాజ్యానికి సంబంధించిన 'ఆత్మ' అనే రామునిలోనికి లీనమవడం, 'బుద్ధి' అనేసీతకు 'జ్ఞానము'

అనే అగ్నిలో శుద్ధి పరీక్ష జరగడం మొదలైన సన్నివేశాలు చిత్రీకరింప బడతాయి.

ఏడవ చక్రం సహస్రారం. ఈ చక్రానికి స్థానం బ్రహ్మ రంధ్ర ప్రాంతము. అందుకే దీనిని ఆంగ్లంలో 'Head Centre' అంటారు. ఆజ్ఞా చక్ర స్థానం మనుష్యులకు తూర్పు దిక్కును సూచిస్తే- ఈ బ్రహ్మరంధ్ర స్థానం ఉత్తర దిక్కును సూచిస్తుంది. రామాయణంలో ఏడవ కాండ పేరు కూడా ఉత్తర కాండ. కాండలలో ఈ ఉత్తర కాండను లెక్కవేయకుండా రామాయణం "షట్కాండ" లనీ, అలాగే చక్రాలలో సహస్రారాన్ని లెక్క వెయ్యకుండా చక్రాలను 'షట్చక్రా' లనీ, అనడం గూడా వాడుకలో ఉంది! 'ఉత్'- అంటే 'పైన' ఉత్తరం- అంటే 'పైతరం' అనే అర్థాలు చెప్పుకుంటే- ఈ ఉత్తరకాండలో రాముని తరువాత తరానికి చెందిన కుశలవుల గాథ వుంటుంది.



జయ! వీరహనుమాన్— జయ! భక్త హనుమాన్!